అంకితం

అకాలమరణానికి ఆహుతులైన మా యన్న

గంగాధరశాస్త్రికి

ఆయన మిత్రుడు

మహాదేవశాస్త్రికి

# ముందుమాట

నేనీ నవలను 1953-54లలో వ్రాశాను. అప్పటినుంచి దీనిని అనేకమంది చదువుట జరిగింది. అయితే అప్పట్లో నేనీ నవలను వ్రాసినపుడు నాకు పట్టణ అనుభవం ఏకొంచెమైనా లేకపోవడంవలన నవలలో యింకా కొన్ని రసవత్తర సంఘటనలను సృష్టించలేకపోయానేమో ననుకుంటున్నాను. ఊహా మాత్రంగా ఊహించిన పట్టణజీవితం అందులో కథానాయకుని నేనై చెప్పడంవలన, నవలలోవున్న సంఘటనలు ఎరగకపోవడంవలన నవలలో అక్కడక్కడా ఒకటి రెండు సంఘటనలు చేర్చవలసివచ్చింది.

పోతే ఈ నవలగాని, సంఘటనలుగాని ఎవ్వరినీ ఉద్దేశించి వ్రాసినవిగావు.

ఈ నవలనుగురించి తమ అమూల్యా అభిప్రాయాన్ని పంపిన ఆప్తమిత్రులు శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రిగారికి, ఎంతయినా కృతజ్ఞుడను.

ఇట్లు,

మురళీకృష్ణ.

# పీఠిక

సమాజంలో మనిషి గా బ్రతకడానికి కావలసిన హంగు
లన్నీ అబద్ధాలమీదే ఆధారపడివున్నాయన్న నగ్నసత్యాన్ని
అనుభవంవల్ల తెలిసికొని, అందుకు ఇష్టపడని - ప్రాణం
పోతున్నా ఏవో ఆలోచనలుమాత్రం శరపరంపరలుగా
తోసుకవచ్చే - లోకందృష్టిలో అసమర్థుడై అష్టకష్టాలుపడ్డ,
చదువూ సంస్కారంగల, గౌరవ మర్యాదలుగల, ఇంతవున్న
ఒక కుటుంబములో పుట్టిన యువకుని విషాదగాథ ఈ నవల.

ప్రతి చిన్నవిషయాన్నీ విశ్లేషణంచేసి నిశితంగా పర్యా
లోచించి తేలిగ్గా వదిలే బుద్ధిలక్షణం, ఆత్మ అంగీకరించకపోతే
ఎంత కావలసినదాన్నైనా సులువుగా త్యజించే సాహసం, అవ
సరానికూడా ఆత్మాభిమానం వదులుకోలేని అచంచలమైన
మనోధైర్యం, భగవత్స్వరూపమైన భవిష్యత్తుమీద ప్రబలమైన
విశ్వాసం ఈ కథానాయకుని అంతర్లక్షణాలు.

ఈ నవల ఒకవిధంగా చిత్రమైంది. తన కండ్ల ఎదుట
హఠాత్తుగా పతనమైన తన కుటుంబపరిస్థితులనుచూచి తట్టుకో
లేక ఒకబస్తీకి పారిపోయివచ్చి, అక్కడి కష్టాలనుభవించలేక తిరిగి
స్వగ్రామానికి చేరుకున్న యువకుని అనుభవాలే ఈ నవల.

రచయిత ఈ నవలను ఉత్తమపురుషలో చెప్పాడు.
ఇలాంటి రచనల్ని చూచి సాధారణబుద్ధులు నిజంగా రచయిత
జీవితమే ఇదంతా అనుకుంటారు. ఉత్తమపురుషలో కథ
చెప్పడం ఒక కథనవిశేషం. అది ఒక ఏకంశిల్పం. అంతకు
మించి మరేమీ కాదు. అయితే కొంతైనా స్వానుభవము
ఉండదా అంటే పాత్రలను ప్రవేశపెట్టి కథ చెప్పినప్పుడందులో

కూడా కొంత స్వానుభవం వుండదని నీకు నమ్మక మేమిటి? అందువల్ల వ్రాయబడ్డది అంతా ఈ రచయిత స్వానుభవమవునా, కాదా అనేది ప్రశ్న కాదు. ఇంతకూ వ్రాయబడిన సంఘటనలు సంభవయోగ్యాలు అవునా, కాదా అనేది మాత్రమే ప్రశ్న. అప్పుడుకూడా ఒకసారి మనం సంభవం కాదనుకున్న సంఘటన నిజంగా సంభవించివుండవచ్చు. ఈ మాయలోకంలో ఇది సంభవం, ఇది అసంభవం అని నిష్కర్షగా చెప్పటం కష్టం. ఈ నవలలోని సంఘటనలన్నీ సంభవయోగ్యాలే. పరిస్థితులలా కల్పింపబడ్డాయి. నిర్మాణమూ, సృష్టీ అంతా అదే. అంటే ఇందులో కల్పింపబడిన సంఘటన ప్రతిదీ నాయకపురుషుని ఏదో ఒక అంతర్లక్షణాన్ని దీప్తిమంతం చేసేదిగానే వుందన్నమాట. ఇది ఈ నవల్లోని మంచి లక్షణం.

సాహిత్యప్రక్రియలన్నీ కూడా మానవుని ప్రవృత్తిలోని వివిధ అంతస్సులను నిరూపించేవే అయినా, నవల అన్నది ముఖ్యంగా ఇహజీవితంద్వారానే మానవుని సహస్రముఖంగా ప్రదర్శిస్తుంది. సాధారణంగా ప్రతి నవలారచయితా ఏదో ఒక ముఖంగా రచన చేస్తాడు. అసాధారణమేధావంతులవిషయం అది వేరు.

ఈ నవలపేరు నిరుద్యోగి ఉద్యోగం బ్రతుకు తెరువు. అటీదారకనివాడు నిరుద్యోగి వచ్చిన ఉద్యోగంలో ఇముడలేక దాన్ని వదలినవాడు — ఇముడలేకపోవడానికి హేతువులను చూపించి, ఉద్యోగాలు లేకపోవడంవల్లనే కాకుండా వున్నవి. నిజాయితీగా బ్రతుకదలచుకొన్నవాణ్ణి బ్రతుకనీయకపోవడం

వల్లకూడా నిరుద్యోగులు సృష్టింపబడుతున్నారని రచయిత శ్రీ మురళీకృష్ణ చిత్రంగా ఇందు నిరూపించారు. ఈ దృష్టితో చూస్తే నిరుద్యోగసమస్య చాలా భయంకరంగా కనిపిస్తుంది

లోకజ్ఞత్వమూ, భావనాశక్తీ వుండి మొదటిదానివల్ల రెండోది ఎంతగా ఎవనియందు సారవంతం అవుతుందో దాన్ని బట్టి ఆ రచయితా ఆ నవలా అంతగా అంతగా పరిగణింపబడతారు. భావనాశక్తి అన్నది నిర్మాణంయొక్క పరిధినికూడా ఇముడ్చుకొన్నది. ఈ నవలలో మొదటిదానంత బలీయంగా రెండోది లేదు. ఇది ఈ రచయిత ప్రథమయత్నం.

జీవితం ఎల్లా వున్నదో-ఎల్లా వుండేదో-ఎల్లావుండాలో అన్న మూడింట్లో ముందు ముందు దానికి నవల క్రమంగా దగ్గరేః వుంటుంది. ఈ నవల మొత్తం మొదటిదానికి చాలా దగ్గరగా వుంది. అది అభినందించదగిన విషయం.

శ్రీ మురళీకృష్ణ నవలారచయితల రంగంలోకి తానూ ఒకడుగా ప్రవేశిస్తున్నాడు. ప్రవేశించడానికి అతనికున్న యోగ్యతను ఈ నవల సర్వవిధాలా నిరూపిస్తున్నది. మంచి వేగంగా ఊహించగల, వ్రాయగల శ్రీమురళీకృష్ణ పరమేశ్వరానుగ్రహంవల్ల ముందుముందు ఒక మహారచయిత కావాలని మనసారా కాంక్షిస్తున్నాను. భవతు.

ఇట్లు

25-10-1960 వరంగల్లు

కేతవరపు రామకోటిశాస్త్రి
ఓ.ఎ.(ఆనర్సు)పి. హెచ్.డి.

# నిరుద్యోగి

ఈరోజు నేనిలా తయారు కావటానికి కారణం తెలుసుకుంటే బహుశా నాలాగే మీరు బాధపడతా రనుకుంటాను. ఈనాడు నే నిలా బికారిగా, రౌడీగా, మోసగాడిగా, పోరంబోకుగా లోకంలోని కొందరిదృష్టిలో చూడబడుతున్నా నంటే ఆతప్పంతా వారిదే. నన్నినా డిలా యిన్ని పేర్లపెట్టి పిలిచే వారే నన్నీదుస్థితికి తీసుకువచ్చారు. అందరిలా నేను పెరిగి సుఖా లనుభవించాలని మేడల్లో నివసించి అందమైన ధనవంతుల యువతిని వివాహం చేసుకొని సుఖపడాలని వున్నది. కానీ నా కా అదృష్టం పట్టలేదు. అందుకే యిలా తయారయ్యాను. ఈనాడు యిన్నికష్టాలు పడుతున్నాను కాని నాకు ఒకఆశ వున్నది. మరి నాకాఆశ లేకపోతే యింతవరకు ఎప్పుడో ఆత్మహత్య చేసుకొని వుండేవాడిని. భగవంతుడింకానాలో ఆశను చంపలేదు. అందుకే యింకాబ్రతికున్నాను. అసలీనాడు నే నిలా కావడానికి ఆనాటి మాయింటి పరిస్థితు లెలావున్నవో చెపుతాను.

నేను గుంటూరుజిల్లా అడవి ప్రాంతంలో సిరి,సంపదకలిగిన ఒక ఉన్నతకుటుంబంలో జన్మించాను నలుగురుపిల్లలలో నేను ఒకడిని. నేను నాబాల్యం ధనవంతుల బిడ్డలలాగే గడిపాను. ఆనాడు మాయిల్లు ఒక చిన్న జమిందారుయిల్లులా వుండేది. ఎప్పుడూ మాయింటికి వచ్చేబంధువులకు లెక్కవుండేది

గాదు. మానాన్నగారికోసం వివిధప్రదేశాలనుండి అసంఖ్యాకంగా ఆహుతమిత్రులు వచ్చేవారు. వీరందరితోను యిల్లు ఎప్పుడూ రద్దీగా, సందడిగా, సంతోషంగా వుండేది. ఏవేళప్పుడు చూచినా యింటినిండా మనుష్యులతో మాయిల్లు పెండ్లి యిల్లులా వుండేది. నాకు పదిసంవత్సరములు వచ్చేవరకు మా యింటిపరిస్థితులు ఆ విధంగానే వున్నవి. నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఎప్పుడూ జీవకళతో మాయిల్లు వినూత్న కాంతులు వెదజల్లుతుండేది. ఆనాడు మా నాయనగారిని యాచించని వారు, ఆయన సలహాలను తీసుకొననివారు చాలా అరుదుగా వుండేవారు. ఆనాడా ప్రాంతములో ధర్మకార్యాలకు, గుళ్ళు గోపురాలు కట్టించడానికి చందాపట్టీలో ముందు మానాన్నగారి పేరు ఉండవలసినదే! ఆయన హస్తవాసి గుంటిదవ ప్రజలలో ఒక అభిప్రాయం వుండేది. పెద్ద పెద్ద పోలీసుఉద్యోగస్థులు సరిపమయాలలో మానాన్నగారి సలహాలను తీసుకునేవారు.

ఆనాడా ప్రాంతములో ఆయన సాటిలేని కార్యశూరుడు. దాన ధర్మాలు చేయడమేగాక ఆయన స్వయంగా బీదలకు అన్నసత్రాలు కట్టించాడు. కుష్టురోగులకు ఊరిమొదట్లో పూరిపాకలు వేయించి, ప్రకృతివైద్యం చేయించేవాడు. బంధువులలో మిత్రులలో ఆనాడాయనను అభినందించనివారు లేరు.

కానీ కాలప్రవాహం, నీటిప్రవాహం ఎప్పుడూ ఒకే తీరుగా వుండవు. ఆనాడు మానాన్నగారిని పొగిడినవారే

మరికొన్ని రోజులకు దూషించటం ప్రారంభించారు. అప్పుడు
నాకివన్నీ తెలిసేవి కావు కాని ఆ రోజులు పోయాయని మాత్రం
నేను గ్రహించాను నిజంగా అంతే జరిగింది మా ఆస్తితో పాటు
మా వైభవం పోయింది. అలాగే మా సంపద పోయింది.
దానితో మా యింటి జనాభా తగ్గిపోయింది. మా బంధువులు,
మా నాన్నగారి మిత్రులు యిప్పుడెవరు రావటం లేదు. దానికి
కారణమేమిటో అప్పుడు నాకు బోధపడలేదు ఇప్పుడు తెలుసుకుంటు
న్నాను. మానవులు తుచ్ఛమైన ధనానికెంత ప్రాముఖ్యత
యిస్తారోనని. ఆనాటి మా యింటి పరిస్థితి చూచినవారికి తెలు
స్తుంది. ఎప్పుడు చూచినా ఇసక చల్లితే రాలకుండా వుండే మా
యిల్లు యిప్పుడు ఎవ్వరూ లేక మేము కొద్దిమందిమే కావటాన
బావురుమంటున్నది. ఇప్పుడు ఎవరైనా కుటుంబాలు సంసారంగా
ఉండటానికి భయపడతారు పురాతన కట్టడాల ప్రతిభను గుర్తు
తెస్తూ యిల్లు మాత్రం యింకా వున్నది. ఇంటిలోపల ఎక్కడ
కూడా గడ్డి మొలకలు మొలచి పాడుగొట్టాడుతున్నది. ఇప్పుడు
రాత్రిపూట మేము తప్ప అక్కడ ఎవ్వరూ వుండరు. ఎప్పుడైనా
ఎవరైనా వుండవలసివచ్చినా గుండె రాయిచేసుకొని ఉండ
వలసిందే! అందుకే అందరూ మా యింటిని "దయ్యాలకొంప"
అని అంటుంటారు,

సంధ్యచీకటి పడటమే ఆలస్యం. మా యింటి పెరట్లో
వున్న అశ్వత్థవృక్షం గాలికి 'బుయ్' అని మోత పెడుతుంది. అప్పు

కప్పుడు అక్కడ పడుకున్నవారు ఏదోనల్లని ఆకారం తిరుగుతుం టుందని అంటుంటారు. ఇపుడది మాతోబాటు కొందరు సన్యాసులకు బిచ్చగాళ్ళకు నిలయం. సంధ్య చీకటిపడగానే బజారు నాలుగిండ్లు తిరిగి నాలుగుముద్దలు తెచ్చుకొని కాలం గడిపే గుడ్డిలింగయ్య తాత కది స్థావరం. అతనితోబాటు మరికొందరు బిచ్చగాండ్లు స్థిరనివాసం ఏర్పచుకున్నారు. ఇక అప్పుడప్పుడు వచ్చి హాజరువేసుక పోయేవారు లెక్కలేదు.

ఇంగువకట్టినగుడ్డ వాసనపోనట్లు మారుమూలలకు పోయినా యిప్పటికీ ఆప్రాంతంలో మాపేరు ఘనంగా చెప్పుకుంటుంటారు. కాలప్రవాహానికి ఆస్థులుపోయినాయింకా ఏదో వున్నదనే భావిస్తారు. కానీ నిజం తెలుసుకున్న తరువాత విచారిస్తారు.

నాకు పదమూడోసంవత్సరము నిండుతుందనగా మానాన్నగారు శాశ్వతంగా ఈలోకాన్నివదలిపోయారు. అప్పటికే మాయింటిపరిస్థితి చాలా అధ్వాన్నంగా వున్నది దారి డొంకాలేని ఘోరారణ్యంలో ఒంటరిప్రయాణీకుని ప్రయాణంలా మాయింటి పరిస్థితి అయినది.

అప్పటికిమాయింటిజనాభా ఐదుగురు. అందులో సంపాదించి కటుంబాన్ని పోషించేవారు ఒక్కరూ లేరు. మేము నలుగురం పిల్లలం, రోజు ఎలా గడిచిపోతవనే దిగులుతో

మా అమ్మ తల్లడిల్లి పోయేది. ఆమెకు కుటుంబపోషణ ఒక పెద్ద సమస్య అయినది. ఎన్నివిధాలఆలోచించినా ఆమెకు మార్గం దొరకలేదు. కష్టపడందే ఏదీ రాదు కానీ కష్టపడేశక్తి యిందులో ఎవ్వరికీ లేదు. రోజులుగడవక దినవెచ్చానికే బాధపడుతుంటే అప్పులబాధ ఒకటి మానాన్నగారు బ్రతికున్నంతకాలం ఎవ్వరూ ఏనాటూ మాట్లాడలేదు. ఆయన సెలవు పోగానే బెల్లం మీద ఈగలుముసిరినట్లుగా మావెంటపడ్డారు దానితోఎలా బ్రతకాలో మాకు తెలియలేదు.

మానాన్నగారు చనిపోయినతర్వాత అపుడప్పుడు మా యింటికి కొందరు స్త్రీలువచ్చి మాఅమ్మగారితో మాట్లాడి పోయేవారు. నాకువారిమాటలు ఏమీ అర్థమయ్యేవికావు వారు వెళ్ళిన మరుక్షణంనుండి మాతల్లి దిగులుగా వుండేది. మాతో ఏమీ మాట్లాడేది కాదు. ఇంటిపనులన్నీ మేమే చూచేవారము. వేళకువచ్చి రెండు మెతుకులు తినేది. ఒకొక్కరోజు అదీతినేది గాదు. మాతండ్రి చనిపోయిన చాలాకాలందాకా ఆమెఇంటి నుండి బైటకురాలేదు బయటిప్రపంచం ఆమెకు తెలియదు. ఎప్పుడూ దుఃఖించుతూ వుండేది. లేకపోతే దిగులుగా వుండేది. సూర్యభగవానునిదర్శనంకూడా లేకుండా ఆమె అలామూడు సంవత్సరాలున్నది. ఆమూడుసంవత్సరాలకాలంలో మాయింటి పరిస్థితి మరీదరిద్రంగా వున్నది. కుటుంబంలోనిఒక్కరికీ వేళకు తిండి వుండేది గాదు కష్టదారిద్ర్యంతో గడిపాము.

ఇంక నే నక్కడ ఎక్కువకాలం వుండలేకపోయాను. అప్పటికి నాకు పదహారో సంవత్సరం వచ్చింది. అక్కడికష్టాలు బాధలు జూస్తూ వుండలేకపోయాను. ఎక్కడికైనా పోదామను నుకున్నాను ఆసమయంలో బంధువులు, స్నేహితులు మమ్మల నాదుకునేవారు లేకపోవటంవలన నాకీ ఆలోచన కలిగింది ఈనా ఆలోచన మాయింట్లో మరెవ్వరికైనా తెలియ పరుచుదామనుకున్నాను. కానీ వారు నామాట విని నన్ను వదులుకుంటారనే నమ్మకంపోయింది. అందుకని నేను ఎవ్వ రికీ తెలియపర్చకుండా వెళ్ళిపోదామనుకున్నాను అయితే ఎక్కడికిపోవాలి, పోయి ఏంచేయాలి మళ్ళీనేను యిలా ఆలోచించాను కాని ఎక్కడికైనాసరే పోయితీరాలి. అదే నా అభిప్రాయం, నాఆశయం. అందుకే ఒకనాడు ఎవ్వరికీ చెప్ప కుండా యింటినుండి బయలుదేరాను.

ఆవిధంగా పరిస్థితి నన్ను నావూరికి, నావారికి దూరంగా తీసుకుపోయింది. ఏంచేయను మరి! గత్యంతరంలేక ఆవిధంగా బయలుదేరాను. ఇక అక్కడవుండి ఆ పస్తులు చేయలేక పోయాను. అంతేకాదు యింక అక్కడ ఎక్కువకాలం వుంటే తప్పకుండానీరసంతో ఎప్పుడో చచ్చిపోతాననుకున్నాను. నా కాసమయంలో ఒకరివిషయం గుర్తుకురాలేదు. తల్లిసోదరులను ఆఖరికి అందరినీ మర్చిపోయాను. ఎవ్వరూ నాఅనే వారులేర నుకున్నాను. బయలుదేరాను. అసలుస్వార్థంబ్రతుకుమీది ఆశ నన్నలా చేసినవి. అందుకే ఆవిధంగా నిర్ణయించుకున్నాను.

నేను రాత్రిపూట బండెక్కి బస్సు దిగడంవలన టిక్కెట్టు లేకపోయినా ఎక్కడయిన్నాగాని లేపకుండానే ఒకపట్టణం వచ్చాను. అప్పటికి బాగా వెలుతురువచ్చింది. నేను ఎంతదూరం ప్రయాణంచేశానో లెక్కగా చెప్పాలంటే మాత్రం నేను చెప్పలేను. ఏదో చాలదూరం అనిమాత్రం ఖచ్చితంగా చెప్ప గలను. నిజం చెపుతున్నాను నాకు తెలియదు.

నాకు అదే మొదలు మావూరువదలి రావటం. కొన్ని రోజులవరకు పట్టణంలో నాకు అన్నీ కొత్తగా వుండేవి. నేను మావూరిలో వున్నప్పుడు బంధువులద్వారా స్నేహితులద్వారా పట్టణంలో విశేషాలు వినటంతప్పితే స్వయంగా ఎప్పుడూ చూడకపోవటంవలన నాకు అన్నీ కొత్తగా కనిపించినవి. ప్రతిదీ అదేదో విచిత్రంగా వుండేది. అసలు మనుష్యులే నాకు క్రొత్తదనంగా వుండేవా అనిపించింది. ఆవాతావరణం ఆప్రదేశం నాకు క్రొత్తకావటంవలన నేను అన్నీ విచిత్రంగా విడ్డూరంగా కొన్ని కొన్నిప్రదేశాలలో గంటలతరబడి నిలబడి చూస్తుండేవాడిని. అప్పుడక్కడివారంతా నన్నుపిచ్చి వాడిలా పల్లెటూరివాడిలా చూచేవారు. అప్పటికికాని నేను అక్కడనుండి పోయేవాడిని కాను. అలాపట్టణంలో నా మొదటిరోజులు వెళ్ళిపోయినవి.

నేను రైలుదిగినపట్టణం సామాన్యమైనది అంటే అన్ని పట్టణాలలోవలెనే అక్కడా మోసం, దుర్మార్గం, అన్యాయం.

ఎక్కువగా వుండేవి. సూర్యోదయంనుండి సూర్యాస్తమయం వరకు రోడ్లన్నీ జనంతో, బండ్లతో, బస్సులతో- రిక్షాలతో సందడిగా వుండేవి. జనం రాత్రింబగళ్ళు ఎందుకో ఎక్కడికో ఆదుర్దాగా తిరుగుతుండేవారు. ఎక్కడికిపోయినాఅంతాడబ్బుతో నేపని. అదిలేనివాడు అక్కడ ఒక్కరోజు వుండటం కష్టం. అక్కడిసంపాదనగూడా ఎక్కువే దానికితగినఖర్చు గూడా వుండేది. నేను ఆపట్టణంలో వున్నప్పుడు యివన్నీ తెలుసుకున్నాను.

ఆపట్టణంవచ్చి నేనుఅప్పటికి కొద్దిరోజులైంది. ఈగడచిన రోజులు నే నెలాగడిపానని [illegible]. అసలు ఆలోచనే వద్దు అష్టకష్టాలుపడ్డాను. తిండికి, పనికని ఎన్నో యిబ్బందులుపడ్డాను. అప్పటికి నా పట్టణ జీవితంలో సగానికపైగా పస్తులతో నేగడిపాను. ఆపట్టణానికిచివరి భాగంలోవున్న పాకాలలో ఒకచిన్నగది అద్దెకుతీసుకున్నాను. అద్దె నెలకు రెండు రూపాయలు. అక్కడికి పట్టణానికసలుసంబంధమేలేదు అది ఒక మూలగొట్టుప్రదేశం అక్కడనివసించే వారంతానాలాగే బీదవాళ్ళు, కూరలమ్మేవాండ్లు, పేకాడేవాండ్లు, రిక్షావాండ్లు, ప్రెస్‌వర్కర్లు. కూలీలు, నిరుద్యోగులు వుంటున్నారు. యాభై రూపాయలరాబడికి తక్కువవారేగాని ఎక్కువవారు లేరు. అందుకే అక్కడ వుంటున్నాను. సరి పట్టణం మధ్యలో వుండాలని వున్నది. ఏంచేయను? ఉద్యోగం లేనివాడిని నేనంత అద్దెలా యిచ్చుకోగలను ? అసలు ఈఅద్దెఅయినా

బకాయిపడకుండా యివ్వగలనా అని నాకు సందేహంగానే వున్నది. కానీ వుండటానికి పడుకోటానికి కాస్త చోటైనా వుండాలిగా మరి, పట్టణాలలో అద్దె లేకుండా ఎవరుండనిస్తారు? అందుకే నే నక్కడ ఇల్లు తీసుకున్నాను.

ఇక అప్పటినుండి వుద్యోగంకోసం ప్రయత్నాలు జేయ నారంభించాను. అయినవాళ్ళని కానివాళ్ళని అడిగాను. అడ్డమైన వాండ్లనందరిని అడిగాను. ఎవ్వరూ ఎక్కడా ఏమీ సమాధానం చెప్పరు. కొన్ని చోట్ల వుద్యోగాలు ఖాళీలుండేవి. నాటికి దరఖాస్తు పెట్టేవాడిని. అంతే అక్కడినుంచి తిరిగి ఏ సమాధానం వచ్చేది కాదు. ఎప్పుడైనా ఎక్కడనుండైనా ఒక్కోసారి సమాధానం వచ్చేది. ఆ గొంతెమ్మ కోర్కెలు చూచేసరికి తల తిరిగిపోయేది. అంతే యిక మళ్ళీ వాటిసంగతి పట్టించుకునేవాడిని కాదు. అలా నేను తిరిగి తిరిగి విసుగుపుట్టింది నే నడగని మనిషి, నేను తిరగనివీధి ఆపట్టణంలో లేదనిపించింది. అలా తిరిగాను ఇంక నాకు అదృష్టం లేదు. అంతకన్న ఏం చేయను మరి. అప్పటికీ విసుగూ విరామం లేకుండా తిరిగాను. ఇలా ఈ నిరుద్యోగంతో ఎన్నాళ్ళు యిబ్బందులు పడుతూ పస్తులు పడుకోవాలో నాకు తోచలేదు.

అప్పుడప్పుడు నేను పడే కష్టాలు, నా అవస్థ చూచి, కొందరు సహాయంచేసేవారు. అంటే అలా వారు చేసిన సహా

యం ఆరోజు సరిపోయేది. మళ్ళీ మరురోజునుండి వీధులవెంట పడేవాడిని. ఆవిధంగా నేను బస్తీలో పనేమీలేక పస్తులుంటూ తిరుగుతున్నాను. కానీ ఆ అవస్థలు పడుతున్నా నాకు సంతోషంగానే వున్నది. మాయింటిదగ్గర నాతో దరిద్ర బాధ అనుభవించే మావాండ్లు ఇక్కడ లేకపోవటమే దానికి కారణం. అందరి అవస్థ చూస్తూ వూరుకోలేకపోయేవాడిని. అందుకే ఆప్రాంతాలు వదలి ఇక్కడికి వచ్చాను. బహుశా అది నా బలహీనత కావచ్చు. నాలో ఆ జాలిహృదయమేలేక పోతే, యిప్పుడీ కథ మరొకవిధంగా వుండేది. ఇలా విరామం లేకుండా తిరుగుతున్నాను. ఎప్పటికైనా నా కష్టం ఫలించకపోదు. నేను పడ్డ కష్టానికి ప్రతిఫలం రాకపో దనే ఆశవున్నది. అవును రోగి తానుచనిపోతానని తెలుసుండీ గూడా ఇంకా కొన్నిరోజులు బ్రతికితే బావుండనుకుంటాడు. మరి అంతకంటే ఏం చేయను మరి !

అప్పటికి నేను భోంచేసి రెండురోజులైంది. ఈ రెండు రోజులు ఏం తిందామన్నా ఎక్కడా ఏమీ దొరకలేదు. ఇంకా ఇంకా వుద్యోగాలకోసం ప్రయత్నంచేస్తూనేవున్నాను కానీ నాకష్టం ఇంకా ఫలించలేదు. నేను పడిన కష్టాల కింకా ప్రతిఫలంగా నాకు ఉద్యోగం దొరకలేదు. అది దొరకలేదనే కొద్దీ నాలో ఆశ, పట్టుదల ఎక్కువైంది. ఎప్పటికైనాసరే ఉద్యోగం దొరికేవరకు విధివిరామం లేకుండా తిరగాలని నిర్ణ యించుకున్నాను. అలాగే క్షణంగూడా వూరికేపోకుండా

తిరుగుతున్నాను. కానీ ఇంకా దేముడికి నామీద జాలికలగ లేదు. నన్ను ఇంకా పరీక్షచేస్తున్నాడా ఏమిటి అనుకున్నాను. అలా నాజీవితంలో ఆరోజుకూడా ఖాళీగానే వెళ్ళిపోయింది. అందుకు పెందలకడనే వచ్చి పడుకున్నాను. పడుకుంటే నిద్ర పట్టలేదు. ఎలా పడుతుంది. అప్పటికి మూడురోజులనుండి భోజనం లేకపోవడంవలన నిద్రాదేవి నన్ను ఆవహించి వున్నది. అప్పుడప్పుడు కడుపులో పేగులు అరుస్తున్నవి. ఆకలి దహించివేస్తున్నది. తిరిగితిరిగి వుండటంవలన కాళ్ళు నొప్పులు పెడుతున్నవి. కదలలేకుండా వున్నాను. ఎక్కడికైనా వెళ్ళ డామా అనిపించింది. ఎక్కడికి వెళ్ళాలి. ఎక్కడికి వెళ్ళితే ఈ రాత్రిపూట ఎవరు పెడతారు అలాగే పడుకున్నాను. ఎంతో సేపు అటూ యిటూ దొర్లాను. గట్టిగా కండ్లు మూసు కున్నాను. కానీ నిద్రపట్టలేదు.

ఇల్లంతా గాఢాంధకారంగా వున్నది. ఒక చిన్నదీపం కూడా లేదు. అసలు పడుకోటానికి ఒక చాపచింపైన వుంటేగా? అదీలేదు. కటికనేలమీద పడుకోవాలి. అలాగే పడుకుంటు న్నాను. అప్పుడప్పుడు నిద్రపట్టక లేచేవాడిని. అవును. మరి, నాలాగే అనేక జీవరాసుల కది నివాసం. మనిషిని గాబట్టి, నే నద్దె యిస్తున్నాను, నోరులేని జీవాలుకాబట్టి అవి అద్దెలేకుండా వుంటున్నవి. అంతే తేడా. అసలు ఒకవిధంగా ఆలోచించితే నా జీవితంకంటె వాటి జీవితమే ఎంతో విలువైనది. అవి

ఎలాగో ఎక్కడో ఆహారాన్ని తెచ్చుకుంటవి. కానీ నాకా ఆహారమే దొరకడంలేదు. భాగ్యవంతుల యిండ్లలో కుక్కలా పుట్టినా బాగుండేది. దేముడు నాకీ మనిషిజన్మ యిచ్చి, ప్రయోగం ఏముంది? ఒక చిన్న చలిచీమ బ్రతుకు కంటె తీసిపోయాను. వాటి బ్రతుకు కంటె నా బ్రతుకు విలువ ఎంతో తక్కువ కాకపోతే నాకీ దరిద్ర మేమిటి? ఒంటరిగా నే నీబాధలు పడటమేమిటి? ఇలా ఎంతసేపో ఆలోచించాను. నా ఆలోచనలు యింకా కొనసాగుతూనే వున్నవి. శ్రీశైలం పోయినా, శనేశ్వరం తప్ప దన్నట్లు ఆకలితో నేను పడుకున్నా, ఆలోచనలుమాత్రం నన్ను వదలిపోవడంలేదు. అసలు ఆలోచనలుకూడా నాలాంటివాడికే ఎక్కువేమో? వున్నవాడికి ఆలోచించవలసిన అవసరంలేదు. ఆలోచించినా, యిలాంటి చిన్న చిన్న ఆలోచనలు ఆలోచించరు. వారి ఆలోచనలకు విలువ వుంటుంది. వారి ఆలోచన ఏ వ్యాపారం గురించో, అయితే అవి లక్షలు లాభాలు తెస్తవి. కానీ నా ఆలోచనవలన వక్క మెతుకుకూడా రాదు.

ఇలా ఆలోచిస్తున్నాను. ఏవో కుట్టటం మొదలు పెట్టినవి. చెవిదగ్గర కొచ్చి రాగాలు తీస్తున్నవి. ఇక అక్కడ ఒక్కక్షణం పడుకోలేకపోయాను. చలికాలం కావడం వలన చలెక్కువగా వున్నది. పోనీ వాకిటిముందు వీధిలో పడుకుంటే ఈగోలవుండదు. కానీ పడుకునేదెలా? కప్పుకోను ఒక

దుప్పటైనా లేదు. ఏం చేయను మరి, తిండికి లేకపోయె, అలాగే వాటితో యుద్ధంచేస్తున్నాను ఇక ఆ దోమలబాధ తట్టుకో లేక పోయాను. నన్ను ఒంటరిగా చేసి అవి అనేక వేలు నా మీద సమిష్టిగా యుద్ధంచేస్తున్నవి. వాటితో బాధపడుతున్నా వాటిని చూస్తుంటే నాకు తెలియకుండానే అప్రియత్నంగా వాటిమీద జాలిగలిగింది. అవును మరి, తమను, తమ జాతిని రక్షించుకోవడంకోసం అవి సమిష్టిగా పోరాడుతున్నవి. మానవునికంటే అవి ఎంతో తెలివిగలవి. కాదని ఎవరైనా అంటారా? నాకు తెలుసు మీా రెవ్వరూ అనలేరు. వాటిలో వున్న ఐకమత్యం మానవునిలో వున్నదా? వుంటే ఈనాడు ప్రపంచము యిలా అణుయుగంలో ఎందుకుంటుంది? ప్రపంచంలోని ప్రతిదేశం యిలా ఎందుకు, భయోత్పాతాలతో తల్లడిల్లుతుంది? ఈనాడు నేనిలా ఎందుకు మూడురోజులు పస్తులుంటాను. అందుకే, వాటిని వాటిజాతిని చూచేసరికి నా కప్రియత్నంగా వాటిమీాద జాలికలిగింది. కానీ వెంటనే విచారంగూడా కలిగింది. అవును ఈ విషయంలో అవి అంతగా ఆలోచించలేదు. అసలు వాటిబ్రతు కెంత, ఆయుద్ధం నాతో కాదు, నామీాదవాలి నారక్తంపీల్చుకుంటే వాటి కేం రక్తం దొరుకుతుంది. నేనే తిండిలేక ఎండిపోతుంటే! యిదే యింకెక్కడైనా భాగ్యవంతులయితే వారిదగ్గర చాలారక్తముంటుంది, రకరకాలైన వంటకాలు రుచిగల పదార్థాలు తింటారు. వారి దగ్గర ఎక్కువ రక్తమే గాకుండా వారిరక్తం రుచిగా కూడ

వుంటుంది. కాని అవి ఆ పనిచేయలేదు. అవి అలా చేస్తే నే నెంతో సంతోషించేవాడిని. కానీ అవి అలా చేయకపోవటంవలన వాటిమీద నాకు అంతులేని కోపంవచ్చింది.

ఒకవేళ నా ఆలోచనే తప్పేమో! తిరిగి నా ఆలోచనను ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకున్నాను. అప్పటికిగాని నా ఆలోచన తప్పని తెలుసుకోలేక పోయాను. వాటికి తెలుసు. భాగ్యవంతులవద్ద రక్తం చాలావుంటుందని, అక్కడ స్త్రీ పురుషులు బాగాతిని కొవ్వుపట్టి మత్తెక్కి వుంటారనిగానీ వాటిని భాగ్యవంతుల యిండ్లలోకి వెళ్ళనిస్తారా, లేదు. అందుకు అవి, నాలాగే దరిద్రబాధకు తట్టుకోలేక, నా నెత్తురును తాగటానికి వచ్చినవి. మరి నే నేం చేయాలి, వాటి ఆలోచనే నిజం. అందుకే అవి, బీదవారిండ్లలోనే స్థిరనివాసం ఏర్పరచుకున్నవి. అలాగే వారివద్ద చిక్కిన నెత్తురుతోనే సంతృప్తి చెందుతున్నవి కానీ మానవుడి కా బుద్ధిలేదు. అందుకే ఈనాడు కొన్ని వేల మంది ఆకలికి తట్టుకోలేక చచ్చిపోతున్నారు. ధాత కరువులాంటి కరువులు అప్పుడపుడు తలెత్తుతున్నవి. ఈవిషయంలో మీలో కొంతమందిమాత్రమే నాతో ఏకీభవించలేరని నాకు తెలుసు. "ఆకలి" "ఆకలి" అని అరుచుకుంటూ ఎవ్వరూచావరు. దరిద్రం వలన అనేకరకాల దీర్ఘవ్యాధులకు గురై నయం చేసుకొను శక్తిలేక లక్షలమంది చనిపోతున్నారు ఇది సత్యం. కాదని ఎవ్వరూ అనలేరు.

ఇలా చివరకు వాటిబాధపడలేక, వాటినేమి చేయలేక వీధిలోకి వచ్చి పడుకున్నాను. అప్పటికి చాలా పొద్దుపోయి నట్లున్నది నల్లని ఆకాశంలో తెల్లని నక్షత్రాలు, మిలమిలా మెరుస్తున్నవి. ఎక్కడా ఏ చప్పుడు లేదు. విశ్వమంతా గాఢ సుషుప్తిలో మాటుమణిగివుంది. సుఖంగా, శాంతంగా, సంతో షంగా గాఢసుషుప్తిలోవున్న లోకంలో నేనొక్కడినే మెళు కువతో వున్నాను. నా కడుపులో ఆకలి దహించి వేస్తున్నది అగ్ని కుండం పగిలనట్లుగా, కడుపులోనుండి అప్పుడప్పుడు వెచ్చగా శెగవస్తున్నది. క్రింద నేల సరసంగా లేదు. అసలామాట కొస్తే యిల్లు సరసంగా వుంటేగా, యిల్లంతా బెత్తెడెత్తున దుమ్ము నిండుకొని వున్నది. ఇక బయటసంగతి వేరే చెప్పాలా? చిన్నచిన్న గులకరాళ్ళు, శరీరానికి పొడుచు కుంటున్నవి. ఎటు కదలి పడుకోడానికి భయంగా వున్నది. కాలే కడుపుకు మండే గంజిలా రాళ్ళు శరీరానికి పొడుచు కోడంవలన నిద్రాదేవి నానుండి పారిపోయింది.

అలాగే కదలకుండా పడుకున్నాను. కానీ నిద్ర రావడం లేదు, ఎలా వస్తుంది? దానికి మాత్రం బుద్ధి వుండవద్దు. చలికి శరీరం కంపించుతున్నది. అప్పటికి డొక్కలో కాళ్ళుపెట్టుకుని, వీలైనంతగా ముడుచుకుని పడు కున్నాను కానీ అప్పటికీ చలికి తట్టుకోలేక పోతున్నాను. అలాగే కండ్లుమూసుకుని పడుకున్నాను. ఎపుడు నిద్రపట్టిందో

నాకు తెలియదు. తెల్లవారింది. లేవాలని ప్రయత్నం చేశాను. కానీ లేవలేకపోయాను. శరీరమంతా బిగుసుకుపోయింది. వంటిన వున్న చొక్కా, లాగూ మంచుకు తడిసిపోయినవి. మనస్సు అసలు పనిచేయడం లేదు. తల దిమ్మెక్కింది. డొక్కలోనుండి కాళ్ళు కదిలించబోయాను. కానీ కదలలేదు. అప్పుడా స్థితిలో నా పరిస్థితి పక్షవాతం వచ్చినవాడిలా వున్నది. అలాగే మెల్లగా లేచాను. తలనొప్పి పట్టుకున్నది. అబ్బ అమితమైన తలనొప్పి. భరించలేని, మనిషి బ్రతుకలేని తలనొప్పి. నూరు అమృతాంజనం డబ్బాలమందు రాసినా పోని తలనొప్పి. అలాగే యింట్లోకి వెళ్ళి పడుకున్నాను. బాధ భరించలేకపోతు న్నాను. ఏం చేయను మరి? ఒక్క అరకప్పు కాఫీ త్రాగే శక్తి కూడా లేనందుకు నన్ను నేనే తిట్టుకొన్నాను. అలా నిందించుకుని లాభమేముంది. అలా చేసినందువల్ల వచ్చేదేమీ లేదు. పైగా నోటిబాధ. అలాగే బాధపడుతూ పడుకున్నాను.

ఆవిధంగా వంటరిగా పడుకుని ఎన్నో ఆలోచించాను. అసలు మావూరు వదలివచ్చినందుకు ఎంతో బాధ పడ్డాను. అప్పటి కా బాధకు నేను బ్రతుకుతా ననుకోలేదు. ఈ సమయంలో మావా రెవరూ దగ్గర లేనందుకెంతో విచారించాను. కనీసం నా బాధ చూచి నాలాగే బాధైనా పడేవారు నా కా సమ యంలో లేనందుకు ఎంతగానో చింతించాను. ఇలా బాధలు పడుతూ, నికృష్టపు బ్రతుకు బ్రతికేకంటె హాయిగా ప్రశాం

తంగా ఒక్కసారి చచ్చిపోతే బాగుండుననిపి ... ఇక ఆలోచించలేకపోయాను. ఆ ఆలోచన వచ్చినప్పుడు నాకు సంతృప్తి కలగలేదు. అందుకే అలా ఆలోచించడం మానేశాను. పొద్దు నెత్తిమీదకు వచ్చేవరకు పడుకున్నాను. తిండిలేకుండా పచ్చిమంచినీటితో కాలం గడపడం చాలాసార్లు నాజీవితంలో జరిగినది. అయినా నేను చలించలేదు. అలాగే మధ్యాహ్నానికి లేచాను ఇంతలో యింటియజమాని వచ్చాడు. ఆయనలావుగా వుంటాడు. నాలుగురిక్షాలు పెట్టుకుని వాటితో జీవనంచేస్తున్నాడు. ఎప్పుడూ బాగా సారా తాగేట్లుగా వున్నాడు. కండ్లు ఎర్రగా చింతనిప్పుల్లా వుంటవి. ఆయన మాట్లాడుతుంటే స్వచ్ఛమైనమాట ఒక్కటీ రాదు. అన్నీ బూతులే.

అప్పటికి నేనా యింట్లో చేరి నెలమీద పది హేనురోజు లైంది. అంటే యిప్పటికి ఒక నెలఅద్దెబకాయిపడ్డాను ఆయన అద్దె విషయం అడగటానికి వచ్చాడు. నేనాయనను చూచేసరికి నా కష్టాలు చెప్పుకుని పెద్దగా ఏడవా లనిపించింది. కానీ ధైర్యం చేయలేకపోయాను ఏడవటానికి. మాట్లాడకుండా మౌనంగా వున్నాను. ఆయనమాత్రం నన్ను వదిలేట్లుగాలేడు. బాగా సారా తాగివచ్చినట్లుగా వున్నాడు. ఆయనమాటలతో సారా వాసన గుబాళించి కొడుతున్నది. అప్పుడప్పుడు ఆవాసన గుప్పించి నా నాసికా రంధ్రాలగుండా తలలోనికి పోయి గిలి గింతలు పెడుతున్నది. నే నిక ఆయన మాటలు వినలేకపోయాను.

బయటికి వెళ్ళిపోమ్మని చెప్పుదా మనుకున్నాను. కానీ నోరు కదపలేను. మాటలు పెదిములుదాటి బయటకు రాలేదు. ఆ వాసనకు డోకు వచ్చేట్లుగా వున్నది.

కానీ ఇంటియజమాని మాత్రం మాటలు ఆపలేదు. ఏదో వాగుతున్నాడు. ఎవరి విషయమో చెప్తున్నాడు. నా కాతని మాటలు వినేశక్తి కూడా లేదు. తన మాటలమధ్యలో అప్పుడప్పుడు స్వేచ్ఛంగా బూతులు మాట్లాడు తున్నాడు. అప్పుడప్పుడు పెద్దగా నవ్వుతాడు. ఆ నవ్వు విన్నప్పుడు అది నవ్వో లేక ప్రిళయమో అర్థం కాకుండా వున్నది. అంత పెద్దగా నవ్వుతున్నాడు. నాకలా ఆయనతో గడపడం చాలా బాధనిపించింది. తన ఘనతనుగురించి కాసేపు మాట్లాడు తాడు. ఏదో అంతా అగమ్యగోచరంగా వున్నది. నేను బలవంతంగా లేవాలని, ప్రియత్నంచేశాను. ఇక అక్కడ వుంటే ఆవాసనకు తల తిరిగేట్టుగావున్నది. రెండుసార్లు వాంతి వచ్చినంత పనయింది. ఎలాగైతేనేం మెల్లగా లేచాను.

కానీ నన్నాయన లేవనివ్వలేదు. 'కూర్చోండి' అంటూ నాచేతినిపట్టుకుని గట్టిగా కూర్చోపెట్టాడు. ఆతను నాచేతిని పట్టుకున్నప్పుడు రెక్కవూడిపోయిందా అనిపించింది. అంత గట్టిగా లాగాడు. ఇక చివర కెలాగో ఈపీడ తప్పించుకోక పోతే లాభంలేదు. అతనికి కాస్తదూరం వెనక్కువెళ్ళి లేచాను. ఈసారి నన్నాతను బలవంతం చేయలేదు. మెల్లగా బయట

పడ్డాను. నాతోబాటే అతను వీధిలోకి వచ్చాడు. నేను నా తాటాకుల యింటివాకిలికి తడిక అడ్డంకట్టి రోడ్డుమీదకు వచ్చేశాను.

అంతవరకు నేనెలా అక్కడికివచ్చానో నాకే ఆశ్చర్యం వేసింది. ఇప్పుడు కొంచెం తల నొప్పితగ్గింది. అక్కడ నాలుగురోడ్ల కూడలి. సరిగ్గా అక్కడే కాఫీ హోటలు ఒకటున్నది. ఆహోటలును చూచేసరికి, నాకేదోశక్తివచ్చింది గబగబాలోపలికి వెళ్ళి ఒక అరకప్పు టీ త్రాగుదామనిపించింది. కానీ ఏం చేయను. జేబులో ఎర్రని రాగి పైసాగూడా లేక పోయింది. నాకు అనుమానం వేసింది. జేబుల్లో యేమైనా డబ్బులు వున్నవేమోనని జేబులన్నీ తడుముకున్నాను. అస లుంటేగా చేతికి దొరకడానికి, ఒక్క కానీగూడా దొరకలేదు. యింతలో కూరలమ్ముకునే ఒక ముసలవ్వ నాముందుగా పోయింది. ఆవిడ బొడ్లో డబ్బులసంచి వున్నది. నిజం చెపు తున్నాను. స్పష్టంగా చూచాను. బొత్తులుగా కొన్ని రూపా యలనోట్లున్నవి. కొంత చిల్లరగూడా వున్నది. ఆ అవ్వ తీరా దగ్గరకు వచ్చినతరువాత ఆ సంచినిపట్టుకు లాగి పారిపోదా మనుకున్నాను. కానీ ఆ ముసలిదానిని చూచేసరికి నాకు తెలియకుండానే ఆమెమీంద జాలిగలిగింది. అందుకే వదలి పెట్టాను.

కానీ నేనామెవైపే చూస్తూ నిల్చున్నాను. ఆ అవ్వ కొంతదూరంపోయి హఠాత్తుగా ఆగిపోయింది. చేతివేళ్ళు లెక్కపెట్టుకున్నది. మళ్ళీ వెనక్కు తిరిగి వస్తున్నది. ఎక్కడైనా ఏమైనా ఏదో మరచిపోయినట్లున్నది. లేక ముసలిదని ఎవరైనా డబ్బులు సరిగా యివ్వలేదేమో? లేకపోతే తిరిగలా ఎందుకువస్తుంది. ఏమైనాగాని ఈసారి ఆసంచి లాగి పరుగెత్తి పారిపోదా మనుకున్నాను. నన్నెవ్వరు ఏం చేస్తారు. ఈ ప్రాంతంలో నే నెవరో, ఎక్కడవుంటానో ఎవ్వరికీ తెలియదు. ఆ డబ్బుతో కొన్నిరోజులు కులాసాగా కాలక్షేపం చేయవచ్చు, ఇలా మనసులో అనుకున్నాను.

తీరా ముసలది యింతకుముందులాగే నా ముందుగా దగ్గరగా పోయింది. కానీ నే ననుకున్నట్లు చేయలేకపోయాను. తీరా ఆమెదగ్గరకు వచ్చినతరువాత నా కా ఆలోచన గుర్తు లేదు.. గుడ్లు మిటకరించిచూస్తూ నిల్చున్నాను. ఆ ముసలిది కాస్త దాటిపోయింది. నా అసమర్థతకు నాలో నేనే తిట్టుకున్నాను. ఆ మాత్రంచేయలేని నేను దేశాని కేవిధంగా ఉపయోగపడతానో నాకర్థంకాలేదు. అసలు ఈనాటిసమాజంలో నేను ఒక మనిషిలా బ్రతకడానికి కావలసిన, హంగులు నావద్ద ఏమీలేవు. అలాగే నిల్చున్నాను. చేచిక్కిన సమయాన్ని చేతులారా పోగొట్టుకున్నందుకు ఎంతగానో బాధపడ్డాను. అప్పను ఎవరునుటుకు అంతమంచి సమయం చేతికి

దొరికినప్పుడు వదులుకుంటారు. అదే కాబోలు పెద్దలు చెపుతారు. అదృష్టం కలిసివచ్చేటప్పుడు చెప్పకుండా, చెయ్యకుండా, అనుకోనట్లుగా వస్తుందట. నాకా అదృష్టంలేదు. నేను దురదృష్టవంతుణ్ని, వట్టిపశువును, మానవుడిలాబ్రతకడంచేత కాని అమాయకుణ్ని. సమాజంలో అసమర్థతకు ప్రతిబింబంలాగా జన్మించినవాణ్ని. ఇలా అనుకున్నాను.

అలాగే నిల్చున్నాను. అక్కడినుండి ఒక్కడుగు ముందుకు వేయలేకపోయాను. కానీ హోటలులోనుండి ఘుమ ఘుమా మసాళావాసన గాలిలో కలిసి తెరలు తెరలుగా వస్తున్నది. ఆ వాసనచూస్తూ అక్కడినుండిపోలేక అలాగే నిల్చున్నాను. నాకు ఆలోచనలుకూడా తెరలు తెరలుగా వస్తున్నవి. సరాసరి లోపలికి వెళ్లి కూర్చుంటాను. కావలసినంత తింటాను. గబగబా వీధిలోకి వస్తాను. నన్ను ఏంచేస్తారు? కాకపోతే పట్టుకుంటారు, డబ్బులడుగుతారు. లేవంటాను. తంతారా? ఏమో, ఎలా చెప్పడం,యిలా ఆలోచిస్తూ నిల్చున్నాను.

అక్కడినుండి మరెక్కడకైనా వెళ్ళి కూర్చుందామనుకున్నాను. యిక యెక్కువసేపు నిల్చోలేకపోయాను. కానీ ఆ హోటలులోకే వెళ్ళిపోదామని ఆలోచనకు వచ్చాను. ఇలా అనుకుంటూ గబగబా ఆ కాఫీ హోటలులోకి వెళ్ళి బెంచీమీద కూర్చున్నాను.

"ఏంకావాలి" ప్రశ్నించాడు ఒక కాకాసప్లయర్. ఏం చెప్పాలో నాకు తోచలేదు. గుండెదడ ఎక్కువైంది. ఏదో నేరం చేసినవాడిలా వణుకుతున్నాను. ఆ సమయంలో ఏ మన్నానో నాకు తెలియదు.

తర్వాత కొద్దిసేపటికి సప్లయరు ఒకగ్లాసు మంచినీళ్ళు తీసుకువచ్చి బల్లమీాదపెట్టి యింకేమిా వద్దా అని వెళ్ళాడు. పోనీ ఏదైనా తిందామనుకున్నాను. కానీ ధైర్యంలేదు అస మర్థతకు తిట్టూకుంటూగ్లాసెడు నీరుత్రాగిబయటపడ్డాను. నేను బయటకు వచ్చేటప్పుడు క్యాష్‌దగ్గరున్నాయన నావైపు చూచాడు. నే నేమి మాట్లాడలేదు పలక్కుండా గబగబా బయటకు వచ్చాను. మళ్ళీ రోడ్డున పడ్డాను. నాలుగు వీధుల కూడలిలోనికి వచ్చాను. అక్కడి గడియారంలో రెండుగంట లైనది. చలికాలం కావడం వలన ఎండ ఎక్కువగా లేదు. కాళ్ళకు చెప్పులు లేకపోయినా బాగానే వున్నది. అక్కడ నుండి మళ్ళీ ఉద్యోగాన్వేషణ ప్రారంభించాను. అన్నిబజార్లు తిరిగాను, అంతటా అడిగాను. కనబడిన వాడినల్లా ఆఖరుకు ఆరోజు తెల్లచొక్కా వేసుకున్న వాడినల్లా ఉద్యోగం యిప్పి స్తారా? అనడిగాను.

సాయంత్రం అయ్యేవరకు ఆవిధంగా తిరిగాను. అప్పు డప్పుడు చెట్లక్రింద నీడ వున్నచోటల్లా ఆగి విశ్రాంతి తీసు

కున్నాను. అలా చేయడంవలన పెద్దబాధేమీ పడలేదు. కాళ్ళునొప్పులు పుట్టకుండా అలాచేశాను. చివరకు వచ్చి ఒక అరుగుమీద చతికిలపడ్డాను. కొద్దిసేపు కూర్చునేసరికి కాళ్ళు నొప్పులు పుట్టడం మొదలెట్టినవి. ఇక అక్కడినుండి కదిలే పరిస్థితిలోలేను. ఈరోజు భోజనంసంగతి ఎలారా భగవంతుడా అని ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇప్పటికి నాలుగురోజులు, ఈ నాలుగు రోజులు ఆకలిలేక కాదుగా అన్నము మానేసింది. చచ్చే ఆకలి, అమాంతం ఒక మనిషిని మింగే ఆకలి. కానీ ఏం చేయను. ఒక్క పైసా అప్పు యిచ్చేవాడు లేక పోయాడు. ఏంచేయనుమరి, నాలోపం లేకుండా అడగదలచిన వారిని అడగగూడనివారిని అడిగాను. ఇక అంతకంటే ఏం చేయను ?

అదేసమయంలో ఆత్రేవన యింటి యజమాని పోతు న్నాడు. సారానిషా తగ్గినట్లుంది. ఊగకుండ నడుస్తున్నాడు. అతని దగ్గరకువెళ్ళి అప్పుగా కొంత చిల్లరడబ్బు లడుగుదా మనుకున్నాను. మరింక వేరే గత్యంతరం లేదు. ఇంతలో మళ్ళీ నాకు ఒక అనుమానం కల్గినది. ముందాతనే అద్దె విష యం మాట్లాడితే ఏముంది? మనపని గుటకాయిస్వాహా జై శ్రీమద్రమా రమణ గోవిందో హరి. అయినట్లే అయినా అడుగుతాను. ఇస్తాడా సరే. లేదంటాడు ఏమిటి చేయటం, అప్పటి ఆలోచన అప్పుడు. ఇలా నిర్ణయానికి వచ్చాను.

నే నిలా నిర్ణయించుకునేసరికి అతడు చాలా దూరం నడచిపోయాడు. ఇక అప్పుడు పరుగెత్తాలి. అంతకన్నా గత్యంతరంలేదు. అలాగే పరుగులంకించుకున్నాను. నే నలా నడిరోడ్డుమీద పరుగెత్తడం - కొందరు పెద్దలు ఆశ్చర్యంగా నావైపుచూస్తూ నిల్చున్నారు. వా రలా చూడటం నా కిష్టం లేదు. కానీ నే నేమీ పట్టించుకోదలుచుకోలేదు. ఒకడి గోల నేను పట్టించుకోనప్పుడు ఒకడు నన్ను చూడటంనా కిష్టంలేదు. కానీ వారు చూస్తుంటే నే నేం చేయను ఏనుగు పోతుంటే కుక్కలు అరుస్తుంటవి అంతే, అని నాకు నేను సమాధానం చెప్పుకున్నాను.

కడుపులో శక్తి లేకపోవడం వలన నే వేసిన కేకలు పెద్దగా లేవు. గొంతు రాసినవాడి మాటల్లా నామాట నాకే సరిగ్గా వినబడటంలేదు. అలాగే వీలైనంత గబగబా పరుగెత్తు తున్నాను. ఆ తొందరలో మధ్యమధ్య కొందరి బుజాలకు నాబుజాలు టకామని పొడుచుకోవడం జరిగినది. ఏలాగైతేనేం చివరకాయనవద్దకు వెళ్ళి ఆగాను. పరుగెత్తుతూ నేను హటాత్తుగా ఆగిపోయేసరికి అతను నావైపు ఆశ్చర్యంగా చూస్తూ నిల్చున్నాడు.

'మీావద్ద ఒకరూపాయివుంటే యిస్తారా? నేను తర్వాత యిస్తాను' గసపెడుతూ అడిగాను.

ఆతను ఒక క్షణం నావైపు చూచాడు. మనస్సులో ఏమనుకున్నాడో! లేదు, కాదు అనకుండా రూపాయి నాణెం నా చేతి కిచ్చాడు. ఆ రూపాయి తీసుకున్నాను. "థ్యాంక్స్ సార్ అవసరం గడిపాను" అనాలోచితంగా అన్నాను. "థేంకు, థేంకు" అని ఆయన గబగబా అంగలు వేసుకుంటూ నడచి పోయాడు.

నే నా రూపాయిని జేబులో వేసుకున్నాను. జేబుకు రంధ్రా లేమైనా వున్న వేమోనని మళ్ళీ ఒకసారి చూచుకున్నాను. కానీ నాకు అనుమానంగానే వున్నది. అదెక్కడైనా పడిపోతుందేమోనని ఒక చేతితో జేబును అదిమిపట్టుకుని నడుస్తున్నాను.

నే నిపుడు ఒక రూపాయికి అధికారిని. నన్నెవరు ఏమన డానికి అధికారం లేదిపుడు. ఎవరైనా ఏమైనా అన్నారా వారి సంగతేమిటో చూస్తాను. అవసరమొస్తే వారిని ద్వీపాంతర వాసంకూడా పంపగలనన్నంత ధైర్యం వచ్చింది.

ఆరూపాయి నా జేబులోవుంటే నాకెంతోసంతోషంగా వున్నది. పిల్లలను ఏను గెక్కిస్తే ఎంతఃంతోషపడతారోనాకు అంత సంతోషంగావున్నది. యాదాలాపంగానడు చుకుంటూ వస్తున్నాను. అక్కడే ఒక చిన్న కురకర్మశాలవున్నదిగబగబా అక్కడికి వెళ్ళాను. కుర్చీలో కూర్చున్నాను. నిజం చెప్పా

లంటే అప్పటికి నేను క్షవరం చేయించుకొని ఆరుమాసాలైనది. నా తల గడ్డగూడులా పెరిగింది. మంగలి నామెడమీద గుడ్డ కప్పి కత్తెర తలమీద పెట్టాడు. అప్పటికి గాని నే నీప్రపంచం లోకి రాలేకపోయాను. అంతవరకూ నా ఆలోచన ఆరూపాయి మీదే వున్నది. దానిని గురించే ఆలోచిస్తున్నాను. నేను వెళ్ళింది క్షవరం చేయించుకోను గాదు, సుభ్రంగా తల దువ్వుకోడానికి వెళ్ళాను.

మంగలిని అప్పుచేసి గబగబా తలదువ్వుకొని బయట పడ్డాను. అద్దంలో చూచుకున్నప్పుడు నా ముఖం చాలా అసహ్యంగా వున్నది. కండ్లు ఎర్రగా వున్నవి. వెంట్రుకలతో నా చెవులు సగానికి నిండిపోయినవి.

ఆలోచిస్తూ నేను రోడ్డుప నడుస్తున్నాను. యూడాలంపంగా వుండటంవలన నాబుజాలు అప్పుడప్పుడు వచ్చే పోయే జనానికి తగులుతున్నవి. ముఖం పీక్కుపోయి వున్నది. చెమటతో ముఖం నూనెపూసిన ముఖంలా వున్నది. నాకు నామీదే అసహ్యం కలిగింది. నేను సంతోషంలో వుండటం వలన నాకాళ్ళుగూడ సరదాగా నడుచుకుంటువస్తున్నవి. ఎక్కడికి పోతున్నానో ఎక్కడికి పోవ లెనో నాకు ఒక ఆలోచన, అభిప్రాయము లేదు ఏఒక్క నిర్ణీతప్రదేశం లేకుండా నడుస్తున్నాను. నేనుచాలా సందులు గొందులు దాటాను. అప్పటివరకు నా వెనకాలే ఒక యువకుడు నడుస్తున్నాడు. అతడు నన్నేదో

అనుమానిస్తున్నట్లుగా వున్నదని ఊహించాను. అతను నన్ను దొంగను చూచినట్లు చూస్తున్నాడు. నా రూపాయి జేబులో వుందో లేదో నారొకసారి చూసుకున్నాను.

అతను ఎవరైంది నాకు తెలియదు. బహుశా ఎవరై వుంటారు? అతనినిగురించి ఆలోచిస్తున్నాను. ఖర్మంగాలి సి. ఐ. డి. గాని, పోలీసు గాని కాదు కదా! అదే నిజమైతే నేను దొంగనని, ఆ రూపాయి ఎక్కడో కొట్టేశానని నా మీద కేసుపెట్టి నన్ను అరెస్టుచేస్తాడేమో! ఆ రూపాయి కనిపించకుండా చాలా జాగ్రత్తగా పై జేబులోనుంచి లాగు జేబులోకి వేసుకున్నాను ఏ దేవుడో తలకాయ లేని బూర్జిట్ లాగున్నాడు. నేను రూపాయిని లాగు జేబులోనికి మార్చింది చూడలేదు. వీడు సి. ఐ. డి. గా పనికిరాడు. పోలీసు అయితే అసలే అనిఫిట్టు. ఇలాంటివాండ్ల కందరికి ఉద్యోగా లివ్వబట్టే దినదినానికి దేశంలో నేరాలు ఎక్కువవుతున్నవి. ఇలా అతనినిగురించి ఆలోచిస్తూ నడవటం వలన పొరపాటున నా బుజం ఒక అమ్మాయికి తగిలినది. అప్పటికిగాని నేను ఊహా లోకాలనుండి ఈ లోకానికి రాలేదు. పొరపాటని, తప్పు జరిగిందని చెపుదామనుకున్నాను. అలాగే అమ్మాయివైపు కన్నార్పకుండాచూస్తూ నిల్చున్నాను ఈలోపు ఆఅమ్మాయే 'చూడలేదండీ పొరపాటుజరిగింది' అన్నది. ఆమె మాటలు నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించినవి. నేనే ఆమెకు క్షమాపణ

చెప్పాలనుకుంటున్నప్పుడు ఆమె నాకు క్షమాపణ చెప్పు కోవడం ఆశ్చర్యంగా లేదుమరి! నే నిక అక్కడినుండి మళ్ళీ బయలుదేరాను. ఇంతసేపూ ఆ యువకుడు గూడా అక్కడే నిలబడి చూస్తున్నాడు. ఇప్పుడు నేను నడక సాగించేసరికి మళ్ళీ అతను నా వెంట నడకసాగించాడు.

అతనూ నా వెంట నడవడం నా ఆలోచనలకు ఎంతో అంతరాయం కలిగింది. ఇదేమిటిరా బాబూ ఈ రోజు వీ డెవడో వెంటబడ్డాడు అనుకున్నాను. ఎలాగైనా వీడిపీడ వదిలించుకోవాలి. ఎలా? వుపాయంకోసం మళ్ళీఆగిపోయాను. ఈసారి అతను ఆగలేదు. మామూలుగా నేనడచివెళ్ళిపోయాడు. అప్పటికిగాని నాకు కొంచెం మనశ్శాంతి దొరకలేదు. కీడ విరగడైపోయింది. ఆ తరువాత నేను హోటలుకు పోదామను కున్నాను. కానీ అక్కడ ఒక్క హోటలు లేదు. అక్కడన్నీ రైల్వేవారి యిండ్లు. ఇదేమిటి యింతదూర మెప్పుడువచ్చాను ఆలోచనలలో ఎంతదూరము నడిచానో నాకే తెలియలేదు. అస లింతదూరము నడిచానా? లేక ఇదంతా కలా? చప్పున నారూపాయిసంగతి గుర్తుకువచ్చింది అమ్మో! నారూపాయి వున్నదో లేదో. పైజేబులో తడుముకున్నాను. వచ్చిందిపండెం నా రూపాయి కాస్తా పోయింది. ఇక నా జీవితంలో మళ్ళీ చీకటి ఆవరించింది ఏదో దాని ఆధారంతో యింతదూరం నడవగలిగాను. దాని ఆధారంతో మరొక వారంరోజుల్లో

ఏ చీకూ చింతా లేకుండా బ్రతకగల ననుకున్నాను కానీ నా ఆశలు అడియాశలైనవి. నేను ఊహించిన ఆశాసౌధాలన్నీ కూలిపోయినవి. హా దేముడా. ఎందుకయ్యా నాయందు నీ వింత పక్షపాతం చూపిస్తున్నావు. నాకు తెలిసినంతవరకు నిన్నెప్పుడూ కలలోనైనా ఒక్క మాటకూడా అనలేదే, అలాంటి నీభక్తుడికి నీవు చేయవలసిన ప్రత్యుపకారమిదేనా, ఓ దేముడా, నీకు నిజంగా బుద్ధిలేదు. కాదు కాదు, నిన్ను పూజించేవారికి బుద్ధిలేదు. నీవేగనక నిజంగా దేవుడవైతే నిజంగా నీలోనే సత్యమేవుంటే ఈనాడు నా రూపాయను, నాకు కాకుండా చేస్తావా, లేదు చెయ్యవు నీదగ్గర సత్యంలేదు. అంతేకాదు, నీవసలు లేనేలేవు. నీ భక్తుడనైన నన్ను నీవేం కాపాడుతావు. నిన్ను నమ్ముకోటం నాదేతప్పు. అయినప్పటికీ నేను నీ భక్తుణ్ని. భక్తుడికి చేయవలసిన సహాయమిదేనా? నా ఆశలన్నీ నా కలలన్నీ ఒక్కసారిగా చెప్పకుండా కూల్చేశావే, నిన్ను ఏంచెయ్యాలి. నీకు దమ్ములుంటే నా కెదురుగావచ్చి నిలబడు, నిన్నేంచేస్తానో తెలుస్తుంది. ఆనాడు సోమనాథదేవాలయంలో మూలకూర్చున్న నిన్ను, తురుష్క సైన్యం నీ వీపు చిట్లకొడితే, నిన్ను నీవే రక్షించుకోలేకపోయావు. కానీ నే నీనాడు నీరూపమే లేకుండా చేస్తాను. ఎందుకు భయపడి దాక్కుంటావు? రా, ఎదుటికి రా! అని పెద్దగా అరచాను.

ఇంతవరకు నే ననిన మాటలన్నీ అటుగా వెళ్ళేవారు వింటూ నిల్చున్నారు. అప్రియత్నంగా నేను చేస్తున్న ప్రసంగం ఆపేసరికి నన్నొక పిచ్చివాడిలా చూస్తూ నవ్వుకుంటూ పోయారు. అప్పటికి ఆరుగంట లైనట్లున్నది. వీధిదీపాలు ఒక్కసారిగా తళుక్కున వెలిగినవి. నేను మళ్ళీ కాళ్ళీడ్చుకుంటూ అక్కడినుండి నా గదికి బయలుదేరాను. అలా నడుస్తున్నానే గాని నా మనస్సు మనస్సులో లేదు. ఆ రూపాయి [illegible] నే నన్నో కలలుకన్నాను. ఇక్కడ్నుంచి నే నెటు పోతున్నది, ఎక్కడవున్నదిగూడా తెలియని స్థితిలో వున్నాను. అలాగే నడుస్తున్నాను. కోర్కెలను చంపుకొని ఆకలిబాధతో నడుస్తున్నాను.

అప్రియత్నంగా నా చెయ్యి లాగుజేబులోనికి పోనిచ్చాను. అలా ఎందుకు చేశానో నాకే తెలియదు. చేతికి నా రూపాయి దొరికింది. నా ఆనందానికి అంతు లేదు. నిజంగా దేవు డున్నాడు. లేడని ఎవరన గలరు? దేవుడు నాయందు దయగానే వున్నాడు. లేకపోతే యిదేమిటి? పోయినరూపాయి మళ్ళీ దొరికిది అప్పుడుగాని నాకు గుర్తుకురాలేదు. నా రూపాయి ఆ జేబులోనికి పోవడానికి కారకుడు దగుల్బాజీ ఆ వెధవ. వాడు నా వెంట పడకపోతే నేనలా చేసేవాడినే కాదు. అలా ప్రవర్తించి వుండేవాడినిగాదు. ఇన్నింటికీ కారకుడు వాడు, ఏడీ వాడు? ఆసమయంలో వాడుంటే పరలోకానికి పంపేవాడిని.

నా ముఖంలోకి తిరిగి సంతోషం వచ్చింది. నా మనస్సు అనేక స్వప్నమధురమైన ఆలోచనలకు దారితీసింది. నాశరీరంలోనికి శక్తి వచ్చింది. భీముడులా పండ్లుకొరికి చేతి వేళ్ళను ముడిచాను. ఏమిటో ఆపిచ్చి, ఎందుకలా చేశానో, యిప్పటికీ నాకు తెలియదు.

నేను రోడ్డుమీద నడుస్తున్నాను. ఒకవిధంగా రోడ్డంతా ఆక్రమించాననే చెప్పాలి. రోడ్డంతా కలయతిరుగుతున్నాను. మధ్యమధ్య చిన్నచిన్న రాగాలు గూడా ఆలాపన చేస్తున్నాను. 'ల ల్ల ల్లా' అని పెద్దగానే రోడ్డుమీద రాగాలు తీస్తున్నాను. రూపాయిని పైకెగరేస్తూ పట్టుకుంటున్నాను. నన్నెవ్వరూ ఏమీ అనడానికి అధికారం లేదు. ఆ రూపాయి నాది. నా సొమ్ము నా యిష్టం వచ్చినట్లు చేసుకుంటాను. ఒకడి అజమాయిషీ ఏమిటి నామీద? ఇది నా అభిప్రాయం. ఎందుకంటే ఎవ్వరూ ఏమనుకుంటున్నది గూడా చూడలేదు. ఆ సమయంలో నాకు తోచినట్లల్లా చేశాను. ఎవరైనా నవ్వినా ఫరవాలేదు. వాళ్ళు నవ్వితే నాకేం? వారిపండ్లే బయట పడతవి.

ఆవిధంగా 'ఎల్లోరా' హోటలుదగ్గరకు వచ్చాను. అది పెద్దహోటలని వినడమేగాని యింతకుముందెన్నడూ లోపలికి వెళ్ళి చూడలేదు. అక్కడికిపోగానే దానిలోకి వెళ్ళి ఫలహారం తీసుకుందామనిపించింది. గబగబా లోపలికి వెళ్ళాను. అలా వెళ్ళి హోటలంతా ఒకసారి కలయతిరిగి వచ్చాను. చివ

రకు నాకు నచ్చిన ఒక కుర్చీలో కూర్చున్నాను. కడుపులో ఆకలి దహించుకు పోతున్నది. రూపాయి దొరికిందన్న సంతోషంతో తిరగడంవలన ఆకలిబాధ కనిపించలేదు. ఇలా వచ్చి కూర్చోగానే దానిప్రతాపం చూపిస్తున్నది. ఇంతలో సప్లయర్ వచ్చాడు.

'ఏం కావాలి'

'హాట్ ఏముంది'

రాత్రి 8 గంటలకు యిప్పుడేముంటుంది. మరొక అర గంటకు హోటలు మూసేస్తాము.

'అలాగా, అయితే ఇడ్లీ తీసుకురా'

'ఇడ్లి ఉదయమే; యిప్పుడుండదు. మిక్చర్, వడ, బోండా' అని పెన్సిలు బల్లమీద కొడుతూ అన్నాడు.

'సరే చపాతీ తీసుకురా'

'చపాతీ లేదు. అది కావాలంటే యిప్పుడు కాకాహోటలుకు పోవలసిందే'

కాకాహోటలుమాట గుర్తుకురాగానే నేను అక్కడి నుండి బయటకు వచ్చేశాను. ఇదేమిటి ఇంత పెద్దహోటలు పేరుకేనా? ఇడ్లీ, చపాతీ లేదు. అనుకుంటూ మళ్ళీ రోడ్డు మీదకువచ్చి నడక సాగించాను. అలా కొంతదూరం వచ్చిన తరువాత మళ్ళీ నా జేబువైపు ఒకసారి చూచుకున్నాను.

అమ్మ! నా రూపాయి వున్నది ఇక అక్కడినుంచి "కాకా" హోటలుకు దారితీశాను. కాకాహోటలంటే "ఎవర్ రెడీ" బాటరీ లాంటిది. రోజుకుండే ఇరవైనాలుగు గంటలలో ఏ క్షణంలో పోయినా ఏంకావాలన్నా అక్కడ దొరుకుతుంది.

వేడి వేడి చపాతీ ఒకటి తిన్నాను. నాలుగు రోజుల నుండి భోజనం లేకపోవటంమూలంగా ఆవురావురు మంటూ తిన్నానేగాని, ఒక్క చపాతీకూడా పూర్తిగా తినలేకపోయాను. తర్వాత టీ తాగి బయటకువచ్చాను. అప్పటికి పావుతక్కువ తొమ్మిదిగంటలైనది. కడుపులో కొద్దిగా చల్లబడ్డది. కొంత శక్తి వచ్చినట్లయింది. హుషారుగా రోడ్డున నడుస్తున్నాను. అక్కడికింకా నా గది దాదాపు రెండుమైళ్ళదూరం వున్నది. పగలంతా బాగా తిరిగినందుననో లేక నాలుగు రోజులనుం తిండి లేకపోవడంవలననేమో అంతదూరం నడవలేకపోయా అక్కడే ఒక చిన్న పార్కు వున్నది. దానిలోనికి వెళ్ళి సిమ్మెంటు బెంచిమీద కూర్చున్నాను. చల్లగా గాలివీస్తున్నది. అప్పటికే చలి ఉధృతంగా వున్నది. పార్కులో ఒక మనిషి లేడు. పార్కులోని రేడియో ఏదేదో వాగుతున్నది. అప్పు డప్పుడు ఆగిపోతున్నది. తిరిగి కాసేపు రాగా తీస్తున్నది. అది వినటం నాకిష్టంలేదు. కాని ఏంచేయను నేను విన్నా వినకపోయినా దాని వాగుడు అది వాగుతూనే వుంటుంది.

నేనూ కూర్చునేవున్నాను కడుపులో ఎవరో చెయ్యి పెట్టి కెలికినట్లుగా వున్నది. వాంతులు వచ్చేట్లుగావున్నవి. చెవులూ మూసుకుని కూర్చున్నాను. బొళకన్న రెండుసార్లు వాంతులు చేసుకున్నాను. శరీరం యిపుడు కొంత తేలికపడి నట్లయింది. కండ్లనిండా నీళ్ళు తిరిగినవి. హరి భగవంతుడా! నన్నెందుకు పుట్టించావు, నే నేం పాపంచేశాను ? మనిషిలా బ్రతుకుదామని ఇంతదూరం వచ్చానే, నన్ను ఇక్కడైనా ప్రశాంతంగా బ్రతకకుండా చేస్తున్నావు. నాస్థితి చూచుకొని ఎంతగానో ఏడ్చాను. తిన్నది గూడా కడుపులో యిముడ్చు కోలేని అసమర్థుణ్ణి అయినాను. అక్కడ ఒకమూల పంపువుంటే అక్కడికి వెళ్ళాను. పంపులోనీళ్ళు లేవు. అక్కడే ఒక చెట్టు మొదట్లో పాదునిండా నీళ్ళున్నవి. అవి నోట్లోపోసుకుని ముఖం కడుక్కున్నాను. కాసేపు విశ్రాంతిగా పడుకోవా లనిపించింది. నా గదికి పోవడానికి శక్తిలేదు. ఆ పార్కులోనే కాసేపు బెంచీమీద పడుకున్నాను. కానీ చలికి ఆగలేకపోయాను. అక్కడనుండి లేచాను. ఎలాగైనా నా గదికి పోవాలని బయలుదేరాను.

ఆ మరురోజు ఉదయం నేను చాలా ఆలస్యంగా నిద్ర లేచాను. అప్పుడు తొమ్మిదిగంట లవుతుంది. నేను కాల కృత్యాలు తీర్చుకుని, బయలుదేరుదామనుకుంటున్నాను. ఈ రోజు నా కెంతో సంతోషంగా వున్నది. ఆకలిబాగా దహించి

వేస్తున్నది. గడచిన నాలుగురోజులనుండి తిండి లేకపోవటం వలన వచ్చే నీరసం నిస్సత్తువ నాలో స్పష్టంగా కనిపిస్తున్నవి. నాముఖం బాగా పీక్కుపోయినట్లుగా వున్నది. నున్నగా ఉబ్బుగావుండే నాబుగ్గలు గుంటలుపడి గుంటూరుభావులలా వున్నవి. రాత్రి కాకాహోటలులో తిన్న చపాతీ, టీ, ఖర్చు మూడణాలు పోగా మిగిలిన పదమూడణాలు నావద్దవున్నవి. చిల్లర అంత వుందో లేదో అని ఒకసారికి నాలుగుసార్లు లెక్క పెట్టుకున్నాను. రాత్రినుండి ఒక్క అణా గూడా పోగొట్టు కోనందుకు నాకెంతో సంతోషంగావున్నది. నా తెలివికి నేనే మెచ్చుకున్నాను. నన్ను నేనే అభినందించుకున్నాను. ఇప్పుడు సమాజంలో నేను ఒక మనిషిలా బ్రతకడానికి కావలసిన హంగులు, తెలివితేటలు నావద్ద వున్నవని నేనెంతో సంబర పడ్డాను.

ఇంతలో ఒక యువకుడువచ్చి నా గదిముందు నిల్చున్నాడు. ఇరవై సంవత్సరా లుంటవి. నా యీడే, నేను ఆశ్చర్యంగా అతనివైపు చూస్తూన్నాను.

"ఇక్కడ అద్దెకేమైనా గదులిస్తారా?" సినిమాలలో హీరోలాగ అడిగాడు.

'నాకు బాగా తెలియదండి.పక్కయింట్లో అడగండి' సమాధానమిచ్చాను.

'అడిగాను అక్కడేమీ ఖాళీలులేవుట, మీరు ఒక్కరే వుంటున్నారని ఇంటియజమాని మిమ్మల్నడగమని చెప్పాడుని మీ కభ్యంతరం లేకపోతే నేను, మీరు కలిసివుందాము' అన్నాడు.

రెండు నిమిషాలు నేను ఆలోచించాను. అద్దె చాలా తక్కువైనప్పటికి నేను ఆ అద్దె రెండురూపాయలు, ఎలాగు యిచ్చుకోలేను. ఇప్పటికి నెలా పదిహేనురోజు లైనా ఒక్క రాగిపైసాగూడా యివ్వలేను. అంత ఎలాగు యిచ్చుకోలేను. మరి ఎలా యివ్వగలను, మీరు చూస్తున్నారుగా నా స్థితి, ఆలోచించాను, అతనిని భాగం కలుపుకోవడమేమంచి దనిపించింది. ఈ కరువుకాలంలో సగంఅద్దె తగ్గినా తగ్గినట్లే ననిపించింది. కానీ అతనెవరో తెలుసుకోవాలిగా, అతడూ నాలాగే బికారైతే చచ్చిందిగొర్రె. యిద్దరుండిగూడా అద్దె యివ్వలేదని అవొక చెడ్డపేరు. అందుకని వివరాలు అడిగి తెలుసుకుంటే బాగుండుననిపించింది.

ఇంతలో అతనే అడిగాడు.'మీ రేంచేస్తుంటారు' అని. 'నేనా'. ఒక్కక్షణం అతనివైపు ఆశ్చర్యంగా చూచాను. 'నేనేదైనా చేస్తుంటే, ఇక్కడెందుకుంటాను' అని సమాధానమిచ్చాను.

'అలాగా, మీరేం వుద్యోగం చేయరా?'

"దారికి తే ఎందుకు చేయను? అందుకే తిరుగుతున్నాను"

"ఇంతకు ముందెక్కడ చేశారు?"

"ఇంతవరకు నాకా అవుసరం కలగలేదు. యిప్పుడు కలిగింది కానీ ఉద్యోగం లేదు."

"ఇంతవరకు మీరెక్కడా వుద్యోగమే చేయలేదా?"

"లేదు"

"పోనీ నే నిప్పిస్తాను, చేస్తారా?"

"ఓ తప్పకుండా, అత్యంతకర మేమున్నది. అసలందుకే గదా యిన్నాళ్ళు ఇక్కడ తిరగడం, అంతకంటే కావలసిందేముంది" ఆత నామాట అనేసరికి నాకెంతో ఆశ కలిగింది.

"మా హోటలులో ఈరోజే ఒకడు మానేశాడు. భోజనం, కాఫీ యిచ్చి నెలకు ఎనిమిది రూపాయలిస్తారు, మరి వస్తారా?" అడిగాడాతను.

ఆతని మాటలు నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగిం అతనిమీద కోపంగూడ వచ్చింది. ఇదా అతను నా ఉద్యోగం. ఈఉద్యోగం లేకనా నేను ఇన్నిరోజులు వున్నది. ప్రపంచానికి నేనెంతహీనంగా కనిపిస్తు బ్రతికిన బ్రతుకు మా వంశగౌరవం, ఒక్కసారేవరకు నాట్యంచేసి నట్లయినది. ఇంత చదువు చదు

నేచేయబోవు ఘనకార్యమిదా! భగవంతుడా వీడికెందుకయ్యా ఆ బుద్ధిపుట్టించావు. నన్నెందుకిక్కడికి తీసుకవచ్చావు. ఉద్యోగం యిప్పించటానికి నామీద నీకు దయలేకపోతే పీడావదిలె. కానీ యిలా హోటలు క్లీనింగుపనా నే చేయవలసినది. అందుకేనా నేనిన్నిరోజులు యిన్నిపస్తులు పడుకుని తిరిగినది. అందుకేనా నేనిన్నిరోజులు కష్టాలు భరిస్తూ తిరుగుతున్నది. మనస్సులో అనుకున్నాను కానీ అతనికి సమాధానము చెప్పాలి ఏదైనాసరే ఘాటుగా చెప్పాలి. ఇంకా తను జీవితంలో మరొకరిని యిలా ప్రశ్నించకుండా చేయాలి. ఆలోచిస్తున్నాను. మంచి, మర్యాద, పెద్ద, చిన్న తెలియకుండా సరిగ్గా [illegible] ఘాటైనది ఎలాంటి సమాధానం చెప్పతానో, ఆ సమాధానంతో వాడి బ్రతుకు ఒకసారి [illegible] జరిగినట్లుండాలి. వాడికి జన్మలో తలెత్తుకుని తిరుగలేని పరిస్థితికి తీసుకరావాలి. ఆ, ఏంమాట ఆలోచిస్తున్నాను. అంత ప్రళయం తెచ్చేమాట అంతతొందరగా వస్తుందా, ఆ వచ్చింది చెప్పాను. అనుకున్నంత ఘాటుగా చెప్పలేకపోయానని తరువాత అనుకున్నాను. "నేనలాంటి ఉద్యోగం చేయను. కాస్త చదువు సంస్కారం గలవాడిని" అన్నాను.

"ఎంతవరకు చదువుకున్నావు" ప్రశ్నించాడతను.

బి. ఎ. అని గట్టిగా చెప్పి అతనివైపు చూచాను. ఈ మాటతో అతను సగం చచ్చిపోయినట్లనుకున్నాను. కాని

నేను ఆశించినట్లుగా ఏమీ ఊహించగలేదు. "నేను ప్రైవేటుగా ఈ సంవత్సరమే మెట్రిక్ ప్యాసయ్యాను" అన్నాడాయువకుడు.

"ఆ" అంతకంటే ఎక్కువ జవాబివ్వలేకపోయాను. హోటలు పనికి యస్. యస్. యల్. సి. చదువా? కండ్లు తిరిగేటట్లుగా ఉన్నవి. భూమి కదిలిపోతున్నట్లున్నది. ఇంకా ఏదో అతను మాట్లాడబోతున్నాడు నాకు ఓపిక లేదు, విన లేకపోతున్నాను. కానీ యింకా...యింకా విషయాలు వినాలనుకుంటున్నాను అలా రెండునిమిషాలు ఏం మాట్లాడలేని స్థితికి వచ్చాను.

కొంతసేపటికి తిరిగి మనిషినయ్యాను. "ఇంకా చెప్పండి వింటాను" అన్నాను. అతను చెప్పడం ప్రారంభించాడు.

"మన మేమిటండీ, మీరింకా దక్షిణాదికి వెళ్ళండి. బి. ఏ చదివినవాడు మీకు కనిపిస్తాడేమో. అంతదూరం కూడ అక్కరలేదు. యిక్కడ మద్రాసు హోటళ్ళున్నవి చూడండి. అక్కడకు మీరువెళ్ళి ఎవరితోనైనా యింగ్లీషులో మాట్లాడండి తెలుస్తుంది.

నేనిక అతనిమాటలు వినలేకపోయాను. ప్రపంచానుభవం మూర్తీభవించిన వ్యక్తిలా ఉన్నాడు. వీడెవడో హోటలు సర్వరుకాడు. నాపాలిట యముడు. "బాబూ! యిక చెప్పకు, నేను వినలేను" నాగదిలో నీవుండటానికి నాకెలాంటి,

అభ్యంతరము లేదు. నీ సామానేమైనా వుంటే తెచ్చుకో. నేను యింక అక్కడ ఒక క్షణం వుండలేకపోయాను రోడ్డున నడుస్తున్నాను. అనేక ఆలోచనలు నన్ను చుట్టుముట్టినవి ఊపి రాపనీయడంలేదు. మూలతిరుగుడు దగ్గర కాఫీహోటలుకు వెళ్ళాను. టీ త్రాగినతర్వాత కొంచెం హుషారువచ్చినట్లుగా వున్నది మళ్ళీ బయలుదేరాను. ఇపుడు కొంచెం నిదానంగా ఆలోచిస్తున్నాను. నా దృష్టిలో ఉద్యోగాల కోసం వేటాడవలసిన ప్రదేశం చాలా వున్నది. ఈసారి ఆవైపు బయలుదేరాను. యివ్వాళకొంతదూరం చూడగలను. రేపు కొంతదూరం. యిలా ఆ పట్టణంలోని అందరిని అడగాలి, ఇదే నా అభిప్రాయం.

ఈవిధంగా నాలుగురోజులు జరిగినవి. ఈ నాలుగు రోజులలో చెప్పుకోతగ్గ మార్పులేమీ లేవు. నాదగ్గరున్న చిల్లర డబ్బులు పూర్తిగా అయిపోయినవి. వుద్యోగాన్వేషణకూడా పూర్తి కావచ్చింది. ఎంతోమందిని అడిగాను. రూపాయి పూర్తిగా అయిపోయేసరికి మళ్ళీ నా జీవితంలో ఈ రోజు ఏకాదశి. ఇలా యింకెన్నిరోజులు ఏకాదశులుగా మారాలో? జీవితంమీద ఆశపోయింది. అవును ఏం జేయను. అంత పెద్ద పట్టణంలో నాకు ఒక్కడికి వుద్యోగం దొరకకపోయె. అసలు నా జీవితానికి తిండికి దిగులు లేకుండా గడుస్తుందనే నమ్మకమే లేకపోయింది. వెంటనే ప్రాణంమీదకూడా ఆశసడలింది.

అవును ఎప్పుడో ఒకప్పుడు ప్రతివాడు చరిత్ర రాస్తాడు. కాకపోతే ముందు, వెనుకల తేడా, అలా నేను ఉద్యోగానికి వచ్చిన తరువాత కొంచెం సంతోషంగా గడపగలిగాను.

మా హోటలు మిత్రుడికి చాలా సామానున్నది పెట్టె, బెడ్డింగు, మనిషి సుఖంగా గడపడానికి కావలసిన సామానులన్నీ వున్నవి. అతను ప్రవర్తనలో చాలా మంచి వాడు. ఎప్పుడు చలాకీగా మాట్లాడుతాడు. అతను జీవితంలో కష్టాలన్నీ అనుభవించినట్లుగా వున్నాడు. అతని మాటలలో ప్రవర్తనలో సంఘంమీద విప్లవం తెచ్చేవాడిలా వుంటాడు. హెచ్చుతగ్గుల తారతమ్య భేదాల కతను వ్యతిరేకి. ఏది ఎలావున్నా, నాయందు చాలా దయ కనబర్చేవాడు. అతనంటే నా కలాంటి అభిప్రాయం ఏర్పడింది కాని నేనంటే అతనికలాంటి అభిప్రాయం లేదు నేను బ్రతకడం చేతగాని వాడినని అతని భావన.

పడకలో నాకు చాలా సహాయం చేశాడు. చాప, దిండూ, దుప్పటి యిచ్చాడు నా అవస్థ నా స్థితి చూచి బాధ పడేవాడు. గదిలో మేమిద్దరం వున్నకాసేపు ఎప్పుడూ, ఏవో మాట్లాడుకునేవాళ్ళము. నా పరిస్థితి కొంతవర కాతనికి చెప్పాను. కానీ నేను పస్తులతో గడుపుతున్నానని అతనికి చెప్పడం నా కిష్టంలేదు. అందుకే ఆ విషయం రహస్యంగా వుంచాను.

(7)

అతను బీడీలు ఎక్కువగా తాగుతుండేవాడు అవంటే అంతవరకూ నాకు ద్వేషంవచ్చేవి. కానీ అతని స్నేహితంలో నేర్చుకున్నాను. మొదట చాలా రోజులవరకు అతనే యిచ్చేవాడు. అతను యిచ్చినా యివ్వకపోయినా స్వతం త్రింగా నేనే అతని జేబులోనుండి తీసుకునేవాడిని. అతని జేబులో నోట్లు, చిల్లర వుండేవి కానీ ఎందుకో నా చెయ్యి వాటిమీదకు పోయేదికాదు. నే నింత ఆకలితో బాధపడు తున్నా నామనస్సు ఆ డబ్బుచూసి చలించేదికాదు. బీడీలు కాల్చడం విషయంలో మొదట్లో కాస్త సరదాగావున్నా రానురాను అవిపీల్చటం బాగా అలవాటైనది. తరువాత అవి లేనిరోజు ఏం చెయ్యాలనినా తోచేదికాదు. మనస్సంతా వాటి మీదనేవుండేది యింకేంచేయను. కొన్నాలంటే డబ్బులుండవు. అవి లేందే వుండలేను. అప్పుడు రోడ్డుమీద దాడిచేసేవాడిని. దొరికినవల్లా తీసుకొని జేబులో వేసుకునేవాడిని.

అందులో అనేక రకాలుండేవి, పెట్టె 0-1-6 సిగరెట్ల దగ్గరనుంచి సిగరెట్టు 0-2-6 వరకు వుండేవి. రకరకాల వాటికిఅలవాటుపడ్డాను. నాకిప్పుడు యిదొక బాధ పట్టుకున్నది. కానీ అవి మానుకో లేకపోయాను. అలవాటయ్యేవరకు, నాకీ ఆలోచనే కలగలేదు. ఇప్పుడు వాటి బాధపడలేక ఆలోచనకు వచ్చాను, కానీ ఏంచేయను మానుకో లేక పోతున్నాను.

ఒకనాడు ఏరుకొచ్చుకున్న బీడీలు, సిగరెట్లు అన్నీ అయిపోయినవి. మళ్ళీ రోడ్డునపడ్డాను. చెప్పరాని వాడొకడు కుష్టురోగముతో బాధపడుతూఒకబీడీసగంకాల్చి రోడ్డుమీద పడేశాడు. అతనినిచూస్తే నాకెంతో అసహ్యం వేసింది. అతనికి నాకు మధ్యచాలాదూరంవున్నది. కానీఅతనినుండి చెడువాసన గుప్పించి నలువైపులా వ్యాపించినది. అతని శరీరమంతా ఎంతో అసహ్యంగా వున్నది. ఒంటినిండా గుడ్డపీలికలు,శరీరం నిండా ఏవో మాయని గాయాలు, మచ్చలు అబ్బ, యిక చెప్పలేను. తర్వాత చాలాకాలంవరకు భోజనం చేసేటప్పుడు అతను గుర్తుకువస్తే భోంచేయలేకపోయేవాడిని. ఒకసారి పట్టుదలతో కూర్చుని భోంచేశాను పర్యవసానం, తిన్నదంతా వాంతిక్రింద పోయింది.

ఆరోజు నా జీవితంలో ఒక మరుపురానిరోజు. ఇక అప్పటినుండి రోడ్లమీద ఏరుకొని పీల్చటం మానేశాను. అంతేకాదు. యిక నా జీవితంలో బీడీలు సిగరెట్లు దగ్గరకు గూడా రానీయలేను. అలా ఆ అలవాటు నేను మానేసిన తర్వాత, ఒకవిధంగా బాగా బ్రతకగలిగాను.

ఆరోజు ఆదివారం. మాహోటలు మిత్రుడి కారోజు శెలవు. ఉదయం నిద్రనుండి అతను లేవగానే నన్ను లేపాడు. ఇద్దరముకాలకృత్యాలుతీర్చుకునిరోడ్డుమీదనడవడం మొదలు పెట్టాము. నన్నొక హోటలుకు తీసుకువెళ్ళాడు. కావలసిన

వరకూ యిద్దరం సుష్టుగాతిన్నాము. అలాఒకసారికాదు, అనేక సార్లు అతనితో ఆపాటి హోటలుకెళ్ళేను. ఎప్పుడూ అతనే బిల్లు యిచ్చేవాడు. కానీ నాకు ఒక్కసారైనా ఆ బిల్లు యివ్వాలని వుండేది., ఏంచేయను, నిరుద్యోగం నన్ని దుస్థితికి తీసుకవచ్చింది. నన్నిలా జీవచ్ఛవంలా చేసింది. అక్కడినుండి అతను స్టంటుసినిమాకు వెళ్ళాడు. నన్ను రమ్మన్నాడు. నాకు వెళ్ళాలనేవున్నది కానీ వెళ్ళలేదు. నేనుసినిమాటిక్కెట్టుకొనే స్థితిలోవుంటేపోయేవాడిని. నాకాస్థితిలేదు. అతనిఖర్చుమీద వెళ్ళడం నాకిష్టంలేదు. అందుకే వెళ్ళడం మానేశాను.

ఏమాట కామాటే చెప్పుకోవాలి అతను నాగదిలో ప్రవేశించిన తర్వాత నాకుచాలాసహాయంగానేవుంటున్నాడు ఇప్పుడు నా జీవితంలో వస్తువులు అట్టే ఎక్కువ రావడంలేదు. కనీసం యిలా అయినా నా జీవితం వెళ్ళిపోతే బాగుండుననిపించింది. కానీ వెంటనే నాకలాంటి ఆలోచన వచ్చినందుకు సిగ్గేసింది. ఇలా ఎప్పుడూ అతను నాకు తిండిపెట్టి కాఫీ యిప్పిస్తుంటాడా, నన్ను కూర్చోబెట్టి అతను కష్టపడతాడా, నేను ఒకరికష్టంమీద ఆధారపడి బ్రతికేఅనాథనా, నా ఆలోచనకు నాకే నవ్వువచ్చింది. ఇలా ఆలోచిస్తూ నేను మళ్ళీ నాగదికి తిరిగివచ్చాను.

అప్పటికి నేను గదికివచ్చి ఒకగంట అయింది ఏంచేయడానికి తోచక పడుకున్నాను. కానీ నిద్రరాలేదు. అలనాటుం

టేగా, నాకు పగటినిద్ర అలవాటు లేదు. అటూయిటూ దొర్లుతున్నాను. కండ్లు మూసుకున్నాను ఏం చేసినా నిద్ర రావటంలేదు. ఆవిధంగా ఒకొక్క గంట కాలం గడిచింది. సినిమానుండి మామిత్రుడు వచ్చే వేళయింది. అతని దయవల్ల ఈరోజు పొద్దున్నే కాస్త కడుపులో ఆహారం పడ్డది. యిపుడు నా కేమీ ఆకలి వేయటంలేదు ఇలా మరొక రెండురోజులు గడపగల ననుకుంటున్నాను.

ఇంతలో నాగదిముందు గాజులచప్పుడైనది. లేచి చూచాను. ఒక యువతి నిల్చొనివున్నది. ఆమెపక్కనే నా మిత్రుడున్నాడు నేను చాలాసేపు ఆలోచించాను. ఎవరీమె, ఆమెకు మామిత్రుడికి సంబంధం ఏమిటి, నాకు తోచలేదు. ఈలోపు వారిద్దరువచ్చి గదిలో కూర్చున్నారు. అతను తన బెడ్డింగు పరచాడు. ఆమెను అక్కడ ఆసీనురాలినిచేసి అతను బయటకు వెళ్ళిపోయాడు.

నేనామెనుగురించి ఆలోచిస్తూనే వున్నాను. ఆమె ఎవరో ఒకసారి అడుగుదామని మాట నోటిదాకా వచ్చినది. కానీ ధైర్యం చేయలేకపోయాను. అప్పుడప్పుడు ఆమె నావైపు చూస్తున్నది! ఆమె చూసినప్పుడల్లా నాకెంతో సిగ్గుగావున్నది. అంతవరకు నేనే స్త్రీకి అంత దాపులో కూర్చొని వుండలేదు. అక్కడినుండి లేచి వెళ్ళిపోదామా అనుకున్నాను. కానీ

ఒక స్త్రీకి భయపడిపోవడం అది పురుష లక్షణంకాదనిపించింది. ఆమె ఎవరు? నా అనుమానం తీరలేదు. మామిత్రుడి సంగతి నాకేమీ తెలియదు. మరి ఈమె ఎవరు? యిదే నా అనుమానం.

నా ఆలోచన ఆమెకసిపెట్టినట్లున్నది. ఒకటి రెండుసార్లు నన్నుచూచి నవ్వింది మే మిద్దరం అక్కడవుండటం నాకెంతో భయమేసింది. అక్కడ ఒకక్షణం వుండలేకపోయాను. లేచి వీధిలోకివచ్చాను. నాగదికి దగ్గరలోనే ఒక పెద్ద వృక్షమున్నది. మామిత్రుడు వచ్చేవరకు ఆచెట్టునీడలో అలాగే కూర్చుందా మనుకున్నాను. కూర్చున్నానే గాని నాకు ఆమెనుగురించి ఆలోచనలు రావటం మానలేదు. ఎవరీమె? యిదే నా ఆలోచన. ఆవిధముగా కొంతసేపు జరిగింది. ఆమెనుగురించి ఇలా ఆలోచించడం అంత మంచిది కాదనిపించింది. ఆమె ఎవరైనా కానచ్చు. ఆమెతో నాకేంపని.

కానీ ఆమె ఎవరో తెలుసుకుంటే నాకీ ఆలోచనలు వుండేవి కాదుగా, అడుగుదామనుకున్నాను కానీ ధైర్యం లేదు. బహుశా ఆతని చెల్లెలు కావచ్చు, కాక మరేబంధువైనా కావచ్చు. ఎవరైనా పరాయిస్త్రీని గురించి ఆలోచించడం తప్పనిపించింది. ఇక నేనామెనుగుంచి ఆలోచించడం మానేశాను. ఇంతలో మా స్నేహితుడు టిఫిన్ కారియర్ పట్టుకొని వచ్చాడు. నాకు కాస్తదూరంలోనే వుండి, 'ఏమండీ ఇక్కడ వున్నారు' ఆశ్చర్యంగా అడిగాడు.

వెంటనే నాకు 'ఆమెవరు?' అని అడగాలనిపించింది కానీ అలా అడగలేకపోయాను. కాని ఏదో సమాధానం చెప్పాలిగా. 'ఆ ఏమీ లేదు. ఒంటరిగా ఆమె అక్కడుంటే నేను కూర్చోవడం బాగా వుండదని యిక్కడికి వచ్చాను'.

ఈమాట కతను ఆశ్చర్యపోయాడు నన్ను డిటెక్టివ్ పరీక్ష చేసినట్లుగా పరిశీలనగా చూచాడు. కానీ నే నేమీ మాట్లాడలేదు. చివరకు అతనే 'రండి వెళ్దాం' అన్నాడు అతనిని అనుసరించాను.

టిఫిన్ కారియర్ మా ముందుంచి మా ఇద్దరిని తినమని చెప్పాడు. నా కాశ్చర్యంవేసింది. 'నేను తిన్నాను' అని బొంకాను. అతను నామాట నమ్మలేదు. బలవంతంచేశాడు. ఇక చివరకు తినకతప్పినది కాదు అయితే ఎలా తినడం, ఆమె, నేను, ప్రక్క ప్రక్కలకూర్చొని తినడం నా కష్టంలేదు. అస లంతకు ముందెప్పుడు నా జీవితంలో అలాంటి సంఘటన జరి గుండలేదు. అంతేకాదు, అంతకుముందు ఎంతో చనువు వున్నవానిలా ప్రవర్తించాలి, అది నావల్ల జరిగేపనిగాదు. ఇప్పు డంతేగాదు. ఎంతో చనువుగా ఆ భోజనం చెరిసగం చేసు కుని తినాలి, కానీ ఏం చేయను. అతను నన్నొదిలేట్లుగా లేడు. చివరకు ఒక వుపాయం ఆలోచించాను.

ఆ దెబ్బతో ఆతను ఓడిపోతాడని నాకు తెలుసు. యిక మళ్ళీ ఆతను నన్ను బలవంతం చేయడని వూహించాను.

కానీ నా ఆలోచన సాగలేదు. అతను అక్కడే కూర్చున్నాడు. ఈ లోపు ఆ యువతి నాకు వేరుగా ఒక గిన్నెలో కొంత అన్నం పెట్టింది అలాగే ఉన్నాను ఆ యువతి అవన్నీ శుభ్రంగా కడిగి పెట్టింది. ఇప్పుడే వస్తానని ఆతను మళ్ళీ బయటకు వెళ్ళిపోబోతున్నాడు. ఈసారి నే సందేహిస్తున్నాను. నేనూ వస్తాను, నన్ను నీతో తీసుకు వెళ్ళు' అని చెప్పాను అతను నా మాటలు కిష్టపడలేదు. తను వచ్చేవరకు నన్నుండమన్నాడు. అంతేకాదు. మరోమాటగూడా అన్నాడు. ఆ మాటకు నా తల తిరిగి పోయింది. యిదా యితని ఆలోచన, నా కప్పుడతని మీంద చాలా అసహ్యం వేసింది. ఇక మళ్ళీ నా జీవితంలో ఆతనిని చూడకూడదనుకున్నాను. అంతే అతి అటు వెళ్ళిపోగానే నేను వెళ్ళిపోయాను. ఇక మళ్ళీ నే నావైపు వెళ్ళలేదు. చాలా కాలందాకా అతనిని కలుసుకోలేదు ఆతనితో మాట్లాడలేదు. అంతే. ఆగదికి నాకు ఋణం తీరిపోయింది.

చలికాలం వెళ్ళిపోతున్నది యిప్పుడట్టే చలిలేదు. నేను పగలల్లా వీధులలో తిరిగి పంపునీళ్ళు తాగుతున్నాను. ఎప్పుడైనా, ఎక్కడైనా, ఎవరైనా, ఏదైనా సహాయంచేస్తే ఆరోజు భోజనంచేస్తున్నాను. అంతే. లేకపోతే అదీలేదు. రాత్రిళ్ళు పార్కుకు వచ్చేవాడిని. అక్కడే ఆ రాత్రిల్లా గడుపుతుండే వాడిని. ఇప్పుడు నాఇల్లు, పడక, అన్నీ ఆ చిన్న పార్కే.

ఈలోపు ఒక ప్రైవేటు కంపెనీలో టైపిస్టు ఉద్యోగం ఖాళీ వున్నదంటే వెళ్ళాను. ఉన్నది ఒక్కఖాళీ. అక్కడికి నాతో ముప్ఫయిమంది వచ్చారు. అదొక ప్రైవేటుకంపెనీ, ఆ మేనేజరు చాలా మంచివాడులా వున్నాడు. అందరినీ పరీక్షచేశాడు. మరొక పదిరోజులకు తిరిగి అందరినీ రమ్మన్నాడు. ఆ రోజు ఎవ్వరిని ఎన్నికచేసిందీ చెప్తారు. కాని ఈ పరీక్షలో నేను నెగ్గుతానని నాకు నమ్మంలేదు. అపుడే చాలామంది చాలారకమైన యోగ్యతాపత్రాలు, సిఫార్సుపత్రాలు తీసుకవచ్చారు. ఒకడు డిప్యూటీకలెక్టరు, మరొకడు మరొక పోలీసు ఉద్యోగి ఇంకా మునిసిపల్ ఛైర్మన్, కమీషనర్, పలుకుబడివున్న పెద్దమనుష్యుల సిఫార్సులతో వచ్చారు. నేనూ ఎవరినైనా అడిగి ఒక సిఫార్సుపత్రం తీసుకవద్దామనుకున్నాను. కానీ ఈమహాపట్టణంలో నాకెవరు తెలుసు నా కెవరిస్తారు, అదెలాగూ నాకు వస్తుందని నమ్మకంలేదు. అలాగే ఆశతోవున్న ముప్ఫయిమందిలో నేనూఒకడిని అంతే?

కానీ నామనస్సు వూరుకోలేదు, అందరూ తలా ఒక సిఫార్సుపత్రం తీసుకవచ్చినా, నేను పోయి ఆ మేనేజరు కాళ్ళమీదే పడతాను, అంతా ఆయన యిష్టం, ఆయనచేతిలోపని ఎలాగూ ముప్ఫయిమందిలో తీసుకునేది, ఆ కంపెనీకి కావలసినది ఒక్కడే, ఆ ఒకరు ఎవరైనా కావచ్చు. మిగతా సిఫార్సులకెలాగు విలువవుండదు ఇలా ఆలోచించాను. నా ఆలోచన బాగానే వున్నది. అలాగేచేయాలి, లేకపోతే ఇక అంతకన్నా

గత్యంతరం లేదు. ఆయన కాళ్ళమీద పడాలి. నా చరిత్ర,
నేనుపడేకష్టాలు చెప్పాలి, ఆయనలో ఏమాత్రం, మానవత్వం
వున్నా తప్పకుండా నా కొఉద్యోగం యిస్తాడు. అని నేను
ఊహించాను.

అయితే యీ అభిప్రాయాన్ని ఎవ్వరికి చెప్పదలచుకో
లేదు. నేనుచెపితే నాకంటేముందే వారలాచేస్తారు. మరెవరూ
యింతగొప్పగా ఆలోచించరు. నాకు తోచిన ఉపాయానికి
నే నెంతో ఆనందించాను. నాకు నేనే అభినందించుకున్నాను.
నామస్తిష్కం చెడిపోలేదు, నా మేధస్సు బాగాపనిచేస్తున్నది.
ఇలా అనుకుంటుండగనే మళ్ళీ నాకొక అనుమానం వచ్చింది.
మేనేజరును ఎక్కడున్నప్పుడు కలుసుకోవాలి. ఆఫీసులోనా,
యింటివద్దనా, పార్కులోనా రోడ్డుమీదా, ఎక్కడా, మళ్ళీ
ఆలోచించాను. చివరకు యింటిదగ్గరకే వెళ్ళడానికినిశ్చయించు
కున్నాను ఆయన యింటి అడ్రసు తెలియదు. ఎలా? ప్యూన్
నడిగితే తెలుస్తుంది. గబగబా వెళ్ళిఆఫీసు గేటుదగ్గరనిల్చున్నాను
యింతలో ప్యూన్ లోపలినుండి వచ్చాడు. రాగానే అడి
గాను. మొదట్లో అతను నావైపు కొంచెం ఆశ్చర్యంగా
చూచినా వెంటనే చెప్పాడు.

అడ్రసు అడిగి తెలుసుకోగానే మళ్ళీ నాకొక సందే
హం కలిగింది. ఆయన, యింటికి ఎన్నిగంటలకువెళ్ళేది, ఎప్పుడు
తీరికగా వుండేది అడిగి తెలుసుకోలేదు. మళ్ళీ ప్యూన్‌ను అడు

గుదామంటే ఫ్ర్యాన్ అక్కడలేడు. అతనప్పుడే వెళ్ళిపోయాడు చీచీ, సందేహాలన్నీ, ఒక్కసారి రావు. ఇలా అనుకుంటుండ గనే ఫ్ర్యాన్ వచ్చాడు. నేను అడిగీ అడగకముందే ఫ్ర్యాన్ విషయాలన్నీ నాకు కావలసినంతవరకు చెప్పాడు. ఇప్పుడు నా కెంతో సంతోషంగా వున్నది. నా మనస్సు ఎంతో తేలిక పడింది.

ఈసారి దేవుడు నా యందున్నాడు. నాకు అన్నీ శుభసూచనలే కలుగుచున్నవి. ఆలోచించుకుంటూ పార్కుకు వచ్చాను. అప్పుడే ఐదుగంటల సైరను కూసింది. మరో గంటకాయన ఆఫీసువదలివస్తాడు. ఏడుగంటలకు పోతే బాగుంటుంది. అప్పుడు విశ్రాంతిగావుంటాడు. నేనా మేనేజరును కలుసుకోవడానికి రెండుగంటల టైమున్నది. ఈలోపు ఎక్కడికీ వెళ్ళదలుచుకోలేదు. అలాగే అక్కడే కూర్చున్నాను. రేడియోలో ఏదో రికార్డులు వస్తున్నవి. వేసవికాలం కావడం వలన పార్కుకు అప్పటికింకా ఎవ్వరూరాలేదు నేనుమరో రెండు గంటల తర్వాత ఆ మేనేజరుదగ్గర ఎలా ప్రవర్తించాలో ఎలా మాట్లాడిఆయన్ను ప్రసన్నునిచేసుకోవాలోఆలోచిస్తున్నాను.

అనుకున్నప్రకారం ఒక అరగంట ముందుగా నేనా మేనేజరు యింటికి వెళ్ళాను. తీరా అక్కడికి వెళ్ళి చూచిన తరువాత నా ఆశ నిరాశ అయింది. ఆయన సకుటుంబంగా సినిమాకు వెళ్ళాడనీ తెలిసింది. నిరాశతో తిరిగి పార్కుకు

వచ్చాను. వచ్చి కూర్చున్నానేగాని నా మనస్సు బాగాలేదు. ఏవేవో పిచ్చిపిచ్చి ఆలోచనలు వస్తున్నవి. ఇక యిలా లాభంలేదని రేడియో సంగీతంమీద నామనస్సు కేంద్రీకరించి వుంచాను. కాసేపు ఆ రేడియో సంగీతానికి నా సంగీతం జోడించి పాడాను. ఆ సంగీతం గోలలోవున్న కాసేపు నా భవిష్యత్తును గురించి నాకెలాంటి ఆలోచనలు రాలేదు. అప్పుడు నామనస్సు కాస్త ప్రశాంతంగా వున్నది.

మరురోజు ఉదయం ఆరుగంటలకు ముందే నేనా మేనేజరు యింటిముందు హాజరయ్యాను. అప్పటి కా యింట్లో ఎవ్వరూ నిద్రలేచినట్లు లేదు. అలాగే వీధిలో కాచుకొని కూర్చున్నాను ఒక గంటకాలం గడచింది. ఆ మేడలోనుండి యిప్పుడిప్పుడే పిల్లలు ఏడుపులు. తలుపులు తీసినచప్పుడు విని విస్తున్నవి మరొక అరగంట కూర్చున్నాను. అప్పుడు ఒకసారి మేనేజరు వీధివాకిటిలోకి వచ్చి ఒకసారి రోడ్డువైపు చూచి, మళ్ళీ లోపలికి వెళ్ళాడు. అప్పుడు నేను వెళ్ళితే బాగుండటుం దనుకున్నాను. ఇంతలో ఆయనే మళ్ళీ బయటకువచ్చాడు. ఈసారి, పాంటూ షర్టు వేసుకున్నాడు గబగబా మెట్లుదిగి ఎక్కడికో వెళ్ళిపోయాడు.

నేనలాగే గుడ్లప్పగించి చూస్తూ నిల్చున్నాను. ఏం చేయను, హరి భగవంతుడా, ఏమిటి యీాఖర్మ నీకు నామీద నిజంగా దయలేదు. నీవేదో దయ వున్నవాడిలా, నాకు అప్పు

డప్పుడు ఆశ చూపిస్తున్నావు, అంతే నీకు నిజంగా నామీద దయలేదు ఉసూరుమంటూ నడుస్తున్నాను. నాకేమి చేయడానికి తోచడంలేదు. పిచ్చెత్తినట్లుగా వున్నది. అంతలో ఎవరో నా వెనకాల కేకలు వేస్తున్నారు, తిడుతున్నారు, "ఏమిటా" అని వెనక్కు తిరిగిచూచాను. ఒక లారీడ్రైవరు "బుద్ధివుందా లేదా ఏం చచ్చేవాడివినా లారీకిందేదేనికి నేనే దొరికానా నీకు ఏకాలవలోనో, రైలుకిందనో పడు. ముందు మాపీడ వదులుతుంది." యింకా, యింకా ఏవేవో రకరకాల తిట్లుతిడుతున్నాడు. అతను లారీ ఆపి అంతతీరిగ్గా ఎవరిని తిడుతున్నాడో మొదట్లో నా కర్థంకాలేదు. ఒకసారి చుట్టూ కలయచూచాను. ఆదాపులో ఎవ్వరూలేరు. మరితను ఎవ్వరిని తిట్టడం? అప్పటికి నా కర్థమైంది, ఆతడుహారన్ వేసివుంటాడు నే నది వినిపించుకోలేదు. అర్థమైంది మైకం వదిలింది. వాడు తిట్టిన తిట్లన్నీ నన్నే.నాగురించే. వాడినోరు ఈ రోజు, చెప్పరాని పాపం చేసింది. అంతపొద్దున్నే వచ్చిన బహుమతి యింకెవ్వరికీకాదు, నాకే అవన్నీ, ఏంచేయనుమరి, వాడలా తిడుతుంటే జవాబు చెప్పలేకపోయాను అలాగే చూస్తూ నిల్చున్నాను. నేనలావాడివైపు ఆశ్చర్యంగా చూడటం వలన వాడు నన్నొక పిచ్చివాడినిలా చూచి లారీ స్టార్టుచేసి గొణుగుతూ వెళ్ళిపోయాడు.

అప్పుడు తెలిసింది. నేను నడిరోడ్డుమీదనడుస్తున్నాను ఇక అప్పటినుండి నడిచేటప్పుడు చాలా జాగ్రత్తగా వుండే

వాడిని. నేనెన్ని ఆలోచనలలోవున్నా, ఎన్ని కష్టాలు పడు తున్నా రోడ్డుకు ఒకవైపు నడుస్తుండేవాడిని. వీటన్నిటికి కారణం నిరుద్యోగం. నాకదే లేకపోతే, నేనలా వాడి చేత తిట్టించుకుండేవాడినా, అసలు నాకుండే బాధలే వాడికుంటే ఈపాటికి వాడుఆత్మహత్య చేసుకుని వుండేవాడు. లేకపోతే వాడే చెప్పినట్లు ఏలారీకిందో పడివుండేవాడు. అయినావాడనుకున్నంత పనికిమాలినవాడినా నేను? వాడిలాగా చదువురాని మొద్దుననుకున్నాడేమో? నాచదువుమీద ప్రభుత్వం కన్నుబడితే రెండువందల రూపాయలజీతంవచ్చే ఆఫీసరును అయ్యేవాడిని. వెధవ, నా సంగతేమిటో తెల్సుకోకుండానన్ను బికారిగా మాట్లాడాడు. నాబట్టలుచూచి అలా మాట్లాడివుంటాడు అనుకున్నాను. మళ్ళీ తప్పుడుపంధాలో పడ్డాను. మళ్ళీరోడ్డు మీందే ఆలోచిస్తున్నాను. ఇకముందెన్నడూ రోడ్డుమీంద ఆలోచించగూడదు అనుకున్నాను. అలా కొంతదూరం వచ్చినతరువాత ఆచిన్నరోడ్డు పెద్దరోడ్డుకు వస్తుంది. అప్పటికే షాపులన్నీతీశారు.మళ్ళీనామామూలుపాట ప్రారంభించాను. ఈరోజు చాలా హుషారుగా అడగాలనుకున్నాను. కానీ అనుకున్నట్లుగాచేయలేకపోయాను.తరతరాలుగామానవునిలో వుండే బలహీనశక్తంతా ఆక్షణంనాలోనేవున్నట్లుగావున్నది. ఏంచేయను మరి, వేళకు తిండిలేదు. పడుకోను చోటులేదు. అలాగేబ్రతుకును భారంగా లాగుతున్నాను.ఆ సమయంలో నన్నాదుకునేవాడుఒక్కడూలేడు నాపట్ల సానుభూతి చూపే

వారు లేకపోయారు. నేను తిరిగి తిరిగి పార్కుకు చేరాను. అప్పుడు సాయంత్రం ఆరు గంట లవుతుంది. అప్పటికి తిండి తినక మూడురోజులైంది. దరిద్రం నన్నావిధంగా చేస్తున్నది.

అక్కడినుండి గబగబా మేనేజరుగారింటికి వెళ్ళాను. ఆ సమయానికి ఆయన నే పనీ లేకుండా వున్నాడు. నా జాతకం బాగుంది. వెళ్ళి ఒక నమస్కారం చేశాను. ఆయననా ముఖం వైపు ప్రశ్నార్థకంగా చూచాడు. నేను నా చరిత్ర అంతా జంకూ, గొంకూ లేకుండా చెప్పాను. అంతా విని ఆయన నిట్టూర్పు విడిచాడు. అంతటితో నా ఆశలన్నీ పోయినవి. నేను కట్టుకున్న గాలిమేడలన్నీ ఏ తుపాను లేకుండానే ఒక్కసారిగా కూలిపోయినవి. నేను యింకా ఏదో చెప్పబోయాను. కాని ఆయన నామాటలువినేట్లుగా లేడు. వెంటనే యిలా అన్నాడు.

“ఉద్యోగాల విషయం ఈరోజుల్లో మహాబాధగా వున్నది. నీవుచూచావుగా, వున్నది ఒక్కఖాళీ, ముప్ఫయి మంది అభ్యర్థులువచ్చారు. ఎవరి కివ్వాలి, ఎవ్వరికివ్వగూడదు, నేను ఏ ఆలోచనకు రాలేకపోతున్నాను ఇందులో కొందరు, గట్టి రికమండేషన్సు తీసుకవచ్చారు. మరికొందరు, డబ్బు ఆశ పెట్టారు. ఏంచేయను? అందుకే పదిరోజుల తర్వాత రమ్మన మన్నాను. అని నా ముఖంవైపు పరీక్షగాచూచాడు. నేనేమీ

మాట్లాడలేదు. జాలిగా, ఆశగా, ఆయన్నుచూస్తూ నిల్చు న్నాను. తిరి గాయన ప్రారంభించాడు.

"నీ చరిత్ర అంతావినేసరికి నాకెంతో జాలిగావుంది. ఈరోజుల్లో నీలాంటివారు అసంఖ్యాకంగావున్నారు. వారందరి జీవితాలు చూచినా, విన్నా, హృదయం ద్రవించుకపోతుంది. ఏంచేయనుంటావు. అయినప్పటికి శక్తివంచన లేకుండా మీలాంటి వారికే సహాయంచేస్తుంటాను" అనిమరొకసారి నా వైపుచూచి తిరిగిలా అన్నాడు "మేము మావిషయం చూసు కోవాలిగా, నీ వంతగా బాధపడుతున్నానని చెప్పావు కాబట్టి రెండువందల రూపాయలివ్వు ఎలాగో నీకావుద్యోగం యివ్వ డానికి ప్రయత్నంచేస్తాను" అని ముగించాడాయన.

నే నేమి జవాబివ్వలోతోచలేదు. రెండువందలరూపా యలు, అవే నాదగ్గరుంటే నే నిలా గెందుకుంటాను. చినిగిన ఒక జతగుడ్డలతో చలికాలం ఎండకాలం అని లేకుండాగడుపు తున్నానంటే ఆయ నలా అడగడంలోని వుద్దేశ్యం నా కర్థం కాలేదు తిరిగినాచరిత్రనంతా చెప్పాను నేను బ్రతికే బ్రతుకు ఒక వీధిలోని కుక్కకూడా బ్రతకడంలేదని చెప్పాను అంతే. కాదు నా దుర్భరదారిద్రం అందులో నేను పడేపాట్లు, అన్నీ చెప్పాను. నేను చెప్పినంతసేపు ఆయన చిరాకుగా వున్నట్లు నాకు తోచింది. అప్పుడప్పుడు ముఖం చిట్లించేవాడు. నాగోడ వంతా విని చివరకు నిట్టూర్పు విడిచాడు.

ఇక నేనక్కడ ఒక్కక్షణం వుండలేకపోయాను. ఆయన ఆశ, కఠినహృదయం చూచి ఆయనమీద నా కెంతో కోపం వచ్చింది నేనే ఆ పదవిలో వుంటేనా? ఏమో? అప్పుడు నా పరిస్థితి ఎలావుంటున్నదో నే నెంతలంచగొండి నవుతానో, కానీ ఏంచేయను [illegible]పం ఎవ్వరికి కావాలి, నన్నెవరు లెక్కలోకి తీసుకుంటారు. మారు మాట్లాడకుండా తిరిగి నా పార్కు దగ్గరికి వచ్చాను పార్కంతా తోరణాలతో పందిళ్ళతో సందడిగా వున్నది. అప్పుడప్పుడు అక్కడ మీటింగులు, సభలు, సమావేశాలు జరుగుతుంటవి. అయితే ఈరోజు ఏమిటిది? ఏ పార్టీమీటింగో, నాకర్థంకాలేదు. అక్కడ పనుల్లో పాల్గొన్న ఒక పెద్దమనిషిని అడిగాను. నా అనుమానం తీర్చుకోడానికి ఆయన ఉద్యోగులసంఘు మీటింగని చెప్పాడు.

ఆమాట కర్థంఏమిటో నాకర్థంకాలేదు. తిరిగాయనను అడిగాను.'ఉద్యోగస్తుల మీటింగేమిటండీ?, అని. ఆయన నా వైపు ఒకసారిచూచి ఇలా అన్నాడు."ఈనాడు ఉద్యోగస్థులు పడేబాధలు, విద్యావంతులు ఉద్యోగాలు లేక పడేకష్టాలు, వాటికిమార్గాలు, వాటినిగురించి పెద్దలు వుపన్యాసాలిస్తారు. ఇది మా ఉద్యోగస్థులు సంఘంతరపున జరుగుతున్నది" అన్నాడు.

ఆయనలా చెప్పినతరువాత ఆ వుపన్యాసమేమిటో వినాలని నాకు కోరిక కలిగింది. ఏమని వుపన్యాసాలిస్తారో,

నిరుద్యోగ నిర్మూలనకు మార్గాలు ఏమిటో అని నాకు ఆశ కలిగింది. అదే మరేపార్టీ మీటింగైనా అయితే నేనువినేవాడిని కాదు.నాకామీటింగులంటే తలనొప్పి. దానికికారణం లేకపో లేదు. ప్రభుత్వం పార్టీ అయితే మేమది చేశాం, ఇది చేశాం, అక్కడ మట్టిరోడ్డు వేయించాం, ఇక్కడ మురికి కాలువలకు నాలుగులక్షలు కేటాయించాం, దేశంలో ఆహారధాన్యాల ధరలు పడిపోకుండా చేస్తున్నాం, ఇంకా చేస్తాం ఇలావుంటవి వారి వుపన్యాసాలు. అదే ప్రతిపక్షం అయితే, ఈప్రభుత్వం ఏమీ చేయడంలేదు. మేమువస్తే అదిచేస్తాం ఆకాశానికి నిచ్చెనవేస్తాం, ఆ నిచ్చెనెక్కి మీరంతా ఎక్కడాఆగకుండా సరాసరి చంద్రిలోకానికి వెళ్ళవచ్చు. దేశంలో ధరలు మండి పోతున్నవి. సామాన్యుడు కొనుక్కో లేకపోతున్నాడుకాబట్టి దీనికిఒక్కటేమార్గంవున్నది. అదే ప్రభుత్వాన్నిగద్దెదించడం. ఇవి వారి వుపన్యాసాలు. ఎవరు చెప్పినా ఏది చెప్పినా, సరళి అంతా ఇలాగేవుంటుంది.అందుకే పార్టీమీటింగులంటే నాకు తలనొప్పి.

అనుకున్నప్రికారం సభఏర్పాటయినది. నాలుగువంద లకు పైగా ఉద్యోగస్థులువచ్చారు. పేరుపేరునాఒక్కొక్కరే తమ అభిప్రాయాలను, నిరుద్యోగనిర్మూలనకుపథకాలు చెప్పి పోతున్నారు. అందులో అంతకుముందు నేను కలుసుకున్న మేనేజరుగూడా వచ్చాడు. ఆయన వుపన్యాసం చాలా జాగ్ర త్తగా విన్నాను. యిలా చెప్పాడు.

'ఈనాడు దేశంలో విద్యావంతులైన అనేకమంది యువతీ యువకులున్నారు. వారికి మన ప్రభుత్వం ఉద్యోగాలు చూపడంలేదు. పైగా ప్రభుత్వోద్యోగులలో లంచగొండి తనంఎక్కువైనది. అంటే మనలోనన్నమాట (ఈమాటకుసభ నుండి కరతాళధ్వనులు) కాబట్టి దేశక్షేమం దృష్ట్యా మనం వాటిని ఎదుర్కోవాలి అందరికి వుద్యోగాలుయిప్పించేట్లుగా మనం ప్రభుత్వంవద్దకురాయబారంవెళ్ళాలి. ఆవిధంగామనకోరి కలు వారు తృణీకారం చేస్తే మనం అంతా వచ్చే ఎన్నికలలో ప్రభుత్వాన్ని గద్దె దింపాలి. (మళ్ళీ కరతాళ ధ్వనులు) యిందాక అంటే ఒక గంటకిత్రం ఒక చిన్న సంఘ టన జరిగింది. చెప్తాను. మా ఆఫీసులో ఉద్యోగం ఒకటి ఖాళీ వున్నది. దానికి ముప్ఫయిమంది అభ్యర్థులు వచ్చారు. తలా ఒకరు పెద్దవారినుండి వారినిగురించి యోగ్యతా పత్రాలు తీసుకవచ్చారు. అందులో ఒక యువకుడు మాత్రం చాలా బీదవాడు. పాపం అతనికి రికమండేషను చేసేవారు ఎవ్వరూ లేరు. ఆ యువకుడు గత్యంతరంలేక నావద్దకు వచ్చాడు. (జాలిగొంతుకతో) ఆపరిస్థితిలో నేనేంచేయను? పెద్దవారిమాట కాదని నేనతనికావుద్యోగంయివ్వాలో లేక 'ఏంచేయాలి' పాపం ఆయువకుడు నేను కాదంటే ఆత్మహత్య చేసుకునేట్లున్నాడు. అతనిపరిస్థితి ఆవిధంగా వున్నది. అతను ప్రతిక్షణం దరిద్రంతో హోరాహోరీగా పోరాడుతున్నాడు. అతనిముఖంలో కళలేదు.

మనిషి బాగా నీరసించి వున్నాడు. ఆతని పరిస్థితి చూచిన ఎవరైనా జాలిపడకపోరు. నే నాతని పరిస్థితి చూచి ఎంతో బాధపడ్డాను ఆతనిని భావిభారతపౌరుడుగా రూపొందించవలసిన బాధ్యత తల్లిదండ్రులు పెద్దలమైన మన మీాదున్నది. అయితే మనం ఏం చేస్తున్నాం [పౌరుషంతో] భారతదేశ పరిస్థితి చివరకు ఈ విధంగా తయారైనందుకు, నాకెంతో సిగ్గుగా వున్నది. ఒక యువకుడు ఉద్యోగంలేక, తిండిలేక మలమలా మాడిపోతుంటే మనిషి అయినవాడెవడు వూరుకుంటాడు. నే నతని కావ్రద్యోగమయితే నాకు పెద్దవారి నుండి మాటరాకతప్పదు. ఇలా ఎన్నిరోజులు మనం స్వాతంత్రం లేకుండా జీవచ్ఛవాలలాగ వుంటాము. ఒక యువకుడికి, నిర్భాగ్యుడి కామాత్రం సహాయం చేయడం చేతగాని మనం ఎందుకీ వుద్యోగాలుచేయడం, నా కతని పరిస్థితి చూచేసరి కెంతో జాలివేసింది. పాపం ఆ యువకుడు భోజనంచేసి ఎన్నిరోజులైనదో నే నతనిని చూస్తూ వుండలేకపోయాను! ఏం చేయుటకు చేతగాక ఐదు రూపాయలిచ్చి పంపాను.

ఆతని వుపన్యాసం విని నే నిక వూరుకోలేకపోయాను. 'అబద్ధం పచ్చిఅబద్దం' అని గట్టిగా అరచాను. వెంటనే వాలంటీర్లు నన్ను నాలుగుబాది తీసుకవెళ్ళి గేటవతల వదలి పెట్టారు. అంతే! ఆరాత్రి మళ్ళీ ఏంజరిగింది నాకు తెలయదు. ఆ దెబ్బల బాధతో అలాగే పడుకున్నాను. మళ్ళీ రెండు రోజులవరకు లేవలేకపోయాను.

మేనేజరు యిచ్చిన వుపన్యాసం ఇంకా నామనస్సులో నుండి పోలేదు. అతని ప్రసంగం పాపం ఆ అమాయకప్రజల కేం తెలుసు? అందరూఆవుపన్యాసాన్నివిని తలలూపారు "ఓ దేముడా, దేశం ఏవిధంగా వుందిరా బాబూ, ఎక్కడచూచినా మోసం, ఎవడిని కదలించినా అబద్ధం, స్వార్థం. దేశంలో రోజు రోజుకు, అన్యాయం ప్రబలిపోతున్నది. ధర్మానికివిలువ లేదు. నీతి, నిజాయితి మంటకలిసిపోయినవి. దేశంలోని ప్రతివక్కరు ఇప్పుడు వాటికి చాలా దూరంగా వుంటున్నారు. అవునుమరి, ఏంచేస్తారు? అవి లేకపోతే బ్రతకడం చేతకావడం లేదు. వాటితోనే ప్రపంచంనడుస్తున్నది. నవనాగరికత దేశంలో ప్రబలిపోయింది. పెద్దలసూక్తులన్నీ బూజుపట్టిన సిద్ధాంతాలన్నారు. వాటికి విలువలేదన్నారు. కొత్తవి సృష్టించారు. కానీ పర్యవసానం ఆలోచించలేదు అందుకే దేశం ఇపుడిలా తగలడ్డది. ఆ మేనేజరుమీద నాకు కోపం ఆగలేదు. ఆతనివుపన్యాసాన్ని మరొకమారుగుర్తుకుతెచ్చుకున్నాను. అబద్ధాలను సంఘం ఎంతతొందరగా నమ్ముతుందో నాకిపుడర్థమయింది. నేరస్థుడికి సరియైన శిక్ష లేకపోవడం, ఒకవిధంగా దేశంలో అశాంతి ప్రోత్సహించడమే అవుతుంది. కాని ఎవరువింటారు నామాటలు. మనస్సులో తిట్టుకున్నాను అంతే. ఇక ఎక్కువ ఆలోచించలేకపోయాను. ఐదురోజులనుండి తిండి లేకపోవడం వలన నైతేనేమీ దెబ్బలవల్లనేమీ, బాగా శోష వచ్చింది"

ఆరాత్రి ఎలావెళ్ళిపోయిందో నాకు తెలియదు.

మరుసటిరోజు ఉదయం నేను లేచేసరికి ఎండ నామీద వున్నది. సుమారప్పుడు తొమ్మిదిగంట లవుతుందనుకున్నాను, లేవబోయాను కాని లేవలేకపోయాను. శరీరం అంతా నలిగి పోతున్నది. తలనొప్పిగావున్నది. నోరంతా బంకగావున్నది. అదేమిటో నాకు తెలియలేదు. చాలాసేపు లేవడానికి ప్రయ-యం ఎవరైనా వస్తారేమోనని ఎదురుచూచాను. లాభం లేకపోయింది, పార్కుకి పగ లెవరువస్తారు. అందులో ఎండా కాలం. ఎండ అప్పటికి బాగా మండిపోతున్నది. అప్పుడు నేనొక సిమెంటుబెంచీమీద పడివున్నాను. ఎండకు బెంచీ కాలిపోతున్నది. పైన సూర్యుడు తన ప్రతాపాన్నంతా నాలో నిమిషనిమిషానికి తన ప్రతాపం చూపిస్తున్నాడు. శరీరం అంతా చెమటపట్టింది. అలాగే పడివున్నాను ఒళ్ళు కాలి సిన తర్వాత గూడా లేచి నడవలేకపోయాను. చేసేదేక అలాగే ఎండలో పడివున్నాను. తర్వాత స్పృహతప్పింది. అంతే. కండ్లు మూసుకపోయి తర్వాత ఏం జరిగిందీ నాకు తెలియదు. కండ్లు తెరిచాను. ఆసుపత్రిలో వున్నాను. నర్సులు అటూ ఇటూ తిరుగుతున్నారు. నేనిక్కడ కెలావచ్చానో ఎవరు తీసుకవచ్చారో నాకు తెలియదు. చుట్టూ చూశాను. నాలాగే అనేకమంది అభాగ్యుల కదినిలయం. నాచుట్టుప్రక్కల అనేకమంచాలున్నవి. అక్కడ అనేకమంది స్త్రీలు, పురుషులు వున్నారు. కండ్లు పోయినవారు, కాళ్ళువిరిగినవారు, రోగిష్టులు, దీర్ఘకాలవ్యాధులతో

చావబోయేవారు నానారకాలుగా రున్నారు. నేనూ అక్కడ వున్నాను.

నే నక్కడికి ఎలావచ్చానో నాకు తెలియలేదు వివరాలడగాలనుకున్నాను. చుట్టూపరికించిచూచాను. మంచాల మీద రోగులుతప్ప ఇక అక్కడెవరూ లేరు. నర్సులంతా వెళ్ళి పోయారు. నేనున్న మంచంమీదనుండి లేవబోయాను. కానీ లేవ లేకపోయాను. శరీరం బిగుసుకపోయినట్లయింది. అవయవాలు స్వాధీనంలో లేవు, ఎంతగానో ప్రియత్నంచేశాను. లాభంలేక పోయింది. అలాగేపడుకున్నాను. అక్కడంతా వాసన వేస్తోంది. అదిఒకరకం అని చెప్పడానికి వీలులేదు. అనేకమంది పాపిష్టుల పాపపంకిలం అక్కడంతా నిండుకుని వున్నది. ఏంచేయను అలాగే పడున్నాను.

ఆ విధంగా అక్కడ మూడురోజులు గడిపాను. ఈ గడచిన మూడురోజులు, అప్పు డప్పుడు నర్సులువచ్చి నాకు రొట్టె, పాలు ఇచ్చి పోయేవారు. నా కవెంతో రుచిగా వున్నవి. అవునుమరి ఏం చేయను? అవి ఇంతకు ముందెపుడూ నేను తినివుండలేదు. అందుకే నా కవి ఎంతో రుచిగావున్నవి

ఇలా ఇంకా నాలుగురోజులుంటే బాగుండుననిపించింది. కానీ అక్కడి వాసనపీల్చుతూ ఆ వాతావరణంలో వుండలేక పోయాను. ఇంతలో ఒక నర్సువచ్చి నాకువుద్వాసన చెప్పింది. ఇప్పుడు నా జ్వరం తగ్గిపోయిందట. డాక్టరు నన్ను పంపించ

మని చెప్పివుంటాడు, ఆమె ఆమాట చెప్పగనే, నా సొత్తంతా ఎవరో అన్యాయంగా దొంగిలించినట్లు బాధపడ్డాను. ఇలాగైనా కొంతకాలంపాటు దిగులు లేకుండా ఇంత తిండి దొరుకుతుందని కలలుకన్నాను. ఆ పాపిష్టి నర్సు వచ్చి నా కలలన్నీ కల్ల చేసినది.

నేను మళ్లీ వీధులలో పడ్డాను అలానే కాలక్షేపం చేస్తున్నాను. కానీ నా కెక్కడా వుద్యోగం దొరకలేదు. కనీసం తిండికూడా లేదు. [illegible] ఆరోగ్యం లేనివాడికి తిండెలావస్తుంది? అలాగే పస్తులతో గడుపుతున్నాను. పగలల్లా తిరిగి, రాత్రికి పార్కుకు చేరుకునేవాడిని. కానీ నా మనస్సులో ఇంకా ఆనాటి సంఘటన పోలేదు ఆ మేనేజరు పచ్చి అబద్ధాలు నా హృదయంలో స్థానం ఏర్పరచుకున్నవి.

అలాగే తిరుగుతున్నాను. ఒకనాటి మధ్యాహ్నం ఎండ వేడిమికి తట్టుకోలేక ఒక వీధి అరుగుమీద కూర్చున్నాను. అప్పుడు మధ్యాహ్నం పన్నెండు గంటలవుతుంది. వేసవికాలం కావటంవలన సూర్యుడు ప్రచండ తేజస్సుతో వెలుగుతున్నాడు వేడిగాల్పులు కొడుతున్నవి. వీధులలో జనం ఎవరూ లేరు. అప్పుడప్పుడు అటూ ఇటూ రిక్షాలు, బస్సులు, జట్కాబండ్లు తిరుగుతున్నవి. అంతే అంతకుతప్ప వీధిలో మరేచప్పుడు లేదు.

నేను కూర్చున్న అరుగు ఒక పురాతన మేడలోనిది. కుటుంబాలతో చాలమంది కాపురం ఉంటున్నారు. మేడ

గోడల కక్కడక్కడ బాగా పెచ్చికలు వూడిపోయినవి. మేడ లోని దంతెలలో పిచ్చికలు గూడు లేర్పరచుకుని స్థిర నివాసం ఏర్పరచుకొన్నవి. అక్కడ అన్నీ గదులుగదులుగా విభజింపబడ్డవి. అక్కడి జనాభాను బట్టి ఒక్కొక్క గదిలో ఒక్కొక్క కుటుంబం అద్దెకుంటున్నట్లుగా వున్నది. వేసవి కాలం, అందులో మిట్టమధ్యాహ్నం కావడంవలన తలుపులు బిడాయించారు. కానీ లోపలనుండి మాటలుమాత్రం స్పష్టముగా వినబడుతున్నవి.

నేను కూర్చున్న యింటివా రెవరోగాని, వారు గోపాలరావుగారి మయూరాపెన్నులకంపెనీనిగురించిమాట్లాడుకున్నారు. అది ఆ పట్టణంలోని పెద్ద పెన్నుల కంపెనీలలో ఒకటని నాకు తెలుసు. ఆ విషయం యింతకు ముందెప్పుడో విన్నాను. ఆ పెన్నులకంపెనీ యజమానిపేరు గోపాలరావు పెద్ద పెద్ద పెన్నులకంపెనీలు ఆ పట్టణంలో ఇంకా నాలుగైదు వున్నవి. ఈ గోపాలరావు ఆ పెన్నులకంపెనీలతో పోటీబడిబాగా చితికిపోయాడు అంతేకాదు, ఆ కంపెనీ ఏజంటు ఇతరకంపెనీలతో లావాదేవీ ఏర్పరచుకొనడం వలన వ్యాపారం క్షీణించిందంటారు.ఏది ఎలావున్నా బాగా నష్టపడ్డాడనిమాత్రం విన్నాను.

కానీ యిపుడు వీరుగూడా, గోపాలరావుగారి పెన్నుల కంపెనీని గురించే మాట్లాడుతుండేసరికి వారి సంభాషణ ఆసాంతం వినాలని నాకు కోరిక కలిగింది. అందుకే చాటుగా వింటూ కూర్చున్నాను.

(10)

మరుసటిరోజు ఉదయం నేను లేచేసరికి ఎండ నామీద వున్నది. సుమారవుతు తొమ్మిదిగంట లవుతుందనుకున్నాను, లేవబోయాను కాని లేవలేకపోయాను. శరీరం అంతా గుంజి పోతున్నది. తలనొప్పిగా వున్నది. నోరంతా బంకగా వున్నది. అదేమిటో నాకు తెలియలేదు చాలాసేపు లేవడానికి ప్రయ యం ఎవరైనా వస్తారేమోనని ఎదురుచూచాను. లాభం లేకపోయింది, పార్కు దగ ఎవరున్నస్తారు. అసలుఁగో ఎండా కాలం. ఎండ అప్పటికి బాగా మండిపోతున్నది. అప్పుడు నే నొక సిమెంటుబెంచీమీద పడివున్నాను. ఎండకు బెంచీ కాలిపోతున్నది. పైన సూర్యుడు తన ప్రతాపాన్నంతా నాలో నిమిషనిమిషానికి తన ప్రతాపం చూపిస్తున్నాడు. ఒళ్ళం అంతా చెమటపట్టింది. అలాగే పడివున్నాను [illegible] సిన తర్వాత గూడా లేచి నడవలేకపోయాను. చేసేదేమీ అలాగే ఎండలో పడివున్నాను. తర్వాత స్పృహతప్పింది. అంతే. కండ్లు మూసుకపోయిన తర్వాత ఏం జరిగింది నాకు తెలియదు. కండ్లు తెరిచాను. ఆసుపత్రిలో వున్నాను. నర్సులు అటూ ఇటూ తిరుగుతున్నారు. నే నిక్కడ కెలావచ్చానో ఎవరు తీసుకవచ్చారో నాకు తెలియదు. చుట్టూ చూశాను. నాలాగే అనేకమంది అనారో గ్యాల కది నిలయం. నా చుట్టుపక్కల అనేకమంచాలున్నాయి. అక్కడ అనేకమంది స్త్రీలు, పురుషులు వున్నారు. విరిగి పోయినవారు, కాళ్ళువిరిగినవారు, రోగిష్టులు, దీర్ఘకాలవ్యాధిగ్రస్తులో

చావబోయేవారు నానారకాలవా రున్నారు. నేనూ అక్కడ వున్నాను.

నే నక్కడి కెలావచ్చానో నాకు తెలియలేదు వివరాలడగాలనుకున్నాను. చుట్టూపరికించిచూచాను. మంచాల మీద రోగులుతప్ప ఇక అక్కడెవరూలేరు. నర్సులంతా వెళ్ళి పోయారు. నేనున్న మంచంమీదనుండి లేవబోయాను. కానీ లేవ లేకపోయాను. శరీరం బిగుసుకపోయినట్లయింది. అవయవాలు స్వాధీనంలో లేవు, ఎంతగానో ప్రయత్నంచేశాను. లాభంలేక పోయింది. అలాగే పడుకున్నాను. అక్కడంతా వాసన వేస్తోంది. అదిఒకరకం అని చెప్పడానికి వీలులేదు. అనేకమంది పాపిష్టుల పాపపంకిలం అక్కడంతా నిండుకుని వున్నది. ఏంచేయను అలాగే పడున్నాను.

ఆ విధంగా అక్కడ మూడురోజులు గడిపాను. ఈ గడచిన మూడురోజులు, అప్పు డప్పుడు నర్సులువచ్చి నాకు రొట్టె, పాలు ఇచ్చి పోయేవారు. నా కవెంతో రుచిగా వున్నవి. అవునుమరి ఏం చేయను? అవి ఇంతకు ముందెపుడూ నేను తినివుండలేదు. అందుకే నా కవి ఎంతో రుచిగావున్నవి ఇలా ఇంకా నాలుగురోజులుంటే బాగుండుననిపించింది. కానీ అక్కడి వాసనపీల్చుతూ ఆ వాతావరణంలో వుండలేక పోయాను. ఇంతలో ఒక నర్సువచ్చి నాకువుద్వాసన చెప్పింది. ఇప్పుడు నా జ్వరం తగ్గిపోయిందట. డాక్టరు నన్ను పంపించ

మని చెప్పివుంటాడు, ఆమె ఆమాట చెప్పగనే, నాసొత్తంతా ఎవరో అన్యాయంగా దోంగిలించినట్లుబాధపడ్డాను. ఇలాగైనా కొంతకాలంపాటు దిగులులేకుండా ఇంతతిండి దొరుకుతుందని కలలుకన్నాను. ఆపాపిష్టిమనుసు వచ్చి నాకలలన్నీ కల్లచేసినది.

నేను మళ్లీ వీధులలోపడ్డాను అలానే కాలక్షేపం చేస్తున్నాను. కానీ నా కెక్కడా వుద్యోగం దొరకలేదు. కనీసం తిండికూడాలేదు. ఆరోగ్యం లేనివాడికి తిం డెలావస్తుంది? అలాగే పస్తులతో గడుపుతున్నాను. పగలల్లా తిరిగి, రాత్రికి పాస్కూలు చేసుకునేవాడిని. కానీ నా మనస్సులో ఇంకా ఆనాటి సంఘటన పోలేదు ఆ మేనేజరుపచ్చిఅబద్ధాలు నా హృదయంలో స్థానం ఏర్పరచుకున్నవి.

అలాగే తిరుగుతున్నాను. ఒకనాటిమధ్యాహ్నం ఎండ వేడిమికి తట్టుకోలేక ఒక వీధిఅరుగుమీద కూర్చున్నాను. అప్పుడు మధ్యాహ్నం పన్నెండు గంటలవుతుంది. వేసవికాలం కావటంవలన సూర్యుడు ప్రచండతేజస్సుతో వెలుగుతున్నాడు వేడిగాల్పులు కొడుతున్నవి. వీధులలో జనం ఎవరూ లేరు. అప్పుడప్పుడు అటూ ఇటూ రిక్షాలు, బస్సులు, జట్కాబండ్లు తిరుగుతున్నవి. అంతే అంతకుతప్పవీధిలో మరేచప్పుడు లేదు.

నేను కూర్చున్న అరుగు ఒక పురాతన మేడలోనిది. కుటుంబాలతో చాలమంది కాపురం ఉంటున్నారు. మేడ

గోడల కక్కడక్కడ బాగా పెచ్చికలు వూడిపోయినవి. మేడ లోని దంతెలలో పిచ్చికలు గూడు లేర్పరచుకుని స్థిర నివాసం ఏర్పరచుకొన్నవి. అక్కడ అన్నీ గదులుగదులుగా విభజింపబడ్డవి. అక్కడి జనాభాను బట్టి ఒక్కొక్క గదిలో ఒక్కొక్క కుటుంబం అద్దెకుంటున్నట్లుగా వున్నది. వేసవి కాలం, అందులో మిట్టమధ్యాహ్నం కావడంవలన తలుపులు బిడాయించారు. కానీ లోపలనుండి మాటలుమాత్రం స్పష్టముగా వినబడుతున్నవి.

నేను కూర్చున్న యింటివా రెవరోగాని, వారు గోపాలరావుగారి మయూరాపెన్నులకంపెనీనిగురించిమాట్లాడుకున్నారు. అది ఆ పట్టణంలోని పెద్ద పెన్నుల కంపెనీలలో ఒకటని నాకు తెలుసు. ఆ విషయం యింతకు ముందెప్పుడో విన్నాను. ఆ పెన్నులకంపెనీ యజమానిపేరు గోపాలరావు పెద్ద పెద్ద పెన్నులకంపెనీలు ఆ పట్టణంలో ఇంకా నాలుగైదు వున్నవి. ఈ గోపాలరావు ఆ పెన్నులకంపెనీలతో పోటీబడిబాగా చితికిపోయాడు అంతేకాదు, ఆ కంపెనీ ఏజంటు ఇతరకంపెనీలతో లావాదేవీ ఏర్పరచుకొనడం వలన వ్యాపారం క్షీణించిందంటారు.ఏది ఎలావున్నా బాగా నష్టపడ్డాడనిమాత్రం విన్నాను.

కానీ యిప్పుడు వీరుగూడా, గోపాలరావుగారి పెన్నుల కంపెనీని గురించే మాట్లాడుతుండేసరికి వారి సంభాషణ ఆసాంతం వినాలని నాకు కోరిక కలిగింది. అందుకే చాటుగా వింటూ కూర్చున్నాను.

ఒకకంఠం—గోపాలరావు బాగా చితికిపోయాడుటగా ?

రెండవకంఠం - ఆ అవును, చితికిపోక ఏంచేస్తాడు. వ్యాపారం తెలుసునా పాడా, ఏదో వ్యాపారం పెట్టగానే లాభాలువచ్చే రోజులేనా యివి.

మొదటికంఠం - అసలు అది కాదుటగా !

రెండవకంఠం-కారణా లనేకం వుంటవి, అతిఆశమనిషి, అందుకే అలా అయినాడు.

మొదటికంఠం - ఏమోలే, వెధవగోల మనకెందుకు గోడలకు చెవులుంటాయంటారు. అసలే మనమంటే వారికి సరి పడదు.

రెండవకఠం - ఏం యిందులో ఏముంది. మనమేం అబద్ధాలు సృష్టిస్తున్నామా, ఆయన చేతులమీదుగా ఆయన చేసుకున్నాడు. అందుకే అనుభవిస్తున్నాడు. కాకపోతే, ఏదో బ్రతికేవాడు అక్కడేవుండి బ్రతకక వ్యాపారమంటూబయలు దేరాడు పట్టణానికి. అందుకే తగినశాస్తి జరిగింది.

మొదటికంఠం-పాపంఅనసూయ, ఆస్తికాజేశాడుటగా?

రెండవకంఠం - అది పిచ్చిబొంద బంగారంలాంటిఆస్తి వీడి మొఖాన పెట్టింది.

మొదటికంఠం - అస లదెందు కిచ్చిందో.

రెండకంఠం - దీనికి చాలా కారణా లున్నవిలే, ఇప్పుడు పనిచేసేవాడిని తీసేస్తాటగా.

మొదటికంఠం - ఆ, తీసేసి,

రెండవకంఠం - ఇంకేవడన్నా, కాస్త అనుభవం వున్న వాడిని పెడతాడట, అంతేకాదు, వాడికేదో ఆశ పెడతాడట అందుకని ఆ చేరేవాడు ఆశపడి ఒళ్ళుయిరుచుక పనిచేస్తాడుగా అప్పుడు బాగా లాభాలు వచ్చినప్పుడు వాణ్ణి తీసేస్తాడట.

మొదటికంఠం - మళ్ళీ ఆలోచించాడు ప్లాను.

రెండవకంఠం - మరేమిటనుకున్నావు, ఎంతకుస్సి కుక్క కుచ్చితబుద్ధులు లేందే ఎలాగు బాగుపడటం.

మొదటికంఠం - అంతేసంటావా,

రెండవకంఠం - అంతే చూడరాదూ, జరిగేదే అంత.

మొదటికంఠం - మరీయనకు పెట్టుబడి కావద్దు,

రెండవకంఠం_పెట్టుబడికేమే పెళ్ళాన్నడిగితే ఇస్తుంది.

మొదటికంఠం- పెళ్ళామా దాని దగ్గర డబ్బెక్కడిది?

రెండవకంఠం — సరేలే, నీ కింకా తెలియదా?

మొదటికంఠం — తెలియదే!

రెండవకంఠం - చెబుతాను, ముందు ఆ వాకిట్లో ఎవ డన్నా వచ్చినోడున్నాడేమో చూడు.

మొదటికంఠం లేచినట్లు మంచం కిర్రుమన్నది. నేను గబాలున అరుగుమీాదనుండి దూకి పక్కసందులోకి పరు గెత్తాను. రోడ్డువ నడుస్తున్నాను. నా కిక గత్యంతరం లేకపోయింది. ఎలాగో వుద్యోగం సంపాయించాలి. లేకపోతే,

యిక నాజీవితాని కాధారంలేదు. అసలింక న్యాయంగా నాకు ఉద్యోగం వస్తుందని నమ్మకంపోయింది, అందుకని న్యాయంగా మాట్లాడి న్యాయంగా ప్రవర్తించిన, ఈ రోజుల్లో వుద్యోగం దొరికేట్లుగా లేదు. అన్యాయాన్ని, అన్యాయం తోనే జయించాలని నేను నిశ్చయానికి వచ్చాను. గోపాలరావు కంపెనీలో అబద్ధం చెప్పి ఎలాగో ఉద్యోగం సంపాయించాలి. తర్వాత వ్యాపారం బాగా సాగకపోతే, వాండ్లే పొమ్మంటారు. అందాకా జీవితం హాయిగా గడప వచ్చు, నేనీ నిర్ణయానికివచ్చి గోపాలరావు కంపెనీవైపు నడక సాగించాను

నేను చేసేపని అన్యాయమని, నా మనస్సు సముద్రంలా ఘోషపెడుతున్నది. అబద్ధాలు, అసత్యం, ఎక్కువకాలం నిలవవని నా కెవరో చెపుతున్నట్లుగా వున్నది. కానీ నా కిక గత్యంతరం లేదు. చేచిక్కిన ఈఒక్కసమయాన్ని వదలుకుంటే ఇక మళ్ళీ నా జీవితానికి చీకటే, అందుకే అలా బయలు దేరాను.

తోవలో నా కనేకఆలోచనలు వచ్చినవి నేనుఅబద్ధాలాడటం, అన్యాయంగా ప్రవర్తించడం ఇదే నా జీవితంలో ప్రథమం, అందుకని ముందే ఆయన అడిగే ప్రశ్నలు వాటికి సమాధానాలు నేను మనసులో వూహించుకుంటూ నడుస్తున్నాను. అక్కడికి అట్టేదూరం లేదు ఆయన కంపెనీ. త్వరలోనే నే నా కంపెనీకి చేరాను. గోపాలరావుగారిని గురించి

ఎక్కడుండేది ఆరాలు తీశాను. అక్కడికి వెళ్ళాను. నా అదృష్టం బాగుండి ఆయన యింటిపద్దనే వున్నాడు. నేను వెళ్ళి నమస్కారంచేసి నిల్చున్నాను. ప్రశ్నార్థకంగా ఆయన నావైపు చూచాడు.

"మీ దగ్గర గుమాస్తా ఉద్యోగం ఖాళీ వున్నదని విని వచ్చాను"

"మీ రెవరు? ఎక్కడుంటున్నారు?" ప్రశ్నించా డాయన.

'నేనుమద్రాసులో కాస్మాపాలిటన్ అండ్ కోలో మూడు సంవత్సరాలనుండి పని చేస్తున్నాను. కానీ వారు యింతకు ముందు నన్ను మైసూరు పంపారు. అప్పుడునాకు ఐదు రూపాయలు దినబత్తెం యిచ్చేవారు ఇపుడు మంగళూరుకు మార్చారు, అక్కడా బత్తెంచాలదు. అంతేగాక నాకు తెలుగు ప్రాంతములో వుండాలని కోరికగా ఉన్నది. అందుకని ఇక్కడకువచ్చాను. ఇక్కడ విచారించగా మిమ్ములను కలుసుకోమని ఎవరో ఒకాయన చెప్పాడు. మీవద్దకు వచ్చాను' అన్నాను.

ఆయన నిక నన్నేమీ ప్రశ్నించలేదు. రెండు క్షణాలు మౌనంగా వున్నాడు. నేను మాట్లాడిన అబద్ధాలన్నీ ఆయన విని నిజమనుకొని వుంటాడు లేకపోతే అనుమానముంటే అడగకపోయాడా, ఇలా అనుకుంటున్నాను నేను.

'సరే, మీకు జీత మెంతకావాలి?'

'మీరే చెప్పండి, మీకు తెలియని దేమున్నది' నేను చాలా నమ్రతగా అన్నాను.

ఆయన ఇలాఅన్నాడు. 'నాసంగతి మీరు వినేవుంటారు. నాసంగతి నేను చెప్పుకోకూడదుకానీ, నావద్ద పనిచేసేవారి యందు నే నెంతో బాగా వుంటాను. నా పద్ధతేమిటో చెపుతాను. మీరు కష్టపడాలి. దానికి తగిన ప్రతిఫలం మేము మీకివ్వాలి. మీరు కంపెనీని బాగా అభివృద్ధిలోకి తీసుకుని వస్తే, తప్పకుండా మీకు నేను పెట్టుబడి లేకుండానే భాగం యిస్తాను. అంతే కాదు, ఇపుడు మీకు నే నిచ్చేజీతం కాస్త తక్కువకావచ్చు. కానీ, భవిష్యత్తులో మీరేచూస్తారు నా పద్ధతి ఎలాంటిదో. మీకు తప్పకుండా లాభం కలుగ చేస్తాను.' ఆయన నావైపు తదేకంగా చూశాడు.

నే నేమీ మాట్లాడలేదు. నిశ్చలంగా ఆయనవైపు చూస్తూ నిలుచున్నాను.

'మీరు కుటుంబంతో వుంటున్నారా?'

'లేదండి నా కింకా పెండ్లికాలేదు'.

'నాకు అదేనండి కావలసింది. పెండ్లయినవారు సరిగా పని చేయలేరు. అవునా?' సంతోషంగా నావైపు చూచాడు. నేను 'అవునన్నట్లు' తలవూపాను. తిరిగాయన ఇలాఅన్నాడు.

'మీరు ఒక్కరే కాబట్టి మా యింట్లో వుండవచ్చు. మా కేలాంటి అభ్యంతరము లేదు. జీతంమాత్రం మీరు

లెక్కగా తీసుకోకండి. మామూలు మీ ఖర్చులన్నీ భరిస్తాను.

నేను గట్టిగా ఏమీ మాట్లాడలేకపోయాను. ఆయన చెప్పినవాటి కన్నిటికీ తల వూపాను. ఈ సమయంలో నేనేదైనా సమాధానం చెప్పితే ఆ కాస్త పోతుందేమోనని నా భయం. సరే అలాగే అన్నాను.

"మరి మీరెప్పుడు ప్రవేశిస్తారు ఉద్యోగంలో?"

'మీ యిష్టం నాకెప్పుడైనా ఒకటే' - 'సరే రేపు నుంచిది రేపు ఉదయంనుండి రండి నేను భోజనటిక్కెట్లు హోటలులో కొని ఉంచుతాను.'

'సరే' నేనింక అక్కడ ఒక్కక్షణం వుండలేకపోయాను. నేను చేసిన అన్యాయానికి మంచిగా నేనాయనను మోసగించి నందులకు నామనస్సు బాధతో నిండిపోయింది. నా పాపం ఎప్పటికైనా బయటపడకపోదని నాకు తెలుసు, కానీ ఏంచేయను విధిలోకి వచ్చాను.

పార్కువైపు నడుస్తున్నాను. నా ఆనందానికి అంతులేదు. రేపటినుండి నేను ఒక ఉద్యోగిని అప్పుడు నా చేతిలో కొంత డబ్బు వుంటుంది. ఇలా ఎక్కువసేపు ఆలోచించలేదు. నా ఆలోచనల్లా సమాజం అబద్ధాలకు, అన్యాయాలకు ఎంతవిలువనిస్తుందో స్వయంగా ఆనాడు చూచాను. ఇప్పుడు నేను నిజం చెబితే ఆయన నన్నాచాయలకు కూడా రానీయడు కాబట్టి

నేనీ నాడు ఒక చక్కని గుణపాఠం నేర్చుకున్నాను. సమాజంలో మనిషిగా బ్రతకడానికి కావలసిన హంగులన్నీ అబద్ధాలమీదే ఆధారపడి వుంటవి, అని.

నాకు ఒకవిధంగా అలా చేయడం బాధగా వున్నా, మరొకవైపు సంతోషంగానే వున్నది. ఇలా సమాజం ఇంకెన్ని రోజులు సాగుతుంది? సమాజం చెడిపోయింది. బూజుపట్టింది. కుళ్ళుపట్టింది. సమాజంలోని ప్రతిఒక్కరూ యీవిధంగానే వుంటే తప్పకుండా ఆ సమాజం ఏవిధంగాను అభివృద్ధి చెందదు. తప్పక నాశనమవుతుంది. మానవుడికి కొన్ని సిద్ధాంతాలు పరిధులు వున్నవి. అవి అతిక్రమించ గూడదు. అలా జరిగితే తారతమ్యంభేదాలు పోయినట్లే, దేశంబాగుపడాలంటే పరిపాలకులు సమర్థులైనవారుండాలి. లేకపోతే, చీడపట్టిన సమాజం చెడు దేశం అంతా వ్యాపిస్తుంది అప్పుడు దాని నణచడం మరీకష్టం—ఇలా ఆలోచిస్తున్నాను.

ఆ ఆలోచనలతో నేను నాపార్కువైపుకు రావడం లేదు ఎటో వెళ్ళి పోతున్నాను. నాకు పనిలేని ప్రదేశానికి వెళ్ళిపోతున్నాను. మళ్ళీ వెనక్కు తిరిగాను. తిరిగి తిరిగి చివరకు పార్కుకు చేరుకున్నాను. ఆ రాత్రి ప్రశాంతంగా నిద్రపోవాలనుకున్నాను. ఇకనుండి సంతోషంగా కాలం గడుపుదా మనుకున్నాను. కానీ నాకు శాంతి లేకుండ వున్నది. నేను చేసిన పనికి నాకు చాలా బాధగా వున్నది.

సిమెంటు బెంచిమీద పడుకున్నాను నిద్రపట్ట
అనేక ఆలోచనలు నామస్తిష్కంలో నిండివున్నవి. ఈ ఆలో
చనలతో ఆకలిమాట మరచిపోయాను. కాని ఒక వైపున
అది నాతో యుద్ధం చేస్తూనే వున్నది. ఈ రోజు నాకు దానికి
ఆఖరు యుద్ధం. ఇప్పటి వరకు నేనే ఓడిపోయాను. ఇక
ముందు అంటే రేపటినుండి నేనే గెలుస్తాను హోటలు భోజ
నం తినీ చాలారోజులైనది. ఇలా అనుకుంటూంటే నాకేపో
ఎప్పుడో తిన్న హోటలుభోజనం గుర్తుకువచ్చింది. అలా కలలు
కంటూ పడుకున్నాను. నామనస్సు బాగాలేదు. లేచి అటూ
యిటూ కాసేపు పచార్లు చేశాను. రేడియో సంగీతం
పూర్తిగా ఆగిపోయింది. పట్టణమంతా ప్రశాంతంగావున్నది.
అప్పుడప్పుడు రోడ్డువైపునుండి కారుహారన్లు, రిక్షా, జట్కా బండ్ల
వాండ్ల కేకలు వినిపిస్తున్నవి.

సిమెంటు బెంచీమీద తిరిగి ఒత్తిగిలిపడుకున్నాను. నేను
చేసినపని తప్పని నాకెవరో చెపుతున్నట్లుగా వున్నది. నేనా
ఆలోచనకు దూరంగా వుండాలనుకుంటున్నాను. కానీ నాకు
మళ్ళీ ఆలోచనలే వస్తున్నవి. ఏంచేయను మనస్సు మరొక
విషయం మీదికి మరల్చబోయానుకానీ, లాభం లేకపోయింది.
నేను జేసినపని నాకే ఎంతో బాధగావున్నది. అలాగే ఆరాత్రి
చాలా ప్రొద్దుపోయేవరకు ఆలోచిస్తూ పడుకున్నాను ఎప్పుడు
నిద్రపట్టిందో తెలియదు సన్నగాజల్లుపడుతున్నది. ఆకాశమంతా
తెల్లనిమేఘాలతో అలుముకునివున్నది. అప్పుడప్పుడు పెద్దపెద్ద

ఉరుములు, మెరుపులు. వర్షం పెద్దదైంది. నేను గబాలున లేచాను. ఎక్కడికిపోవాలి ? రోడ్డుమీదికి పోదామనుకున్నాను. కానీ ఆ వర్షంలో ఎక్కడికి కదలడానికి వీలులేకపోయింది. పార్కుగేటు తాళంవేసి వుంటుంది. గోడెక్కి దూకాలి. తర్వాత నూరుగజాలుపోతేగాని ఎక్కడా యిండ్లు లేవు. అదంతా వెళ్ళేసరికి కట్టుకున్న బట్టలు తడిసిపోవడమే కాకుండా, నేను పూర్తిగా తడిసిపోతాను. అంచేత గబాలున సిమెంటు బెంచీక్రిందకు దూరాను.

ఆరాత్రి చాలాసేపు వర్షం కురిసింది. మధ్య మధ్య వడగండ్లు గూడపడినట్లున్నవి. నాతల తడిసిపోయింది. బట్టలు మాత్రం అక్కడక్కడా తడిసినవి అంతే, ఆరాత్రి చలిగాలికి, ఆవర్షానికి నే నాబెంచీక్రిందనే వున్నాను. అది నా బెంచీ. నే నా పట్టణం వచ్చినప్పటినుండి అక్కడే కూర్చుంటాను. అది ఈనాడు వర్షానికికూడా నా కాశ్రియమిచ్చింది. వర్షంపూర్తిగా తగ్గేవరకు ఆ బెంచీక్రింద కూర్చున్నాను. ఇలా తెల్లవారింది. ఆరాత్రి ఏకొంచెంసేపు నిద్రపోయానో అంతే, తెల్లవార్లు జాగారం చేశాను.

అంతవర్షంలో గూడా, నా ఆలోచనలు మాత్రం పోలేదు, అవి నన్ను వదలిపోకుండా నా వెంటే వుంటున్నవి. నేను కంపెనీలో కొంతడబ్బు తీసుకోవాలి. అందులో ముఖ్యముగా నాలుగురూపాయలు, నా గదికి అద్దె చెల్లించాలి,

ఒక రూపాయి, అప్పుగా తీసుకున్న రూపాయి, మొత్తం నాలుగు రూపాయలు ఇంటియజమానికిచ్చి రావాలి తర్వాత, ఎప్పుడైనా మా హోటలు మిత్రుడికి కాఫీ యిప్పించాలి. ఇది నా ఆలోచన. ఇలా ఆరాత్రి ఆలోచిస్తూ కాలంగడిపాను.

తెల్లవారింది. ఎవ్వరూ చూడకుండా చెట్లచాటుకు వెళ్ళి బట్టలు పిండుకున్నాను. మళ్ళీ కట్టుకున్నాను. ఆకలి దహించివేస్తున్నది. రోడ్డుమీదకుపోయి ఎవరినైనా కొంత చిల్లరడబ్బులు అడుగుదా మనుకున్నాను. కానీ నే నలా చేయలేదు, మా మిత్రుడుండే కాఫీహోటలు అక్కడికి దగ్గరే, అక్కడికి వెళ్ళాలనుకున్నాను. ఎలాగైనాసరే ఈపూట కాస్త కడుపులో పడాలి. లేకపోతే ఆకలి ఆగేట్లుగా లేదు ఇలా నీరసంగావుంటే వుద్యోగం ఎవరిస్తారు. ఆయన నాముఖం, నా నిస్సత్తువ, నా వేషంచూచి అనుమాన పడతాడేమోనని నాకు భయంగావున్నది. అంచేత తప్పకుండా ఏదో తినాలని బయలుదేరాను. తీరా అక్కడికిపోయి చూచినతర్వాతగాని నాకు గుర్తుకురాలేదు. ఆరోజు ఆదివారం. ఆ హోటలుకు శెలవుదినం. నాఆశలన్నీ నిరాశలైనవి. నా ఆలోచనంతా భగ్నమైపోయింది. ఏడుపువచ్చింది. పెద్దగా నడిరోడ్డుమీద ఏడవాలనిపించింది. నా జీవితానికి, ఏదో విధంగా మిత్రుడతనొక్కడే, అతడు అనేకతప్పులుచేస్తుండవచ్చు కానీ, నాకతనే మిత్రుడు. ఎప్పుడైనా అతనే నాకు సహాయంచేసేది, ఈరోజు అతనుగూడా లేడు, ఏంచేయను. అదృష్టం లేదు. విఘ్నే

శ్వరుడు ఏంచేయబోయినా అన్నీ విఘ్నాలే! అలా వుంది నా పరిస్థితి అక్కడినుండి అతనిగదికి వెళ్దామనుకున్నాను.

కానీ నా కక్కడికి వెళ్ళాలని లేదు. పోతే ఇంటియజమాని అద్దె అడుగుతాడని కాదు. మళ్లీ అక్కడికి వెళ్ళడాని కిష్టంలేదు. అంతే' అక్కడినుండి వెనక్కు తిరిగాను. త్రోవలోనే వుంది ఎల్లోరాహోటలు, అది ఎప్పుడు సందడిగా వుంటుంది. నేను గబగబా లోపలికి పోదామనుకున్నాను. కానీ ధైర్యం చేయలేకపోయాను. తిరిగి అక్కడినుండి బయలు దేరాను. ఇంతలో మాహోటలు మిత్రుడు కనిపించాడు. నా సంతోషానికి అంతులేకపోయింది అతను నన్ను చూడలేదు. గబగబా అతనిదగ్గరకు వెళ్ళాను.

అతను నన్నుచూచి ఆశ్చర్యపోయాడు 'మీరింకా యిక్కడేవుంటున్నారా' అనుమానంగా అడిగాడతను అవు నన్నట్లుగా తలవూపాను. రండి! కాఫీ తాగిరా రా! అంటూ హోటలులోపలికి తీసుకవెళ్ళాడు. అతనలా అంటాడని నాకు ముందే తెలుసు. అందుకేగా ఇంతదూరం తిరిగి అతనికోసం వెళ్లిరావడం, అతనలా అనకపోయినా ఆరోజు నేనే అడిగేవాడిని హోటలులో కూర్చుని నాపరిస్థితి అంతా చెప్పాను అంతా విని అతను చాలాసంతోషించాడు. కాఫీతాగిబయటపడ్డాము అతనిదగ్గ శలవుతీసుకుని నేను గోపాలరావుగారి కంపెనీవైపు బయలుదేరాను. అక్కడికా కంపెనీ ఎక్కువదూరంలేదు. ఇప్పుడు కొంచెం కడుపులో చల్లగావున్నది.

నేను గోపాలరావుగారి గదిలోకివెళ్ళేసరికి ఆయన ఎవరితోనో మాట్లాడుతున్నాడు అందులోనాయీడుకుర్రాడు ఒకడున్నాడు అతనిని చూచేసరికి నాకు అనుమానం వేసింది. కొంపతీసి అతనుగూడా నాలాగే వుద్యోగానికి రాలేదుగదా! అదే నిజమయితే యింకేముంది. కొంతసేపు చాటుననిల్చుని వారిమాటలు విన్నాను. వారి మాటలనుబట్టి వారెవరో వ్యాపారస్తులని తేలింది అప్పటికి నాకు కొంచెం గుండెదడ తగ్గింది. వారు వెళ్ళేవరకు అలాగే కూర్చున్నాను ఆ తర్వాత వెళ్ళి నమస్కారంచేశాను.

"ఏమండీ ఇంత ఆలస్యంగా వచ్చారు?" నవ్వుతూనే ప్రశ్నించాడాయన. అసలాయన ఎప్పుడూఅలాగే మాట్లాడుతాడు.

అవును నిజమే, ఆయనలా అడుగుతాడని నాకు ముందే తెలుసు, ఏం చేయను మరి, కాఫీకోసం అంతసేపు తిరిగితిని. తాగి వచ్చేసరికి యింత ఆలస్యమయినది, నేను సమాధాన మేమీ చెప్పలేదు. నవ్వి వూరుకున్నాను. ఆయన నన్నిక ప్రశ్నించలేదు. భోజనటిక్కట్లు నాచేతికిచ్చాడు. నే నవి భద్రంగా జేబులో దాచుకున్నాను.

అక్కడ నేనుచేయవలసినపనులన్నీ వివరంగా నాలుగు ముక్కలలో చెప్పాడాయన. ఆయన ఒప్పగించినపనినాకేమీ కష్టంగాలేదు. ఏదో ఖాతాపుస్తకమిచ్చి కూడికలుసరిచూడమన్నాడు. అదే ప్రస్తుతం నేనక్కడ చేయవలసిన పని.

ఆవిధంగా వారంరోజులు గడిచినవి. ఈ వారంలో పెద్దమార్పులేమీ లేవు. తిండి కడుపునిండా వుండటంవలన నా కేలాంటి లోటులేదు, సంతోషంగా వున్నది. కానీ మనస్సులో నేను చేసేపని అన్యాయమని, మోసం చేస్తున్నానని నామనస్సు ఘోషిస్తూనే వున్నది. కానీ గత్యంతరం లేదాయె. మరియేం చేయను. అక్కడే రాత్రిళ్ళు పడుకుంటున్నాను అక్కడవారు నాకు వేరుగా ఒక గదిచ్చారు. అక్కడే నా మకాం. హాయిగా కాలం వెళ్ళిపోతున్నది.

మా యజమానికి ఒక కూతురున్నది ఆమె నాకన్నా రెండుసంవత్సరాలు చిన్నది, చాలాఅందంగావుంటుంది. గుండ్రని ముఖం, నల్లని నలుపైనా కళగల ముఖం. నన్నెంతో ఆప్యాయతగా చూచేది. ఆమె కింకా పెండ్లికాలేదు పేరు 'సుగుణ' ఆమె నన్నెంత ఆప్యాయంగా చూసేదో నేను ఆమెను అంతే ప్రేమగా చూచేవాడిని. నే నెప్పుడైనా బాధపడుతున్నా ధైర్యమిచ్చేది. మా యిద్దరి పరిచయం ఆమె తల్లిదండ్రులకు తెలుసునో లేదో నాకు తెలియదు. నాకు తీరిక వున్నప్పుడల్లా నే నామెతోనే గడిపేవాడిని. ఆమె నన్ను సోదరునికంటె ఎక్కువగా చూచేది. అప్పుడప్పుడూ ఇతరపట్టణాలకు కంపెనీ పని మీదవెళ్ళుతుండేవాడిని. మొదట్లో కొంచెంకష్టంగావున్నా రాను నా కంతకుముందు చెప్పినా అలా తిరగడం అలవాటైంది. మొదట్లో కొంచెం కష్టపడ్డాను. కానీ కష్టపడ్డా నాకు

సంతోషంగానే వుండేది. రానురాను నాకలా తిరగడం బాగా అలవాటైనది.

ఇపుడు నాకేవిషయంలోనూ ఏలోటూ లేదు. టూరింగు లలో నేను వెళ్ళిన ప్రతిచోటా బాగా పని జరుగుచున్నది. టూరింగు వెళ్ళినపుడు సుఖంగా నేవుండేది. పండుగలపుడు నేను యజమానిండ్లో నే భోంచేస్తుండేవాడిని. అలా వారికుటుంబంతో నాకు మంచి సన్నిహిత సంబంధం ఏర్పడ్డది. నాకిప్పుడక్కడ ఏలాంటిజంకూ లేదు, ఏది కావాలనినా అందులో ఎవరినైనా అడిగేవాడిని. నేను అడిగినదేదైనాసరే కాదనేవారు కాదు. వారింట్లో వారితో గూడా నాకు మంచిస్నేహ మేర్పడ్డది.

అపుడపుడు మా యజమాని యింటికి రంగనాధం వచ్చేవాడు. ఆయన ఎవరో వారి కెలాంటి బంధువో మొదటి రోజుల్లో నకు తెలియదు. కానీ ఇంట్లో అందరూ ఆయనను ఎంతో ఆప్యాయంగా చూచేవారు. నేను అందంలాగే ఆయ నను ఎంతో గౌరవించేవాడిని. ఆయన నన్ను చాలా మర్యా దగా చూచేవాడు. అపుడపుడు నన్ను వెంటబెట్టుకుని సినిమా లకు తీసుకవెళుతుండేవాడు. కొద్దికాలానికే ఆయనతో నాకు మంచిస్నేహం ఏర్పడ్డది.

ఆయననుగురించి నాకు ఒక అనుమానం వుండేది. కారణం ఆయన ఎపుడూ పట్టణంలోనే గడుపుతుండేవాడు. బహుశా ఆయనకు పట్టణమంటే ఇష్టమనుకునేవాడిని.

ఆయనదిపట్టణానికి దగ్గరలోనే ఒక పల్లెటూరు. నెలకు ఇరవై రోజులు ఆయన పట్టణంలోనే గడుపుతుండేవాడు. విచ్చల విడిగా డబ్బు ఖర్చుచేసేవాడు. అంతడబ్బు ఎలా ఖర్చుచేస్తాడా అని నాకు అనుమానంగా వుండేది. కానీ ఆయన ననుసరించి వివరాలు తెలుసుకున్న తర్వాత నే నలా అనుకోవడం మానేశాను.

ఒక పెద్దఎస్టేటుకు ఆయన యజమాని. ఇక ఆయనకు లోటేమున్నది. యజమానిగాదింట్లో అందరూ ఆయనను వరస లు బెట్టి పిలిచేవారు. ఒకొక్కప్పుడు నాకు అలాపిలవాలనిపించేది. కానీ నే నెప్పుడు అలా చెయ్యలేదు. నే నక్కడ ఉన్నంత కాలం మా ఇద్దరిమధ్య స్నేహం బాగానేవుండేది. కానీ వయస్సులో ఆయన నాకంటె పెద్దవాడు ఆస్థితిలో ఆయనకు నాకు అసలు పొంతనేలేదు. కాని ఆయనకు నేనంటే అంత అభిమాన మెలాఏర్పడ్డదో నాకు ఇప్పటికి ఆ విషయం గుర్తుకు వస్తే ఆశ్చర్యంగానే ఉంటుంది.

అక్కడ నేను ఎలాంటిభేదాలులేకుండా వుంటున్నాను. నాకిపుడెంతో సంతోషంగావున్నది. అవునుమరి ఎందుకుండదు. సత్రంలో భోజనం, మఠంలో నిద్ర అలావున్నది నా పని. నాకిపు డెలాంటి దిగులూలేదు. నాలో నాకే ఎంతోమార్పు వచ్చినట్లుగా వున్నది. ఇపుడు ముఖంలోకి కళవచ్చింది. మనిషిని కాస్త లావుగూడా అయ్యానట. అసలు మానవ జీవితానికి అంతకంటే కావలసింది ఏముంది. అపుడపుడు తీరిగ్గా

పడుకున్నప్పుడు, నాకు రకరకాల ఆలోచనలు వచ్చేవి. రోజు లెప్పుడూ యిలాగే జరిగిపోతే బాగుండుననిపించేది. అప్పట్లో నాకు మరే చీకూ, చింతా వుండేవి కావు పెండ్లి చేసికోవాలని, సంసారమనేది ప్రతిమానవుడికీ తప్పనిసరిగా వుంటుందని నాకు అప్పట్లో తెలియలేదు. రోజులు సుఖంగా వెళ్ళిపోవడమే ఘనంగా చూచుకునేవాడిని. ఆ రోజులు తలుచుకుంటే ఇప్పటికీ నాకు సంతోషంగానే వుంటుంది.

ఇలా మరికొంతకాలం గడిచింది. వ్యాపార మిప్పుడు మూడుపువ్వులు ఆరుకాయలుగా వున్నది. దానికి కారణం నా ఘనతని నేను చెప్పలేనుగాని, నేను వచ్చినతర్వాతే ఆ కంపెనీ అంత గొప్పదైందని అంటారు కొందరు. కానీ నిజానికి ఏది ఎలావున్నా, మా కంపెనీ యిప్పుడు మంచి వుచ్ఛస్థితిలో వున్న మాటమాత్రం నిజం. మాతో ఇప్పుడు పోటీకి వ్యాపారంలో ఎవ్వరూ సరిరావడంలేదు. అంతేకాదు, మా ఆఫీసుకూడా ఎంతో మార్పుచెందింది. ఇంతకుముందు మా గోడౌను ఒక్క గట్టికుర్చీ కూడా వుండేదికాదు. అలాంటిదిప్పుడు నూతనపరికరాలతో కంపెనీ ఎంతో అభివృద్ధి చెందింది. అతిథులకు కాఫీలు, అతిథుల గదులు ప్రత్యేకంగా ఏర్పాటుచేశాము. ఒక రేడియో కూడా కొన్నాము. ఇలా మా కంపెనీ ఎంతో నవీనంగా అభివృద్ధి చెందింది.

ఇప్పుడు మా కంపెనీలో నాతోబాటు మరొక ఏజంటుకూడా వున్నాడు. అతను నాలాగే ఒక అభాగ్యుడు.

అయితే నాఅంత దురదృష్టవంతుడుమాత్రం కాదు. ఏదో కాలానికి కట్టుబడి మా కంపెనీలో చేరాడు. అతను నాలాగే బాగా చదువుకున్నాడు. ఎక్కడా వుద్యోగందొరకక, ఏ ఆధారంలేక మా కంపెనీలో 25 రూపాయల జీతానికి చేరాడు. నిజానికి మాయజమాని మాయందెంతో జాలిచూపించేవాడు. కానీ మా పరిస్థితిమాత్రం అంతే. గొర్రెతోకలాగా మా కంపెనీ ఎంత వృద్ధిలోకివచ్చినా మా బ్రతుకులుమాత్రం మామూలుగాకంటే పైకిపోలేదు. అది మాఖర్మ అనండి. లేక మరేమైనా అనండి. అలాగే బ్రతుకులు భారంగా లాక్కుపోతున్నాము. అలా ఎన్నిరోజులు మా జీవయాత్రలు సాగిపోతవో తెలియదు.

మే మిద్దరం ఎంతో స్నేహంగా వుంటుండేవారము. మా యిద్దరిమధ్య ఏలాంటి భేదాభిప్రాయాలు వచ్చేవికావు. వయస్సులో అతనికన్నా నేపెద్ద, అంతేకాదు అతనికంటేనాకే ఎక్కువ అనుభవ మున్నది. అందుకో మరెందుకో, అతను నాయందు వినయవిధేయతతో వుండేవాడు. నన్ను గౌరవంగా చూచేవాడు.

అవును మరి, నాకు అతను, అతనికి నేను తప్ప మాకిక ఈ ప్రపంచంతో నిమిత్తంలేదు. నదీప్రవాహంలో ఏఆధారం లేక కొట్టుకపోతున్న రెండు ప్రాణులకు ఒక ఆధారం దొరికి నప్పుడు అక్కడ అంతకుముందు వారిద్దరిమధ్యఏలాంటిపరిచయం

లేకపోయినప్పటికీ కొద్దిక్షణాలలో వారిద్దరు ఎంత గొప్ప స్నేహితులవుతారో అలా మా యిద్దరిమధ్య మిత్రిత్వం ఏర్పడింది. మా యిద్దరిమధ్య ఏ అరమరికలు లేకుండా కాలాన్ని వెళ్ళతీస్తున్నాము. కాలంఎల్లప్పుడూ ఒకేతీరుగా వుండదు. కాలము చంచలమైనది. దేవుడు నాజీవితయాత్రను ఈవిధంగా కూడా సాగనివ్వదలచుకోలేదు.

అంతవరకు నేనంటే ఎంతో అభిమానంగావుండే మా యజమాని కుటుంబం ఇపుడు నాకు చాలాదూరంగా వుంటున్నారు. ఇంతకుముందులాగా ఇపుడు నాతో మాట్లాడటం మానేశారు. ఇంతకుముందులా, నాతో చనువుగా వుండటం లేదు. నాకు చాలా దూరంగా వుంటున్నారు. నాకు అవసరముండి వారిని ఏదైనా అడిగితే ముక్తసరిగా సమాధానం చెపుతున్నారు. లేకపోతే అదీలేదు. కారణమేమిటో నాకు బోధపడలేదు. కారణమేమైవుంటుంది? అని నేను చాలా సార్లు దీర్ఘంగా ఆలోచించాను. కానీ, వారివిషయంలో నేను ఏఒక్క ఆలోచనకు రాలేకపోయాను. అప్పటినుండి నేను వారికి దూరంగా వుండాలనుకున్నాను. వారి కవసరముండి పిలిస్తేనే వెళ్ళేవాడిని. లేకపోతే లేదు. వారిలో వచ్చిన ఈ హఠాత్తుమార్పుకు, కారణమేమిటో నాకు అంతుబట్టలేదు.

ఈవిషయంలో నేను ఎవ్వరినీ అడగదలుచుకోలేదు. ఎవ్వరితోనూ సంప్రదించదలుచుకోలేదు. ఎక్కడికి వెళ్ళకుండా వున్నపుడు, నాపనేదో నేను చూచుకుంటుండేవాడిని అంతే.

మరీ ఏమీ తోచనపుడు బజారుకూ, పార్కుకూ, ఎక్కడికైనా వెళ్ళేవాడిని. అంతేగానీ ఇంతకుముందులా నే నక్కడ వుండటంగూ వేశాను కాకపోతే అప్పుడప్పుడు మాస్నేహితుని యింటికి వెళ్ళేవాడిని. అలా కాలక్షేపం చేయడం అలవాటు చేసుకున్నాను.

మాకంపెనీ నాద్వారానే వ్యాపారం అభివృద్ధి చెందిన దని నన్నుగురించి కొంతమంది పెద్దలకంపెనీ యజమానులు వివరాలు అడిగి తెలుసుకొనుట ప్రారంభించారు. నా స్నేహితుని కొందరు అడిగారు. ఇంకా కొందరు మరికొందరిని అడిగి నన్నుగురించి వివరాలు తెలుసుకున్నారు. కొందరు జీతం బాగా యిస్తామని నాతో చూచాయగా అన్నారు. అయితే వారి అభిప్రాయం నాకు మొదట తెలియలేదు. దానికి కారణం ఏమిటో అసలు వాండ్లు నన్నలా ఎందుకు పిలిచేవారో నాకు అర్థంకాలేదు. దానివల్ల వారికి లాభ మేమిటోగూడా నాకు తెలియలేదు.

ఈ విషయం నా కంటేముందే మా యజమానికి తెలిసింది. ఒకనాడు ఆయనే నన్నడిగాడు అసలు విషయమేమిటని. ఆయ నలా అడిగినపుడు నేను నిర్ఘాంతపోయాను. అదే మొదలు నేనీ విషయం వినడం, అందుకని నాకెంతో ఆశ్చర్యమేసింది. నాకేమీ తెలియదని చెప్పాను. ఆ తావిని ఆయన మళ్ళీ ఆ విషయంగురించి నాతో మాట్లాడలేదు. నిరాటంకంగా మా

వ్యాపారం సాగుతూనే వున్నది. మాకువ్యాపారంలో లాభాలు బాగా వచ్చేకొద్ది యజమానికి, ఆయన కుటుంబంలో వారికి డబ్బుమీద ఆశ ఎక్కువైంది. పైసాదగ్గరనుండి లెక్కచూడటం ప్రారంభించారు. వారు గూడా ఖర్చులు చాలా తగ్గించుకున్నారు. ఇంతకుముందులా సినిమాలుచూడటం మానేశారు. వినోదానికి ఒక రాగిపైసాగూడా ఖర్చుచేయడంలేదు. వారు వినోదాలు, తిండివిషయంలోనే గాదు, ఇంటికివచ్చిన అతిథుల విషయంలోగూడా చాలా పీనాశిగా వుంటున్నారు. నాకలా డబ్బు కూడబెడుతున్నారు. అప్పుడప్పుడు కంపెనీకి కావలసిన సరుకులు తయారుచేయడంలో ఇంట్లోవారుకూడా కష్టపడుతున్నారు. తక్కువమందితో ఎక్కువపనికి కొత్తగా సూత్రం కనిపెట్టారు. ఏది ఎలావున్నా ఈ విషయంలోమాత్రం నేను వారితో ఏకీభవించలేకపోయాను. అలా చేస్తే దానిఫలితం ఎలావుండేది వారు వూహించలేదు.

మేమక్కడ వుంటున్నప్పుడు మాకూ బ్రతుకుమీద ఆశకలిగింది. మేము సుఖాలనుభవించాలని, విలువైన గుడ్డలు ధరించాలని, వినోదప్రదర్శనాలకు వెళ్ళాలని కోరిక కలిగింది. అయితే మా కోరికలు నెరవేరాలంటే మాలోగూడా మార్పురావాలి. ఇంతకుముందులా కాకుండా మాకు జీతం అనేది ఏర్పాటుచేయాలి. అదైనా ఎక్కువగా వుండాలి. అది ఏర్పాటయ్యేవరకు మా కోరికలు నెరవేరవు. ఒకనాడు

మా కోరికలు మా యజమానికి చెప్పాము. ఆయన మాకు సమాధానం చెప్పలేదు. విని వూరుకున్నాడు. అంటే మా కలాంటి కోరికలు వుండకూడదని మేము ఆయనలా సుఖపడ కూడదని ఆయన అభిప్రాయం కావచ్చు ఏది ఎలావున్నా మా కోరికలు నెరవేరలేదు దానికి నే నేమీ బాధపడలేదు. కనీసం మళ్ళీ ఆ విషయంగురించి ఆలోచించనుకూడ లేదు.

కానీ నా మిత్రునిలో ఆ విషయం ఒకవిధంగా తుపాను లేవదీసింది ప్రశాంతంగావున్న మహాసముద్రంలోని తుపానులా ప్రతిక్షణం వాటినిగురించే ఆలోచించడం ప్రారంభించాడు. అతనలా కోరికలనుగురించి ఆలోచించడం ఒకవిధంగా అతని మూలంగా నాకు కూడా మనశ్శాంతి లేకుండా పోయింది.

ఒకనాటిసాయంకాలం మే మిద్దరం బజారుకు వెళ్ళి తిరిగి వస్తున్నాం అక్కడ నేకమంది అనేకవిధాలుగా జల్సాగా జీవితాలను గడపడం చూచాము మే మెలా ఒక్కనాడైనా మా జీవితాలను గడపలేకపోతున్నామని, మా బ్రతుకులను గురించి మే మెంతో విచారించాము. దేశంలో నాగరికత పెంపొందేకొలదీ బానిసవిధానం పూర్తిగా రూపుమాపడం కోసం అందరూ విశ్వప్రయత్నాలు చేస్తున్నారు. కాని మరొక విధంగా, బూర్జువాలు తమ సిద్ధాంతాలను, తమ పనులను మరొకరూపేణా మరొకరిమీద రుద్దుతు నేవున్నారు. అయితే వెనుకటి బానిసవిధానం యిప్పుడు కనపించకపోవచ్చు. కాని మరొకరూపేణా అది, దేశంలో విలయతాండవం చేస్తూనే

వున్నది. అలా అని నే నూహించాను. అందుకు ప్రయత్నం చేయడం విఫలమనే నే నావిషయంగురించి ఆలోచించడం మానేశాను.

కానీ నా స్నేహితుడు, సమాజంలో ఒక మనిషిలా బ్రతకడానికి ప్రయత్నంమాత్రం మానలేదు. జీతం విషయం వచ్చినపుడు అతని శరీరం కుంచించుకుపోయేది. మనిషిపూర్తిగా సిగ్గుపడేవాడు. అపుడపుడు అతని అవస్థచూచి నేను బాధ పడేవాడిని. అవునుమరి అంత చదువు చదువుకుని పాతిక రూపాయలజీతమని చెప్పుకోలేక పోతున్నందుకు ఆతప్పుఅతనిదికాదు. అతని నలా సృష్టించిన యజమానిది తప్పు. ఆర్థికంగా దేశం ఎంతోఅభివృద్ధిచెందింది.ప్రతిచిన్నవిషయండబ్బుమీదఆధార పడ్డది. అలాంటి పరిస్థితిలో ఆతని పాతికరూపాయలజీతం ఈ మహాపట్టణంలో ఒక్కమనిషికైనప్పటికి ఏ విధంగానరిపోని రోజుల్లో అత నలా తనజీతం చెప్పుకోడానికే సిగ్గుపడుతున్నా డంటే ఎవ్వరూ ఆశ్చర్యపడనక్కరలేదు. కానీ మానవజన్మ కాబట్టి ఆడంబరాలకు స్థానమిస్తాడు. అలా దానిలో మునిగి పోయి తన్మయత్వం చెందుతాడు. అది మానవనైజం. బహుశా అదే మా స్నేహితునిలో కన్పించింది. అపుడపుడు మామిత్రునివిషయం నాకు గుర్తుకువచ్చినప్పుడల్లా ఒకొక్క సారి నేను కుంచించుకపోయేవాడిని. ఆ ఆలోచనలతో గంటల

తరబడి గడిపేవాడిని. నే నేం ఆలోచిస్తున్నానో, ఎక్కడ వున్నానోకూడా మరచేవాడిని. మా జీవితాలనుగురించి తల పోస్తూ మధ్యమధ్య పరాకుగా మనస్సులోనే ఏదో గొణు క్కునేవాడిని. చేతులు ముడిచి పండ్లు బిగబట్టి కండ్లు పెద్దవి చేసి లేచేవాడిని అంతే అంతటితో నా ఆలోచనలు పటా పంచలై పోయేవి. అప్పటికిగాని నేను చేసేపనేమిటో నాకు అర్థమయ్యేదిగాదు. ఈవిధంగా రోజులు వారాలు గడచి పోయినవి.

ఇలా వుండగా ఒకనాడు ఒక చిన్న సంఘటన జరిగింది అదే నా జీవితంలో ఒక గొప్పమార్పును తీసుకవచ్చింది. ఇక నేను ఆ వుద్యోగంవదలి ఎక్కడికైనా పోదామనుకున్నాను. లేక ఆపట్టణాంవదలి వెళ్ళిపోదా మనుకున్నాను. ఇప్పుడు నాకు నా జీవితాన్నిగురించి భయం లేదు. ఏదోవిధంగా బ్రతకగలనని నాకు నమ్మకమున్నది. ఏదో ఒక వ్యాపారంలో కొంతఅనుభవం గడించాను. అలాంటప్పుడు వెనుకటిలా బ్రతుకును భారంగా గడపవలసిన అవసరంలేదు. ఆలోచిం చాను, కానీ నేను తొందరపడదల్చుకోలేదు. వెంటనే ఒకనిర్ణ యానికి రాకూడదనుకున్నాను ఈ విషయంగురించి మరెవరి తోనైనా సంప్రదించితే బాగుంటుందేమో ననిపించింది. అయితే ఎవరితో సంప్రదించాలి. మళ్ళీ ఆలోచించాను. చివ రకు నామిత్రునికే ఈ విషయం చెప్పాలని నిర్ణయానికి వచ్చాను.

ఆ రాత్రి చాలా పెందుపోయింది. పడుకున్నా నిద్ర రావటంలేదు. ఉదయం జరిగిన సంఘటన మాటిమాటికీ గుర్తుకు వస్తున్నది. ఇంకొకవిషయం. నేను తొందరపడి ఈ సాంటి పర్ణ యానికి రానందుకు మనస్సులో నాకు నేను ఎంతో సంతో షించాను ఇలా ఆలోచించుకుంటున్నాను. ఇంతలో మా ఆఫీసులో గడియారం టంగుటంగుమంటూ పన్నెండుగంటలు కొట్టింది. ఇక ఎలాగో నిద్రపోవాలి. లేకపోతే లాభంలేదు. ఒకరోజు నిద్రాభంగం అనుమానాల బద్ధకమను పెద్దల సూక్తి నాకు అనుకోనట్లుగా గుర్తుకువచ్చింది వెంటనే గట్టిగా కళ్లు మూసుకున్నాను.

అంతే! తెల్లవారి ఉదయం ఎనిమిదిగంటలవు.గాని నేను గాఢనిద్రలోనుండివిముక్తికాలేదు. లేచి కాలకృత్యాలుతీర్చు కున్నాను. కాఫీహోటలుకు వెళ్తూ మిత్రునికోసం ఆఫీసు లోపలికి వెళ్ళాను. మరి అతనికి చెప్పాలిగా నావిషయం ఆతని సమాధానం వింటేనేగాని నాకు మనశ్శాంతి కలుగదు. నా అదృష్టం బాగుండి అతి సప్పుడే వచ్చాను. ఇద్దరం కలిసి కాఫీహోటలుకు వెళ్ళాము. దారిలో జరిగినసంగతంతా అతనికి చెప్పాను. అంతా విని ఆత నెంతో సంతోషించాను. అంతే కాదు. జాతకంబాగుండి ఆ సంఘటన జరిగిందని, మంచి రోజులు వస్తున్నవని చెప్పాను.

కానీ, అతను చెప్పిన దేమిటో నాకు అర్థంకాలేదు. అసలు అతని అభిప్రాయమేమిటోగూడా నాకు తెలియలేదు.

నిగ్గదీసి వివరంగా చెప్పమని పాత్రిధేయపడి అడిగాను. అతడు ఆతని అభిప్రాయం చెప్పాడు. నాకు అతని అభిప్రాయం నచ్చలేదు. అంతేకాదు, ఇంతకుముందు హోటలుమిత్రుడికి, ఇతనికి ఆ విషయంలో భేదమేమీ లేదని నా కనిపించింది. ఇక అప్పటినుండి అతనితో మాట్లాడటం మానేశాను. సాధ్యమైనంత వరకు అతనికి దూరంగా వుండటానికి ప్రయత్నించేశాను. ఆ విధంగా నాకున్న ఆ నురొక్క మిత్రుడుగూడా దూరమయ్యాడు. ఇప్పుడు నాకు నా అన్న దిక్కెవ్వరూ లేరు. ఒంటరిగా వుంటున్నాను. ఆఫీసులో గూడా, నా పనేమిటో నేను చూచుకునేవాడిని. అంతే! తిరిగి నా గదికి వచ్చేవాడిని. ఆవిధంగా మరొక వారంరోజులు గడిచినవి. ఎలాగో ఈ వారంరోజులు వంటరి జీవితం అనుభవించానుగాని, ఇక ముందలా వుండలేక పోయాను. జీవితంలో మనిషి ఒంటరిగాగూడా బ్రతుకలేడని అప్పుడుగాని నేను తెలుసుకోలేకపోయాను. జీవితంలోని నగ్నసత్యాలను ఒకొక్కటి అనుభవరూపేణా తెలుసుకుంటున్నాను.

ఆవిధంగా మరి కొన్నిరోజులు జరిగినవి. ఒంటరిగా ఎలాగో వుండగలుగుతున్నానుగాని, ఆనాటిసంఘటనమాత్రం నాలోనుండి తిరిగిపోలేదు. అది నా జీవితంలో మరపురాని సంఘటనగా ప్రముఖమై నామనస్సులో గట్టిగాస్థానం యేర్పరుచుకున్నది ఆ విషయం నేను మరెవ్వరికీ చెప్పదలుచుకోలేదు. అలా చెప్తే నాలో బలహీనతను ఒకవిధంగా వెల్లడించడమే

అవుతుంది. అందుకు నేనా సంఘటనను గోప్యంగా వుంచ దలచాను.

ఇంతలో మాకు సీజను ప్రారంభమయింది. ఆ సీజను రోజులలో మాకు చాలా పనివుంటుంది. విశ్రాంతిఅనేది వుండదు. ఆ రెండు నెలలు ఎంతకష్టపడితే అంత ఫలిత ముంటుంది. నాకుటుకు నేను చాలా కష్టపడ్డాను విశ్రాంతిఅనేది లేకుండా నేను ఆ రెండు నెలలు గడపదలచాను అలాగే ఆ తరువాత గూడా గడపడంవలన మా యజమాని అప్పుడప్పుడు నాతో "నీలాగే అందరూకష్టపడితే ఈ సంవత్సరం మనవ్యాపారంలో అరవై వేలులాభంవస్తుంది" అనేవాడు. నాఆరోగ్యవిషయంలో ఆయన నన్ను చాలా జాగ్రత్తగా చూచేవాడు. పడిశభారం చేసినా, తలనొప్పివచ్చినా వెంటనే పెద్దడాక్టరును పిలిపించే వాడు. అదంతా నా మీాద ప్రేమకొద్దీ, నా యందుండే అభిమానంతో అలా చేస్తున్నాడు అని అనుకునేవాడిని. అందుకే నేను శక్తికిమించి పనిచేశాను. నన్నుచూచి కొందరు నాతోటిపనివారలు ఈర్ష్యపడేవారు. వారి ప్రవర్తన నా కర్థమయ్యేదికాదు వాకలా ఎందుకు నేనంటే ఈర్ష్యచూపేవారో నాకు తెలిసేదిగాదు. ఆ రెండుమాసాలు నే నెంతో కష్ట పడ్డాను.

కానీ ఫలితం పూరకేపోలేదు. ఆ సంవత్సరం మా కంపెనీకి ఆశించినదానికంటే అధికలాభాలు వచ్చినవి. నాకు

మాత్రం జబ్బుచేసింది. అనేకలంకణాలు చేశాను. మొదట్లో డాక్టరువచ్చి చూచేవాడు. కాని, రాను రాను నన్ను పలకరించే దిక్కే లేకపోయారు. దానికి కారణం నేను వూహించాను ఆ జబ్బుపడ్డరోజుల్లో పని చేయించినట్లుగూడా యిచ్చేవారు లేకపోవడం ఒకవిధంగా మా కంపెనీ యజమానులకు నా యందు అయిష్టత ఏర్పడిందనుకున్నాను. అంతకష్టపడి పని చేసినా కనీసం ఫలితంలేకపోగా జబ్బుచేసినా చూచేదిక్కు లేకపోవడంతో నా తోటిపనివారు చెప్పిన మాటలు నాకు అప్పుడు గుర్తువచ్చినవి. ఇకముందు జాగ్రత్తగా వుండాలనుకున్నాను. అయితే ఏవిషయంలో ఎలావుండాలో నాకు తెలియదు. ఎలాగో చివరకు జబ్బు నయమైంది. లేచి తిరుగుతున్నాను. అన్నిరోజులు కటికఉపవాసంవలన నాలోని శక్తి పూర్తిగా కోల్పోయాను. కాస్త దూరంగూడా నడవలేకపోతున్నాను. నిలబడితే సోలుపు వస్తుంది విపరీతమైన ఆకలి. ఇలా వున్నది నా స్థితి.

ఒకనాడు నా భవిష్యత్తునుగురించి ఆలోచిస్తూ నా గదిలో పక్కమీద పడుకునివున్నాను. అప్పుడే నా శరీరంలోకి కొత్త రక్తం వస్తున్నది. పని కాస్త చేయగలుగుతున్నాను అప్పుడు రాత్రి ఎనిమిదిగంటలవుతున్నది. కొద్దిగా చలిగాలివీస్తున్నది. నీలపాకాశం కాసేపట్లో కారుమేఘాలతో నిండిపోయింది. కొద్దిక్షణాలలో వర్షం వచ్చేట్లుగావున్నది. ఇంతలో మా యజమాని కూతురు నా గదిలో అడుగుపెట్టింది ఆమె అప్పటి

లేమంచూస్తే నాకెందుకో భయంవేసింది. ఆమెను చూడ గానే, ఆనాటిసంఘటన నా మనస్సుకు గుర్తుకువచ్చింది. మళ్ళీ ఈరోజు యిలా ఆమె రావడం నాకు అనుమానంవేసింది. ఇవ్వాళగూడా ఆరోజులాగే తనకోరిక బయటపెడుతుందేమో నని నాకు భయంగా వున్నది. కానీ పైకి ధైర్యంగా వుండాలని ఎంతో ప్రయత్నంచేశాను. ఈసారి ఏమైనా ఆమెను నాగదికి రాకుండా చేయాలనుకున్నాను

ఆమె వస్తూనే యిలా అన్నది:'ఏమండీ, దేముడి దయ వల్ల మీకు పూర్తిగా నయమైంది. మీకు జ్వరంవచ్చిందని తెలియగానే నే నెంతో భయపడ్డాను' అంటూ నా ప్రక్కన వచ్చి కూర్చున్నది.

ఆమె అలా ధైర్యంగా నాదగ్గర కూర్చున్నదేగాని నా మటుకు నాకెంతో సిగ్గువేసినది. మాటలుగూడా సరిగ్గా రావడంలేదు. ఎవరైనా చూస్తారేమోనని నాకెంతో భయం వేసింది. ఇంతకుముందున్న ధైర్యం పోయిందా? తలుపులు తీసుకుని కూర్చోవడం, మాయజమానికుటుంబంలోనివారు ఎవరు చూచినా యింకేమున్నది? నా జీవితం నాశనమైనట్లే. ఇంత వరకు ఎలాగో మంచిగా బ్రతుకుతున్నాను. నే నిలా అని తెలిస్తే యికముందు నాకు ఉద్యోగం యిచ్చే దిక్కుగూడా వుండదు. ఇలా ఆలోచిస్తున్నాను.

'ఏమండీ! ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తున్నారే' అని అడిగింది.

ఈ హఠాత్తుప్రశ్నకు నేనేం సమాధానం చెప్పాలో నాకు తోచలేదు. నాలోని బలహీనత మరొకసారి బయట పడ్డది. ఇదేమిటి? ఒక్క ప్రశ్నగూడా సమాధానం చెప్ప లేని స్థితికి వస్తున్నానని నేను నా బలహీనతను మనస్సులో విచారిస్తున్నాను.

ఈలోపు ఆమె ముందుకొంచెం నావైపు జరిగింది. వెంటనే నేను లేవబోయాను కానీ ఆమె నన్ను గట్టిగా పట్టుకోవడం వలన లేవలేకపోయాను. నా శరీరం కంపించుకపోతున్నది. కొద్దిగా చెమటలుగూడా పట్టినవి. ఆసమయంలో నాకు సహా యంచేసేవారు ఒక్కరూ లేనందుకు ఎంతో విచారించాను. ఇంతలో నాకు ఒక వుపాయం తోచింది. అంత త్వరలో నా కి లాంటి ఉపాయము తోచినందుకు, నాలోనేనే ఎంతో సంతో షించాను. ఎలాగైనా ఆ గండం గడచి బయటపడవచ్చునని మనస్సులో అనుకున్నాను. ఈ వంకతోనైనా ఆమెనన్ను వదులు తుందని భావించాను. అందుకే యిలా అందామనుకున్నాను. 'తలుపు తీసివున్నది ఎవరైనా చూస్తారు. ఇప్పుడు కాదు, తర్వాత' అని చెప్పుదామనుకున్నాను. కానీ నాకు ఆమాటలు పూర్తిగా నోటరాలేదు. సరిగా 'తలుపు' అని అనగలిగాను.

ఆమె నామాటలువిని పకపకా నవ్వింది 'నేనంత పిరి కిదాన్ని కాదు. మావాళ్లెవరూ ఇంట్లోలేరు. అంతా సినిమాకు వెళ్ళారు నేను సినిమా చూచానని నన్ను మాత్రం ఇంటికి

కాపలా వుంచారు. బయటగేటు తాళంవేసే వచ్చాను. ఇప్పు డిక్కడ ఎవ్వరూలేరు. ఇదే మనకు మంచిసమయం. మీరు ఆలస్యంచేయకండి' అంటూ నన్ను గట్టిగా కౌగలించుకున్నది.

అప్పటికిగాని నా బలహీనతను నేను పూర్తిగా తెలుసు కోలేదు. ఇక లాభంలేదని యిలా చెప్పాను. 'చూడు సుందరి! నీవు కోరితే నేను కాదనలేను. కానీ నీవు ఆలోచించు. నేను మీ గొప్పకు ఏమాత్రం సరిపోను, మీసాటివాణ్ణికూడా కాదు. మీరు నాతో సంబంధం ఏర్పరచుకుంటే మీకు అగౌరవమే. నాకున్న పరువుపోతుంది. నీకు యీడు వచ్చినది కాబట్టి తగినవాడిని వివాహంచేసుకొని సుఖపడు. నాబ్రతుకు నన్ను బ్రతకనీయి అనిచెప్పాను.

ఆమె యీ మాటలకు తోకతొక్కిన త్రాచులా లే చింది. ఆ కోపంలో ఏమేమో అన్నది. నే నింత బలహీను ణ్ణని తెలిస్తే అసలామె నాపొందే కోరేది కాదట. ఇలా యే మేమో మాట్లాడి అక్కడి నుండి వెళ్ళిపోయింది.

నా కామెనీడ వదలిందని సంతోషమేగాని ఏం చేస్తుం దోనని మనస్సులో నాకెంతో భయంగా వున్నది. అవునుమరి స్త్రీ తలచుకుంటే ఏదైనా చెయ్య గలుగుతుంది. ఒక్కసారి నాకు గడచిన దినాలలోని చరిత్రంతా గుర్తుకు వచ్చినది. సారంగధరుడు, మహామంత్రి గుణశర్మ స్త్రీని కాదని ఎలాంటి బాధలు అనుభవించారో నాకు గుర్తుకువచ్చి నాశరీరం కంపిం

చెదర మొదలెట్టింది. కానీ చివరకు ఎలా వారి నిర్దోషిత్వాన్ని ప్రపంచానికి వెల్లడిచేశారో, వారి సత్యసంధత సద్బుద్ధి ఎలా స్థిరంగా ప్రపంచంలో నిలిచిపోయినవో నాకు స్ఫురణకు వచ్చి కొంత ధైర్యమూ వచ్చింది. కానీ గుండెదడ మాత్రం తగ్గలేదు. ఆరాత్రి వెళ్ళిపోయింది. నాలుగు రోజులవరకు, ఆమె నాకు కనిపించలేదు. ఇక మళ్ళీ నేనామెనుగురించి ఆలోచించడం గూడా మానేశాను. నా మకాం నే నక్కడినుండి మరెక్కడికైనా మార్చుదామనుకున్నాను. కాని ఎక్కడికి మార్చాలి? ఇక్కడినుండి ఎక్కడకెళ్ళినా బోలెడు అద్దె చెల్లించాలి. అదే పట్టణంమధ్యలో అయితే ఒక చిన్నగదికే ఎంతో అద్దెవుంటుంది. పడుకోను ఒక మనిషికిగూడా సరిపోదు. గాలి రావడానికి ఒక్కకిటికీకూడా వుండదు. ఆమాటకువస్తే వెలుతురు గూడా ఉండదు. పగలే లైట్లు వేసుకోవాలి. కానీ అద్దె మాత్రం ఏమాత్రం తక్కువవుండదు ఇల్లుమార్చితే. మా యజమానికేవిధంగా చెప్పాలి. ఇలా నేను ఆలోచిస్తున్నాను. రోజులు వారాలు గడచిపోతున్నవి. కానీ నా కామె భయం మాత్రం పోలేదు. వంటరిగా నాగదిలో పడుకుంటే ఏదైనా కొద్దిగా చప్పుడుకాగానే ఆమెవస్తున్నట్లుగానే నాకనిపించేది. ఏం చేయను. నా పరిస్థితి అలా తయారైనందుకు నే నెవరిని నిందించాలి? నాస్థితికి నేనే మనస్సులో బాధపడేవాడిని. నిందించుకునేవాడిని అలాగే ఒంటరిగా జీవితంగడుపుతూ కాలక్షేపం చేస్తున్నాను.

ఒకసారి మామూలుగా నేను వేళ్ళేపార్కులో

నా బెంచీమీద కూర్చున్నాను. ఆ బెంచీ అంటే నా కెంతో యిష్టం. ఒకప్పుడు అదేనాయిల్లు, ఆప్యాయతగా వెళ్ళి అక్కడ కూర్చున్నాను! కాసేపు పడుకున్నాను! చాలాసేపుఅక్కడ గడిపాను. అక్కడ కూర్చున్నప్పుడు నా గతజీవితం గుర్తుకొచ్చింది. వానవచ్చినరాత్రి మోటెంగుజరిగినరోజు అక్కడ గడపిన దినాలలో జరిగిన అనేకసంఘటనలు గుర్తుకువచ్చినవి. ఇపుడు ఆలోచిస్తే ఆరోజులే బాగా గడిచిన వనిపిస్తున్నవి. ఇపుడు నాకుస్వతంత్రం లేదు. ఏం చేయాలన్నా, ఎక్కడకు వెళ్ళాలన్నా యజమాని అనుమతి తీసుకోవాలి. అప్పుడు ఎక్కడకువెళ్ళినా, ఎక్కడ తిరిగినా, స్వతంత్రంగా వుండేది. కాకపోతే తిండికే ఇబ్బందిపడేవాడిని అంతే. అంతకుతప్ప మిగతా విషయాలలో నాకుఅన్నీ స్వతంత్రంగా వుండేవి.

అలా ఆలోచిస్తుండగా మా హోటలుమిత్రుడు గుర్తుకొచ్చాడు ఆతనితోనాకు మొదటిపరిచయం తర్వాతఅతను నాకు అప్పుడప్పుడు చేసినసహాయం అవన్నీ గుర్తుకు వచ్చినవి. అతనినిచూచి చాలారోజులైంది. ఒకసారి చూడాలనిపించింది కానీ అప్పటికి బాగా చీకటిపడటంవలన నాకోరిక ఆనాటికి వాయిదా వేయవలసివచ్చింది అక్కడనుండి తిన్నగాభోజన హోటలుకు వెళ్ళి, సుష్టుగా భోజనంచేశాను. తిరిగి అక్కడ నుండి నాగదికి వెళ్ళి పడుకున్నాను.

ఆరోజు సంక్రాంతిపండుగ. మామూలుగా ప్రతిపండు గకు పిలిచినట్లుగానే ఆ పండుగకు మా యజమాని నన్ను భోజనానికి పిలుస్తారనుకున్నాను. కానీ ఈసారి ఎందుకో నా విషయం ఎవ్వరూ పట్టించుకోలేదు. మామూలుగా వేళకు హోటలుకు వెళ్ళి భోంచేసి, నాగదికివచ్చి పడుకున్నాను. మాయజమాని ఇంట్లో అందరూ అభ్యంగనస్నానం చేశారు. నాకు అనుకోనట్లుగా మాయింటిపరిస్థితి గుర్తుకువచ్చింది నేను పట్టణం వచ్చినతర్వాత వారిజాడ నాకు తెలియలేదు నేను బ్రతికివున్నానని కనీసం ఒక జాబుగూడా ఇంతవరకు వారికి వ్రాయలేదు. అనుకోనట్లుగా నాకీనాడు మళ్ళీ మాయింటి సంగతి గుర్తుకు వచ్చినది. అక్కడిస్థితి ఎక్కువసేపుఆలోచించ లేకపోయాను. ఆ బాధలు, అక్కడి బతుకులు తలుచుకుంటే ఎవ్వరూ ప్రశాంతంగా వుండలేరు. అంతహీనంగా, నాను ణంగా అక్కడ మాయింట్లో జీవితం వెళ్ళబోసుకుంటున్నారు.

ఇలా నాస్మృతిపథంలోకి ఒకపండుగకుజరిగిన సంఘు టన గుర్తుకు వచ్చింది. అది మా జీవితాంతంవరకు గుర్తుండే సంఘటన. జన్మలో ఎప్పుడూ మరచిపోలేము.

ఆ పండుగ రెండురోజులపండగ. ఏమిటది? ఊc గుర్తు కొచ్చింది. ఇదేసంక్రాంతి.అవును సంక్రాంతే. గట్టిగాచెప్ప గలను. ముందు భోగి, తర్వాత సంక్రాంతి పండుగ.

ఆరోజు- అవును భోగిరోజు. మాయింట్లోపొయ్యిలో నిప్పుపడలేదు. ఎప్పుడూ అనుభవించే దరిద్రింకన్నా ఆ రెండు

రోజులు ఎక్కువ దరిద్రం అనుభవించాము. పండుగ వారం రోజులుండగానే అందరూ పండుగసందడిలో వుంటారు. కొత్త బట్టలు, బంధువులను పిలవటం పిండివంటలు హడావుడిగా ఆ వారం రోజులు సంతోషంగా గడుపుతారు.

కానీ మాయింటి పరిస్థితి అందుకు పూర్తి విరుద్ధంగా వున్నది. మా అదృష్టమేమో ఆ నాలుగు రోజులు మాకు రాగినయా పైసా అప్పిచ్చిన దిక్కు లేదు. పండుగ ఒక్కరోజు ముందే మా అమ్మ ఆ రెండురోజులు ఉన్నదాంట్లో సంతృప్తిగా గడపాలని విశ్వప్రయత్నం చేసింది. ఫలితం నిష్ప్రయోజనం అయింది భోగినాడు మాయింట్లో ఏకాదశి. పోనీ సంక్రాంతి పండుగరోజున ద్వాదశి చేసుకుందామని దూరపుబంధువు ఒకాయన దగ్గర ఐదురూపాయలు అప్పు తెచ్చింది మా అమ్మ. అవి పెట్టి పండుగకు కావలసిన వస్తువులు తెచ్చి భోగినాడు చాల పొద్దుపోయేవరకు పిండివంటలు చేసింది. ఆ ఐదు రూపాయిలకుతోడు అంగడియజమానికి మరొక రూపాయి అరువుపెట్టింది.

కానీ దేముడు పండగరోజుగూడా మమ్ములను ఏకాదశిగా కాలం గడపమన్నాడు. మేము పిల్లలం. సంతోషంగా ఉదయమే స్నానాలుచేసి పంచభక్ష్య పరమాన్నాలు భోంచేయాలని ఆ రాత్రి సుఖంగా నిద్రపోయాము. మా అమ్మ పొద్దుపోయేవరకు పనిచేసి అలసి ఏ అర్ధరాత్రో పడుకొని

గాఢంగా నిద్రపోయింది. ఆ అమను చూసి మేమలాగూడా బ్రతకడం యిష్టంలేదని మాకంటె దరిద్రులైన చోరులు ఇంట్లో వస్తువులేగాక ఆరాత్రి చాలా పొద్దుపోయేవరకు చేసిన పిండి వంటలతో త్రాగటాని కొకపాత్రగూడా లేకుండా తీసుకెళ్ళారు.

తెల్లవారుఝామున సంతోషంతో మమ్మలను లేప వలసిన మా అమ్మ దుఃఖంతో లేపింది. జరిగినదంతా విని మేమంతా పెద్దగా ఏడ్చాము. ఆవిధంగా ఆపండుగ వెళ్ళిపోయింది.

అలా మా యింటిపరిస్థితి నాకు గుర్తుకువచ్చేసరికి నా మనస్సెంతో బరువెక్కినట్లైంది. అక్కడిబాధలు చూడలేక నే నిటువచ్చాను. ప్రశాంతంగా బ్రతకాలనుకున్నాను కాని నా జీవితాని కది లేదు. నేను బ్రతికినంతకాలం ఎవరినో ఒకరిని గురించి కాని, కనీసం నాగురించి నేనైనాగానీ బాధలు అనుభ వించవలసినదే! ఇదే నా జీవితానికి పరమావధి, అదే మోక్షం ఏంచేయను మరి; నేనలాంటి పరిస్థితిలో పుట్టాను, అలాంటి సమాజంలో బ్రతుకుతున్నాను. అలాగే బ్రతికినంతకాలం కష్టాలు అనుభవిస్తూ చచ్చిపోతాను అది నా జీవితం. నావల్ల దేశానికి, కనీసం ఒకమనిషికి ఎలాంటి ఉపకారంలేదు. అలాంటి బ్రతుకు నాది.

ఇలా ఎక్కువసేపు ఆలోచించలేకపోయాను. మనస్సును మరొక విషయంమీదకు మరల్చడానికి ప్రయత్నం చేశాను. కానీ ఉపయోగం లేకపోయింది. ఈ పండుగ- ఇదే

పండుగ. ఈసారి మావాండ్లు ఏంచేస్తుంటారో? అసలీలోకంలో వున్నారో, లేరో? అబ్బ! ఇక ఆలోచించలేను. ఇక అక్కడ ఎక్కువసేపు వుండలేకపోయాను. గది తలుపులు వేసి ఆఫీసు లోకి వెళ్ళాను. అక్కడి దృశ్యంచూచి నిర్ఘాంతపొయ్యాను పొగలోనుండి సెగలోకి వచ్చినట్లయింది నా పని. ఇన్ని రోజులు నేను దేనినిస్వతిరేకించానో, దేనిని చెడ్డగా చూచానో దేనికోసం నేను హోటలుమిత్రుణ్ణి కాదని పారిపోయివచ్చి అష్ట కష్టాలు పడ్డానో, యిప్పుడీ వుద్యోగాన్ని సహితాం దేనికోసమై వదిలిపెట్టుటకుగూడా సిద్ధంగా వున్నానో, అదే నా కండ్లెదుట ఇపుడు జరుగుతున్నది. పట్టపగలు, పడిమంది వచ్చే ఆఫీసులో ఇలా ప్రేమకలాపం యింత నిర్భయంగా జరుగుతుందని అబ్బ! అసలు దేశంలో యిలాంటి మనుష్యు లుంటారనిగూడా అంత వరకూ నాకు తెలియదు.

కామం ఎంతగొప్పదో, ఎంతగుడ్డిదో, దానికున్న శక్తి ఆ నాడు కళ్ళారా చూచాను. ఈడు, జోడు, పగలు, రాత్రి, మంచి, చెడు, తప్పు, ఒప్పు తెలియనిది కామం. దీనిశక్తి, ఒక మహాస్త్రం శక్తికి మించినది. కామంకోసం రాజ్యాలు, వదులుకునేవారు, బంధువులను, ఆఖరుకు సోదరులను చంపిన వారు చరిత్రలో కొల్లలుగా కనిపించుతారు. అలాంటి సం ఘటనలు ఈనాటికి గాదు, ఈ లోకం ఇలా వున్నంతవరకు జరుగుతూనే వుంటవి.

పురుషుని కామాన్ని రెచ్చగొట్టేవస్తువు సృష్టిలో స్త్రీ. కాబట్టి కామానికి మూలం స్త్రీ. ఆ స్త్రీకోసం రాక్షస సామ్రాజ్యాలు పతనమైనవి. రామాయణం సృష్టించబడింది. ఒక మహా కావ్యం వెలువడింది. ఆ స్త్రీకోసం భారతయుద్ధం జరిగింది. రోమన్ సామ్రాజ్యం పతనమైంది. అయితే కొన్ని మంచి గుణాలుగూడా లేకపోలేదు. కామానికి అంతశక్తే లేకపోతే తాజమహాలులాంటి అపురూపమైన భవనము ఉండేదికాదు. వీటన్నిటికి మూలం కామం. కామంతో మన విచక్షణాజ్ఞానం నశిస్తుంది. మంచి చెడు భేదాలు తెలియవు. అదే యిప్పుడిక్కడ జరుగుతున్నది.

నే నా దృశ్యంచూస్తూ అక్కడ ఎక్కువసేపు వుండలేకపోయాను. గిర్రున వెనక్కు తిరిగి గబగబా వీధిలోకి వచ్చాను. త్రోవలో నడుస్తున్నానేగాని, నే నెక్కడికిపోతున్నానో, అసలు నడుస్తున్నానో లేదోగూడా నాకు తెలియలేదు. అలా వుంది నాపరిస్థితి. నా ఆలోచనంతా ఆ దృశ్యంమీదనే వుంది. అది ప్రేమో, కామమోగూడా వాండ్లకు తెలియదు. అది ప్రేమ అని సుందరి చెప్పింది. అదెలా ప్రేమవుతుందో నా కర్థం కాలేదు.

సుందరి మొదట నన్ను ప్రేమించానన్నది. ఆ అమ్మాయికి ప్రేమే ముఖ్యమైతే మళ్ళీ నామిత్రుడి నెలా ప్రేమిస్తుంది. నాతో సంబంధం ఏర్పరచుకోవాలని చూచింది. కాని నేనందు కిష్టపడలేదు. రెండుసార్లు ఆమెకోరిక తీర్చలేకపోయాను. ఇక

నామీద ఆశ వదులుకున్నది. మా మిత్రుడిమీద ఆ అస్త్రాన్ని ప్రయోగించింది. అతనికి కావలసిందికూడా అదే. అందుకే కాబోలు ఆనాడు నే నామె సంగతి చెప్పినతర్వాత అదృష్టవంతుడని అన్నాడు. ఇదే కాబోలు అతనికి కావలసిన అదృష్టం. ఆతను కోరుకున్న అదృష్టం ఆమె కోరిక వెంటనే ఆత నామెకోరికను తీర్చుతున్నాడు.

వారిద్దరిమధ్య సంబంధం అదే మొదటిది కాకపోవచ్చు. ఇది ఎన్నోసారో, ఇలా వారింకెన్నిసార్లు చేస్తారో! ఇలా ఆలోచిస్తున్నాను. నా ఆలోచనలకు నాకే విసుగుపుట్టింది. ఛీ ఇదేమిటిలా ఆలోచిస్తున్నాను. వారెన్నిసార్లు ఏమ్చేసుకుంటే నా కేం[illegible]. ఇంక నేను విషయం పట్టించుకోదలుచుకోలేదు. దాని పర్యవసానం ఎలా వుంటుందనేది వారు ఆలోచించాలి. అంతేగాని నాకెందుకు ఈ గోల, అని నే నెటుపోతున్నానో అప్పుడు నిలబడిచూచాను. ఇంక కొద్దిదూరంలో ఆ త్రోవ ఆగిపోయింది. ఆ తర్వాత రైలుపట్టాలు అప్పటికిగాని నేను ఎటు వెళ్ళేది నాకు అర్థం కాలేదు. తిరిగి ఆఫీసువైపుకు మళ్ళాను. వస్తూ మళ్ళీ ఏదో ఆలోచిస్తున్నాను. ఇంతలో హఠాత్తుగా మాహోటలుమిత్రుడు కలిశాడు. ఆతనిని చూచేసరికి నా కెంతో సంతోషం వేసింది నేనే ఆతనిని చూడాలనుకుంటున్నాను. అలాంటిది ఈరోజు ఆతనే కనిపించాడు. ఇక ఆరోజు ఆతనితో చాలాసేపుగడిపాను. ఏదేదోమాట్లాడుకున్నాము అక్కడినుండి యిద్దరం విడిపోయాం. అప్పుడప్పుడే

సంధ్యచీకటి పడుతున్నది. నాకెందుకో ఈ పూట ఆకలిగాలేదు. అందుకని సరాసరి మా ఆఫీసుకు అంటే నాగదికి వెళ్ళాలని బయలుదేరాను.

నేను గేటుదాటి లోపల ప్రవేశించబోయాను ఇంతలో సుందరి పిలుపు వినిపించింది. ఆమె వరండాలో కుర్చీలో పడుకుని ఏదో చదువుకుంటున్నది. నేను దగ్గరకువెళ్ళి నిలబడ్డాను. 'మా తాతయ్యకు జబ్బుగా వున్నదని మా వాండ్లంతా మధ్యాహ్నం వూరికి వెళ్ళారు ఎప్పుడు వస్తారో తెలియదు. ఈ రాత్రికి మీరు తోడుపడుకుంటారా? లేక మీ స్నేహితుణ్ణి రమ్మనమని చెప్పుకుంటారా?' అని అడిగిందామె. ఆమె యిలా అడగడంలో అర్థం నాకు తెలియకపోలేదు. 'ఆతనినే పిలవండి' అని చెప్పుదామనుకున్నాను. కానీ వెంటనే 'మీ యిష్టం' అన్నాను.

ఆమె నామాటకు వెంటనే ఇలా అన్నది. 'మీరు సినిమాలకు ఎక్కడికైనా వెళ్ళాలనుకుంటే వెళ్ళండి. ఆతనినిపిలుస్తాను'

ఆమె అభిప్రాయం నే నర్థం చేసుకున్నాను. మధ్యాహ్నం వారుసాగించిన ప్రేమకలాపం నాకు తెలియదని ఆమె నన్నేదో గారడి చేయాలనుకుంటున్నది. నే నెలాగూ ఆమె కోరిక తీర్చలేదని ఆమె మా మిత్రుడితో తన కోరిక తీర్చుకోవాలని చూస్తున్నది. ఒకవిధంగా నాకీ విషయం

తెలియకుండా వుండాలని ఆమె అభిప్రాయం అందుకే ఆమె అలా చెప్పింది. నిజంగా నాకు అంతవరకు ఏసినిమాకు పోవాలని లేదు. కానీ యిప్పుడు ఈ నరకం దాటిపోవడమే మంచిదని పించింది. నేను ఈరాత్రి ఎక్కడికైనా పోవడం. వారికీ, నాకూ సంతృప్తిగా, సంతోషంగా వుంటుంది ఇలా ఆలోచించాను.

.సరే నేను ఏ సినిమాలు చూడలేదు. ఈ రాత్రికి రెండాటల సినిమాలు చూసివస్తాను. అని చెప్పి ఆమెముఖం వైపుచూచాను ఆమెకు నామాటలు సంతృప్తి కలిగించినవి. తిరిగి వెంటనే యిలా అన్నది.

'మీకేమైనా డబ్బు కావాలా ?'

'వద్దు' అని చెప్పి, నేనక్కడనుంచి గబగబా వీధిలోకి వచ్చేశాను. అంతే. ఆరాత్రి నేను మళ్ళీ ఆవైపుకు పోలేదు. అక్కడనుంచి నేను రెండుఆటల సినిమాలకు వెళ్ళాను. రెండో ఆట వదిలేసరికి రెండుగంటలైనది. రెండు సినిమాలు బాగాలేవు. బాగా లేకపోతేనేం ఒక్కొక్క ఆట మూడున్నరగంటలు చూపించారు. అదే చాలు. పావలా పోతేనేం. ఎలక్ట్రిక్ ఫానులక్రింద కుర్చీలో గంటకు అణాఅద్దె యిచ్చాను. నేను హాలునుంచి బయటపడ్డాను. తెల్లవార్లు నిద్రలేకపోవడంమూలంగా కండ్లు మంటలుగా వున్నవి. ఆకలి దహించివేస్తున్నది. నిద్రలో తూగిపోతున్నాను. తప్పనాగదికి వచ్చాను. గేటుదాటినస్తూ అప్రయత్నంగా నాచూపు ఆఫీసు

మీాద పడ్డది. అక్కడెవరూ కనిపించలేదు. చప్పు డేమీాలేదు. నేను వెళ్ళి నాగదిలో పడుకున్నాను.

అలా చాలాసేపు పడుకున్నాను. సగంరాత్రివరకునిద్ర లేకపోవడంవలన వేళతప్పిపోయింది. అటూ, ఇటూ చాలాసేపు పొర్లాను. చివర కెప్పుడో నిద్రపట్టింది. పదిగంటలకు మెళకువ వచ్చింది. అంటే మధ్యాహ్నంలేచి స్నానంచేశాను. ఇపుడు కొంచెం బాగావున్నది. భోంచేద్దామని బయలుదేరాను. గేటుతీసి బయటకు పోబోయాను. అంతలో సుందరి కేకవినిపించింది. ఇష్టం లేకపోయినా ఆమెదగ్గరకు వెళ్ళాను. ఆమెకూ తెల్లవార్లు నిద్రలేనట్లున్నది. కండ్లు తేలిపోతునన్నట్లుగావున్నవి. ముఖం తెల్లగావున్నది. ఆమె చాలా శుభ్రంగా నీటుగా తయారైవున్నది. నేనువెళ్ళి దగ్గర నిల్చోగానే, 'రాత్రి రెండు సినిమాలు చూచివట్లున్నారే?' అడిగింది.

నాకు సమాధానం చెప్పాలనిలేదు. అందుకని ఇలా ఎదురుప్రశ్న వేశాను.

'మీా కెలా తెలుసు?,

'రాత్రి నేను గేటుతాళం తీసి పడుకున్నాను. మొదటి ఆట వదిలేవరకు మాట్లాడుతూ నేవున్నాం' అప్పటివరకు మీారు రాలేదు. అందుకని అడుగుతున్నాను అన్నది.

'మళ్ళీ తాళం వేయలేదా?,

'తెల్లవారుఝామున నాలుగు గంటలకు మెళకువ వచ్చింది అపుడు వేశాను.,

'అలాగా' అన్నాను నేను. అంతే ఇంకేమీ మాట్లాడ లేదు. అక్కడనుండి గబగబా హోటలుకు వెళ్ళాను.

నేను భోంచేసి తిరుగుముఖంపట్టాను. కంటి రెప్పలు మూసుకపోతున్నవి. భుక్తాయాసంగావున్నది. కాసేపు పడు కుంటే బాగుండననిపించింది. అందుకని వచ్చేటప్పుడు గబగబా నడచివచ్చాను. గేటులోపల గొళ్ళెం పెట్టివున్నది. ఏమి టిలా వున్నది యివ్వాళ అని ఆలోచించాను అవును మరి ఎప్పుడూ పగలు గేటు తీసివుండేది. ఈరోజు యిలావుండేసరికి నాకే ఆశ్చర్యం వేసింది.తిన్నగా గొళ్ళెంతీసి లోపల అడుగుబెట్టాను. ఆఫీసు తలుపు వేసివున్నది.నా అనుమానం స్థిరపడ్డది.గబగబా నాగదికి వెళ్ళాను. దొడ్డివైపు నాగది కావడంవలన ముందు మా ఆఫీసు, దాని వెనుక మా యజమాని యిల్లు, తర్వాత నా గది.

నేను ఆఫీసు దాటాను.మా యజమాని యింటి దగ్గరికి వచ్చాను. దారిలోనే వున్నది పడకగది. కిటికీ తలుపులు తీసి వున్నవి.నే నా ప్రక్కసందులోగుండా పోతున్నాను.కిటికీతలు పులు తీసివుండటంవలన లోపల ఏంజరుగుతున్నదికనిపిస్తున్నది. నే నటువెళ్ళినప్పుడు నే ననుమానించినట్లుగానే,మామిత్రుడు సుందరి నగ్నంగావున్నారు. వారినిచూచి నాకెంతోఆశ్చర్యం సిగ్గు వేసినది. పట్టపగలు,ఒకరికెదురుగా ఒకరు అలా నగ్నంగా వుంటారని నే నెప్పుడూ వూహించలేదు, అది అంతవరకు నా

వ్యాహాకరందవిషయం. అక్కడినుంచి నేను గబగబా లోపలికి వెళ్ళి నాగదిలో పడుకున్నాను.

తర్వాత కొద్దిసేపటికి మా మిత్రుడు వచ్చాడునాగదికి. వస్తూనే చిన్నగా నవ్వాడు. నే నేమీ మాట్లాడలేదు. అతనే ఏదేదో చెప్తున్నాడు. ఇంతవరకూ చాలా రోజులనుంచి మాయిద్దరిమధ్య మాటలులేవు. అలాంటిది రోజు అత నిలా వచ్చి మాట్లాడటం నా కెంతో ఆశ్చర్యం వేసింది. చివరకు మాటలసందర్భంలో,ఆవిషయం ఎక్కడా చెప్పవద్దనీ బ్రతిమి లాడాడు. అతనికి నే నేమీ సమాధానం చెప్పలేదు.

ఆ తర్వాత అతను వెళ్ళిపోయాడు. నే నా విషయం గురించి ఆలోచించడం మానేశాను ఇక నా కక్కడ వుండా లని యిష్టంలేదు. కానీ గత్యంతరం లేదుగా, ఏంచేయను? పడుకున్నాను ఇంతలో సుందరివచ్చింది. నే నేమీ మాట్లాడ లేదు. అసలామెతో మాట్లాడటానికి నా కిష్టంలేదు. కానేపు నిలుచుంది. కానీ నే నప్పటికీ మాట్లాడనందువలన చివర కామె యిలా అన్నది.

'ఏమండీ నాన్నగారు ఇంకా రాలేదే?'

నన్నేదో మాట్లాడించాలని అడిగినట్లుగా వున్నది గాని నిజంగా అడగాలని అడిగినట్లుగా లేదు. వాండ్లు వెళ్ళేది కూడా నాకు తెలియదు. అలాంటప్పుడు వా రెప్పుడు వచ్చేది మాత్రం నా కెలా తెలుస్తుంది? అమాటే పైకన్నాను.

ఇంకా ఆమె ఏమీ అడగలేదు అప్పుడప్పుడు నేనామె ముఖంవైపు చూచేవాడిని. ఆమె ముఖభంగిమలనుబట్టి ఏదో చెప్పబోతు న్నట్లుగా వుండేది. అంతేగాని, చెప్పదలచుకున్నమాట సరా సరి చెప్పలేకపోయింది.

కానీ ఆమె చెప్పబోయే మాటేమిటో నాకు తెలుసు, చివరకు నేనే యిలా అన్నాను.

'మంచి అలవాట్లు, మంచిగుణం ఎవరికివారు అలవరచు కోవాలి. అవి ఒకరు చెప్పితే ఒకరునిచూస్తేరావు. అలాగే నేను నిన్ను నిరాకరించినప్పుడే నీవు నీ ప్రయత్నం, నీ కోరికలను చంపుకొని వుండవలసింది. కానీ నీ వలాచేయలేదు. నేను కాదన్నానని మరొకరితో ప్రేమకలాపం సాగించావు. దాని పర్యవసానం ఎలావుండేది ఇప్పుడు నీకు తెలియకపోవచ్చు కానీ కొద్దిరోజులకు నీవే తెలుసుకుంటావు. అంతేకాని మధ్య నీ విషయంలో నే నెలాంటిజోక్యం కలుగజేసుకోను. అసలు నేనే ఇక్కడనుండి గది మారుద్దామనుకుంటున్నాను అని చెప్పాను. దానికామె ఏమీ సమాధానం చెప్పలేదు. సంతృప్తిగా వెళ్ళిపోయింది.

అలా ఒక వారంరోజులు గడచినవి. కంపెనీపనులతో నేను సతమత మవుతున్నాను. ఇదిలా వుండగా మా యజ మానితండ్రికి జబ్బు ఎక్కువగానుండి, తిరిగాయన ఒక్కడూ అక్కడికి వెళ్ళాడు. ఈసారి నాకు పని మరీ ఎక్కువైంది.

ఒక్కొక్క రాత్రి పన్నెండుగంట లయినా పని తెమిలేదికాదు. నేను చేస్తున్నపని ఎంతకూ తెమిలేదికాదు.

ఈసమయంలో రంగనాథంగారు వచ్చారు. ఆయనంటే నాకు మంచి అభిమానమని చెప్పానుగా, అందుకు ముఖ్యకారణము ఆయన చాలా సరదాగా వుంటాడు. పనులున్న వని చెప్పినా ఆరాత్రి ఆయన నన్ను సినిమాకు రమ్మని బలవంతం చేశాడు. పోక తప్పలేదు. ఏంచేయను అంత పెద్దమనిషి రమ్మంటే కాదంటే బాగుండదు చివరకు తప్పనిసరై మొదటి ఆట సినిమాకు వెళ్ళాము. తిరిగి ఇంటికివచ్చేసరికి పదిగంటలైంది. ఆపూట నాకు భోజనంప్రాప్తిలేదు ఏంచేయనుమరి. అలాగే వచ్చి పనులు చూచుకుంటున్నాను. కానీ ఆయన నన్నలా వుండనివ్వలేదు. ఆయనతోబాటు నన్ను భోజనానికి పిలిచాడు. కాదనలేకపోయాను. వెళ్ళి భోంచేసివచ్చి నా పనులు నేను చూచుకోవడము ప్రారంభించాను.

ఆయన నాతోబాటు భోజనం ముగించుకొని నా వెనకాలేవచ్చి నాదగ్గర కాసేపు కూర్చున్నాడు. నేను పని ఆపకుండా ఆయనతో పిచ్చాపాటీ మాట్లాడుతూనే వున్నాను. ఈ విధంగా ఒక అరగంటకాలం గడిచింది. 'పడుకోండి చాలా పొద్దుపోయింది. రేపు చూచుకోవచ్చుపని, అయినా ఎప్పుడూ వుండేదేగా'?

వెంటనే నే నిలా సమాధానం చెప్పాను. 'చేయువలసిన పని చాలావున్నది. మీరు పడుకోండి, ఈరోజు పనిపూర్తిచేసే

సరికి పన్నెండుగంటలో ఒంటిగంటో అవుతుంది.' దానికాయన ఏమీ మాట్లాడలేదు, లోపలికి వెళ్ళాడు. ఇంతలో మా యజమాని భార్యవచ్చి ఆమె అలాగే అన్నది. తిరిగి నేను ఆమెకు అలాగే సమాధానం చెప్పాను ఆతర్వాత కొద్దిసేపుండి ఆమె వెళ్ళిపోయినది. నేను నాపనిలో నిమగ్నమయ్యాను

ఒక అరగంటకాలం గడచింది. చలిగాలి బాగా వీస్తున్నది. గదికిపోయి దుప్పటి తెచ్చుకుని యిక్కడ పనులుచూచుకుందామని గదికి బయలు దేరాను. తోవలోనే వున్నదిగా పడకగది. ఆప్రక్కగానే వెళ్ళాలి. అయినా యజమాని లేడు గదా అని నేను పోబోయాను. గాజుల చప్పుడి వినిపించింది. నాకు అనుమానం వేసింది. చూడకుండానే కిటికీ దాటి పోవాలనుకున్నాను తీరా కిటికీ దగ్గరకు పోయేసరికి అప్రయత్నంగా నా చూపు అటు మళ్ళింది. నే నా దృశ్యం చూస్తూ అక్కడ ఒక్కక్షణం వుండ లేకపోయాను. మా యజమాని భార్య అలా ప్రవర్తిస్తుందని నేను కలలోగూడా వూహించలేదు. చాలా సేపటివరకు నా కండ్లతో నే చూచిన దృశ్యాన్ని నేనే నమ్మలేక పోయ్యాను. పొరపాటున అది కలకాదుగదా! చాలాసేపు తర్కించుకున్నమీదట గాని అదికలకాదని నిర్ణయానికి రాలేకపోయాను.

మొదట్లో నేనాకంపెనీలో చేరినపుడు మా యజమాని దాంపత్యం చూచి ఎంతో సంతోషించే వాడిని. దాంపత్యం

అంటే అలా వుండాలనుకున్నాను. వారి ప్రేమచూచి ఆశ్చర్య పోయేవాడిని. పురాణదంపతులను మరపించేటంతగా వుండేది ఆ దాంపత్యం. కానీ యిప్పుడాసంఘటన స్వయంగా చూచిన తరువాత నాకు నేనే పునర్జన్మ ఎత్తినట్లనిపించింది. నాకు మా యజమాని కుటుంబంమీద అంతకు ముందుండే గౌరవము పూర్తిగాపోయింది. ఒకవిధంగా నాకు వారంటే అయిష్టత ఏర్పడ్డది. ఇక అక్కడనుండి బయటపడా లనుకున్నాను. ఎట్టి దారుణ పరిస్థితులను నేను గురి అయినా యిక ఆ కంపెనీలో పనిచేయకూడ దని ఒట్టుపెట్టు కున్నాను.

కానీ ఈసారి నేను నా వుద్యోగవిషయంలో జాగు చేయలేదు. మా యజమానికి చెప్పి నే నా వుద్యోగంలో నుండి బయటపడ్డాను. నేను నా వుద్యోగం మానేస్తే కారణం అడుగుతాడేమో నని చాలాసేపు ఆలోచించాను. కానీ ఆయన నన్నేమీ అడగలేదు. నే నెందుకు మానుకుంటున్నదీ చెప్పలేదు. ఆ వుద్యోగం మానేయా లనుకున్నాను అంతే, మానేశాను.

అప్పటికి గాని నాకు ప్రశాంతత దొరకలేదు. అంతవరకు నా కక్కడ ముళ్ళమీద వున్నట్లుగా వున్నది. మళ్ళీ నా పాతజీవితం ప్రారంభమైంది. మళ్ళీ నా మామూలు పార్కుకు వచ్చాను. అలా వచ్చినతరువాత నా కెంతో సంతోషంగా వున్నది. ఇపుడు నా మనస్సు కొంచెం తేలిక

పడింది. ఇప్పుడు నేను స్వతంత్రుణ్ణి. ఏంచేయాలన్నా నా యిష్టం. ఇప్పుడు నే నెవరికీ జంకవలసిన పనిలేదు. ఇలా ఆలోచించుకుంటూ పార్కు బెంచీమీద పడుకున్నాను.

వారం రోజులు జరగనట్లుగానే జరిగిపోయినవి. ఉరకలు పెట్టుకుంటూ, ఉప్పెనలా వచ్చే నదీప్రవాహాన్నైనా ఆపవచ్చునేమోగాని, కాలప్రవాహాన్ని ఆపటం ఎవరితరము గాదు.

నేను ఆవారంరోజులు మళ్ళీ వుద్యోగంకోసం ఎక్కడా ప్రయత్నంచేయలేదు. అప్పటివరకు నాకు భోజనం టిక్కెట్లు వున్నవి. అంతే. అవీ కాలప్రవాహానికి ఆగలేక ఒక్కొక్కటే నన్ను వదలిపోయినవి ఇక మళ్ళీ నా జీవితం ఎలా వెళ్ళిపోతుందో అనే ఆలోచన నాకు లేదు. ఇంతకు ముందులా గాకుండా నే నిప్పుడు ధైర్యంగా వున్నాను ఇప్పుడు నే నెలాగైనా బ్రతకగలననే నమ్మకం నాకున్నది. బ్రతుకును గురించి భయంలేదు. నిశ్చింతగా హోటలులో భోంచేసి పార్కుకు వచ్చి పడుకుంటున్నాను. ఆ వారంరోజులు నాకు పదనిమిషాల్లాగా వెళ్ళిపోయినవి.

ఈ నాటికి మళ్ళీ నాజీవితంలో పస్తులరోజు వచ్చినది. అంటే ఇవ్వాళ నాకు ఏకాదశి అన్నమాట. ఏకాదశి రోజు హిందువులు కటిక ఉపవాసం చేస్తారు. పండ్లు, నీళ్ళు తప్ప మరేవీ ముట్టుకోరు. ఆరోజు పుణ్యం వస్తుందని వారు భావి

స్తారు. అందుకే యింకా యీనాటికీ సనాతనసాంప్రదాయాలు పోకుండా వాటిని అనుసరిస్తున్నారు.

నాకు నా జీవితంలో అనేక ఏకాదశులు అనుకోనట్లుగా వచ్చిపోతున్నవి. జీవితంలో యిప్పటివరకు ఎన్ని ఏకాదశులు పోయినవో లెక్క వేసుకుంటే తప్పకుండా నేనుస్వర్గానికిపోతా నని ఖచ్చితంగా చెప్పగలను. అయితే నేను చేసిన ఉపవాసా లలో అన్నీ ఏకాదశులు లేకపోవచ్చు. కొన్నైనా వుంటవనేది మటుకు సత్యం.

అయితే ఒకవిధంగా నా వుపవాసాలకు విలువలేదు. పురాణాలలో ఏకాదశి వుండాలని, వున్నవారికి పుణ్యమొస్తుం దనే చెప్పారు. అనీ, ఆరోజుమనస్సును ఏ ప్రాపంచికవిషయా లలో లగ్నంచేయకుండా కేవలం భగవంతునిమీదనే ధ్యానం వుంచితేనే పుణ్యం వస్తుందని చెప్పారు. ఆ దృష్టితో చూచిన నా కెప్పుడూ పుణ్యంరాదు. ఎంచేతంటే, నేను ఏకాదశి రోజున వుపవాసంచేయాలని చేయడంలేదు. ఎక్కడా పిడికెడు మెతుకులు దొరకక వుంటున్నాను. ఇక రెండోది, ఆ రోజు మనస్సును కేవలం భగవంతునిమీదనే లగ్నంచేయడం. అలా అయితే నాకు తెలిసినంతవరకు నే నెప్పుడూ భగవంతుని తలచిన పాపాన పోలేదు. పైగా నేను తిట్టినరోజు ఆ ఏకాదశి వుండవచ్చనే అనుమానంగూడా నాకు లేకపోలేదు అటు

వంటప్పుడు నాకు పుణ్యం వస్తుందని నమ్మకంలేదు. కానీ, పాపంమాత్రం రాకుండా వుంటే అదే పదివేలు.

ఇలా అనుకుంటూ పార్కునుండి రోడ్డుమీదకు వచ్చాను. అపుడు సాయంత్రం ఐదుగంటలవుతుంది ఎవరో యిద్దరు బ్రాహ్మణులు నాకెదురుగుండా వస్తున్నారు. వారిని చూచేసరికి యీరోజు తిథిఏమిటో కనుక్కోవాలని కోరికకలిగింది. ఒకవేళ యీరోజే ఏకాదశి ఎందుకు కాకూడదు? అదే అయితే ఈ రోజు నాకు పుణ్యం తప్పకుండా వస్తుంది. సూర్యోదయ మైనప్పటినుండి ఇంతవరకు ఏమీ తినలేదు. అపుడపుడు కాసినిపంపునీళ్ళు తాగాను, అంతే పోనీ,ఇక్కడ సుఖంలేక పోయినా, స్వర్గంలో నైనా సుఖా లనుభవించా లని కోరికకలిగింది.

ఇంతలో ఆ యిద్దరు బ్రాహ్మణులు నా దగ్గరగా వచ్చారు. 'ఈరోజు తిథేమిటిశాస్త్రిగారు! అని అడిగాను. 'ఏకాదశి' అనిచెప్పి వారు గబగబా వెళ్ళిపోయినారు. ఆ మాటవినేసరికి నాకెంతో సంతోషంవేసింది. అప్రయత్నంగా అనుకోనట్లుగా ఈరోజు పుణ్యం సంపాయించానని నా ఆనం దాని కంతులేదు. ఇక ఎక్కడికీ ఆరోజు వెళ్ళదలచుకోలేదు. పరిమితికి మించిన సంతోషం వేసింది. అక్కడినుండి తిరిగి పార్కుకు వెళ్ళి నా బెంచీమీద పడుకున్నాను.

అంతేఎప్పుడు నిద్రపోయానో నాకు తెలియదు. కండ్లు తెరచి చూచేసరికి వెలుతురు బాగావచ్చింది షుమారుఅప్పుడు ఆరు గంటలు కావచ్చు. గబగబా లేచాను. క్రిందటిరోజు వచ్చిన పుణ్యఫలితం, స్వర్గంలో ఒక సంవత్సరము సర్వ సుఖాలు అనుభవించవచ్చు ననే ఆలోచన నాకు వచ్చేసరికి నామనస్సెంతో ప్రశాంతంగావున్నది. అక్కడినుండిఆపార్కు మూల నున్న పంపుదగ్గరకు వెళ్ళి శుభ్రంగా ముఖప్రక్షాళన కావించి స్నానంచేశాను. తిరిగి అక్కడినుండి రోడ్డుమీదకు వచ్చాను. నా కిపుడు బాగా ఆకలిగా వున్నది. ఏదైనా తింటే బాగుండననిపించింది. కానీ ఏం తినను? ఏంతినాలన్నా డబ్బులు కావాలి. డబ్బుల సంగతి గుర్తుకువచ్చేసరికి, మళ్ళీ నామనస్సు వుద్యోగం వున్న రోజులు నా స్మృతిపథంలోకి వచ్చినవి. ఆ నాడు నేను పొందిన సుఖానుభూతి మరచిపోలేనంత గాఢంగా నా మనస్సులో నాటుకుని వుంది.

అలాగే రోడ్డుమీద నడుస్తున్నాను. ఎటుపోతున్నానో గూడా తెలియడంలేదు. నా మనస్సంతా తిండిమీదేవున్నది. మార్కెట్టుదగ్గరకు వచ్చాను. అక్కడంతా సందడిగా వున్నది. రిక్షావాళ్ళ గంటల చప్పుడు, జట్కా బండివాళ్ళ కొరడా చప్పుళ్ళు, కూరలమ్మేవాళ్ళ కేకలు, కార్ల హారన్లు, పేపర్లమ్మే వాళ్ళ కేకలతో ఆ ప్రదేశమంతా కోలాహలంగా వున్నది.

అక్కడనుండి మరికొంతదూరం ముందుకు వెళ్ళాను. ఎడమవైపు ఓ పెద్ద మేడ కనిపించినది. ఆధునికంగా అమెరికన్ పద్ధతిలో కట్టారు - ఎవరిదో గొప్ప భోగలాలసుల గృహము వుంటుందనుకున్నాను - అయితే! ఆ భోగపురుషులెవరు! వారేం చేస్తుంటారో తెలుసుకోవాలి? గతజన్మ ఫలితమేగదా? ఉత్తరజన్మలో నైనా నేనందులో పుట్టాలి. అందుకు ముందుగా ఆ యింటిని పరిశీలించ ప్రారంభించాను - బహుమతి8రూపాయలు ప్రాణరక్షణకు రక్తదానముచేయండి (Blood Bank, (రక్తము అమ్మబడును, కొనబడును) అని ఒక పెద్ద బోర్డు ప్రహరీకట్ట వేలాడుతున్నది. ఇదేమిటి? డబ్బు బ్యాంకులు, తనఖా బ్యాంకులు, వుంటవిగాని బ్లడ్ బ్యాంకు - కూడా వున్నదా? అయితే దీనిచరిత్రేమిటో తెలుసుకోవాలి! అని లోపలికి వెళ్ళాను.

ఈ మధ్య హోటలు భోజనం దిట్టంగా తిని వున్నందున నేను బాగా కొవ్వుపట్టి వున్నను నావద్ద రక్తంగూడా బాగున్నది. ఔన్సుఎంతో తెలుసుకోవాలి? నాదగ్గర యెంత తీస్తారో, ఎంతవస్తుందో.

'ఏయి, ఏమిటి?'

చప్రాసీవాడో, కాపలావాడో అన్నాడు-

సవిస్తరంగా అన్నీ అడిగి తెలుసుకుందామని, వాడినే వివరాలడిగాను !

వాడేదో, చెప్పాడు - నాకు సంతృప్తి కాలేదు. లోపలికి వెళ్ళి వివరాలడిగాను- అక్కడున్న పెద్ద డాక్టరుగారు నాకు ఓ పెద్ద ఉపన్యాసం యిచ్చారు. ఆఖరుకు మీలాంటి యువకులు విరివిగావచ్చి రక్తదానము చేయాలి దేశభవిష్యత్తు, సంఘ శ్రేయస్సు మీలాంటివారిమీదనే ఆధారపడి వుంది. అని ముగించాడు.

నా కాయన ఉపన్యాసం ఆశ్చర్యాన్ని కలిగించినది. ఇలాంటి వుపన్యాసాలు సహజంగా రాజకీయ నాయకులే యిస్తుంటారు - యిప్పుడీ డాక్టరుగారుకూడా మాట్లాడు తున్నాడు. ఒక్క డాక్టరేమిటి! ఈ రోజుల్లో రిక్షావాలా వా డడిగినంత యివ్వకపోతే అనర్గళంగా ప్రయాణీకునితో ఓ చిన్న ఉపన్యాసం యిస్తాడు - అలావుంది యీ భారతదేశ పరిస్థితి. అందుకు విచారించి లాభంలేదు.

"అయితే యిప్పుడు నావద్ద ఎంత రక్తం తీస్తారు" అని అడిగాను.

"రెండు ఔన్సులు"

"మీరు నా కిచ్చే డబ్బెంత ?

ఆయన ఒక్కసారి నాముఖం చూచాడు. ఇంతసేపు యిచ్చిన ఉపన్యాసం అనవసరమైనదేఅని అనుకునివుంటాడు.

"మీరు కేవలం డబ్బుకోసమే అయితే మిమ్ములను పరీక్షచేయాలి.మీరక్తం ఎంతవరకు పనికివస్తుందో చూడాలి? సాయంత్రం ఒకసారి రండి, మిమ్ములను పరీక్షచేస్తాను" అన్నాడు.

నేనువస్తూ ఆలోచించాను. ఆ డాక్టరుగారు బహుశా నేను ఉచితంగా రక్తదానం చేస్తాననుకుని వుంటాడు. తీరా డబ్బుఅడిగేసరికి సాయంత్రం రమ్మన్నాడనుకున్నాను.ఏమైనా గానీ సాయంత్రంవెళ్ళి ఎంతో కొంతకు, రక్తమిచ్చిరావాలి? కాకపోతే బ్రతకడం కష్టం – ఈ పనివలన రెండు ఆశయాలు సిద్ధిస్తవి. దేశానికెంతో కొంత ఈవిధంగా సేవచేసినవాడి నవుతాను. ఆ వచ్చే ప్రతిఫలంతో కొద్దిరోజులు సుఖంగానూ గడపవచ్చు.

ఆ సాయంత్రం ఆయన చెప్పిన వేళకు కాస్తముందు గానే వెళ్ళాను – నేను ముందుగా వచ్చానని చెప్పంపినా, ఆయన చెప్పిన వేళకే నన్ను లోపలికి పిలిపించాడు. పదినిమిషాలు పైగా పరీక్షచేశాడు. ఏవేవో ప్రశ్నలు వేశాడు – అంతా అయిన తరువాత మీరక్తం అంతవిలువైనదేమీ కాదు. ప్రతిఫలం ఏదోకొద్దిగా వుంటుంది అన్నాడు.

ఆయన ఆంతకంటే ఎక్కువగ మాట్లాడుతాడని నే నాశించ లేదుగా? 'సరేనండయ్య' అన్నాను.

నన్ను పడుకోబెట్టి రెండు ఔన్సుల రక్తం తీశాడు. నిజానికి వ్యాధి పీడితుడ్ని, అనారోగ్యవంతుడ్ని కాదు. మంచి నవయువ్వనంలో వున్నాను. అయినప్పటికీ అంత పెద్ద డాక్టరు గారు నాగురించి ఆవిధంగా శెలవిచ్చిన తరువాత నేనేమి మాట్లాడను—వైద్యవిషయంలో ఆయనతో నే నేమి చెప్పను? కిమ్మనకుండా ఆయనందచేసిన బహుమతి 8 రూపాయలు తీసుకుని బైటికివచ్చాను. ఆకలేగాక యిప్పుడు నాకెంతో నీరసంగా కూడా వున్నది. నిజం చెప్తున్నాను. అప్పటినుంచీ నా శరీరంలోని శక్తి తగ్గిపోయింది. ఆ నీరసంనుండి నేను తిరిగి కోలుకోలేకపోయాను.

ఆ తర్వాత చాలాసార్లు ఆకలికితట్టుకోలేక, బహుమతి కోసరం వెళ్ళాలనుకుండేవాడిని. కానీ ఆ తర్వాత దానిఫలి తం వూహించినతరువాత — చావుకైనా అంగీకరిస్తానుగాని, యీపని యికచేయకూడదని నిశ్చయానికి వచ్చాను—

అక్కడ ఒక నాలుగు కాఫీహోటళ్ళు కూడా వున్నవి. మా హోటలుమిత్రుడు ఇక్కడేదో హోటల్లో పనిచేస్తున్నా నని చెప్పాడు. అయితే అతను పనిచేసే హోటలు నాకు తెలి యదు. అతనున్నది ఏ హోటలో తెలుసుకుంటే పోతుంది. ఈ పూటకాస్త యిడ్లీ, కాఫీ అయినా దొరుకుతుంది. ఇలా అను కుంటూ ఒకహోటలుకు వెళ్ళి అతనిని గురించి అడుగుతున్నాను.

ఇంతలో మామిడిపూడి అక్కడికి రెండు పొట్లాలు తీసుకొని వచ్చారు అనుకోనట్లుగా అతను కనుపించేసరికి నాకెంతో సంతోషం వేసింది. అతను నన్ను చూడగానే నన్ను తీసుకొని లోపలకు వెళ్ళాడు.

సుష్టుగా తిని బయటపడ్డాను. నా కడుపు భోంచేసినట్లుగానే వున్నది. అంత ఎక్కువగా తిన్నాను మళ్ళీ ఒకరోజు వరకు ఏం లేకపోయినా యిబ్బంది లేదనుకున్నాను. ఇలా అనుకుంటూ రోడ్డుమీద వస్తున్నాను ఇంతలో అక్కడ మాధవరావు కనిపించాడు. ఆయనకు ఒక చిన్న కంపెని వున్నది. కిందటిసంవత్సరమే ఆయన నా కంపెనీని స్థాపించాడు. ఆయన మాట్లాడినంత సేపు ఎంతో మర్యాదగా మాట్లాడాడు. నేనే ఆయనను ఎక్కడైనా వుద్యోగం చూసిపెట్టమని అడుగుదామనుకున్నాను. కానీ, ఆయనే నన్నిలా అడిగాడు.

'ఏమండీ మీరా వుద్యోగం మానేశారటగా'

'అవును'

'కారణం?'

'ఏమీ లేదు'

'మరెక్కడైనా ఉద్యోగం చూసుకున్నారా'

'లేదు'

'మరి ఎందుకు మానేశారు'

నేనేమీ సమాధానం చెప్పలేదు. తిరిగాయన నన్నిలా అడిగాడు.

మా కంపెనీలో చేర్తారా? నేనే ఎవరైనా వుద్యోగం చేయడానికి వస్తారేమో నని చూస్తున్నాను.

నేను వేరేవిమీ మాట్లాడలేదు. 'సరే' అన్నాను. "నే నిప్పుడు కొద్దిగా పనుండి పోతున్నాను. వెంటనే తిరిగి వస్తాను. మీరు మా కంపెనీకి వెళ్ళండి" అని చెప్పి ఆయన గబగబా వెళ్ళిపోయాడు.

అక్కడినుండి నేనాయన కంపెనీవైపు నడుస్తున్నాను. త్రోవలో ఆయననుగురించి నాకుఅనేక ఆలోచనలువచ్చినవి. అంతవరకు నా కాయనతో అట్టే పరిచయంలేదు కానీ ఆయ నను గురించి నేను చాలా విన్నాను. జీతం సరిగ్గా యివ్వడని అతికోపిష్టని విన్నాను. నిజంగా అదే నిజమయితే చాలా కష్టమే జీతం రాకపోతే గుమాస్తా ఎలా పనిచేయగలడు? ఒక గుమస్తాఏమిటి? ఎవరైనాఅంతే. అసలు పనిచేసేవాడి బ్రతుకే అంత. అందులో ఈ ప్రైవేటువుద్యోగాలుమరీ అధ్వాన్నంగా వుంటవి. యజమాని అడుగులకు మడుగులొత్తినంత కాలం ఏ లోటురాదు. ఏవిషయంలోనైనా యజమాని అభిప్రాయాలను వ్యతిరేకిస్తే పేచీ వచ్చితీరుతుంది.

అసలు వ్యాపారాలన్నీ ప్రభుత్వం ఎందుకు జాతీయం చేయకూడదు? ప్రభుత్వం వ్యాపారాలన్నిటినీ జాతీయం చేస్తే పనివారికడగండ్లు ఈ నాడిలా వుండవుగా! దీనికంతటికీ కారణం ప్రభుత్వమే.

అందుకే ఈనాడు దేశంలో యిన్ని పార్టీలు, యిన్ని అభిప్రాయాలు, యిందరు నాయకులు తయారయ్యారు. ఏపార్టీ అయినాసరే దేశంలో సంపూర్తి సోషలిజాన్ని తీసుక వచ్చే వరకు బీదవాడి బ్రతుకింతే. వారికి సుఖం వుండదు. వారికి కోరికలు వుండగూడదు. వారు మనుష్యులులా బ్రతకడానికి వీలు లేదు. అసలు వారిని చూచి జాలిగూడా పొందే వారు వుండరు.

అలావారు ప్రపంచంలో తమకోరికలను చంపుకొని బానిసలుగా బ్రతకాలి. ఆ విధంగా వారి జీవితం బానిసగానే వెళ్ళిపోవాలి. అంతేగాని, వారిలో మార్పు రాకూడదు. వస్తే ధనవంతులు తమ హోదాలను తగ్గించుకోవాలి. అందుకు వారు యిష్టపడరు. కష్టానికి, తెలివికి విలువ వుండగూడదు. పూర్వకాలం రాజులలాగా రాజు సంతతికే, రాజ్యాధికార హక్కులెలా వుండేవో అలాగే వారిసంపద వారి కుమారులకు, మనమలకు వారి మనుమలకు, యింకాయింకా యిలాగేవుండాలి. అంతేగాని, నిజమైన కష్టజీవికి, తెలివిగలవాడికి ఆ సంపద రాకూడదు. వారుసుఖాలనుభవించరాదు వారికిసంపదవుండకూడదు. వారి అభిప్రాయాలు అలాంటివి. ఇదీ ప్రపంచంలో ఈ నాడు జరుగుతున్నది.

అందుకే ప్రతిదేశంలోనూ ఈనాడుఅనేకపార్టీలున్నవి అనేకమంది సోషలిజం కావాలంటున్నారు. అయితేసోషలిజం రాగానేసరికాదు. నిజమైన, అసలైన, సిసలైన, సోషలిజం

రావాలి. మానవులంతా ఒక్కటే. ధనవంతుడు, దరిద్రుడు అనే తేడా లుండకూడదు. తెలివికి కష్టానికి నిజమైన ప్రతిఫలం వుండాలి. అదే సోషలిజం అప్పుడే ఏ దేశమైనాసరే అత్యంత అభివృద్ధిలోకి వస్తుంది. ఇది నగ్నసత్యం ఇదే మానవుని నిజమైన జీవితాశయము.

అంతేగాని, మనిషిని మనిషి గౌరవించనంతకాలం ఏ దేశమయినాసరే, పురోభివృద్ధిలోకి వచ్చిందంటే అది నిజమైన పురోభివృద్ధి కాదు. అది నాగరికత దేశం అనిపించుకోదు.

ఇలా ఆలోచించుకుంటూ నేను ఆ కంపెనీకి వెళ్ళాను. ఆ కంపెనీ పేరు రావు అండ్ కో. అదీ పెన్నులకంపెనే. అయితే ఈ కంపెనీ తక్కువరకం పెన్నులు తయారు చేస్తుంది. డజను ఆరు రూపాయలు. అన్నీ ఒక్కటేరకం, ఒక్కటే బ్రాండ్ ఇదీ ఆ కంపెనీ పరిస్థితి.

నేనక్కడ ఒకకుర్చీలో చతికలపడ్డాను. అక్కడ నేను తప్ప మరెవ్వరూ లేరు. ఒక డ్రాయరు, మూడు కుర్చీ లున్నవి. కంపెనీలాగే అక్కడ పనిచేసేవారుగూడా చాలా తక్కువ వుందే వున్నారు. ఇద్దరు ముగ్గురుకంటే ఎక్కువమంది లేరు. అక్కడిపరిస్థితి చూస్తూ ఆలోచిస్తూ కూర్చున్నాను.

ఇంతలో మాధవరావు వచ్చాడక్కడికి. వస్తూనే 'కొద్దిగా ఆలస్యమైనదండీ, అన్నాడు. ఫరవా లేదన్నట్లుగా నేను చిన్నచిరునవ్వు నవ్వాను. ఆయన డ్రాయరుముందున్న

కుర్చీలో కూర్చున్నాడు కాళ్ళు డ్రాయరుకు తన్నిపట్టి కుర్చీ కానుకుని కూర్చున్నాడు. వయస్సు బాదాపు ముప్పయి వుండ వచ్చు. మనిషి కాస్త నల్లగా పొడుగ్గా వుంటాడు. కంటికి ఎప్పుడూ నల్లకండ్లజోడు పెడ్తాడు.

ఆయన నన్నేమి ప్రశ్నిస్తాడో నని నేనాయనవైపే చూస్తూ కూర్చున్నాను. ఆయన కండ్లజోడు తీసి ముందున్న డ్రాయరుమీదపెట్టి డ్రాయరుమీద చేతులుపెట్టి ముందుకు వంగి కూర్చున్నాడు. నేను కాస్త సర్దుకుని కూర్చున్నాను.

"మీ కక్కడ జీత మెంతండి" ప్రశ్నించాడాయన.

"జీత మేమీ లేదండి కావలసినప్పుడు కావలసినంత తీసు కునేవాడిని, అంతే!" అన్నాను.

"అదే — నెల కెంత తీసుకొనేవారు"

"లెక్కేమీ లేదు"

"పోనీ యిప్పుడు చెప్పండి, మీ కెంతజీతం కావాలి"

"నా కేమీ తెలియదండి, నాపని చూచి మీరు నిర్ణ యించి చెప్పండి"

"సరే అలాగే," అని చిన్నగానవ్వి "మీకిక్కడ పనే మిటో తెలునుగా, నే నెప్పుడూ ఇక్కడఉండను ఈకంపెనీ మేనేజిమెంటుగూడా మీదే అప్పుడప్పుడు టూరింగులకు వెళ్ళి వస్తుండండి" అన్నాడు.

నేను సమాధానం చెప్పలేదు. ఆయన చెప్పిన వాటి కన్నిటికి సరేనని తలవూపాను. ఇక తిరిగాయ నేమీ మాట్లాడలేదు. నేనే ముందు కొంతడబ్బు అడిగి తీసుకొని హోటల్లో భోజన టిక్కెట్లు కొందా మనుకున్నాను. మరి వుద్యోగం చేసేటప్పుడు భోజనం లేకుండా ఎలా? అంతేకాదు ఈసారి ఎక్కడైనా ఒక చిన్నగది అద్దెకు తీసుకుందా మను కుంటున్నాను ఆ గదికి ఎడ్వాన్సు ముందు కొంత యివ్వాలి. ముందు ఒక నెలఅద్దె ఇచ్చి అద్దెకుంటే ఎంతో గౌరవమిస్తాడు ఇంటి యజమాని. ఎడ్వాన్సు అడగగనే లేదన్నా. ఇవ్వమన్నా చేకేనారిని దరిద్రులుగా, పోరంబోకులుగా, రౌడీగా చిత్రించు కుంటాడు యజమాని. వీటి కన్నిటికి ముందు చాలా డబ్బు కావాలి.

ఇంతలో ఆయనే ఇలా అడిగాడు – "ఏమండీ ఏమిటి ఆలోచిస్తున్నారు"

'ఆ' ఏమీలేదు. ముందు కొంత డబ్బు కావాలండి హోటల్లో ఇచ్చి భోజనటిక్కెట్లు తీసుకోవాలి' అన్నాను.

"ఎంత కావాలి"

"ఇరవై రూపాయ లివ్వండి"

"సరే సాయంత్రం ఒకసారి రండి. ఇంతకూ మీరు కంపెనీలో ఎప్పుడు ప్రవేశించుతారు" ప్రశ్నించా డాయన.

"మంచిరోజు చూచి మీరే చెప్పండి"

ఆయన తెలుగు క్యాలండరు చూచి "ఎల్లుండినుండి రండి, బాగావున్నది" అని చెప్పాడు. నేనూ ఆయనవద్ద శెలవు తీసుకుని బయటపడ్డాను.

ఆ సాయంత్రం ఐదున్నర గంటలకు నేను రావు అండ్ కో కు వెళ్ళాను. అప్పుడే ఆయన ఎక్కడికో వెళ్ళాడనిపనిచేసే కుర్రాడొకడు చెప్పాడు. ఉసూరుమంటూ నేనక్కడ కుర్చీలో చతికిలపడ్డాను.

ఒకగంట కాలం గడచింది. చీకటి పడుతున్నది. కానీ మాధవరావుమాత్రం రాలేదు.ఒంటరిగా నే నెక్కువసేపక్కడ కూర్చోలేకపోయాను. పైగా వేసవికాలం, గాలిలేదు. గాలి రావడానికి కిటికీలుగూడా లేవు. చెమట కారిపోతున్నది. శరీరాన వున్నబట్టలు పూర్తిగాతడిసినవి. అక్కడినుండి రోడ్డు మీదకు వచ్చాను. చల్లటిగాలి నా శరీరానికి తగిలింది. శరీరం ఒక్కసారి ఆనందంతో పులకరించింది. ఆ పులకరింపుకు నాకు చిన్నతనంలో మా తాతయ్య అన్న మాట ఒకటి గుర్తుకు వచ్చింది. ఆయన బాగాశ్రమించి వున్నప్పుడు చల్లనిమారుతం వీచినప్పుడు దానిని దొరలగాలని పిలిచేవాడు. ఆయన గాలి కంతటి ప్రాధాన్యతయిచ్చాడు. అవును. నిజంగా అది దొరల గాలే కాకపోతే నాకు అంత మంచిగాలి అనుభవించే అదృష్టం గూడానా? ఇలా అనుకుంటూ అక్కడే కాసేపు అటూ ఇటూ పచార్లుచేశాను. కంపెనీ మూసి పనివాండ్లంతా వెళ్ళి

పోయారు. ఇంక ఆరోజుకు మాధవరావు రాడని వారు చెప్పి మరీ వెళ్ళిపోయారు. ఆ మాట విన్నతర్వాత నా గుండె దడ దడ కొట్టుకొనడం ప్రారంభించింది. ఆ డబ్బు తీసుకొని ఈ పూటనైనా కడుపునిండా భోంచేద్దా మనుకున్నాను. కానీ నాకా అదృష్టంలేదు. వరుసగా రెండురోజులు పస్తుఉండ మని దేవుడు నాముఖాన రాస్తే నాకు తిం డెలా దొరుకుతుంది. అక్కడినుండి తిరిగి పార్కుకు బయలుదేరాను.

అప్పటికి బాగా చీకటి పడ్డది. నేను పార్కులో నా బెంచీమీద కూర్చున్నాను. రేడియోలో వార్తలై పోయినవి. ఏదో సంగీతం వినిపిస్తున్నది. పార్కులో జనం అట్టే లేరు. ఉన్న కొద్దిమంది అక్కడక్కడా కూర్చుని వుండటంవలన పార్కు నిర్మానుష్యంగానే కనిపిస్తున్నది. రేడియో సంగీతంగోల తప్ప మరేశబ్దము లేదక్కడ నా ఆలోచనలు నిరాటంకంగా సాగి పోతున్నవి.

నాపరిస్థితి నాకే ఎంతో హీనంగావున్నది. ఏంచేయను, మయూ కంపెనీలో చేరకముందు ఒకజత బట్టలుండేవి. ఇపుడు రెండు జతల బట్టలైనవి. అంతేతేడా. అప్పటికీ యిప్పటికీ నాలో ఏ మార్పు రాలేదు. కాకపోతే మధ్యలో కొన్ని రోజులు తిండి కే యిబ్బంది లేకుండా గడిపాను. అదే తేడా. ఇలా నా గడచిన జీవితం నాకు గుర్తుకు వచ్చేసరికి దుఃఖం ఆగలేదు. కానీ ఏంచేయను. నేను అసమర్థుణ్ణి, భయ

సుణ్ణి, పిరికివాడిని అని నామీద నాకే కోపంవచ్చింది. ఎక్క-
డికి పోదామనినా భయమే, ఏం చేయాలనినా అనుమానమే,
ఏం చేసినా ఆలోచనలే. నాబ్రతుకు ఈ విధంగా తయా
రైనది.

ఇలా ఆలోచించుకుంటూ ఒత్తిగిలి పడుకోబోయాను.
అప్రయత్నంగా నాచూపు పార్కు ప్రక్క నున్న మేడమీద
పడినది. అదిఅతిపురాతనకాలం నాటిది కాదు. మరీఆధునిక
నాగరికత పెరిగినతర్వాత కట్టినదికాదు. సుమారు ముప్పయి
సంవత్సరాల క్రితం కట్టిందిలా వున్నది.ముప్పయి సంవత్సరా
లేనని నిర్ధారణ ఏమిటి?

యాభై సంవత్సరాలు కావచ్చు. అసలు సంవత్సరాల
నిర్ధారణ ఏమిటి? ఏదో లెక్క వేయాలి కాబట్టి అసలా మేడ
ఎన్ని సంవత్సరాలక్రితం కట్టిందో ఎవరుచెప్పగలరు? ఎందుకు
చెప్పలేరు. ఆ మేడవారినడిగితే సరిపోతుంది!

ఇలా నిర్ణయానికి వచ్చాను. లేవబోయాను.
కానీ లేవదలచుకోలేదు. అసలు ఆ మేడతో నాకేంపని, నా
కెందుకా మేడ ఎప్పుడు కడితేఏమిటి? అవును, అంతే, ఇలా
చివరకు నిర్ణయించుకుని నా బెంచీమీద కాళ్ళుచాపి పడుకు
న్నాను.

ఆ మేడ అక్కడున్నదని నాకు తెలుసు. ప్రతిరోజూ ఈ
పార్కుకు వచ్చేముందు నే నా మేడముందుగనే నడచివస్తాను.

నేనేకాదు-నాలాగే చాలామంది ఆ రోడ్డునవచ్చేవారు ఆమేడ ముందుగా వస్తారు. కానీ నే నెపుడూ ఆ మేడను సరిగా చూడ లేదు. దానినిగురించి ఆలోచించనూలేదు.

అసలు చూడటానికిదేం తాజమహల్‌లాంటి అపురూపమైన కట్టడమా? లేక నైజాంనవాబు మునిమనుమరాలి పడకగదులా? లేక దిల్‌కుష్ భవనమా? అవేవికావు. అతి సామాన్యమైన ఒకచిన్న రెండంతస్థుల మూడు దశాబ్దాలనాటి మేడ, అసలు ఆ మేడనుగురించి నాకిపుడీ ఆలోచన ఎందుకొచ్చింది! ఆ, ఒకమ్మాయి ఆ మేడలోని కిటికీలోగుండా హఠాత్తుగా కనిపించిపోయింది. గుర్తొచ్చింది, అందుకు ఆమేడ ఎవరిదై వుంటుందనే ఆలోచన నాకుకలిగింది. అందులోఎవరో ఆఫీసరు వుంటున్నాడు. మళ్ళీ నామనస్సు ఆమేడమీదనుండి నాబ్రతుకు మీదకు మళ్ళింది. అలాగే ఆ మేడనే చూస్తున్నాను. వారెంత అదృష్టవంతులు? జీవితంమీద వారికెంతో అభిమానం గౌరవం ఆశవున్నది. జీవించడం వారికిఅవసరం, జీవితం అంటే వారెంతో విలువగా చూస్తారు. సుఖాన్ని ఆహ్వానిస్తారు, అనుభవిస్తారు, కష్టాన్ని పారదోలుతారు. అందుకు ఎంతటి పాపకార్యాలైనా చేయుటకు సిద్ధపడతారు. కానీ నేనో, నాకు సుఖంలేదు. కష్టాలతో నిండిపోయిన జీవితమే నాబ్రతుకు. అదే నాకు ముక్తి.

ఇంతలో నాకిన్ని ఆలోచనలు కలుగజేసిన ఆ యువతి మళ్ళీ కనిపించింది. బహుశా ఆమె ఆ ఆఫీసరు భార్య అయి

వుండవచ్చు. కెంపురంగు సిల్కుచీర కట్టుకున్నది. తలలో మల్లె పూలు పెట్టుకున్నది, మనిషి చామనఛాయ. అయినప్పటికీ ఆమె నా కెంతో అందంగా కనిపించింది. ఈసారి ఆమె అక్కడ పిట్టగోడమీద కూర్చుని రోడ్డుమీద నడిచే జనాన్ని చూస్తున్నది. ఇంతలో ఒకచిన్న కుర్రాడు వచ్చి ఆమె ఒడిలో చేతులువేసి రోడ్డువైపు చూస్తూ నిల్చున్నాడు.

తదేకంగా నేనా మేడవైపు ఆ యువతిని చూస్తుంటే నాలో నాకు తెలియకుండానే వారిమీద ద్వేషంఎక్కువైనది. ఏంచేయను. ఇక అంతకన్నా చేయుటకేమైనా పని ఉంటేగా. నాలాగే వారు జన్మించారు. నాలాగే తిరుగుతున్నారు. ఏవిష యంలోను నాకు, వారికి భేదమనేదిలేదు. మరి అలాంటపుడు వారు నాకంటే ఏ విషయంలో ఎక్కువని ఆ మేడలో వుంటున్నారు? కాకపోతే వారు సుఖంగా తింటారు. తిన్నది జీర్ణించుకుంటారు. నాకు తినడానికి తిండిలేదు. ఉండి తిన్నా దాన్ని జీర్ణించుకోలేను, అంతేతేడా. ఈ చిన్నభేదానికిమనిషికి మనిషికి యింతభేదం వుండాలా? అసలు నేనలా చూడటం మానేస్తే కనీసం ఆ ఆలోచనలైనా పోతవేమోనని నే నా వైపునుండి దృష్టి మరల్చాను. కానీ అప్పటికీ నా ఆలోచనలు మాత్రం పోలేదు. ఏవేవో ఆలోచిస్తూనే వున్నాను. ఈ సారి నా కొక కొత్తఆలోచన వచ్చింది. ఒకప్పుడు వారు నాలాగే బ్రతికి వుంటారా? ఏమో ఎందుకు కాకూడదు. నేను మరూ

కంపెనీలో ఏజంటుగా వున్నప్పుడు నన్ను గురించి ఎందరేమను కున్నారో? నేను వారినిగురించి ఆలోచించడం మానేశాను. అయినా నా కోపం వారిమీద కాదు. వారి నలా, నన్నిలా సృష్టించిన సమాజంమీదే నా ద్వేషం. అందుకేవాళ్ళనిగురించి ఆలోచించడం మానేశాను. నా భావిజీవితాన్ని గురించి ఆలోచించడం ప్రారంభించాను.

ఆ రాత్రి చాలా పొద్దుపోయేవరకు ఆలోచిస్తూ పడుకున్నాను. ఏదేదో ఆలోచిస్తుంటాను, ఎవరినిగురించో ఆలోచిస్తుంటాను. కానీ వాటివల్ల ఏ వుపయోగం వుండదు. అలా ఆలోచించడం నాకే అసహ్యమనిపించింది. అందుకని నిద్రపోదామని గట్టిప్రయత్నం చేశాను. కానీ నిద్రరానిదే నే నేం చేయను. నా చేతనైనంతవరకు వీలైనంత గట్టిగా కండ్లు మూసుకుని పడుకున్నాను. కానీ ఉపయోగం లేకపోయింది. అనవసరపు ఆలోచనలతో నా తల వేడెక్కింది. అసలే రెండు రోజులనుండి భోజనంలేకపోవడంవలన ఆకలి దహించి వేస్తున్నది. కాసిని నీళ్ళైనా తాగితే బాగుం డనిపించింది. కానీ అప్పుడు నీళ్ళుండవని పంపుదగ్గరకు వెళ్ళి చూచినతర్వాతగాని గుర్తురాలేదు. తిరిగి వచ్చి పడుకున్నాను.

అప్పటికీ నిద్రపట్టలేదు. ఇంక అక్కడ పడుకోని అనవసరపు ఆలోచనలు ఆలోచించడం నా కిష్టం లేకపోయింది. అప్పటి కెంతరాత్రి అయినదో నాకు తెలియదు. కానీచాలా

రాత్రి అయివుంటుం దనిమాత్రం ఖచ్చితంగా చెప్పగలను. ముందు కాసిని మంచినీళ్ళు తాగాలి. ఆ తర్వాత ఏంచేయా లనేది నిర్ణయించుకోవాలి. అందుకు బయలుదేరాను. పార్కు దాటి రోడ్డుకు వచ్చాను. కాకాహోటలులో రెండు గ్లాసుల మంచినీళ్ళు తాగాను. అప్పటికిగాని నాకు కొంచెంమనశ్శాంతి చిక్క లేదు. అప్పటివరకు నాకు వచ్చే ఆలోచనలన్నీ పోయాయి. ఆకలికూడా కొంచెంతగ్గింది మళ్ళీ పార్కువైపు వస్తున్నాను.

ఇంతలో హఠాత్తుగా మాహోటల్ మిత్రుడు కలిశాడు. అతనిని చూచి నా కాశ్చర్యం వేయలేదు. కారణం అతనికి రాత్రిపూట అలా తిరగటం అలవాటే. అందుకే నేను అతనిని ఏమీ అడగలేదు. అతనే రెండవఆట సినిమాకు వెళ్ళి వస్తున్నా నని చెప్పాడు. అక్కడనుండి అతను నన్ను "కాకా" హోట లుకు తీసుకువెళ్ళాడు చపాతీ, టీ ఇప్పించాడు. బాగా ఆకలిగా వుండటంవలన ఆ సమయంలో అంతకన్నా ఎక్కువ తినలేక పోయాను. అక్కడినుండి అతను ఆతనిగదికి వెళ్ళిపోయాడు.

నేను నా పార్కు బెంచీమీదకు వచ్చి పడుకున్నాను. వేసవికాలం ఎండవేడికి గబాలునలేచి కూర్చున్నాను. అప్పుడు ఉదయం తొమ్మిదిగంటలు కావచ్చు. రాత్రి చాలా పొద్దు పోయేవరకు గడపడంవలన బాగా నిద్రిపోయాననుకున్నాను. అక్కడినుండి లేచి పంపుదగ్గరకు వెళ్ళి శుభ్రంగా ముఖం కడు

క్కనిరోడ్డుమీదకువచ్చాను. మరి రావుఅండ్ కోకు వెళ్ళాలిగా. అప్పటికి పదిగంటలైంది. రోడ్డంతా జనంతో బండ్లతో రిక్షాలతో కార్లతో కిక్కిరిసివున్నది. ప్రభుత్వకార్యాలయాలన్నీ తెరిచే వేళయ్యె. పట్టణంలో నివసించే మూడువంతులజనాభా రోడ్లమీదనే వున్నారు. సరాసరి నేను రావు అండ్ కోకు వెళ్ళాను అప్పుడే మాధవరావు వచ్చి కూర్చున్నాడు. నన్ను చూడటంతోనే "నిన్నసాయంత్రం కొద్దిగా పనుండి బయటకు వెళ్ళాను. మీరు మళ్ళీ రాత్రికి వస్తారనుకున్నాను. రాలేదేమండి" అన్నాడాయన.

నే నేమీ సమాధానం చెప్పకుండా వుందామనుకున్నాను కానీ అప్రియత్నంగా, ఇలా చెప్పాను.

"అంత తొందరేమున్నదండి, ఇవ్వాళ ఉదయంవచ్చి తీసుకుందామనుకున్నాను"

"అవు నవును" అంటూ ఆయన జేబులోనుండి రెండు పదిరూపాయల కాగితాలుతీసి నాచేతికిస్తూ 'రేపువచ్చి చేర్తారు కదూ' అన్నాడు.

"నాకు వేరే పనేమీ లేదుగా, తప్పకవస్తాను" అని నేను బయటకు వచ్చాను. అక్కడినుండి గబగబా, నా మామూలుహోటలుకు వెళ్ళాను. పదిహేనురూపాయ లిచ్చి ముప్ఫయి టిక్కెట్లు కొన్నాను. నే నెప్పుడూ ఆ హోటలుకు బాకీ పెట్టలేదు. అంచేత నేనంటే ఆ హోటలులో యజమాని

నుండి పని వారివరకు అందరూ ఎంతో గౌరవంగా చూస్తారు. నేను డబ్బివ్వగనే, హోటలు అయ్యర్ గారు నావైపుచూస్తూ, 'ఏమండీ మీరు భోజనానికి రావడం లేదేం' అన్నాడు.

'టిక్కెట్లు అయిపోయాయిగా అందుకురాలేదు,

'మరి భోంచేయడం ఎందుకు మానేశారు'

'మిమ్ములను అప్పు అడగదలచుకోలేదు'

'అయ్యో, ఇందులో అప్పేమున్నదండీ' ఆయన ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

నేను సమాధానంగా ఒక చిరునవ్వు నవ్వి భోజనాల గదిలోకి వెళ్ళాను.

నేను రావుఅండ్ కోలో చేరి అప్పటికి వారందోలైంది. నాకా ఉద్యోగం కొత్త కాకపోవడం వలన, అందులో పని యాను అన్నీ తెలిసుండటంవలన, నాకేమీ కష్టంగా లేదు. మామూలుగనే చేయవలసిన పనేమిటో నాకు తెలుసు కాబట్టి అన్నీ నేను చేసుకుపోతున్నాను. ఈలోపు ఒకసారి మాకంపెనీ పెన్నులు తీసుకొని టూరింగు వెళ్ళాను. అంతవరకూ, అక్కడి ఏజంట్సుతో నాకు బాగా పూర్వ పరిచయం వుండటంవలనమా పెన్నులు చౌకబారువైనప్పటికి నేను సులభంగానే ఆర్డర్లు బుక్ చేయగలిగాను. టూరింగునుండి రాగానే నాఆర్డర్లుచూచి మాధవరావు ఎంతో సంతోషిం

చాడు. ఇలాకొన్నిరోజులుకష్టపడితే పెట్టుబడిలేకుండా నేభాగ మిస్తానని చెప్పాడు.ఆయనమాటలు నా కెంతో ఆశ్చర్యాన్ని కలిగించినవి. నేనాయనమాటలునమ్మదలచుకోలేదు కారణం యజమానులంతా ఒకటే నని నా అభిప్రాయం. వారి అవ సరాలకు వారేదో మాట్లాడుతారు. వారికి నాలుగుడబ్బులు కనిపించేసరికి ఎదుటివారుకనిపించరు. ఇదిఅందరికీరహస్యాకాకపో వచ్చు. పనిచేసేవాడిమీద మొదటవున్న ప్రేమ, అభిమానం చివరిదాకావుండవు. ఇది సత్యం. నాజీవితానుభవంలో నేర్చు కున్న అత్యంత విలువైన సత్యం.

మాధవరావు మాటలు సంతోషించనూ లేదు. ఆశ్చ ర్యపడనూ లేదు. చచ్చిపోయేరోగిని ఆరోగి చచ్చిపోయేవరకు డాక్టరు అతనిలా బ్రతుకుతాడని చెపుతాడో, కేసుఓడిపోయే వరకు వకీలు తనపార్టీవారితో మన కేసే గెలుస్తుందని ఎలా చెపుతాడో అలాగే యజమానులుగూడా, పనివారి కలాంటి ఆశలు చూపకపోతే, ఆ కంపెనీలు అంతతొందరగా అభివృద్ధి చెందవు. పైపెచ్చుమధ్యలో దివాలాతీయడానికిగూడా వీలుం టుంది.అందుకు పనివారియందు యజమాను లెప్పుడూ సామ, దాన, భేద, దండోపాయలు వుపయోగించాలి. లేకపోతే వారు తమ మూటముల్లె కట్టుకుని మరెక్కడికైనా బయలు దేరాలి. అదే వ్యాపారం రహస్యం. అందులో నాలాంటివాడి విషయం ఇక చెప్పనక్కరలేదు. కంపెనీ భవిష్యత్తంతా లోనేవున్నది.అందుకే ఆయననాతో ఆ విధంగా మాట్లాడి

వుంటాడు. అయితే నేను మాధవరావుగారి మాటలను నమ్మ
దలుచుకోలేదు. నా పనేమిటో నేనుచూచుకునేవాడిని అంతే!
అలాగే వుండాలని నా అభిప్రాయం.

ఒక మాసంరోజులు జరిగినవి. మాధవరావు కంపెనీ
విషయాలు, బాధ్యతలు నాకు అప్పగించాడు. ఆయనిప్పుడసలు
కంపెనీకే రావడంలేదు. దేశంలో మా పెన్నులకు బాగా
గిరాకి పెరిగింది. అందుకు అదనంగా పెన్నులు ఎక్కువగా
తయారుచేయవలసివచ్చింది పనివారిని కొంతమందినిఅదనంగా
నియమించవలసివచ్చినది. నేనే స్వయంగా కొంతమంది అను
భవంకలిగినవారిని నియమించాను. మా కంపెనీ అమ్మకాలు
దినదినం అభివృద్ధి చెందుతున్నవి. లాభాలుగూడా అధికంగా
రావటంవలన మా యజమాని ఆలోచనలుగూడా చాలా
ముందుకుపోయినవి.

కానీ ఆయన పరిస్థితి నాకేలాంటి ఆశ్చర్యాన్నీ కలుగ
చేయలేదు పైపెచ్చు నేనేఆయనకు కొన్నిసూచనలిచ్చాను.
ఆయనకు నాయందు బాగానమ్మిక యేర్పడినది. ఆయనిప్పుడు
పూర్తిగా నామాట ప్రకారం నడుచుకుంటున్నాడు. ఏం చేయ
వలసివచ్చినా నన్నడగంది ఏపనీ చేయడు. ఆయనకు నామీద
బాగా నమ్మకం కుదిరింది. ఈ సమయంలో నేను నాజీతాన్ని
అడగటానికి వెనుకాడాను. భోజనఖర్చు, గదిఅద్దె తప్ప పైన
ఒక్క కానీగూడా అడగడంలేదు ఆవిధంగా నేను కంపెనీ

పనులలోఇరవైనాలుగుగంటలు నిమగ్నుడనై వుండేవాడిని.
ఇప్పుడు నాగదికూడా మాకంపెనీకి ఎక్కువదూరంలో లేదు.

కానీ నాలోమార్పేమీరాలేదు.స్నానంచేసినతర్వాత
తుడుచుకోను ఒక్కతుండుగూడా లేదు. పక్కకసలు బట్టలే
లేవు. చలికాలం, ఎండాకాలం అన్నికాలాలు నేనలాగే
గడుపుతున్నాను.తిండి,పడకవిషయంలో మినహా మిగతావిష
యాలలో నా కెలాంటిమార్పు రాలేదు. ఇంకా కష్టం ఎక్కు
వైంది. అందుకు నాకు బాధలేదు. నాకష్టానికితగిన ప్రతిఫలం
వుంటే చాలు నేనుజీవితంలోఅంతకంటే ఎక్కువకోరుకొనేది
లేదు సామాన్యంగా అలా జరగదు కష్టపడేవాడెప్పుడూ దరి
ద్రంగానే వుంటుంటాడు. నా జీవితంలో నే నెప్పుడూ అంత
కంటే ఎక్కువ ఆశించను. నేను అన్యాయాన్ని అధర్మాన్ని
సహించను. నీతినియమాలకు కట్టుబడివుంటాను.బహుశాఅదే
నా బలహీనతకావచ్చు. నిజంగా అదేఅయితే అందుకు విచా
రించవలసిన పనిలేదు. ఇలా నేను నాజీవితాన్ని గడుపుకొంటు
న్నాను. నే నా కంపెనీలో చేరి అప్పటికి రెండుమాసాలు
దాటినది. నే నా కంపెనీలో చేరిన ఈ రెండుమాసాలలో
రెండువేల రూపాయలు లాభం చూపించాను. అయితేనేం
నా జీవితం అంతే. జీవితానికి నిలకడంటూలేదు. ఇలా
వున్నప్పటికీ నే నప్పుడప్పుడు ఆ పార్కుకు వెళ్ళేవాడిని. నా
మామూలు బెంచీమీద కూర్చుని నా విషయాన్నిగురించి

ఆలోచించుకుంటుండే వాడిని. అలా ఎప్పుడో తిరిగి గదికో కంపెనీకో వెళ్ళేవాడిని.

ఇలా ఒకసారి బెంచీమీద కూర్చుని ఆలోచించుచుండగా నాకు మాయింటి విషయం గుర్తుకువచ్చింది. అక్కడస్థితి తలుచుకొని ఆరోజు ఎంతగానో బాధపడ్డాను. అక్కడవారు బ్రతుకులు ఎంతహీనంగా గడుపుతున్నారోనని నాకు మా వాండ్లమీద జాలికలిగింది. కానీ నే నేంచేయను? వారినిగురించి నేను ఎక్కువసేపు ఆలోచించలేక పోయాను. దుఃఖం వచ్చింది. పెద్దగా ఏడ్చాను. కానీ నా ఏడుపు ఎవరికి వినబడుతుంది. ఎవరికి కావాలి? నేనెలాపోతే నేం. ఇంటి కేదైనా కొంచెం డబ్బు పంపితే బాగుండునిపించింది. నా ఆలోచనకు నాకే ఆశ్చర్యం వేసింది. ఇంత మంచి విలువైన ఆలోచన యింతవరకు నాకు ఒక్కసారి గూడా తట్టలేదు. అసలు నా మనస్సు ఎప్పుడూ అలాంటిఆలోచనలుఆలోచించదు. ఏమైనా గాని తప్పకుండా కొంతడబ్బు యింటికి పంపాలి. మాధవ రావుకు చెప్పి జీతం ఏర్పాటు చేసుకోవాలి. ఆలస్యం చేయ గూడదు. ఇదీ నా ఆలోచన. అప్పటికికాని నాకు కొంచెం స్థిమితం చిక్కలేదు. అక్కడినుండి గబగబా మా కంపెనీకి వచ్చాను. తీరా నేను వచ్చేసరికి మాధవరావు కంపెనీలో లేడు. ఏం చేయను? పుట్టక పుట్టక నా కా బుద్ధిపుడితే చేయ డానికి వీలులేకపోయింది. నాకన్నీ వ్యతిరేకమే. నే నేది ఆలో

చించినా నా ఆలోచన ఒక్కటీ కలిసిరాదు అదేంఖర్మమో విధి నాకు ఎంతో వ్యతిరేకముగా వున్నది. అక్కడనుండి నా గదికివచ్చాను. కానీ నాకుమనశ్శాంతి లేదు. ఏవిధంగానయినా ముందు కొంతడబ్బు ఇంటికిపంపాలి. అది నెరవేరేవరకునాకు శాంతివుండదు.ఆరాత్రి చాలాపొద్దుపోయేవరకు మాఇంటిని గురించే ఆలోచించాను.

ఇంతవరకు నాజాడ వారికి తెలియపరచనందుకు మనస్సులో నే నెంతో బాధపడ్డాను. నేను చేసినది క్షమించరాని తప్పు. నాతోబాటు రక్తంపంచుకుని పుట్టిన నాసోదరి, సోదరులను వదలి నే నిలా నాసుఖంకోసం రావడం మొదటితప్పు వచ్చినతరువాత కనీసం వారికి నావిషయమైనా తెలియపర్చక పోవడం రెండోతప్పు. ఇలా నేను ఆరాత్రిఎంతో బాధపడ్డాను. దీనికంతటికి కారణంఒక్కటే. అదేనాబలహీనత! నేనేంచేయలేకపోవడానికి కారణం అదే! కనీసం నాకష్టానికి తగిన ప్రతిఫలం నా బ్రతుకుకు ఒక ఆధారం ఏర్పరచుకో లేకపోయినందుకు ఎవ్వరినీ నిందించవలసిన పనిలేదు. నాలోనేనే, ఆరాత్రి ఎంతగానో ఏడ్చాను. నాప్రవర్తనకు నాకే ఎంతో ఆశ్చర్యం వేసింది.

పోనీ ఒకసారి వెళ్ళి అందరినీచూచివస్తే— మళ్ళీ ఇలా ఆలోచించాను. కానీ ఏవిధంగా వెళ్ళాలి సమాజంలో నేనూ మానవుడి నేనని_నాకూకోరికలనేవివున్నవని-నాకుజీవితంమీద

ఆశ వున్నదని నిరూపించేటంతవరకు నేను వెళ్ళదలుచుకోలేదు. అందుకు డబ్బు పంపడమే మంచిది. కష్టాలలో కొంత సహాయం చేసినవాడినైనా అవుతాను రేపు ఎలాగైనాసరే మాధరావును అడిగి కొంత డబ్బు తీసుకొని మాయింటికి పంపాలి. ఇలా ఆలోచించి నిర్ణయానికి వచ్చాను.

కానీ నాకు మళ్ళీ ఒక అనుమానం వేసింది. ఒకవేళ నేను డబ్బు పంపుతాను. వాళ్ళు ఆ డబ్బు తీసుకుంటారు. నా అడ్రసు చూస్తారు ఆ తర్వాత వారు మళ్ళీ డబ్బు పంపమని రాస్తే అప్పుడు నేనేం చేయాలి? పోనీ అలా రాయకుండా, నేనిక్కడ బాగా బ్రతుకుతున్నానని, నావద్ద డబ్బున్నదని మావాళ్లు ఇక్కడకువస్తే అప్పుడేంచేయను? ఇక ఎక్కువసేపు ఆలోచించ లేకపోయాను. ఎలాగైనాసరే వారికి నా అడ్రసు తెలియకుండా డబ్బుపంపాలి. అయితే ఎలాచేయడం? ఆలోచించాను. తెల్లవార్లూ ఆలోచించాను. కానీ నాకు ఏంచేయాలో తోచ లేదు. అలా అలోచిస్తూ ఎప్పుడో నిద్రపోయాను.

తెల్లవారింది, మాధవరావునుఅడిగి డబ్బు తీసుకోవాలి. అందుకని రోజూకంటే ఒక అరగంటముందే ఆఫీసుకు వెళ్ళాను. కానీ ఆఫీసుకు వెళ్ళిన తరువాతగాని నాకు తోచలేదు. నాకు డబ్బుకు తొందరైతే వేళకానిది ఆఫీసు ఎలాతీస్తారు? నా తెలివికి నాకే సిగ్గేసింది. అక్కడే చతికిలపడ్డాను. మరెక్కడికీ వెళ్ళదలుచుకోలేదు.

ఎనిమిది గంట లయింది. ఆఫీసుకు ఒక్క పనివాడూ రాలేదు. పనిమనిషిగూడా రాలేదు. రోజూ ఏడున్నర గంటలకే తెరిచే ఆఫీసు ఈరోజు ఎందుకు తెరవలేదో నా కర్థం కాలేదు. ఎవరినైనా అడిగి కారణం తెలుసుకుందా మనుకున్నాను. కానీ అక్కడ ఎవరైనా వుంటేగా తెలుసుకోడానికి? అక్కడినుండి రోడ్డుమీాదకు వచ్చాను. రోడ్లన్నీ నిర్మానుష్యంగా వున్నవి జనం ఎవ్వరూ నడవడంలేదు. రోజూ రద్దీలో సగంగూడా ఆరోజు లేదు. దీనికంతటికీ కారణం ఏమిటి? పోనీ ఎవరినైనా అడిగితే - ఎవరిని అడగాలి? అక్కడ నాకు తెలిసినవారు ఎవరూ కనిపించలేదు. ఇంతలో ఒక పెద్ద మనిషి చేతిలో పేపరు పట్టుకొని వస్తున్నాడు. ఆయనను అడుగుదా మనుకున్నాను. కానీ ఆయ నే మనుకుంటాడో? నే నిలా ఆలోచించుకుంటూ౦డగనే ఆయన నన్ను దాటి పోయాడు.

ఇంతలో మా ఆఫీసులో పనిచేసే పసివా డొకడు హోటల్లోనుండి బయటకువచ్చి కిల్లీకొట్టు దగ్గర కిల్లీ ఒకటి కొని నావైపు వస్తున్నాడు. అత నలా నా దగ్గరకు వచ్చి "ఏమండీ యిలా వచ్చారు? ఇవ్వాళ ఆదివారంగా, మరచిపోయారా?" నవ్వుతూ అడిగాడు.

అప్పటివరకు నా కారోజు ఆదివార మనే గుర్తు లేదు. అతని మాటకు నే నెంతో సిగ్గుపడ్డాను. కానీ పైకేమీా నాసిగ్గు కనబర్చలేదు.

"ఆ, కొద్దిగా పనున్నది. మాధవరావుగారు వస్తా
మన్నారు. ఆయనకోసం చూస్తున్నాను" అని చెప్పేశాను.
ఆతను తల వూపుకుంటూ వెళ్ళిపోయాడు. ఇక నేనక్కడ
ఒక్కక్షణం వుండలేకపోయాను. గబగబా అంగలు వేసు
కుంటూ నా గదికి వెళ్ళాను.

ఉదయం తొమ్మిది గంట లవుతుంది. అప్పటివరకు
మాధవరావుకోసం కనిపెట్టుకొనివున్నాను. ఆయన ఎప్పుడు
వస్తాడా, ఎప్పుడు డబ్బుపంపుదామా అని ఆయనకోసం నిమిష
మొక యుగంగా గడుపుతున్నాను. కానీ ఆయన రాలేదు.
రోజూ ఈ వేళకు వచ్చేవాడు. ఈరోజు ఎందుకురాలేదు? ఇలా
నాలో నేను ఆలోచించుకుంటున్నాను ఇంతలో ఆయనరానే
వచ్చాడు. వెంటనే వెళ్ళి అడగా లనుకున్నాను. కానీ, కొంత
సేపైన తర్వాత అడగా లనుకున్నాను.

ఈలోపు ఆయనే నన్ను పిలిచి ఏదో పని చెప్పాడు. ఆ
సమయంలో నాకా పని చేయాలని లేదు. కానీ ఏంచేయను?
ఆయన కెలా తెలియపర్చడం అని ఆలోచిస్తున్నాను. ఈలోపు
ఆయన నాసంగతి కనిపెట్టినట్లున్నాడు. 'ఆపని చాలా అవసరం
మీరు వెంటనే వెళ్ళిరండి' అని మళ్ళీ ఇలా అన్నాడు: 'ఏమిటి
ఆలోచిస్తున్నారు చెప్పండి' అని కొంతచిల్లర బస్సుచార్జీకి నా
చేతి కిచ్చాడు. నే నా చిల్లర జేబులో వేసుకున్నాను.

నా ఆలోచనసంగతి చెప్పుదా మనుకున్నాను. అస
లింతకుముందు నేనే ఆయనను అడగా లనుకుంటున్నానుగా,

కానీ అడగలేకపోయాను. 'ఏమీలేదండి. పూరకనే అలా వున్నాను' అని అక్కడనుండి వీధిలోకి వచ్చాను.

అప్పటికిగాని నేను చేసినపనేమిటో నా కార్థంకాలేదు. నే నెంత పిరికివాడిని, నేనెంత బలహీనుణ్ణి? కాదు కాదు, నేను ఒట్టిదద్దమ్మను నాకు తెలివిలేదు. సమాజంలో ఎలాబ్రతకాలో నాకు తెలియదు జనాభా లెక్కకు మాత్రమే నేను పనికి వస్తాను. అంతే? ఇలా పెద్దగాఅన్నాను. అలా ఎందుకన్నానో నాకు తెలియదు నా మాటలు రోడ్డునపోయేజనం విన్నారు. కొందరు నావైపు ఆశ్చర్యంగా చూచినట్లు చూచారు. మరి కొందరు నవ్వుకున్నారు ఇంకా కొందరు నన్నుగురించిఅనేక రకాలుగా విమర్శించటం ప్రారంభించారు. వారు మాట్లాడే మాటలన్నీ నేనువిన్నాను చూశాను కానీ,నిజంగా వా రను కున్నట్లు నేను పూర్తిగా పిచ్చివాడినైనా బాగుండేది. నన్ను చూచి కొందరైనా జాలిపడేవారు. ఇలా అనుకుంటూ రోడ్డున నడుస్తున్నాను.

ఇంతలో నా వెంట ఒక అమ్మాయి రావడం కని పెట్టాను ఆమె అలా ఎక్కడికి పోతున్నదో నాకు తెలియదు. కానీ నా వెంట చాలా దూరంనుండి వస్తుందని మాత్రం కని పెట్టాను. ఆమెను చూడగనే నా మనస్సు ఆమె మీదకు మళ్ళింది. నా ఆలోచనలన్నీ పోయాయి. ఇపుడు నా మన స్సుకు కొంచెం ప్రశాంతత దొరికింది. ఆమెను పరీక్షగా చూస్తూ నడుస్తున్నాను.

ఆమెను చూస్తూ చటుక్కున ఒకచోట ఆగిపోయాను. పాపం ఆమె ఎవరో నాలాగే దరిద్రుల యింటి ఆడపడుచు. లేకపోతే అలాచినిగిన బట్టలు వేసుకుని బజారు కెందుకొస్తుంది. ఆమెమీద నాకు అనుకోనట్లుగా హఠాత్తుగా జాలికలిగింది. రోడ్డుమీద నేను ఆగిపోగానే ఆమె నా దగ్గరకు వచ్చిఆగింది. ఆమె నాదగ్గ రాగడం నాకెంతో ఆశ్చర్యం వేసింది. ఆమెను గురించి నేను ఆలోచించడంమాత్రం మానలేదు. మనస్సులో ఆమెనుగురించే విచారిస్తున్నాను ఇంతలో ఒక చిన్న కారు రివ్వునవచ్చి మా ముందుగా దూసుక పోయింది. ఆ కారు వేగంగా పోతున్నా, దానిని పరీక్షగా చూచాను. వెనుక సీటులో ఒకయువతి కూర్చుని వున్నది. ఎవరో భాగ్యవంతులు అదృష్టవంతు లనుకున్నాను.

కానీ అంతటితో ఆగలేదు. ఆ కారులో వున్న అమ్మాయికి నా ముందున్న అమ్మాయికి పోల్చాను. ఎక్కడి కెక్కడా సంబంధం లేదు. పట్టు, సిల్కు వస్త్రాలుఆమె కట్టుకొని మెడనిండా బంగారుదండలు వేసుకుని న్యూ మార్కెట్ సన్నుని మిలా కారులోకూర్చుని పోతున్నది. ఈ అమ్మాయిచినిగిన గుడ్డలతో మానాన్ని కప్పుకొని, మనిషిజన్మఎత్తి, మసిపిలాబ్రతక లేకపోతున్నది. ఇదీ తేడా. భాగ్యవంతులకు బీదవారికిమధ్యలో వున్న ఈ కొద్ది తేడాకు, సంఘం బీదవారిమీద ఎలాంటిదాడి చేస్తున్నదో నా కప్పుడు కండ్ల ఎదుట కన్పించింది. నే నది

చూస్తూ సహించలేకపోయాను. కానీ యింతలో చటుక్కున నాముందున్న అమ్మాయి గుర్తుకు వచ్చింది. నాదృష్టిని ఆమె వైపు మళ్ళించాను. ఆ అమ్మాయి నావైపే చూస్తున్నది.

"ఏంకావాలి తల్లి" అలా అడగాలనిపించింది. అడిగేశాను.

ఈ ప్రశ్నకు ఆ అమ్మాయి పెద్దగా ఏడవడం మొదలు పెట్టింది. నాకేం చేయాలో తోచలేదు. నా తల తిరిగి పోతున్నది ఆ క్షణంలో ప్రపంచమంతా ఒక్కసారి సర్వనాశనమై పోతే బాగుం డనిపించింది. నేను నిశ్చేష్టుడనై అలాగేనిలబడి ఆ అమ్మాయివైపు చూస్తూ నిల్చున్నాను. ఆ సమయంలో అంతకన్నా ఏంచేయాలో తోచలేదు.

కానీ కొద్దినిముషాల తర్వాత తెప్పరిల్లుకో గలిగాను. సమాధానంకోసం ఎదురుచూచాను. చటుక్కున ఆఅమ్మాయి సమాధానం చెపితే బాగుండనిపించింది. కానీ ఆ అమ్మాయి యింకా ఏడుస్తూనే వున్నది. నేను మళ్ళీ అడగ లేకపోయాను అప్పటికి ఆ అమ్మాయి తేరుకున్నది. అప్పుడిలా చెప్పింది.

"మా నాయన రెండురోజులనుండిశీతజ్వరంతో లేవడం లేదు. మాయింట్లో ఈ రెండురోజులనుండిపస్తు. మా అమ్మకు క్షయ. వారికి నేనొక్కతినే కూతురును. వారలాంటి స్థితిలో వున్నారు. నాకేం చేయడానికి తోచలేదు. ఎవరినైనా

సహాయం చేయమని అడుగుదామని ఇలావచ్చాను" అనిఒక్క నిమిషంఆగి తిరిగిలాఅన్నది. "మిమ్మల్నిచూసేసరికి మిమ్మల్ని నడగాలనిపించింది. ఏమైనా సహాయంచేయండి" అని నావైపు చూచింది.

ఆ అమ్మాయి అడగటం బాగానే వున్నది. ఆకలి బాధకు తట్టుకోలేక ఆమె అలా బయలుదేరింది. సుఖంగా, సంతోషంగా కాలం వెళ్ళబుచ్చవలసిన రోజులలో ఆ అమ్మాయి అలా చిరిగినబట్టలతో బజార్ల వెంట ఇలాతిరగడం నాకిష్టంలేదు. కానీ ఏంచేయను. దేశంలో ఇలాంటి వారింకెంత మందున్నారో. చటుక్కున నాకు కార్లోపోయిన అమ్మాయి గుర్తుకు వచ్చింది. ఆమెతోబాటు దుఃఖంలో నేను పాలు పంచుకున్నాను. నాకు మా యింటిసంగతి గుర్తుకు వచ్చింది. ఇంటిదగ్గర నా చెల్లెలు,తమ్ముల్లుగూడా ఇలా గేజీకస్తున్నార ? ఇక ఎక్కువసేపు ఆలోచించలేకపోయాను. వారి కెవరైనా సహాయం చేస్తారా? ఏమో–నే నీ అమ్మాయికి సహాయం చేస్తాను, నావారి కక్కడ ఎవరైనా...

అలా కొద్దిక్షణాలు గడచింది. ఈలోపుఅనుకోనట్లుగా నా చేయి జేబులోకి పోవడం, బస్సుచార్జికి మాధవరావు యిచ్చిన చిల్లర ఆ అమ్మాయిచేతిలో పెట్టడం జరిగిపోయింది. ఆమె ఆ చిల్లర తీసుకొని కృతజ్ఞతగూడా చూపకుండా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ గబగబా వెళ్ళిపోయింది.

ఒకవిధంగా ఆ అమ్మాయిమీద నాకు జాలి, కోపం రెండు సమపాళ్ళలో వచ్చాయి. నేను కష్టపడి నడుస్తూ, బస్సుచార్జి కిచ్చినడబ్బులు కూడా పైసామిగల్చకుండా ఆ అమ్మాయి కిచ్చినందుకు ఆమె కృతజ్ఞతకూడా చూపకుండా వెళ్ళడం నాకెంతో బాధకలిగింది. ఆ అమ్మాయినిగురించే ఆలోచిస్తూ అలాగే నిలబడ్డాను. దేశంనిండా మోసం, దుర్మార్గం నాటుకునివున్నవి. ఇవి ఎన్నడూ మార్చలేరు. ఎవరితరమూగాదు. ఎవరైనా మార్చాలని ప్రయత్నించినా; అది వృథాప్రయాసై వూరుకుంటుంది.

ఇంతలో చటుక్కున మా కంపెనీ పని గుర్తుకువచ్చి, గబగబా నడచివెళ్ళాను. అప్పుడు పదకొండు గంటలవుతుంది. సూర్యుడు నడినెత్తిమీద కొస్తున్నాడు. తలమాడిపోతున్నది క్రింద కాళ్ళు బొబ్బ లెక్కుతున్నవి. చెప్పులు లేవు. బస్సుచార్జీ కిచ్చినడబ్బులు నాదానకి సరిపోయినవి. ఏం చేయను మరి. అలాగే నడుచుకుంటూ గబగబా వెళ్ళాను.

"ఏమండీ ఇంత ఆలస్యం చేశారు" మాధవరావు అడిగాడు.

"ఏమని చెప్పను? ఆలస్యానికి కారణంఏమని చెప్పాలి? ఆలోచిస్తున్నాను. తిరిగాయన గట్టిగాఅడిగినదాకా, నేనలాగే మౌనం వహించి నిల్చుని వున్నాను. ఇప్పుడిక చెప్పకతప్పింది కాదు. ఏదో ఒకటి చెప్పాలి. ఏదైనాసరే చెప్పి ముందు ఈ

ఆపద దాటాలి.పాత ఖాతాదారులు ఎక్కడినుండో పెన్షన్లు కావలసివచ్చారని, సాయంత్రం మనకంపెనీకి వస్తామన్నారని చెప్పాలనుకున్నాను:కానీ ఇది శుద్ధ అబద్ధం. నాకలా చెప్ప డానికి మనస్కరించలేదు. కానీ ఏదో చెప్పాలిగా. "ఒంట్లో బాగాలేదండి" అని జవాబిచ్చాను.

దానికి వెంటనే ఆయన ఇలా అన్నాడు. "నేనుఉదయం నుండి గమనిస్తూనేవున్నాను. మీరేదో బాధపడుతూ నాతో చెప్పలేకపోతున్నారని అనుకున్నాను. "అదే నిజమైంది. వెళ్ళి డాక్టరుకు చూపించండి" అని అన్నాడు. ఒకవిధంగా ఆయన చెప్పినది నిజమే. నేను బాధపడుతున్నమాట వాస్తవమే. అయితే ఆయ ననుకునేబాధ కాదుగా నేను పడేది. ఇలాఅను కునేసరికి మళ్ళా నాకు మాయింటిపరిస్థితి గుర్తుకొచ్చింది. ఈ సారి ఎలాగైనాసరే అడగాలి-అని నేను నిర్ణయానికి వచ్చాను. కానీ నాకు మళ్ళీ ఒక అనుమానం వేసింది.ఆవిషయంఇప్పుడే అడగాలా, మధ్యాహ్నం మళ్ళీ కంపెనీకి వచ్చినప్పుడుఅడిగితే బాగుంటుందా? ఆలోచించాను. చివరకు మధ్యాహ్నంఅడగ టానికే నిర్ణయించుకున్నాను. అలా అక్కడనుండి నేను నా కదికి వెళ్ళాను.

మధ్యాహ్నం రెండుగంట లవుతుంది. మనియార్డరు పంపడానికి మరొకగంట పైమున్నది. నేను ఆఫీసుకువెళ్ళాను. మాధవరావు కుర్చీలో కూర్చుని ఎవరితోనో మాట్లాడు

తున్నాడు. నన్ను చూడగనే నన్ను వారికి పరిచయంచేశాడు. వారు పెన్నుల ఏజంట్లు. పెన్నుల కంపెనీలనుండి ఏజన్సీలు తీసుకుంటారు. మా పెన్నుల ఏజన్సీ తీసుకుందామని. వివ రాలు మాట్లాడి వెళ్ళాలని వచ్చారు. వారి మాటలపోకడను బట్టి వారు నైజాంమనుష్యులులాకనిపిస్తున్నారు. తెలుగు,ఉర్దూ సమ్మేళనచేసి మాట్లాడుతున్నారు.

మాధవరావు నన్ను వారికి పరిచయం చేయగానే అందులో ఒకాయన నాతో కరస్పర్శచేసి, ఇలా అన్నాడు, "మీకీ మాట మేం విన్నాం, కానీ మాకీమిమ్ముల నెప్పుడూ చూచి వుండలేదు. అచ్ఛా, "అ" తుమారా నామ్?"

"నేను నా పేరు చెప్పాను"

"అచ్ఛా, అల్లా నామ్ బాగుంది. బాగుంది" అని మాధవరావువైపు తిరిగి "అచ్ఛా, సేట్జీ మళ్ళీమనం కలుసు కుంటాం" అని లేచి వెళ్ళిపోయారు.

అప్పటికి రెండుగంటల పదిహేను నిమిషాలైంది. నా కెంతో తొందరగా వున్నది. ఇపుడే పిలుదారికింది. అడిగేయా లనుకున్నాను. ఇంతలో మాధవరావు "మీరు ఈ రాత్రికి రాజమండ్రి వెళ్ళిరావాలి" అన్నాడు.

నేను సమాధానమేమీ చెప్పలేదు. ఆయనే ఏదో వివ రంగా చెప్తున్నాడు. ఆయన చెప్పడంపూర్తి చేసేసరికి రెండూ నలభై నిమిషాలైంది. టైము జరిగిపోయేకొద్ది నా కెంతో

తొందరగా వున్నది. నాకేం చేయడానికీ తోచడంలేదు. ఏం మాట్లాడుతున్నాడో గూడా తెలియడంలేదు. కానీ అనుకోనట్లుగా నేను అడిగేశాను ఎలా అడిగానో నా కిప్పటికీ ఆశ్చర్యంగానే వున్నది.

ఆయన నే నడిగినదానికి సమాధాన మేమీ చెప్పలేదు. విని వూరుకున్నాడు. నేనూ అలాగే నిలబడి ఆయన వైపు చూస్తున్నాను. "చూద్దాంలే" అన్నాడు. ఆమాట నాకర్థం కాలేదు. ఇక మళ్ళీ గట్టిగా అడగలేకపోయాను.

ఆ రాత్రి రాజమండ్రి వెళ్ళాను. నాలుగు రోజులకు గాని తిరిగిరాలేదు. వచ్చిన తరువాత ఒకసారి అడిగాను. దాని కాయన ఇలా సమాధానం చెప్పాడు.

"మీరిలా డబ్బడిగితే నేనివ్వలేను. ఏదో తిండిలేక బాధపడుతున్నారని, మీతో మా కిక్కడ అవసరం లేక పోయినా వుండమన్నాను. అంతేగాని, డబ్బు అడిగితే నా కక్కరలేదు. తర్వాత మీ యిష్టం" అనిఆయన అక్కడినుండి వెళ్ళిపోయాడు.

ఆ మాటలు నా కెంతో ఆశ్చర్యాన్ని కలిగించినవి. కండ్లముందు భూమి గిర్రున తిరుగుతున్నట్లనిపించినది. ఆమాట నా కెంతో బాధ కలిగించింది. ఇక అక్కడ ఒకనిమిషంవుండ లేకపోయాను. అక్కడున్న పనివారితోగూడా చెప్పకుండా పార్కుకువెళ్ళి నా బెంచీమీద కూర్చునియిలాఆలోచించడం ప్రారంభించాను.

దేశంలో అమాయకులనుచూస్తే అందరికీ లోకువే! అందరూ వారిని హీనంగా చూస్తారు. వాండ్ల మెతకతనాన్ని కారణంగా తీసుకొని తమపత్రిపాలను వెళ్ళబుచ్చుతుంటారు. వారు చేసేవాటికి ఎదురుతిరగనంతకాలం వారలా చేస్తూనే వుంటారు. దానికి తిరుగులేదు. అంతవరకూ వారిపత్రాపాన్ని చూపిస్తూనే వుంటారు అవసరంవస్తే వారిని తమస్వార్థంకోసం కాలరాసినవారు లేకపోలేదు. దీనికంతటికీ కారణం ఒక్కటే. డబ్బు. అదివుంటే అన్నీ వాటంతటవే వస్తవి సంఘంలో గౌరవం, మర్యాద, ఆదరం, అభిమానం, ఒక్కటేమిటి అన్నీ వస్తవి. అప్పుడు వాడెన్నితప్పులుచేసినా సమాజంసహిస్తుంది. ఇదే నేటి నాగరికతా జీవనం.

రాత్రి ఎనిమిదిగంటలవుతుంది. పార్కులో జనం అట్టే లేరు. నేను పార్కుకురాగానే తలెత్తి ఒకసారి ఆ మేడవైపు చూశాను. ఆ అమ్మాయి లేదక్కడ. బహుశా ఎక్కడికైనా వెళ్ళివుంటుందేమో అనుకున్నాను. కాని నా మనస్సంతా ఆ అమ్మాయిమీద, ఆమెనిల్చుండే కిటికీ దగ్గరవున్నది. అటువైపు మళ్ళీ కూర్చున్నాను. అలా చాలాసేపు చూస్తూ కూర్చున్నాను. ఆ విధంగా ఎందుకు కూర్చున్నానో ఎంత, కాలం గడిచిందోకూడా తెలియదు.

. . . . . . . .

. . . ఇంతలో ఒక నడికారు పురుషుడు, అదేవయస్సు స్త్రీ, ఒక చిన్న పిల్లాడు మెట్లుదిగి క్రిందికి వెళ్ళారు. కానీ వారితో

పాటు ఆ అమ్మాయి కూడా వస్తుందేమో అనుకున్నాను. కాని
ఆ అమ్మాయి రాలేదు. బహుశా ఆయన ఎవరైనా వుంటారా? ఆ,
గుర్తుకువచ్చింది. ఆయనే ఆఫీసరు. అప్పుడు, నిజంగా అంతే.
ఆరోజు ఆమె పిట్టగోడమీద కూర్చొని రోడ్డువైపు చూసింది.
ఆమె ఆయన భార్య కావచ్చు. కావచ్చేమిటి? అంతే.

అలా మరొక గంట కాలం గడిచింది. నేను మాధవరావు
సంగతి ఆలోచిస్తున్నాను. ఆయన అన్నమాటే మాటిమాటికీ
గుర్తుకువస్తున్నది. అడగక అడగక నేనడిగినందుకు తప్పకుండా
కొంత డబ్బు యిస్తా డనుకున్నాను. కాని ఇలా
అంటా డనుకోలేదు. ఏంచేయను? నా ఖర్మ ఇలావుంటే ఒక
రేం చేయగలరు? అసలు యజమానులంతా యింతే నేమో!
లేక నాముఖంచూస్తుంటే వారి కలా అనిపిస్తున్నదో? ఏదైనా
కావచ్చు. కానీ, యజమానులంతా ఒకటి కాకపోతే ఇదేమిటి?
అందరి పనివారియందు యజమానులిలా ప్రవర్తిస్తారా? ఇలాగే
ప్రవర్తిస్తే అందరూ నాలానే బ్రహ్మచారు లుంటారా? అందరికీ
యిలా ఎన్నటికీ కాదు. ఇలావుంటే వారెలా బ్రతుకుతారు?
ఇప్పటికి నేను చాలామందిని చూచాను. ఒకాయనకు తొమ్మిది
మంది పిల్లలున్నారు. ఆ ఇంట్లో మొత్తం జనాభా పదకొండు
మంది. ఆయన ఒక కంపెనీలో గుమాస్తా. ఆయనకు కంపెనీ
వారు జీతం సరిగ్గా యివ్వకపోతే ఎలాబ్రతుకుతారు వారంతా.
ఎప్పుడో ఆకలి ఆకలి అంటూ, స్వర్గానికి సరాసరి పోయి
వుండేవారు.

అలా ఎన్నటికీజరగదు మున్నాటికీ జరుగదు. ఇదంతా నా దురదృష్టమే. పెద్దగా అన్నాను. అలా అన్న తర్వాత నా మాటలకు నాకే సిగ్గేసింది. ఎవరైనా విన్నారేమో అని చుట్టూ చూచాను. అప్పటికి పార్కులో ఎవ్వరూ లేరు. అయినా ఆవేళప్పుడు ఎవరు వస్తారు? నాలా అసమానం పనీ పాటా లేకుండా పార్కులో ఎవరుంటారు? ఎవ్వరూ లేక పోవడం నాకుకొంచెం ధైర్యం చిక్కింది. నామనస్సు కొంచెం తేలికపడ్డది. ఎవరయినా నా పిచ్చిమాటలు వింటే ఏముంది? మరొకసారి నేను పిచ్చివాడిగా లోకందృష్టిలో చూడబడ తాను.

ఈ విధంగా ఎక్కువసేపు ఆలోచిస్తూ కూర్చోలేక పోయాను కాసేపు నా బెంచీమీద పడుకుందామనుకున్నాను. కానీ ఇంతలో అప్రయత్నంగా నా చూపు బెంచీకి వేసిన అడ్డ కమ్మీలమీద పడింది. ఆదృశ్యం చూచేసరికి నా గుండె ఆగి పోయింది. ఏం చేయను? నాబెంచీకి వేసిన అడ్డకమ్మీని ఎవరో బుద్ధిమంతులు విరగకొట్టారు. ఆ దృశ్యం చూచేసరికి నా కెంతో జాలి వేసింది. ఆ బెంచీ ఏడుస్తూ నావైపు చూచినట్లుగా కనిపించింది. నేను ఎంతో బాధపడ్డాను. నేను ఇక్కడ వుండక పోబట్టిగదా దానికా ఖర్మ పట్టింది. నేనుంటే వాడి తల పగలకొట్టివుండేవాడిని. రాస్కెల్. వాడికామాత్రం బుద్ధి లేదు. పశువు. కసికొద్దీ తిట్టాను.

అదేమిటో, ఆ సిమెంటుబెంచీ అంటే నాకంత ప్రేమ. అవును, మరి ఎవరికి మటుకు ఎందుకుండదు? నే నాపార్కుకు

వచ్చినప్పటినుండీ నా బెంచీ అదే. ఆ బెంచీమీద తప్పితే మరెక్కడా కూర్చోను. అందుకే కాబోలు అదంటే నాకంత ప్రేమ. అసలు ఆ బెంచీజోలికి ఎవ్వరూ పోరు కారణం ముందే చెప్పానుగా, అదొక్కటే ఆపార్కుకు మూలగా వుంటుంది. అంచేత అక్కడి కెవ్వరూ రారు వచ్చినా దాని మీద కూర్చోరు.

ఆ విధంగా చాలాసేపు దానినిగురించే ఆలోచించాను. బాధపడ్డాను ఏం చేయను. నా ఆలోచనలే అంత. నాకు ప్రాణంపోయినా ఆలోచనలుమాత్రం నన్ను వదలి పోవు. నా కంతవరకు తెలుసు. అసలు వాటికీ నాకు ఏదో తెలియని అవినాభావసంబంధ ముండి వుంటుంది. లేక పోతే ఇన్ని ఆలోచనలతో గడిపేమనిషి ఎవరైనా వుంటారా? చాలాసేపు పడుకున్నాను. కానీ నిద్ర పట్టలేదు. ఇంతలో లైట్లు ఒక్కసారి ఆరిపోయినవి. చల్లనిగాలి వీస్తున్నది. మనస్సెంతో ప్రశాంతంగా వున్నది. ఇక మళ్ళీ ఆఫీసుకు పోకూడదనుకున్నాను. అసలికముందు నాజీవితంలో ప్రైవేటు వుద్యోగం చేయకూడదనుకున్నాను. ఇలాఅనుకున్న తరువాత నాకు మనశ్శాంతి కలిగింది.

నాకు భోజన టిక్కెట్లు మరొక రెండు రోజులవరకే వున్నవి. ఈ నెలఅద్దె నిన్ననే చెల్లించాను. గదికి రేపటివరకు గడువున్నది. వెంటనే వెళ్ళి ఆగది ఖాళీచేయాలి. మళ్ళీ అద్దె

చెల్లించుకోవేసా. అసలు మళ్ళీ వుద్యోగం దొరుకుతుందో లేదో? ఏమైనా ఎలాంటి వుద్యోగం దొరుకుతుందో! ఏమైనా గాని ఈసారి, జీతంవిషయం ముందే మాట్లాడుకోవాలి. ఇలా నిర్ణయానికి వచ్చాను. అక్కడనుండి నాగదికి వెళ్ళాను.

ఆ రాత్రి నాకు భోజనం చేయాలనిలేదు. అప్పుడురాత్రి ఎనిమిదిగంటలవుతుంది. చింపిచాప పరుచుకొని, నేనునాగది వాకిట్లో మోకాలిమీదకాలు పెట్టుకొని, తలక్రింద రెండు చేతులు పెట్టుకొని వెల్లికిలా పడుకున్నాను.

ఇలా పడుకునేది ఎవరు? పూర్వం మహారాజులు, జమిందారులు పడుకునేవారు. వారు వారికాలాలలో అలా పడుకొని చిన్నచిన్న రాచకార్యాలు చూచేవారు అయితే నేనెందుకు పడుకున్నాను? నేనుమాత్రం మహారాజును ఎందుకు కాకూడదు? పోనీ రాజులుపోయారు. కాబట్టి నా చేతిలో మహారాజయోగ్య రేఖలే వుండవు. అయితే జమీం దారును కావాలి అదీ కాలేను. సెంటు పొలంకూడా లేని నే నేం జమీందారును? ధనవంతుడ నవుతాను. కావచ్చు. అలా అవడానికిరోజులలో పరిశ్రమపడవలసిన అవసరంకూడా లేదు, ఒకచిన్న పజిలు వచ్చిందంటే చాలు. ఇవ్వాళ ఇట్లా వున్న నేను రేపు ఉదయానికి ధనవంతుడ నవుతాను అప్పుడు లోకం నేనంటే గౌరవిస్తుంది. నాకు సన్మానసభలు, నాచేత ప్రారంభోత్సవాలు, ఇలా ఎన్నెన్నో చేసి దానకర్ణ, దేశోద్ధారక లాంటి బిరుదులెన్నో తగిలిస్తారు. అప్పుడు ధనవంతులంతా,

ఎండముఖం ఎరుగని తమ తమ గారాబు కుమారికారత్నా లను ఇచ్చి పెండ్లిచేస్తామంటారు. కట్నం ఒకలక్ష రూపాయ లిస్తారు. పెండ్లిలో కట్నం చాలదని పేచీ పెడితే మరొక అరలక్ష. అసలు ఈ డబ్బంతా ఎక్కడ దాచాలి. ఛా, ఛా అసలు నేను ధనవంతుడిని కాకూడదు. ఆ మురికి జీవితం నాకక్కరలేదు. హాయిగా ఇలాగే జీవిస్తాను. డబ్బున్నా నా దగ్గరున్నదని ఎవరికీ తెలియకూడదు. అసలే రోజులు బాగా లేవు.

"గది కావాలి, అద్దెకిస్తారా?" అని అడిగాడు ఒకాయన.

"ఎవడు వీడు బంగారం లాంటి నా ఆలోచనలకు ఆటంకం కలిగించాడు. ఛీ ఛీ అవతలికి పో ఎవడా? అక్కడ, వీణ్ని బయటికి గెంటండి" అందా మనుకున్నాను. ఇంకా నయం అనలేదు.

నేను తలెత్తి ఆయనవైపు చూచాను. నడికారుస్త్యకి ఎవరో నాలాగే చిన్న గుమాస్తా అయివుంటాడు. లేకపోతే ఒక్కగదిలో ఎలావుంటాడు? అనుకున్నాను. కానీ ఈ లోపు మాయింటి యజమాని వస్తూనే "ఏమండీ, ఎవరికోసం" కొత్తగావచ్చినాయనను ప్రశ్నించాడు. తిరిగాయన "గదులేమైనా అద్దెకిస్తారా?" అన్నాడు.

"ఏమీ లేవండి" అన్నాడు మా యజమాని.

నేను రాజఠీవితో లేచాను, "వున్నాయండి ఇదిగో నా గది ఇస్తాను" అని నేను ఆ కొత్తగా వచ్చినాయనను నా గది

లోకి ఆహ్వానించాను. మా యింటి యజమాని ఆశ్చర్యంగా నా వైపు చూస్తున్నాడు. ఆ కొత్తగా వచ్చినాయన ఇంటి వివరాలన్నీ కనుక్కొని, రేపు చేరుతానని వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళిపోగానే మా యింటియజమాని ఆశ్చర్యాన్ని కనబరుస్తూ ఇలా అడిగాడు.

"మీగది చూపించారు మీ రెక్కడికి వెళ్తారండి?"

"రేపు నేను ఖాళీచేస్తున్నాను. అనవసరంగా మళ్ళీ కొత్తవారు వచ్చేవరకు మీ అద్దె నష్టంచేయడం దేనికి?" అన్నాను నేను. ఆయన తర్వాత మరేమీ అనలేదు. కృతజ్ఞత చూపుతూ వెళ్ళిపోయాడు.

ఇప్పటికిగాని నాకు మనశ్శాంతి పూర్తిగా చిక్కలేదు. ఇవ్వాళ వుదయమే నేననుకున్న ప్రకారం నా గదిని ఖాళీ చేశాను. మళ్ళీ నా మామూలుపార్కుకు వచ్చి, నా బెంచీ మీద కూర్చున్నాను.

అప్పటికి నేను నా పట్టణ జీవితంతో చాలా అనుభవం గడించాను పట్టణజీవితంలో నాకు చాలామందితో పరిచయం కలిగింది. అయితే ఇందులో అవసరానికి సహాయం చేసేవారెవరో పరీక్షించాలి. ఈ పరీక్షలో ఎవరు నెగ్గితే వారే నాకు స్నేహితులు అని అనుకున్నాను. అప్పటికి నాభోజనటిక్కెట్లు అయిపోయినవి. మళ్ళీ నా జీవితంలో ఏకాదశులు వస్తున్నవి. ఆ విధంగా ఎన్నిఏకాదశులు వెళ్ళిపోవాలో. అసలునాజీవితమే

ఒక ఏకాదశి. ప్రపంచంలోనిజనాభాలో కనీసం నాలుగోవంతు జనాభాఅయినా నాలాగే ఏకాదశులు వుంటే ఇంకెంత జనాభావున్నా ప్రపంచానికి భారం వుండదు. కాటకాలు వుండవు అనుకున్నాను.

అప్పుడు మధ్యాహ్నం రెండుగంట లవుతుంది. ఎండ బాగానే వున్నది. సిమెంటుబెంచీ కావడంవలన బాగా కాలు తున్నది. కానీ నే నలాగే ఆ ఎండలో అంతసేపు దానిమీద ఎలా వున్నానో నాకు ఆశ్చర్యంగానే వున్నది.

అప్పుడు నిద్రనుండి లేచినట్లు వళ్ళు విరుచుకుంటూ లేచాను. బట్టలు విడిపించుకోవాలని బట్టలమీద చెయ్యి వేశాను. మండిపోతున్నవి. తలమీద చెయ్యిపెట్టి చూచుకు న్నాను. జుట్టంతా కాలిపోతున్నది. శరీరం చూచాను. 104 డిగ్రీల జ్వరం వచ్చినట్లుగావున్నది. నా సాహసానికి నాకే ఆశ్చర్యం వేసింది. అక్కడనుండి లేవబోయాను.

అంతలో నా చూపు పార్కు కెదురుగా వున్న మేడ మీదపడ్డది. ఎవరో ఒకమ్మాయి కిటికీలోనుండి నా వైపే చూస్తున్నది. ఎవరా అమ్మాయి? బహుశా ఎవరైవుంటాను పేందుకో నావైపే తదేకదృష్టితో చూస్తున్నది. అలా ఎందుకు చూస్తున్నది? నే నేం పిచ్చివాడిననా! అంతేఅయివుండవచ్చు. కాకపోతే అంత ఎండలో ఆ బెంచీమీద మంచివా డెవడు కూర్చుంటాడు? అసలు నిజమైన పిచ్చివాడుగూడా కూర్చుం

టాలా? వాడికి మాత్రం తెలియదు-క్రింద, పైన గాలిపోతుంటే నాకు కూర్చోడు అయితే నేనెవరిని? పిచ్చివాడి దృష్టిలో కూడా పిచ్చివాడినయివుంటాను. అందుకే ఆ అమ్మాయి అలా చూస్తున్నది.

నేనక్కడనుండి లేచి రోడ్డుమీదకు వచ్చాను. కానీ నా ఆలోచన మాత్రం ఆ అమ్మాయిని గురించే. అసలింతకు ఆ అమ్మాయి ఎవరైవుంటుంది? ఆ ఆఫీసరు కూతురేమో? ఏమో? కాకపోతే చెల్లెలైవుంటుంది ఎవరైనా కావచ్చు నా వైపుమాత్రం చూడటం సహజం.

అయినా ఆ అమ్మాయి నన్ను చూస్తే నాకేం, నేను ఆ అమ్మాయిని చూస్తేతప్పు. ఆ అమ్మాయి నావైపుచూడవచ్చు. అలా స్త్రీలు పురుషులవైపు చూడవచ్చు కానీ పురుషులు మాత్రం స్త్రీలవైపు చూడగూడదు ఇది సంఘం కట్టుబాటు ఇదేమి మర్యాదో నా కర్థం కాలేదు.

కానీ నేనిక్కడికి ఎందుకువచ్చినట్లు? 'ఆఁ' గుర్తువచ్చింది. ఆ అమ్మాయి చూస్తున్నదనేగా నేనిటు వచ్చినది. పాపం ఆ అమ్మాయికి ఎంత అన్యాయం చేశాను. ఆమె కోరిక నన్ను చూడాలని. కానీ ఇంత చిన్నకోరిక నేను తీర్చలేకపోయాను. అనుకోనట్లుగా నామీద నాకే కోపం వచ్చింది. నా పురుషత్వానికే దెబ్బ తగిలేట్లుగా వున్నది. అక్కడినుండి గబగబా మళ్ళీ పార్కుకు వెళ్ళాను. కానీ ఆ అమ్మాయి అక్కడలేదు.

ఆ అమ్మాయి కిదేపనా, నన్ను చూడటమేనా? ఇంతాక ఆ అమ్మాయి నావైపే చూచిందని నిర్ధారణ ఏమిటి? రోడ్డువైపు చూస్తుండవచ్చు. లేదా పార్కులోని చెట్లవైపు చూస్తూండ వచ్చు. అయినా నే నేమైనా పెద్ద అందగాడినా ఆ అమ్మాయిని అంతగా ఆకర్షించడానికి? నా తెలివికి నేనుచేసినతప్పుకు నాకే నవ్వువచ్చింది. అక్కడినుండి గబగబా తిరిగి రోడ్డు మీదకు వచ్చాను.

హటాత్తుగా నా చూపు తిరిగా మేడమీదకు మళ్ళింది. ఎందుకో పైకిచూచాను. ఆ అమ్మాయి కనిపించింది. తిరిగి ఆ అమ్మాయినిగురించి ఆలోచించడం ప్రారంభించాను. అలా ఆ అమ్మాయి ఎందుకు నావైపు చూస్తున్నది? ఎంతసేపాలోచించినా నాకర్థంకాలేదు.

నా లాగే ఆ అమ్మాయి ఎండలో నిల్చునివున్నది. ఆ అమ్మాయిని చూచేసరికి నా కెంతో ఆశ్చర్యం వేసింది. నేను పార్కులోనుండి వచ్చినతరువాత ఆఅమ్మాయి అక్కడనుండి యిటువచ్చింది అనుకున్నాను.

అలా ఇద్దరం ఒకరి నొకరం చాలాసేపు చూచు కున్నాం. ఇంతవరకు నాజీవితంలో కలగని అనుభవం ఈ రోజు కలిగింది. నే నలా ఎందుకు అంతసేపు ఎండలో నిల్చుని చూచానో నా కర్థం కాలేదు. అదేమిటో వింత అనుభవం కలిగింది. అలా చూస్తు ఎండసంగతే మర్చిపోయాను ఏదో

వ్యక్తం చేయలేని మధురమైన అనుభూతి పొందాను. నాలాగే ఆ అమ్మాయికీ. ఏదో అనుభూతి కలిగి వుంటుంది కాకపోతే అంత ఎండలో అలా నిల్చుని ఎందుకు చూస్తుంది? నా కాశ్చర్యం వేసింది. దీనినే ఏదో అంటారు. కానీ దాని విలువ ఏమిటో నా కింతవరకు తెలియలేదు. దానివలన మనుష్యులెలా మైకంలోపడిపోతారో, ఇప్పుడు నాకు తెలిసింది. ఇదే కాబోలు స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణ. అనుకున్నాను.

అలా అనుకుంటూ అక్కడ ఇక ఎక్కువసేపు వుండ దలుచుకోలేదు. గబగబా రోడ్డుమీదకు వచ్చాను. ఆ విధంగా ఎక్కడికిపోతున్నానోకూడా నాకు తెలియడంలేదు. కు కలిగిన అనుభూతినిగురించే ఆలోచిస్తున్నాను. మధ్య మధ్య శరీరం గగుర్పొడిచేది. ఆ అమ్మాయిని మనస్సులో తలుచుకొన్నప్పుడల్లా శరీరం పరవశత్వం చెందేది. చెప్పలేని సంతోషం కలిగేది.

ఆవిధంగా ఆలోచించుకుంటూ చాలాసేపు తిరిగాను. చాలారోడ్లు నడిచివచ్చాను. ఇంతకుముందు నే ననేకమంది అమ్మాయిలను చూచాను. అప్పుడు నా కిలాంటి అనుభూతి కలగలేదు. అసలు ఇంతకుముం దెన్నడూ ఏ స్త్రీ న న్నలాగా చూడనూలేదు కానీ ఈరోజుసంఘటనే నాకెంతో విచిత్రంగా వున్నది. నా జీవితంలో అలా ఎప్పుడైనా జరుగుతుందని నే నూహించలేకపోయాను. కానీ ఈనాటి సంఘటన నా జీవితంలో ఒక మరుపురాని ఘట్టం. ఇలా అనుకుంటూ, ఆలోచిస్తూ చాలాసేపు తిరిగాను. చివరకు పార్కుకువచ్చాను.

## II

అప్పుడు సాయంత్రం ఆరుగంటలవుతుంది. పార్కంతా జనంతో జండాలతో కోలహాలంగా వున్నది. ఏదో పార్టీమీటింగనుకున్నాను. వేదిక బాగా వేశారు. మామిడాకులతో రంగుకాగితాలతో పార్కునలంకరించారు.'స్వాగతం' అట్టలు తగిలించారు. మొదట్లో ఈహడావుడిఏమిటోనా కర్థంకాలేదు. విచారించాను. ఎన్నికలప్రచారానికిమంత్రిగారువస్తున్నారట. ఆయనతోబాటు పార్టీ పెద్దనాయకులు వస్తారట. అందుకే ఈ కోలాహాలము, యీ హడావుడి. నేను నా బెంచీదగ్గరకు వెళ్ళాను. బెంచీ ఖాళీలేదు నలుగురుఉపనాయకులుకూర్చుని వున్నారు.ఆనలుగురు షుమారు ఏబువంజలపౌనులకు తక్కువ వుండరు. అంతబరువు నా బెంచీమోయడం నాకిష్టంలేదు. నా బెంచీనిచూచి నాకెంతో జాలివేసింది. కానీ నేనేంచేయను? ఆబెంచీకూడా నన్నుచూచి జాలిపడుతున్నట్లుగా వున్నది. ఈ పూట నేను నీకు ఉపయోగపడలేక పోయానన్నట్లుగాఉన్నది.

ఇంతలోమంత్రిగారువచ్చారు. ఆయన వెనకాలే, పెద్ద పెద్దనాయకులూవచ్చారు.వారిని చూచి పార్కులోనిజనం లేచి హర్షధ్వానాలుచేసి మంత్రిగారికి, నాయకులను, జే జే లుపలికారు. నేనుమాత్రం అలా చేయలేదు. అలా చేయడం నాకిష్టంగూడా లేదు. అందుకే చూస్తూ వూరుకున్నాను. వచ్చిన నాయకులు ఒక్కొక్కరే ఉపన్యాసా లివ్వడం ప్రారం

భించారు. ప్రతిపక్షాలను ఓడించమని మంత్రిగారు గట్టిగాపదే పదే చెప్పారు. నాయకులు పోటీపక్షాల నన్నిటిని తీవ్రంగా విమర్శించారు.

ఆతర్వాత రెండుగంటలకు పార్కు నిర్మానుష్యమైనది. ఇపుడు పార్కులో నేనుతప్ప మరెవ్వరూ లేరు – నేను ఆప్యాయంగా, వెళ్ళి నా బెంచీమీదకూర్చున్నాను. దేశవ్యాప్తంగా తిరిగి ఎన్నికలు వచ్చినవి.ప్రభుత్వపక్షాన్ని గెలిపించమని మంత్రిగారు చెప్పారు ఈ ఎన్నికలవలన నాలాటి వాడికి ఉపయోగమేమిటి? ఎవరుగెలిస్తే నాకెందుకు? ఆరాత్రి ఇంక ఎక్కడికీ పోలేదు. కాసిని నీళ్ళుతాగి పడుకన్నాను.

తెల్లవారింది. అప్పటికింకా బాగా వెలుతురురాలేదు. ఈపూట కడుపులో ఏదైనా పడకపోతే ఆకలి బ్రతకనిచ్చేట్లుగా లేదు. మా హోటలు మిత్రుడికోసం బయలుదేరి వెళ్ళాను. తీరా విచారించగా అక్కడమాహోటలుమిత్రుడు లేడు. అసలా వుద్యోగమే మానేశాడని హోటలు యజమాని చెప్పాడు.నాదురదృష్టానికి ఏడ్చాను అత నే హోటల్లో పనిచేస్తున్నాడో అడిగి తెలుసుకున్నాను. ఆత నిపుడు ఏ హోటల్లోను పనిచేయడంలేదు. స్వతంత్రపార్టీ వారి ఓటర్లలిస్టు వ్రాస్తున్నాడనిచెప్పాడుఆపార్టీ కార్యాలయంఎక్కడో తెలుసుకొని అక్కడినుండి బయలుదేరాను. స్వతంత్రపార్టీ కార్యాలయం అక్కడికెంతో దూరంలేదు గబగబా నడుచుకుంటూ

అక్కడికి వెళ్ళాను. నా అదృష్టం బాగుండి మా మిత్రుడు అక్కడే వున్నాడు ఇంకా అక్కడ నాలాంటి అభాగ్యులు అనేకమంది ఓటర్ల పేర్లు రాస్తున్నారు. నన్ను చూడగానే ఆప్యాయంగా మా మిత్రుడు లోపలికి తీసుక వెళ్ళి అక్కడున్న వారికి నన్ను పరిచయం చేశాడు అందరూ ఎంతో ఆప్యాయంగా నావైపు చూచి తిరిగి వారిపనుల్లో వారు నిమగ్నులైనారు.

నేను మా మిత్రుణ్ణి కలుసుకొని వెళ్ళినపని చెప్పాను. అతను వెంటనే బయటకువచ్చాడు. ఇద్దరం కలిసి దాపులో వున్న ఒకహోటలుకు వెళ్ళాము. అక్కడిగడియారం పది గంటలు చూపుతున్నది. నేను ఫలహారంతీసుకుని కాఫీ త్రాగుతానన్నాను. మామిత్రు డందుకు ఒప్పుకోలేదు. భోజనం చేద్దామని భోజనశాలకు దారితీశాడు. నా మనస్సులో భోంచేయాలనేవున్నది. కానీ ఏంచేయను? అభిమానం అడ్డు వచ్చి అడగలేక పోయాను. సుష్టుగా భోజనంచేశాను. అంతవరకు నేను అతని ఉద్యోగవిషయం ప్రశ్నించలేదు. అతను నాకేమీ చెప్పలేదు. అసలు నా సంగతంతా అతనికి తెలుసు. నేను ఆవు రావురుమంటూ భోజనంచేస్తానని అతను నేను భోంచేసేటప్పు డెప్పుడూ పలకరించడు.

ఇద్దరం రోడ్డుమీద నడుస్తున్నాము అతను నా కతని కొత్త ఉద్యోగవిషయం చెపుతున్నాడు. అతను చెప్పినది విన్నతరువాత నేనూ ఆఓటర్ల పట్టేరాస్తే బాగుండుననిపించింది.

ఉద్యోగం తాత్కాలికమైనా శ్రమకు తగిన ప్రతిఫలంఅన్నాడు మామిత్రుడు. అతను చెప్పేడంటే నాకు నమ్మకమే. ఆత నా మాట అన్నతరువాత నాకు అలాగే అనిపించినది. వెయ్యి పేర్లకు రూపాయి ముప్పావలా, కిరాణాకున్న చోటునుండి కదల కుండా రూపాయిముప్పావలా వస్తుంటే ఏం? మయూకంపెనీలో, మాధవరావు కంపెనీలో ఏమిచ్చారు? నా చేత అడ్డమైన పనులు చేయించుకొని జీతం యివ్వటానికే ఏడ్చారు అందుకే వాటికంటే నాకు యిదే బాగుం దనిపించింది. అయితే మా మిత్రుడు హోటలు వుద్యోగం ఎందుకు మానుకున్నదీ చెప్పలేదు. ఎప్పుడూ వుండే వుద్యోగాన్ని వదలుకొని ఇది తాత్కాలిక వుద్యోగమని తెలిసుండికూడా పాతవుద్యోగాన్ని ఎందుకు మానుకొని వుంటాడు? తప్పకుండా యిందులో ఏదో రహస్యము వుండివుంటుంది. మనసులోమాట అడిగేశాను.

కాని అతను నా మాట వినిపించుకున్నట్లు లేదు. మాట్లాడుతూ మాటలుమార్చి ఇలా చెప్ప సాగాడు. "స్వార్థం పుట్టినప్రతివారికి గిట్టేవరకు వుంటుంది. అయితే అందులో తారతమ్యాలు వుండాలి ప్రతిదీ తనకే కావాలనుకోడంచాలా పొరపాటు. భగవంతుడు మనకు జీవితాన్ని ప్రసాదించింది సుఖంగా, న్యాయంగా, శాంతంగా, నిస్వార్థంగా బ్రతకమని గాని, మరొకరినీ, సమాజాన్ని మోసం చేయుటకుగాదు. కొందరు స్వార్థంలో తన, పర భేదాలుగూడా మరిచిపోతారు. వారి మనస్సు

పాషాణం లాంటిది. అలాంటి మనుష్యులు జీవితంలో తారసిల్లి నప్పుడు ఒకకంట కనిపెట్టి వుండటం చాలామంచిది. ఇంకా కొందరు స్వార్థానికి మానవత్వాన్ని మరచి తనకోసం ఎదుటి వారిని ఏమైనా చేస్తారు అలాంటి వారిని మనుష్యులు అనేకన్నా దానవులు అంటే సరిపోతుంది. ఏమంటారు?" నా వైపుచూచి హఠాత్తుగా నన్నిలా ప్రశ్నించాడు.

నిజానికి అతనలా ఎందుకు చెపుతున్నాడో నా కర్థం కాలేదు. కానీ, అతనడిగిన దానికి సమాధానం చెప్పాలిగామరి! అందుకే ఇలా చెప్పాను "నీవు చెప్పింది నిజమే ఈ నాడు తొంభయితొమ్మిదిమందిసమాజాన్నితమకోసంఉపయోగించు కోడానికే చూస్తున్నారు. అసలు లోకపరిస్థితే అలావున్నది. మాటకు విలువ పోయింది. ఆడితప్పడం, తీసుకొని తీసుకోలే దనడం, పరులసొమ్మునితస్కరించుటకు సామ, దాన, భేద, దండో పాయాలు ప్రయోగించడం, అందుకు ఎంతటిపాపకార్యా న్నైనా అవలీలగా చేయడం, నేడు ఆచారమై పోయినది. అసలు అలా చేయకపోతే ఈ ఇరవయ్యోశతాబ్దంలో బ్రతక డం గూడా చాలా కష్టమే" అన్నాను.

"అవునవును. మీరు చెప్పింది పదహారణాల నిజం. ఉదా హరణకు మీ పరిస్థితే చూడండి, మీరీనాడు ఇలా ఇబ్బం దులు ఎందుకు పడాలి? మీరూ చదువుకున్నారు. అందరిలాగే పుట్టారు. మరిసుఖంగా బ్రతకగలిగారా? లేదు. దీనికి కారణం

ఎవరంటారు? సమాజం. ఆ సమాజాన్ని, నడిపించే పెద్దలు. అవునంటారా?” ప్రశ్నించాడు.

నేను కాదని ఎలా చెప్పగలను? అతను నూరు నయా పైసల నిజం చెప్తున్నప్పుడు! నేను మాట్లాడలేను. కానీ తిరిగా తనే ఇలా మాట్లాడాడు.

‘స్వతంత్రపార్టీ అభ్యర్థిని చూడండి, ఇతను పెద్దవ్యాపారస్తుడు. ఈయన చేతికింద అనేకమిల్లులు, ఫ్యాక్టరీలు, వందల కొలది పనివారు పనిచేస్తున్నారు. ఈయనకు పోటీగా కాంగ్రెసు, కమ్యూనిస్టు అభ్యర్థులు వున్నారు. కాంగ్రెసు అభ్యర్థీ పెద్ద భూస్వామి! స్వాతంత్ర్యానికి ముందు జస్టిస్ పార్టీ నాయకుడు ఈ నియోజక వర్గంలో ఆయనంత ఆస్తిపరులు లేరనిప్రతీతి - మా మిత్రుడింకా కాంగ్రెసు అభ్యర్థిని గురించి ఏదో చెప్ప బోతున్నాడు. కాని నేను ఆపుచేసి ‘కమ్యూనిస్టు అభ్యర్థిసంగతేమి’ టని ప్రశ్నించాను.

“కమ్యూనిస్టుఅభ్యర్థికి ఏదో కొద్దిగా ఆస్తి వున్నదట. కాని ఆయన ఆస్థిలో సగం భార్యకు, మిగిలిన సగంలో సగం పిల్లలకు, మళ్ళీ సగం తనకు, మిగిలిన సగం పార్టీకిచ్చాడుట.

‘అలాగా’ అన్నాను నేను.

‘అవును. ఆయన చాలా మంచివాడే ‘ ఉపకార బుద్ధివున్నదని ప్రతీతి’ కానీ ఆయన మాట ఎవరు వింటారు?’ అన్నాడు మా మిత్రుడు.

'ఏం'

'ఆయన ఈ ఎన్నికలలో గెలిస్తే గా'

'గెలవడా?'

'చెప్పలేము' ఆయనకు పోటీ అభ్యర్థులిద్దరు బాగా వున్న వారు. అవసరంవస్తే వారెంత డబ్బైనా ఖర్చు పెట్టగలరు'

ఇలా మాట్లాడుకుంటూ మేము స్వతంత్రపార్టీ ఆఫీసుకు వచ్చాము. ఇప్పుడక్కడ ఎవరూ లేరు. ఓటర్లలిస్టు రాసే వారంతా భోజనాలకు వెళ్ళారు. నేను, నా మిత్రుడే వున్నాము. భోజనం చేయగనే నడవటంవలన నాకు కొంచెం భుక్తాయాసంగా వున్నది. మా మిత్రుడు చొక్కా విడిచి గోడకు తగిలించి కాళ్ళుజాపి కూర్చున్నాడు.

నేను నావుద్యోగవిషయం గురించి ఆతనిని అడగాలనుకున్నాను. ఇంతవరకూ ఆతనే చెప్తాడనుకున్నాను, కానీ చెప్పలేదు. అంతేకాదు. అతను ఎప్పుడూవుండే హోటలు వుద్యోగం మానేసి ఈవుద్యోగంలో ఎందుకుచేరాడో చెప్ప లేదు. నా అనుమానం తీర్చుకోవాలి—

'ఏమిటి ఆలోచిస్తున్నారు?. మా మిత్రుడే అడిగాడు.

"మీరు హోటలు ఉద్యోగం ఎందుకుమానేశారు?"

నాప్రశ్న కాతడు నవ్వి, ఇలా చెప్పాడు.

"హోటలు ఉద్యోగం ఎప్పుడూవుండేదేగా, ఒకచోట మానుకుంటే మరుక్షణంలో మరొకచోట చేరవచ్చు. ఈ

సంవత్సరం మెట్రిక్ గూడా చదివితిని. మనకు దయతలచి ఉద్యోగము ఎవ్వరిస్తారు? అందుకని ఎలాగో మంచివుద్యోగం సంపాదించాలంటే ఇంతకంటే మార్గంలేదు. అందుకని ఈ లిస్టు రాయడానికి వచ్చాను.”

ఆతనిమాటలు నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించినవి. ఇప్పుడీ ఓటర్లపట్టీకి; అతని ఉద్యోగానికి సంబంధం ఏమిటో నాకు బోధపడలేదు.

మా మిత్రుడు నా ముఖంచూచి జాలిగా నవ్వాడు. మీ రెంత అమాయకులండీ?, యీమాత్రంఆలోచించలేరా. ఇక్కడ పోటీచేస్తున్న ముగ్గురు అభ్యర్థులలో డబ్బు, పలుకుబడి స్వతంత్రఅభ్యర్థికే ఎక్కువగా ఉన్నవి. ఇప్పుడు మనం ఆయన చెప్పినట్లుచేస్తే ఆయన గెలిచినతర్వాత ఆ అభిమానంతో ఏదో చిన్నగవర్నమెంటు వుద్యోగం యిప్పిస్తాడు. ఓడిపోతాడా, ఆయనకు చాలా మిల్లులు ఫ్యాక్టరీలు, ఇంకా ఏవేవో వున్నవిగా, వాటిల్లో ఎందులోనో గుమాస్తాగా పెట్టుకుంటాడు,’ అనినావైపు తదేకంగా చూచాడు. కానీనేనేమీ మాట్లాడలేదు. నాసంగతేమి టన్నట్లు ప్రశ్నార్థకంగా చూచాను.

మా మిత్రుడు అర్థం చేసుకున్నాడు. వెంటనే తిరిగిలా అన్నాడు.‘మీరుమాత్రం ఈసమయంలో ఊరికే వుండకండి. మీరుకాంగ్రెసు అభ్యర్థి ఆఫీసుకువెళ్ళి, ఓటర్లపట్టీ రాయండి

అవసరమైతే ఎన్నికల ప్రచారంకూడా చేయండి. ఇంతెందుకు? ఈనాలుగురోజులు వారు చెప్పిన పనల్లా చేయండి. మీకష్టం ఫలించకపోదు. మీఅభ్యర్థి గెలిచాడా, మీ వుద్యోగానికి దిగులులేదు ఓడిపోయినా, కాంగ్రెసుఅభ్యర్థి కాబట్టిఎక్కడో ఎలాగోమీకు వుద్యోగం ఇప్పించలేకపోడు. కానీ ఒక్కటి మాత్రం మీరు గుర్తుంచుకోవాలి"

'ఏమిటి' అన్నాను.

"మీరు తరుచూ ఆయనకు చేదోడుగా వుండాలి. ఆయన సమక్షంలో వున్నప్పుడు ఎవరికి ఏపని చెప్పినా మీరే అది చేయాలి. ఆయనదృష్టి మీమీద మళ్ళించుకొని ఆయనకు నచ్చారా- మీ రొట్టె విరిగి నేతిలో పడినట్లే అక్కడున్నంత సేపూ ఎంతో అణకువ, ఓర్పు, ఓపిక సహనం వున్నట్లుగా నటించాలి. మీరు ఇందులో ఎప్పుడు ఏపని చేయకపోయినా, యిబ్బందే. "మామిత్రుడు చెప్పడంఆపి, నావైపు చూచాడు

నేను ఆతను చెప్పినదంతా బాగా ఆకళింపు చేసు కున్నాను. కానీ నా మనస్సుమాత్రం మా మిత్రుని అభి ప్రాయానికి పూర్తి వ్యతిరేకము గావున్నది. నామనస్సెందుకో ఈ ఎన్నికలలో కమ్యూనిస్టు అభ్యర్థికి సహాయపడమని చెపు తున్నది. అదీనిజమే. కమ్యూనిస్టుఅభ్యర్థిని నేను స్వయంగా చూడలేదుగానీ, అతనినిగురించి అంతా బాగానే చెపు తున్నారు. అలాంటప్పుడు తుచ్ఛమైన ధనానికి, సుఖానికి ఆశించి, అంతరాత్మకు విరుద్ధమైన పనిచేయడం నాకిష్టంలేదు,

కానీ ఏంచేయను? ఎంతకాలం ఆదర్శాలు వల్లిస్తూ ఈ బాధలు పడను? ఏదో ఒకటి నిర్ణయించుకోవాలి. ఆదర్శాలకుపోయి అంతరాత్మకు తోచినట్లు చేయడమా? లేక మా మిత్రుడు చెప్పినట్లు చేయడమా? ఆలోచిస్తున్నాను — మా మిత్రుడు చెప్పిందీ నిజం. నేను కష్టపడి, ఎలాగో, కమ్యూనిస్టు అభ్యర్థికి సహాయంచేస్తే ఎన్నికలలో ఆతను గెలుస్తాడని నమ్మకమేమిటి? గెలిచినా ఆయన మాటవిని నాకెవ్వరు ఉద్యోగంయిస్తారు — ఇలా రెండువిధాలా చెడటం నాకూ యిష్టంలేదు. పోనీ, ఈ ఎన్నికల ప్రచారం అన్నిటికీ తెగించి ఆ కమ్యూనిస్టు అభ్యర్థికి చేస్తే కనీసం ఈ నాలుగు రోజులైనా ఆతడు తిండికైనా డబ్బిలిస్తాడో, లేదో? యిస్తే బాగుండు. కానీయివ్వడుగా, అసలే అది బీదవారిపార్టీ. అభ్యర్థి బీదవాడు. ఓటర్లు బీదవాండ్లు, యిందులోని వారెవ్వరు నన్ను ఒక్కపూట తిండికాదుకునే వారులేరు. మరి నాబ్రతుకు సంగతేమిటి?

ఇలా నేను నిర్ణయానికి రాలేక తీవ్రంగా ఆలోచిస్తున్నాను. ఈ విషయంలో మా మిత్రుడెంతో తెలివిగలవాడు. ఆతనిసిద్ధాంతాలు, ఆదర్శాలుకాస్త సోషలిజానివైనా, ముందు తన సంగతేమిటో చూచుకుంటాడు. ఆపైన సిద్ధాంతాలు వల్లిస్తాడు. అయితేయిదేమిటి? 'స్వార్థం కనబడకుండా రాజ్యం చేస్తున్నదే, అందుగూ యి తేనా, ఏమో! యిక్కడపోటీచేసే ముగ్గురు అభ్యర్థులు గుర్తుకువచ్చారు. ఇందులో ఎవరిదెక్కువ

స్వార్థం. నిష్కళంక దేశభక్తి, స్వార్థరహిత ప్రజాస్వామ్యం, బుద్ధి సూక్ష్మత యిందులో ఎవరికెక్కువవున్నవి? మళ్ళీనా ఆలోచన అభ్యర్థుల మీదికి మళ్ళింది ఒకొక్కరే అభ్యర్థులు నా మస్తిష్కంలో లీలగా కనిపిస్తున్నారు.

కానీ మామిత్రుడు నాకీ అవకాశాన్ని యివ్వలేదు. "ఏమిటి ఆలోచిస్తున్నావ" అన్నాడు.

నా ఆలోచన ఏమని చెప్పను? "ఏమీలేదు, కాంగ్రెసు అభ్యర్థి దగ్గర చేరకుంటావా?" అడిగాను. "మరి చేరక వేరే గత్యంతరంలేదు అభ్యర్థులు ఎన్నికలలో విజయులవడం నీ, నా అదృష్టంమీద ఆధారపడివున్నది" అన్నాడు "అవును" నిజమే, ఈ విషయంలో నాకంటే నీవే కొంత అదృష్టవంతుడివి. కాబట్టి మీ స్వతంత్ర అభ్యర్థే గెలుస్తాడు" అన్నాను.

"ఏమో ఎలా చెప్పగలం? ఈ త్రికోణపుపోటీ చాలా తీవ్రముగానే వున్నది. ఒకొక్కసారి యీ ఎన్నికలలో అభ్యర్థి కూడా ఆశించనివిధంగా జయాపజయాలు పొందుతాడు."

"అవునవును" ప్రజాభిప్రాయం ఎలావుందో ఎన్నిక ఫలితాలు వచ్చేవరకు ఎవ్వరూ చెప్పలేరు"-

"అది కష్టంగూడా"-

నేనిలా చివరకు ఈ ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థి దగ్గరకు వెళ్ళడానికే నిర్ణయించుకున్నాను. మా మిత్రుడి ఆదేశంప్రకారం మరురోజు ఉదయమే, నేను కాంగ్రెసుఆఫీసుకు

వెళ్ళాను- కాడెద్దుల వాల్‌పోస్టర్ నాకు ఆఫీసుముందే స్వాగతం చెప్పింది, ప్రహరీదాటి లోపలికి వెళ్ళాను కీర్తి శేషులైన నాయకులఫోటోలు, ఆ ప్రక్కనే మహానాయకుల ఫోటోలు వున్నవి అది చిన్నహాలు, అక్కడమాత్రం ఎవ్వరూలేరు ఆప్రక్కనే ఒక గదివున్నది. ఆగదిలోకి తొంగి చూచాను. సరాసరి లోపలికి పోదామనుకున్నాను. కానీ ఎందుకో నా కాళ్ళు అక్కడే ఆగిపోయినవి. నేను గదిలోకి తొంగిచూచినపుడు గదిలోనివారు ఒకరిద్దరు నన్నుచూచారు. నేనుమాత్రం అక్కడే నిల్చున్నాను. లోపలిమాటలనుబట్టి ఆ గదిలో యిద్దరకుమించి చాలామంది వున్నారనుకున్నాను. అంతాజరుగబోవుఎన్నికలనుగురించేమాట్లాడుతున్నారు. కంఠ స్వరాలనుబట్టి ఆ గదిలో ఎనిమిదిమంది వున్నారనుకున్నా.

నాలెక్క తప్పుకాదని తెలుసుకోడానికి నాకెక్కువసేపు పట్టలేదు. నేను ఊహామాత్రంగా లెక్కపెట్టిన జనం ఎనిమిది మంది మరుక్షణంలోనే బయటికివచ్చారు. అంతా శుద్ధమల్లె పువ్వుఖాదీ కట్టుకున్నారు. శాలువలు, పేటంచు కండువాలు, ఖాదీశిల్కు కండువాలు. వేసుకున్నారు. అందులో నాకు కావలసిన అభ్యర్థి ఎవరో నాకు తెలియదు. ఎలా అడగడం? నాకు కాంగ్రెసుఅభ్యర్థిపేరు మాత్రం తెలుసు. కానీ ఏం చేయను? అలాగే నిల్చున్నాను.

అంతా ఒక్కసారి బయటికివచ్చినా ఎవ్వరూ వెళ్ళి పోలేదు. మళ్ళీఅందరూ గుమిగూడి అక్కడ మాట్లాడుకుంటు

న్నారు. రహస్యం వచ్చినప్పుడు మాత్రం మాటల శబ్దవేగాన్ని తగ్గించి మాట్లాడుతున్నారు. అప్పుడప్పుడు అందులో ఇద్దరు మాత్రం నన్ను చూస్తున్నారు. చూచినపుడు ప్రశ్నార్థకంగా ముఖం పెట్టేవారు. కానీ నన్ను ఎవ్వరూ ప్రశ్నించలేదు. నాకు అలా వుండటం చిరాకుగానేవున్నది. కానీఏంచేయను? అంతస్థుల మధ్య దారుణసంగ్రామం జరిగే కాలంలో ఉద్భ వించాను మరి వారి మాటలనుబట్టి వారంతా చాలా సంతో షంగానే వున్నట్లు నాకు కనిపించారు. మధ్యమధ్య పకాపకా నవ్వేవారు. అలా వారు నవ్వుతూ ఆ సంతోషంతో నా వైపు చూచినప్పుడు నేను జీవచ్ఛవం అయ్యేవాడిని మరి నాకు సంతోషం కలుగకపోయె నవ్వడానికి! వారు నవ్వుతూ ఆ సంతోషంతో నా వైపు చూచినపుడు నే నింకేంచేయను? నన్ను చూచిన మరుక్షణంలోనే వారు నవ్వడం ఆపుచేసుకునే వారు, ఇలావుంది అక్కడ నా స్థితి.

ఒక అరగంటకాలం, అతికష్టంగా గడిచిపోయింది. ఒక్కొక్కరే అభ్యర్థికి శుభాకాంక్షలందచేస్తూ వెళ్ళిపోయారు. నాకు కావలసినఅభ్యర్థిఅక్కడే వున్నందుకునాకు కాస్తసంతో షంగానే వున్నది. అందరినీ సాగనంపి, కాంగ్రెసుఅభ్యర్థితిరిగి గదిలోకి పోబోతూ నన్ను ప్రశ్నార్థకంగా చూచాడు. నేను వోయిన పనిచెప్పాను. ఆయన ఏమీ మాట్లాడలేదు. గదిలోకి రమ్మని సౌంజ్ఞచేశాడు.

ఆ గదిలో యిప్పుడు నేను ఆయనతప్ప నురెవ్వరూలేరు. ఆయన డ్రాయరు ముందున్న కుర్చీలో కూర్చున్నాడు. నేను ఇవతలున్న కుర్చీలో కూర్చున్నాను. అక్కడ వాతావరణం చాలా నిశ్శబ్దంగా వున్నది. పైన ఫాను "గిర గిరా" తిరుగుతున్నది. ఆ శబ్దంతప్ప అక్కడ మరే శబ్దమూ లేదు. ఆ నిశ్శబ్దవాతావరణము చీల్చుకుంటూ ఆయననోటినుండి ఎప్పుడు ఏమాట వస్తుందోనని నే నాయన ప్రతి అవయవ కదలికను ఆసక్తితో జాగరూకుడనై చూస్తున్నాను. కానీ ఆయన నోటి నుండి ఎంతసేపుగడచినా మాటరాకపోవడం ఆ కటిక నిశ్శబ్ద నూతన వాతావరణం నాకు కొంచెం బాధను కలిగించినది. అలాగే ఓపికతో వున్నాను.

నీవు ఇప్పు డేంచేస్తున్నావు'హఠాత్తుగా ఆయన నుండి ఆణిముత్యాలలాంటి యీ మాటలు వచ్చినవి. ఈ హఠాత్తు చిన్న సంచలనానికి నేను కొంచెం అదిరిపడి, తిరిగి వెంటనే సర్దుకొని "నే నిప్పు డేం చెయ్యడం లేదు?" అన్నాను.

"నీ నివాసం" తిరిగి అర్థోక్తిగా ప్రశ్నించాడు.

"పార్కుని" చెప్పాలనుకున్నాను కానీ చెప్పలేదు. నేను పూర్వం వుంటున్న ఇంటిఅడ్రెసు చెప్పాను ఆయన నాసమాధానం విని తిరిగి మౌనంవహించాడు.

ఈసారి నేనే ఏదో కల్పించిమాట్లాడుదామనుకున్నాను అలా నిశ్శబ్దంగా గడపడం నాకు సాధ్యంకాదు. అయితే

పెద్దవారు ఏమి మాట్లాడాలి. ఈ సమయంలో ఏం మాట్లాడితే ఏ విపరీతార్థాలకు దారితీస్తుందోనని నా భయం. అందుకే మాట్లాడకుండా వూరుకున్నాను.

ఇంతలో ఆయనే తిరిగిలా అన్నాడు, 'మీకిక్కడ లిస్టు రాసేపనిలేదు మరి ఎన్నికలప్రచారం చెయ్యగలరా' ప్రశ్నించాడు.

మరి అన్నిటికి సిద్ధపడేగా నేనక్కడికి వెళ్ళినది. 'సరే' అన్నాను. ఈసారిమాత్రం ఆయన ఆలస్యముచేయలేదు. నా సమాధానం వినడంతోనే డ్రాయరులోనుండికొత్తరూపాయి నోట్లు పదితీసి నాచేతికిచ్చాడు. ఒక బాకా చేతికిచ్చి, కొన్ని కరపత్రాలు అందించి, సాయంకాలందాకా పట్టణమంతా తిరిగి మనకే ఓటు చేయమని ప్రచారంచేయమని చెప్పాడు.

ఆ ప్రచారం ఎలాచేయాలో నాకు తెలియదు. ఎలుకల మందు, క్రీస్తుప్రచారకులలా చేయాలా, లేక ఆ రేకుగొట్టం నోటిదగ్గర పెట్టుకొని ఏమనిచెప్పాలి ? ఆయననే ప్రార్థనా పూర్వకంగా అడిగాను.

ఆయన మాత్రం నన్నేమీ అనలేదు. నా ప్రార్థన మన్నించాడు. 'కాడెద్దుల గుర్తుగల పెట్టెలోనే మీ ఓటు' ఫలానా అభ్యర్థికే మీఓటు అని చెప్పి పట్టణమంతా తిరిగి రమ్మనమనిచెప్పాడు. సరేనని నేను బయలుపడ్డాను. ఆ విధంగా ఆ సాయంకాలందాకా తిరిగాను. మధ్య మధ్యలో

కాఫీ రెండుసార్లు తాగాను. ప్రచారంచేసేటప్పుడు ఇంకేమీ తినలేదు. నేనేమీ తినకపోవడానికి కారణం డబ్బులేక ఆకలి లేక కాదు, తింటూ కూర్చుంటే ఆలస్యమవుతుందనీ ప్రచారం పట్నమంతా చేయలేనని నేను గబగబా కాసిని కాఫీనీళ్ళు నోట్లోపోసుకొని పరిగెత్తేవాడిని. ఆవిధంగా నా మొదటిరోజు ప్రచారం పూర్తయింది. ప్రచారం ముగించి సాయంకాలం సూర్యాస్తమయానికి ముందే నేను కాంగ్రెసు ఆఫీసుకు వెళ్ళాను. నేనక్కడికి వెళ్ళేసరికి ఆఫీసు ముందున్న ఖాళీప్రదేశంలో కుర్చీ లేసుకుని ఆ ఉదయం మాట్లాడిపోయిన వ్యక్తులలో ముగ్గురు, కాంగ్రెసు అభ్యర్థి కూర్చుని మాట్లాడుకుంటున్నారు. నేనక్కడికి వెళ్ళగానే, వారు మాట్లాడుకునే మాటలు ఆపి, నన్నెంతో ఆప్యాయంగా దగ్గరికి పిలిచి, నన్నెంతగానో అభినందించారు. అందులో ఒకాయన ఆ మధ్యాహ్నం నుండి నేను చేసిన ప్రచారం వినివచ్చానని, చాలా బాగున్నదని, నా గొంతు చాలా పెద్దదని, వినసొంపుగాకూడా వున్నదని చెప్పారు. అసలీ మాటలన్నీ కాంగ్రెసు అభ్యర్థికిముందే చెప్పారు ఆయనెంతో సంతోషంగా వున్నాడు. ఆ రాత్రి ఎక్కడికీ వెళ్ళవద్దని బాగా విశ్రాంతి తీసుకొనమని చెప్పి, నాకక్కడ వుండటానికి ఒకగది ఏర్పాటుచేశారు.

ఆవిధంగా నేనక్కడ వుంటున్నాను. పగలల్లాప్రచారం చేసి వచ్చేవాడిని. రాత్రి పెందలకడనే సుష్టుగా భోంచేసి పడుకునేవాడిని. ఈవిధంగా వారంరోజులు గడచిపోయినవి.

ఈ వారంరోజులలో నేనక్కడ అనేకసంవత్సరాల అనుభవం గడించాను. ఆ నియోజక వర్గంలోని వివిధ గ్రామాల నుండి అసంఖ్యాకంగా రైతులు, చిన్నచిన్న భూస్వాములు, కూలీలు, వ్యాపారస్తులు వచ్చేవారు. వారు రాత్రిపూట మా ఆఫీసులో పడుకునేవారు. ఆ విధంగా రాత్రిళ్ళు అనేక రకాలవాగ్వివాదాలతో ఆ రాత్రిని గడిపి ఉదయంలేచి ఎటువారు అటువెళ్ళి పోయేవారు.

నేను చాలా జాగ్రత్తగా వారిమాటలు వింటుండే వాడిని. గ్రామాలలో కాంగ్రెసు అభ్యర్థి బలం వారిమాటలను బట్టి నాకు తెలిసిపోయింది. కానీ నేనెక్కడా ఆ అమాయక ప్రజలయొక్క అభిప్రాయాన్ని బట్టబయలు చేయదలుచుకోలేదు. కానీ నేనుమాత్రం దినదినానికి నా ప్రచారం ఉధృతం చేస్తు న్నాను. తిరిగినప్రదేశమే రోజూ తిరగడమైనా నాకు మొదటి వారంరోజులు ఏమీ విసుగనిపించలేదు. మొదటిరోజుకన్నా, రెండోరోజుతర్వాత మూడోరోజు, నేనుప్రచారంచేయడంలో నిపుణత్వం సంపాదించగలిగాను ఇప్పుడు నేను మా కాంగ్రెసు అభ్యర్థినిగురించి పార్టీని గురించి అనర్గళంగా పదిహేను నిమిషాలు చెప్పగలను.

ఒకరోజు నేనుపట్టణానికిదక్షిణంవైపుప్రాంతం ప్రచారం చేయడానికని వెళ్ళాను. అది నేనా పట్టణానికి కొత్తగా వచ్చిన పుడున్న ప్రదేశం, ఆ పట్టణానికి మూలగొట్టు ప్రదేశం. ముందే చెప్పానుగా అక్కడుండేదంతా అలగాజనమేనని. తీరా యిం

రోజు నే నక్కడికి వెళ్ళేసరికి ఎవరో, స్వతంత్ర పార్టీనిగురించి ఎన్నికల అనంతరం ఆపార్టీ అనుసరించు విధానాలనుగురించి మాట్లాడుతున్నాడు. వీడెవడో యీరోజు నాకు పోటీ వచ్చాడని నేననుకుంటూ దగ్గరికివెళ్ళాను. ఎవరోకాదు. మా మిత్రుడు. అతను నన్ను చూడగానే ప్రచారాన్ని ఆపుచేసి దగ్గరిలో నున్న అతని గదికి నన్ను తీసుకవెళ్ళాడు. అతను మాట్లాడి నంతసేపు ఆ ప్రాంతపాకాలలో వున్న స్త్రీ, పురుషులు విచిత్రంగా, విడ్డూరంగా నిలబడి చూచారు. మా మిత్రుడు ప్రచారం ఆపు చేయగనే ఎవరిపనులకు వారు వెళ్ళిపోయారు.

నేను మా మిత్రుడు ఆ గదిలో కాసేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నాము. ఇప్పుడతను ఓటర్లపట్టీ రాయడంలేదని నాలుగురోజులనుండి స్వతంత్రపార్టీ ప్రచారం చేస్తున్నానని చెప్పాడు. నన్నుమాత్రం జాగ్రత్తగా ఉండమని చెప్పిఅతను వెళ్ళిపోయాడు. నేనుఅక్కడ మాకాంగ్రెసు అభ్యర్థినిగురించి ప్రచారం మొదలుపెట్టాను. మళ్ళీస్త్రీ, పురుషులు చోద్యంగా నిలబడి నేచెప్పినంతసేపూ శ్రద్ధగా విన్నారు. నేను చెప్పడం పూర్తిచేయగనే ఎటువారు అటు వెళ్ళిపోయారు. నేనారోజు మరింకెక్కడికీ వెళ్ళలేదు. పెందలకడ నేఆఫీసుకు వచ్చివిశ్రాంతి తీసుకున్నాను.

అప్పటికి ఎన్నికలు వారం రోజులలోకివచ్చినవి. అన్ని పార్టీలవారు ఎన్నికల ప్రచారం ఎంతో ఉధృతంగా చేస్తున్నారు. వీలున్న చోటల్లా నాయకులు మీటింగులు, వాల్ పోస్టర్లు, బాకాప్రచారాలు, మైకు ప్రచారాలునానావిధప్రచారాలతో పట్టణమంతా మారుమోగుతున్నది. ఈరోజు ఒకచోట కాంగ్రెసువారు మీటింగు పెడితే, మరురోజే స్వతంత్రపార్టీ, ఆ వెంటనే కమ్యూనిస్టులు, ఇలావుంది పట్టణపరిస్థితి. ఈఎన్నికలలో పాల్గొంటున్న మూడు పార్టీలకు వెనుక, అనేక చిన్న పార్టీలు, పలుకుబడిగల పెద్దలు వున్నారు. వారు ప్రచారంలోకి దిగారు. ఎన్నికలలో జయాపజయాలెలావున్నా పోటీమాత్రం చాలా తీవ్రంగా వున్నది. ఎవరికి వారికి అనుమానమే, అపనమ్మకమే. కానీ ఆ నాటి రాత్రి ప్రక్కగ్రామాల రైతులు కాంగ్రెసు ఆఫీసులో పడుకుని మాట్లాడుకున్న మాటలు నా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నవి. ఒకవేళ వారు మాట్లాడుకున్నదే జరిగితే నా భవిష్యత్తేమిటి? నా జీవితానికి సుఖమంటూలేదా ! అని నా భావిజీవితాన్ని గురించి అనేక అనుమానాలు నా అంతరాత్మలో తలెత్తకపోలేదు. అయితే మామిత్రుడు చెప్పాడుగా. కాంగ్రెసు ఓడినా, కాంగ్రెస్సే నని. ఆఒక్కమాటే నా భావిజీవితంలో ఆశను రేకెత్తిస్తున్నది. ఆ ఒక్కమాటే ఆరిపోని చిన్న కొవ్వొత్తిదీపంలా ఎక్కడో మినుకు మినుకుమంటూ నా పురోగమనానికి నాందియైనది.

కాలచక్రం జగన్నాథుని రథచక్రాల్లా గిర్రున తిరిగి పోయినవి. ఎన్నికలరోజు నేను పట్టణంలోనే వున్నాను. ఓటర్లకు, స్వేచ్ఛగా, స్వాతంత్ర్యాలున్నవని చెపుతూనేఒక వైపు వారువచ్చి ఓటుచేయుటకు బండ్లు కార్లు రిక్షాలు, మూడు పార్టీలవారు ఉపయోగించారు. అక్కడక్కడా ఓటర్లనుతీసుకు రావడంలో పార్టీల వాలంటీర్లకు మధ్యమధ్య చిన్న ఘర్షణలు జరిగినా ప్రమాదా లేమీ జరగలేదు. ఆ రోజు కాంగ్రెసుఅభ్యర్థి చాలా హడావుడిగా తిరిగాడు. కనిపించిన ప్రతివాడికి చేతులెత్తి హృదయ పూర్వకంగా నమస్కారం చేశాడు.

ఆవిధంగా అప్పటికెన్నిరోజులనుంచో ఎదురుచూస్తున్న ఆ భయంకరమైన పగలు వెళ్ళిపోయింది, రాత్రి వీథులలో అక్కడక్కడ గుంపులుగా జనం మూగి, అభ్యర్థుల జయాపజయాలు నిర్ణయిస్తున్నారు. ఆ పగలల్లా తిరగడంవలన, నేను ఆరాత్రి ఎక్కువసేపు తిరగలేదు. పెందలాడే వచ్చి పడుకున్నాను.

ఇపు డాఫీసులో నే నొక్కడనే కాదు. నాలాగేఅనేక మంది యువకులున్నారు. వారంతా ఏదో చదువుకున్నవారే, నాలాగే ఉద్యోగాలులేక వచ్చామని అందులో కొందరు చెప్పారు. కానీ నేనెప్పుడూ స్వయంగా ఎవరినీపలుకరించలేదు. ఎవ్వరితోనూ స్నేహం కావాలనుకోను. ఎవరైనా పలుకరిం

చితేనమాత్రం సమాధానం చెప్పేవాడిని అయితే వారంతా, నాలాగే నిర్భాగ్యులుమాత్రం కాదు ఏదో వచ్చాక అంతే అందరూ జీతం తీసుకుంటున్నారు. నేనుమాత్రం ఏమీ మాట్లాడుకోలేను. నే చేరినప్పుడు కాంగ్రెసు అభ్యర్థిచ్చిన పదిహేనుహామీలు, తర్వాత మరి రెండుమూడ్లు రెండుసార్లు తీసుకున్నాను అంతే! మిగిలినవారంతా నెలకరవై చొప్పున తీసుకుంటున్నారని చెప్పాను. నేనుమాత్రం అలా అడగదలచుకోలేను నాకు కావలసినది ఆయన ఇచ్చే డబ్బుకాదు, ముందు కాంగ్రెసు అభ్యర్థి గెలవాలి. ఆతర్వాత నాకు నాచదువుకు తగిన ఉద్యోగం రావాలి వస్తుంది, ఇదే నాకోరిక.

ఆ మరురోజుదయమే నాతోబాటు అక్కడుంటున్న యువకులంతా వారికి రావలసినది తీసుకుని వెళ్ళిపోయారు. నేనుమాత్రంపోతానని అనలేను. అక్కడెవరూ వెళ్ళిపొమ్మనమని చెప్పలేదు. నేనలాగే వుంటున్నాను అలా మరొక రెండురోజులు గడచినవి. అప్పటికి వారంరోజులున్నవి ఎన్నికల ఫలితాలు తెలియడానికి. మా అభ్యర్థి తన గ్రామం వెళ్ళుతున్నానని చెప్పాడు. నేను నా ఉద్యోగవిషయం అప్పుడాయనతో చెప్పాలనుకున్నాను. కానీ ఫలితాలు వచ్చిం తర్వాతనైతే బాగుంటుందేమోనని ఆలోచించాను. అందుకే నేనేమీ సమాధానం చెప్పలేను. ఆయన వెళ్ళిపోయాడు.

అప్పటికి నలభైరోజులనుండి నేను కాంగ్రెసు ఆఫీసులో ఉండటంవలన నే నా పాక్కవైపుకే వెళ్ళలేను. పైన ఆఫీసను

గారమ్మాయి ఏంచేస్తున్నదో? నే నెటైనా వెళ్ళిపోయానని,ఆ అమ్మాయి దిగులుపడం దేమో? ఎలాఆమెవిషయం తెలియడం. ఇలా ఆలోచించాను. నా ఆలోచనకు నాకే ఆశ్చర్యం వేసింది. ఆ అమ్మాయి నన్ను గురించి ఎందుకు దిగులుపడు తుంది? నా పిచ్చి ఆలోచనకు నాకే నవ్వొచ్చింది. అన్నట్లు మా మిత్రుడిని ఒకసారి కలుసుకోవాలి. ఆతనిని ఎన్నికల ముందొకసారి కలుసుకున్నాను అంతే, మళ్ళీ ఈమధ్యఆతనిని కలుసుకోలేదు. అత నిప్పుడు ఏంచేస్తున్నాడో ఒకసారి చూడా లని బయలుదేరాను.

నా పార్కు అక్కడికి కెంతో దూరంలేదు. ముందు పార్కుకు వెళ్ళా లనిపించింది. అక్కడకు వెళ్ళి ఆప్యాయంగా బెంచీమీద కూర్చున్నాను. ఆఫీసరుగారి యింటివైపు చూచాను. ఆ అమ్మాయి కనిపించలేదు ఒకసారి కనిపించితే బాగుండుననిపించింది. నామనస్సులో స్థిరవాసం ఏర్పరుచుకున్న ఆమె రూపం కనిపించకపోయేసరికి, నాకు ఆప్తులైనవారిని పోగొట్టుకున్నంత బాధకలిగింది. ఏ విధంగా ఆ అమ్మాయి నా కిప్పుడు కనిపించుతుంది? మే మిద్దరం ఒకరినొకరం చూచు కొనడమేగానీ, ఎప్పుడూ మాట్లాడుకుని, కనీసం సొల్లాన్నా చేసుకుని ఎరగం. అయితే ఆ అమ్మాయి నాకిప్పుడు కన్పించదా? ఈ ఆలోచన నన్నెంతో కలవరపెట్టింది.

ఆ పార్కులోనుండి బయటికివచ్చాను. వస్తూ వకసారి చూచాను. ఫలితం లేదు. అక్కడనుండి రోడ్డుమీదకు వచ్చి

ఒకసారి వెనక్కు తిరిగి ఆ మేడ వైపు చూచాను. నా సంతోషాని
కంతులేదు. నాకు కావలసిన అమ్మాయి, నేను పరితపించే
అమ్మాయి యీ వైపు పిట్టగోడ దగ్గర కూర్చుని వున్నది. నేను
కన్నార్పకుండా పదినిమిషాలు చూచాను. కానీ ఆ అమ్మాయి
మాత్రం నన్ను చూచినట్లు లేదు. తదేకంగా రోడ్డు వైపు చూస్తు
న్నదే గాని, క్రిందివైపు చూడటం లేదు. మరి నేనక్కడున్నట్లు
ఆ అమ్మాయికెలా తెలుస్తుంది? మేడ దిగువకొచ్చి పెద్దగా దగ్గాను
ఆ అమ్మాయి చూచింది. కానీ ఆ చూపుల్లో ఆదుర్దా, ఆశ్చ
ర్యం రెండూ లేవు ఏదో సామాన్యంగా చూచింది. ఆమె
ప్రవర్తనకు నా కెంతో సిగ్గు వేసింది. నేను చాలా తొందర
పాటు పనిచేశానని మనస్సులో చాలా బాధపడ్డాను. ఇక
అక్కడ ఒక్క క్షణం ఉండలేకపోయాను. ఎంత శీఘ్రంగా ఆ
ప్రదేశాన్ని వదిలిపోతే అంత మంచి దనుకొని గబగబా నడిచి
పోయాను.

అలా స్వతంత్రపార్టీ ఆఫీసుకు వెళ్ళాను. మామిత్రుడు
చెప్పినట్లు స్వతంత్రఅభ్యర్థి దృష్టి మా మిత్రుడిమీద పడింది.
ఫలితంగా పట్టణంలో వున్న ఒక మిల్లులో గుమాస్తాగా చేరాడు.
నెలకు తొంభయి రూపాయలిస్తున్నారట. ఇదిగాక సంవత్స
రానికి రెండుమాసాల బోనసు, ఉండటానికో గది యిచ్చారు.
నే ననుకున్నట్లే జరిగింది. అతనెంతో అదృష్టవంతుడు. నే
నక్కడున్న కాసేపట్లో నేనూ మామిత్రుడు రెండుసార్లు కాఫీ
త్రాగాము, అక్కడినుండి తిరిగి నే నాఫీసుకు వచ్చాను.

ఎన్నికల ఫలితాలు ప్రకటించే రోజువచ్చింది. పల్లె టూరునుండి మా కాంగ్రెసు అభ్యర్థి ఒకరోజు ముందే వచ్చాడు. ఆ రోజంతా ఆయన ఖాళీగానే వున్నాడు. నా ఉద్యోగం విషయం ఆయనతో ప్రస్తావించాలనుకున్నాను. కానీ చెప్పలేదు మరురోజు ఫలితాలు తెలిసిన తర్వాత చెప్పితే బాగుంటుందని నేను నిర్ణయించుకున్నాను.

ఆ మరురోజు ఎన్నిక ఫలితాలు సాయంత్రము నాలుగు గంటలకే తెలిసినవి. నాఆశ నిరాశైనది. ఆనాడు ఆపల్లెటూరి రైతులు చెప్పినట్లే జరిగింది. కాంగ్రెసుఅభ్యర్థి స్వతంత్ర అభ్యర్థి ఓట్లు పంచుకోడంవలన కమ్యూనిస్టుఅభ్యర్థి గెలిచాడు. ఎన్నికల ఫలితాలు విన్న తరువాత మా అభ్యర్థిముఖాన నెత్తురు చుక్కలేదు. ముఖం తేలేసుకుని ఆఫీసుకు తిరిగి వచ్చాడు. ఓట్ల లెక్కింపురోజు చాలామంది ఆసక్తిగలవారు నాయకులు, ఉపనాయకులు, అధికారులు అక్కడికి వచ్చారు. స్వతంత్రపార్టీ అభ్యర్థివెంట మా మిత్రుడూ వచ్చాడు. అయితే స్వతంత్రపార్టి అభ్యర్థి ముఖంలో ఓటమి కనుపించ లేదు. ఆయన ఎప్పటిలాగే వున్నాడు.

ఈవార్త తెలిసిన మరుక్షణమే కమ్యూనిస్టు అభ్యర్థిని ఆ పార్టీవారు పూలమాలలువేసి వూరేగించారు. నేను, నా మిత్రుడు, ఆరోజు చాలా పొద్దుపోయేవరకూ తిరిగాము. ఆ తర్వాత ఎవరి నివాసాలకు వారము వచ్చాము.

నేను ఆఫీసుకు వచ్చేసరికి ఎవ్వరికీ చెప్పకుండా మా కాంగ్రెసు అభ్యర్థి ఆయన గ్రామం వెళ్ళిపోయినాడు. ఎప్పుడు వస్తాడని అక్కడున్న మరొక కాంగ్రెసునాయకుడిని అడిగాను ఆయన ఇప్పట్లో రాడని సమాధానం చెప్పాడు. ఆ సమాధానం నాకెంతో ఆశ్చర్యాన్ని కలుగచేసింది. ఏంచేయను. నా దురదృష్టం, నా ఖర్మమిలా కాలింది నిజానికి ఆయన తప్పేమీ లేదు. తప్పంతా నాదే ఇక అక్కడ వుండటంకూడా అనవసరమే, తిరిగి నాపార్కుకు వచ్చాను. ఆరాత్రి నాకు నిద్రపట్టలేదు. నా అసమర్ధతకు, నామీద నాకే ద్వేషం కలిగింది. ఆరాత్రి చచ్చిపోదామనుకున్నాను. కానీ నాలాంటి అసమర్ధుడు ఆ పనికూడా చేయలేడని ఆనాడు స్వానుభవంలో తెలుసుకున్నాను. నిజంగా ఆనాడు ఆపని చేసి వుంటే ఈ నా డీ కథ యిలా వుండేదికాదు.

తర్వాత నాలుగురోజులకు మా మిత్రుడు కలిశాడు. నా విషయమంతా అతనితో చెప్పాను. అంతా విని అతను నన్ను నా శరీరంలో ఎముకలు లేకుండా చితకకొడితే బాగుండనిపించింది. నాశరీరంమీద నాబుద్ధిలేని మనస్సుమీద నాకే అంతరోత కలిగింది. కానీ నా మిత్రుడు నన్నేమీ అనలేదు. ఆరోజు అతను నన్నేమనినా నేనుతిరిగాతనినిఏమనివుండేవాడిని కాదు, అతను నాకు మిత్రుడేకాదు. నా దృష్టిలో అతడు పూజ్యుడు. అలాంటి మిత్రుడు జీవితంలో తటస్థపడకపోతే, నా

దుర్భర, అసమర్థత జీవితం ఇంకా ఏవిధంగా, ఎంతహీనంగా తయారై వుండేదో! అందుకే ఆతను నాదృష్టిలో నిండుమానవత్వం వున్న మానవుడు. ఆ సమయంలో అతనిలో పాలు నాకు గుర్తుకురాలేదు. ఆతనిలో వుండే మంచే నాకు కనిపించింది. అందుకే నాకు పూజనీయుడయ్యాడు.

నే చేసిన పనికి ముందు కొంచెంసేపు బాధపడ్డా వెంటనే ఇలా చెప్పాడు. స్వతంత్రఅభ్యర్థికి చెప్పి ఉద్యోగం ఎక్కడైనా ఏర్పాటుచేస్తానని చెప్పాడు. నేనేమీ మాట్లాడలేదు. నా బలహీనత తెలుచుకుంటూ మనస్సులో కుమిలి కుమిలి ఏడ్చాను. భగవంతుడు నాయందెందుకింత నిర్దయగా వుంటున్నాడో నాకు తెలియదు. నాకు వయస్సు వచ్చిన తరువాత నేనెప్పుడూ, ఎవ్వరికీ, ఏఅన్యాయము చేసివుండలేదు. మరి నాకీ గతేమిటి? నా బ్రతుకేమిటి? జీవించినంతకాలం నేనిలా బాధలు పడుతూ చనిపోవలసిందేనా? నా జీవితానికి గమ్యమేమిటి? నేనెందుకు జన్మించాను, నాజన్మ సార్థకం కానపుడు నేనెందుకు బ్రతుకున్నాను? ఆ రోజంతా నేసలా ఆలోచించాను. అంతే! మరురోజునుండిమళ్ళీ ఉద్యోగాన్వేషణ ప్రారంభించాను.

ఈ విధంగా మరొక వారం గడిచింది. అప్పటని నేను భోజనం చేసి నాలుగు రోజులైనది. మామితుడు తనగదికి రమ్మనమని చెప్పాడు. కానీ నాకక్కడ వుండటానికిష్టంలేదు.

నాకు సంపాదన లేనపుడు నే నాతని మీాద ఎంతకాలమని ఆధారపడను? అలాగే అలవాటైన బ్రతుకును భారంగా గడుపుకు పోతున్నాను.

ఒకరోజు నాకొక చిన్న ఆలోచనవచ్చింది. కమ్యూనిష్టు అభ్యర్థి చాలా మంచివాడని మా మిత్రుడు, ఇంకా కొందరు చెప్పారు. ఇంతమంది చెప్పారుకాబట్టి, ఆతను చాలా మంచివాడై వుంటాడు. అంతేకాకుండా, ఎన్నికలలో కూడా గెలిచాడు. కాబట్టి నా అవస్థచూచి నాకు తప్పకుండా ఎక్కడైనా వుద్యోగం ఇప్పిస్తాడు, అని నేను నిర్ణయించుకొని, ఒకరోజు ప్రాతఃకాలం ఆయనింటికి వెళ్ళాను. ఆయ నొక కుర్చీలో కూర్చొని పేపరుచదువుకుంటున్నాడు. నా అలికిడి విని ఆయన నన్నుచూచి ముందు కొంచెం ఆశ్చర్యపడి, తిరిగి పేపరు చదవడం ప్రారంభించాడు. ఆయన నన్ను చూచినపుడు నేను నమస్కారం చేశాను. ఆయన పేపరు చదవడం పూర్తియై నట్లున్నది. పేపరు ప్రక్కనపెట్టి, "ఏం ఇలా వచ్చారు?" అని అడిగారు.

నేను వెళ్ళినపని, ప్రస్తుతం నే ననుభవించు కష్టాలు అన్నీ చెప్పాను. అంతావిని, తిరిగాయన ఇలా ప్రశ్నించాడు. "మీారు కాంగ్రెసుపార్టీకి ఎన్నికలప్రచారం చేశారుకదూ?"

నేను 'నిజమే' అన్నాను. కానీ నా అంతరాత్మలోని విషయం, ఆనాడు అలా చేయడానికిగల కారణాలు అన్నీ వివరంగా చెప్పాను. ఆయన నా కష్టగాథంతా విని, తప్పక నాకు సహాయం చేస్తాడనుకున్నాను. కానీ "నేను ఎన్ని కల్లో గెలిచినా, మా మాట లెక్కింటూరండి" అన్నాడు. ఆదానికేమీ మాట్లాడలేదు. అక్కడనుండి బైటపడ్డాను. అంతే. మళ్ళీ నా జీవితంలో ఆ రాజకీయనాయకులజోలికి పోగూడ దనుకున్నాను.

ఈ విధంగా కాలచక్రం దొర్లి పోతున్నది. కాలయముడు పుటలు తిరగ వేస్తున్నాడు. మానవుని మేధస్సు దినదినానికి ఎంతో అభివృద్ధి చెందుతున్నది. నాగరికత పెంపొందుతున్నది. మానవుడు దేవుడిస్థానం ఆక్రమించాలనుకుంటున్నాడు. ఉన్న వాడు కడుపునిండా తింటున్నాడు, సుఖంగా బ్రతుకుతు న్నాడు. లేనివాడి బ్రతుకు లేమితోనే మాడి, నశించిపోతు న్నాడు. ఇదీ యీ ఇరవయ్యో శతాబ్దపు నాగరికత.

ఒకరోజు మామిత్రుడు నాకొక సంతోషవార్త తీసు కొనివచ్చాడు. చౌదరీ ఆయిలు మిల్లులో గుమాస్తా పుద్యోగం ఖాళీ వున్నదని వెళ్ళమని చెప్పాడు. నేను ఆలస్యంచేయకుండా ఆ మరురోజే నే నా మిల్లుకు వెళ్ళాను. మేనేజరు చాలా మంచివాడు. నేను వెళ్ళినపని చెప్పగనే ఆయన నన్నేవో ప్రశ్నలు వేశాడు. నేనన్నిటికి సమాధానం

చెప్పాను. ఆ మరురోజు వచ్చి యజమానికి కనిపించమని, ఈ లోపు తనూ చెప్తానని చెప్పాడు. అంతతొందరగా అక్కడ పని అవుతున్నందుకు ఆరోజు నే నెంతో ఆనందించాను.

ఆ మరురోజు వారు చెప్పిన వేళకు కాస్త ముందే నే నక్కడకు వెళ్ళాను. యజమానికి నన్ను చూపించాడు మేనేజరు. కాని యజమాని ముఖం చిట్లించాడు. అంతటితో నా ఆశ నిరాశైనది. అక్కడినుండి బయటపడ్డాను. అక్కడ నేను వుద్యోగం పొందలేకపోవడానికి గల కారణం తెలుసుకున్న తర్వాత నాకు ఈనాటికీ ఆ కారణం ఆశ్చర్యంగానే వున్నది.

అక్కడినుండి నేను నామిత్రుడు పనిచేస్తున్న మిల్లుకు వెళ్ళాను. ఇక్కడ జరిగిన సంగతంతా నా మిత్రుడికి చెప్పాను. అంతా విని ఆత నెంతో ఆశ్చర్యపడ్డాడు. కానీ ఆతనుమటుకేం చేయగలడు? అతనితో చెప్పి మిల్లులోనుండి బయటకు వచ్చాను. ఆ సాయంకాలందాకా నేను ఉద్యోగాన్వేషణలో తిరిగి పార్కుకువచ్చాను.

అపుడు రాత్రి తొమ్మిదిగంట లవుతుంది. నా పార్కు ప్రక్కన మేడమీ దుంటున్న ఆఫీసరు, కుటుంబముతో బయటకువచ్చి జట్కాలో ఎక్కిపోయారు. ఈరోజుస్వయంగా నేను వారందరినీ చూచాను. అయితే వీరంతా ఈ అర్థరా

తప్పుడు ఎక్కడకు పోతున్నారు ? అసలు వీరివెంట నేను రోజూచూచే అమ్మాయి లేదేమిటి?వీరంతా వూరికి కాదుగదా. కాదు, అలా ఎన్నటికీ కాదు. ఏదో రెండో ఆట సినిమాకై వుంటుంది. ఇలా కొద్ది క్షణాలు గడచినవి.

కానీ నామనస్సంతా ఆ అమ్మాయిమీదనే వున్నది. ఆ అమ్మాయి ఎవరై వుంటుంది? ఈఆఫీసరుగారికూతురేమో? అదేనిజమైతే వీరితోబాటు ఇప్పుడెందుకు వెళ్ళలేదు? ఏమో? ఎంతోసేపు ఆలోచించాను. సమాధానం దొరకలేదు.

అప్పుడు తొమ్మిదిన్నరగంట లవుతుంది. పార్కులో జనం ఎవ్వరూ లేరు. నేనలాగే బెంచీమీద మేడవైపు ముఖం పెట్టి ఆలోచిస్తూ పడుకున్నాను. ఆ రాత్రి చాలా పొద్దు పోయేవరకు అలాగే పడుకున్నాను. అంతసేపు ఆ మేడ లోని ఆ కిటికీవైపే కన్నార్పకుండా చూస్తూన్నాను. కానీ ఆ అమ్మాయి కనిపించలేదు. ఇక ఎక్కువ సేపలా పడుకోలేకపోయాను. ఒత్తిగిలి పడుకున్నాను. నిద్రపట్టింది. నిద్రలో ఒక గమ్మత్తైనకలగూడావచ్చింది.ఆకలఇలావచ్చింది.

నేను, ఆ అమ్మాయికలసి ఈ పార్కులోనే, ఈ బెంచీ మీదనే ఒకరి కొకరు దగ్గరిగా కూర్చున్నాము. ఏవేవో విషయాలు చాలాసేపు మాట్లాడుకున్నాము, ఆ అమ్మాయిని నేనే ప్రశ్నలు వేశాను. వాటికామె ఉక్కిరిబిక్కిరైంది. అయితేనేం అన్నిటికి సమాధానం చెప్పింది. నేనామెనడిగిన ప్రశ్నలివి.

1. మీరు మొదటిసారి నన్ను చూచినపుడు మీ రేమనుకున్నారు?

2. నన్నుచూడగానే నేను అప్పుడు మీకెలా కనిపించాను?

3. నన్ను మీ రెంతవరకు ప్రేమించారు?

4. అది మామూలు ప్రేమా? లేక పురాణాలలోని ప్రేమా ?

5. మిమ్మల్ని నేను పెండ్లి చేసుకోకపోతే, మీ రేం చేస్తారు?

6. మీ రెవరు?

ఆమె వాటికిసమాధానంచెప్పింది. కానీ నన్నొక పిచ్చి వాడిలా చూచినట్లుంది నాకు.

అదే నిజమైతే నాప్రశ్నలకు సమాధానం ఎందుకు చెపుతుంది? ఆమె నన్ను గురించి అలా అనుకోలేదనుకున్నాను. అక్కడినుండి ఆమె నన్నువదలిపోతానన్నది కానీనేనే ఆమెను వదలి వుండలేనన్నాను. అలాఅయితే పెండ్లి చేసుకోమన్నది. అవును ఆమె చెప్పిందే నిజం. అపుడు రోజల్లా ఆమెనుదగ్గరే వుంచుకుని తనివితీరా చూడవచ్చు. ఇలా అనుకున్నాను. ఇంతలో మెలకువ వచ్చినది. ఆమె నన్ను విడిపోలేదు. నాదగ్గరే వున్నది. కాబట్టి నే నామెను తప్పకుండా పెండ్లి చేసుకుంటా ననుకున్నాను.

సంతోషంగా లేచాను. ముఖం కడుక్కుని రోడ్డుమీదకు వెళ్ళాలనుకున్నాను. ఇంతలో అప్రయత్నంగా నా చూపు ఆ కిటికీమీదకు మళ్ళింది. ఆ అమ్మాయి అక్కడేవున్నది నా కెంతో సంతోషం వేసింది. ఆమె అక్కడ వుంటుందని నే నూహించలేదు. అసలు జగత్తు రహస్యంకూడ అదేకాబోలు కాకపోతేఏమిటి? రాత్రిల్లా నేనామెకోసం కలవరించి, కనిపిస్తుం దేమోనని కాచుకుని వున్నాను. కానీ ఆమె కనిపించలేదు. ఇక యిప్పుడు కనిపిస్తుందని నే నూహించలేదు కానీ ఆమె కనిపించింది. నే నలాగే ఆమెనుచూస్తూ నిల్చున్నాను. ఆమె నావైపే చూస్తున్నది ఆ విధంగా కొద్ది నిమిషాలు గడిచినవి. కానీ మా ఇద్దరిలో ఏ ఒక్కరమూ చూపును మరల్చలేదు. ఆసమయంలో ఆమె నాకెంతో అందంగా కనిపించింది. అసలు ఏమాటకామాటే చెప్పుకోవాలి. ఆమె అందమైనదే. కానీ నన్ను అలా ఎందుకుచూస్తున్నదో నా కర్థంకాలేదు. కొంప తీసి అది ప్రేమకాదుకదా? అదే అయితేనా, నా జీవితంలో ఒక పెద్ద మార్పువస్తుంది. నే నా ఆఫీసరుకు అల్లుడ నవుతాను. అంతేగాదు, నా చదువుకు, శ్రమకు తగిన వుద్యోగం నాకు వస్తుంది. నేను అప్పుడు ఆయనలాగే పదిగంటలకు ఆఫీసుకు వెళ్ళుతాను. నా క్రిందివుద్యోగులను సమానంగా చూస్తాను. పై ఉద్యోగుల మెప్పులు పొందుతాను. ఇలా ఆలోచించాను. మళ్ళీ నా ఆలోచనకు నాకే నవ్వువచ్చింది. ఇదంతా నా భ్రమ, పిచ్చి. కాకపోతే ఆ అమ్మాయితో నాకు పెండ్లి

మిటి? ఆమె నన్ను వివాహం చేసుకుంటుందా? ఒకవేళ ఆమె ఇష్టపడినా, ఆ ఆఫీసరు యిష్టపడతాడా! అయినా నా కంటే వారికి మంచిఅల్లుడు దొరకకనా? వుద్యోగం లేని నా కిచ్చి పెండ్లిచేస్తారా? అలాఎన్నటికి ఈజగత్తులో జరగదు ఇదంతా నా పిచ్చిఆలోచన.

ఇంతలో నాకు మళ్ళీ ఒక ఆలోచనవచ్చింది. అసలింతసేపూ ఆ అమ్మాయి నన్నేనా చూడటం? ఏమో, నా వైపే చూస్తున్నదని నమ్మకమేమిటి? రోడ్డువైపు చూస్తుండవచ్చు. లేదా మరెవరైనా చూడవచ్చు. అయినా నాలాంటి దౌర్భాగ్యుణ్ణి ఎవరు ప్రేమిస్తారు? ఎవరు కనికరిస్తారు? నాఆలోచనకు నాకే నవ్వొచ్చింది. అక్కడనుండి గబగబా రోడ్డు మీదకు వెళ్ళాను.

చాలాసేపు రోడ్లన్నీ తిరిగాను. ఉద్యోగాలు ఎక్కడైనా ఖాళీ లున్నవేమోనని గవర్నమెంటు ఆఫీసులన్నీ గాలించాను. ఎక్కడికెళ్ళినా, ఖాళీలు లేవు అన్నబోర్డే ఎదురైనది. తిరిగి తిరిగి కొంపకుచేరాను. కొంపంటే యిల్లు అనుకునేరు. అది కానే కాదు. నాకొంప, నాపడకా, అంతా పార్కులోని ఆ బెంచేగా! అదే నాయిల్లు. నాసర్వస్వం. అసలు నాకు ఆ బెంచీకి ఏదో అవినాభావ సంబంధ ముండివుంటుంది. కాకపోతే ఈపట్టణంలో ఎన్నిపార్కులు లేవు, ఎన్ని బెంచీలు లేవు? నే నాపార్కుకే వచ్చి, ఆ బెంచీమీదనే కూర్చోవడం ఏమిటి? పురాణాలలో

లాగా ఆ బెంచీ పూర్వజన్మలో ఏ మనిషిజన్మో, ఏదో అయి వుంటుంది. అప్పుడు మా ఇద్దరికి ఏదో సంబంధం వుండివుంటుంది. అదిచూచి, ఎవరో ఒక దేవత మా యిద్దరినీ చూచి సహించలేక ఆబెంచీ పూర్వజన్మలో వచ్చేజన్మలో సిమెంటు బెంచీవి కమ్మని శపించి, నన్నిలా నిరుద్యోగిన్నై, పరప్రాంతాలలో తిండిలేక, యిల్లులేక తిరుగుతూ, ఆ బెంచీమీద పడుకుంటుండమని శపించి వుంటాడు. ఇలా అనుకున్నాను. కానీ ఏదైతేనేం నాకు ఆబెంచీఅంటే ఎంతో ప్రేమ. ఏదో తెలియని సంబంధం మాయిద్దరికీ వున్నది. అయితే వివరాలు మాత్రం ఈకలియుగంలో ఎవ్వరికీ తెలియదు కాబట్టి నాకూ తెలియవు.

ఆ రాత్రికూడా ఆ అమ్మాయి కోసం చాలాసేపు చూచాను నాకా అమ్మాయికనిపించలేదు. అసలు రాత్రిళ్లు పెందలకడనే పడుకుంటుందేమో ననుకున్నాను. కానీ నాకు నిద్రపట్టలేదు. కారణం ఏమైవుంటుందా అని ఆలోచించాను. ఆ! గుర్తుకువచ్చింది అప్పుడు, ఈ అమ్మాయి గొడవలో నా ఆకలి మర్చిపోయాను. నేను అప్పటికి భోంచేసి రెండురోజులైనదనేమాట అప్పుడుగాని నాకు గుర్తుకురాలేదు. ఏం చేయను? మళ్ళీ నాకు కష్టాలువచ్చినవి. నా జీవితంలో ఇలా ఇంకెన్ని ఏకాదశులు వెళ్ళిపోవాలో? అని ఆలోచిస్తూఎప్పుడో నిద్రపోయాను.

ఆ మరురోజు వుదయం నిద్రలేవగానే ఆ అమ్మాయి దర్శనం అయింది. ఆమె అక్కడినుండి చూడటం, నేను నా

బెంచీమీదనుండి చూడటం; మా ఇద్దరికి ఒక అలవాటై పోయింది ఈరోజు చాలాసేపు ఒకరినొకరు చూచుకున్నాము. అలా చూస్తూకూర్చుంటే సరిపోతుందా? ఏదైనా వుద్యోగం చూసుకోవాలిగా? అసలు ఈరోజు నిద్రలేచినప్పటినుండిఎంతో ఆకలిగా వున్నది. ఏదో విధంగా ఈరోజు భోంచేయాలి, అని అక్కడినుండి బయలుదేరాను చాలాసేపు చాలా బజార్లు తిరిగాను. కానీ నేను ఎవరిని ఒక కానీ ధర్మంచేయమని అడగ లేదు. ఆ స్థితిలో నే నడిగితే ఫలితం ఎలావుంటుందో నాకు తెలుసు; అందుకే నే నెవ్వరిని అడగలేదు.

ఆ విధంగా తిరిగి తిరిగి విసుగుపుట్టింది. ఎక్కడైనా కాసేపు విశ్రాంతితీసుకుంటే బాగుండు ననిపించింది. ఆ దగ్గ రలో ఎక్కడా విశ్రాంతి కనువైన ప్రదేశం కన్పించలేదు. అలాగే మరి రెండుబజార్లు తిరిగాను అక్కడ ఒక చిన్నగుడి వున్నది. అక్కడకెళ్ళి కాసేపు కూర్చుందామని లోపలికి వెళ్ళాను. కానీ నా ఖర్మనేమోగాని అక్కడా ఖాళీ లేదు. ఎవరో ఒక బ్రాహ్మణుడు పానకం, వడపప్పు పంచి పెడుతున్నాడు. నాకు ఆశ కలిగింది. నేనూ వెళ్ళాను కానీ అప్పటికేనాలాంటి దౌర్భాగ్యు లనేకమంది ఆమనచుట్టూమూగివున్నారు, వారిని చూచేసరికి నాకెంతో జాలి, కోపం కలిగింది. వాండ్లలో ఐకమత్యతలేదు. అందరూకలిసిఒక్కసారే ఆ ముసలి బ్రాహ్మ ణుడిమీద విరుచుకు పడుతున్నారు. అప్పటికి ఆయన నెంతో

ఓర్పుగా అందరికీ వడపప్పు పెడుతూనేవున్నాడు. ఎలాగైతేనేం చివరకు నేను గుప్పెడు వడపప్పు అందుకో గలిగాను. అది తింటూ అక్కడ ఒక బండమీద కూర్చున్నాను.

ఇంతలో అక్కడ ఒక్కసంఘటనజరిగింది. ఒకయువతి ఒకసారి వడపప్పు పెట్టించుకొని ఆ జనంలోనుండి బయటకు వచ్చి వడిలో పోసుకొని మళ్ళీ ఆ బ్రాహ్మణుడిమీద ఎగబడి నది. అలా ఎన్నిసార్లు చేసిందోగాని, చివర కామె అక్కడే పావుశేరు వడపప్పు పోగుచేసింది. ఆమె ప్రవర్తన నాకెంతో ఆశ్చర్యాన్ని కలుగజేసింది. దేవుడిదగ్గరకు వచ్చికూడా ఆమె చేసే పాపంచూచి నాకు కోపం ఆగలేదు. కానీ అలా ఆమెను తయారుచేసిన సమాజం ప్రవర్తనకు ఆమెమీద కోపంపోయి జాలికూడా కలిగినది

అలా ఒక అరగంటకుగాని ఆ జనసమర్దం తగ్గలేదు. వడపప్పు అయిపోయినతర్వాత ఆబ్రాహ్మణుడు పానకంబిందె బయటకు తీశాడు. మళ్ళీ జనంమూగారు. కానీ ఈసారి నేను వారి ననుసరించలేకపోయాను. జనసమర్దం తగ్గిందాకా ఒక మూల కూర్చున్నాను. కానీ చివరకు నాకు పానకంఅందలేదు. అందుకు నే నేమీ బాధపడలేదు. గుడిమూలవున్న పంపునీళ్ళు త్రాగి పడుకున్నాను. అలా చాలాసేపు పడుకున్నాను. టైమెంతయిందో తెలియదు. షుమారు మూడుగంటలవుతుం దనుకున్నాను.

అక్కడినుండి మళ్లీ బయలు దేరాను. నడుస్తూంటే ఎక్కిళ్ళు పట్టుకున్నవి. ఎందుకు ఎక్కిళ్ళు వస్తున్నవో మొదట నా కర్థంకా లేదు. చివరకిలా అనుకున్నాను మూడు రోజుల నుండి తిండి లేకపోవడంవలన, వడపప్పు తినడంవలన వచ్చిన ఎక్కిళ్ళేమో అనుకున్నాను.అసలింతకూయిదేంగుడి, ఇవ్వాళ ఏంవారం,బహుశా ఇది రాములవారి గుడి అయి వుంటుంది ఇవ్వాళ శనివారం అయివుంటుంది అనుకున్నాను. అక్కడ నుండి చివరకు నా పార్కుకు చేరాను.

నేను పార్కుకు వెళ్ళేసరికి మాహోటలుమిత్రుడక్కడ కూర్చుని వున్నాడు. అతని చూచేసరికి నా కెంతో ఆశ్చర్యం వేసింది. అతనలా నా కోసం ఎప్పుడూ రాలేదు. వెళ్ళడం తోనే కారణమేమిటని అడిగాను. ఎక్కడో గవర్నమెంటు ఉద్యోగం ఖాళీ వున్నదని, తెల్లవారి ఎనిమిది గంటలకు ఇంటర్వ్యూ అని చెప్పాడు.అతని మాటలు నాకెంతో సంతోషాన్ని కలిగించినవి. ఆతనికి నామీదవున్న అభిమానానికిఅత నికి నే నెంతో ఋణపడివున్నాను. నిజంగా అతనికి, నాకు ఎలాంటి సంబంధంలేదు.కానీ ఆతను మొదటినుండీ,నాయందు చూపే అభిమానం, ప్రేమ,ఆతడు నాకు గతంలోచేసినసహా యాలు అన్నీ గుర్తుకు వచ్చినవి. ఆ సమయంలో ఆతనునాకు ఆప్తబంధువుగనూ మిన్నగాకన్పించాడు. ఆతను చెప్పినదంతా విని నేను సరేనన్నాను. కానీ నాకొక అనుమానం వేసింది.

అప్పుడు నేను వేసుకున్న బట్టలు బాగా మాసి పోయి వున్నవి. గవర్నమెంటు ఇంటర్వ్యూ అంటే కాస్త హుషారుగా పోవాలి. కానీ ఏం చేసేది? నాకున్న రెండో జత బట్టలు చాకలి కొట్టులో ఉన్నవి. వాటికి డబ్బులిస్తే గాని ఆ బట్టలివ్వరు. కర్తవ్యం తోచక ఆలోచిస్తున్నాను. ఇంతలో మా మిత్రుడిలా అడిగాడు,

"ఏమండీ,ఏమిటో ఆలోచిస్తున్నారు"

ఆతనికి నా ఆలోచన చెప్పదామనుకున్నాను. కానీ చెప్పలేక పోయాను. "ఆ ఏమీలేదు!" అన్నాను. కానీ ఆతను నామాట నమ్మలేదు. అస లంతకు ముందునుండి నా విషయం అతనికి తెల్సును కాబట్టి అర్థం చేసుకున్నట్లు న్నాడు. అందుకిలా అన్నాడు.

'మీరు రేపుదయం యిక్కడేవుండండి ఏడుగంటలకల్లా నే నిక్కడికివస్తాను,ఇద్దరం కాఫీత్రాగిఅక్కడికి వెళ్ళుదాము.'

నేనేమీ మాట్లాడలేదు."సరే"అన్నాను ఆతను వెళ్ళి పోయాడు. కానీ నా ఆలోచన అదికాదుగా! ఒకపావలా (నాలుగణాలు) వుంటేబాగుండు.ఇస్త్రీబట్టలు వేసుకుని వెళ్ళ వచ్చు, ఇలాఆలోచిస్తూ సిమెంటు బెంచీమీదకూర్చున్నాను.

నాలుగణాలు సంపాయించటం కోసం చాలాసేపు ఆలోచించాను. కానీ ఆ నాలుగణాలు ఎలా సంపాయించాలో నాకు తోచలేదు.

తెల్లవారింది. షుమారుఆరుగంటలవుతుంది. నిద్రినుండి లేచాను. ఒళ్ళు విదిలించుకొని బెంచీమీద కూర్చున్నాను. తరువాత ఏంచేయాలో నాకు తోచడం లేదు. మరొక అర్ధ గంటలో నామిత్రుడు వస్తాడు. ఏంచేసినా ఈలోపే చేయాలి. బట్టలు తెచ్చుకోవాలి. చాకలికి డబ్బులిస్తేగాని బట్టలివ్వడు. అంతా నాలుగణాలబిల్లు. నా జేబులో ఒక్కపావలా డబ్బు లుంటే బాగుండు. ఏంచేయను? అవివుంటే ఈ ఆలోచనలన్నీ ఎందుకు? పోనీ ఎవరినైనా ఒకపావలా అప్పుఇవ్వమని అడుగు దామను కున్నాను కానీ ఎవరిని అడగాలి? ఎవరిస్తారు? మళ్ళీ ఆలోచన, ఏంచేయను ? అలావూరికే కాలం గడిచి పోవడం నా కిష్టంలేదు.

కానీ కాలం నేనాపితే ఆగుతుందా? ప్రపంచంలోని జీవరాసులన్నీ ఏకమైనా కాలాన్ని ఆపలేవు. ఆవిధంగామరొక పదినిమిషాలు గడిచింది. కాలంజరిగిపోయేకొద్దీ నాలోఆదుర్దా ఎక్కువైంది ఇక అక్కడ వుండలేకపోయాను. గబగబాపంపు దగ్గరకు వెళ్ళి నోట్లోనీళ్ళు పోసుకొని పుక్కిలించివుమ్మేశాను. అక్కడనుండి రోడ్డుమీదకువచ్చాను. ఎవరైనా తెలిసినవారు కనిపిస్తారేమోనని వచ్చేపోయేజనాన్ని పరీక్షగాచూస్తూనిల్చు న్నాను. అలా చాలాసేపు నిల్చున్నాను. కానీ ఎవ్వరూ కని పించలేదు. ఈలోపు నాకొక అనుమానం కల్గినది. నా మిత్రుడు నాకోసం పార్కుకువచ్చి నేను అక్కడ లేకపోవడం

చూచి ఎక్కడికైనా నాకోసం వెతకడడానికి వెళ్లాడేమోనని పించింది. ఇలా .వృహించిన తరువాత అక్కడ ఒక్కక్షణం వుండలేకపోయాను అక్కడినుండి గబగబా మళ్ళీ పార్కుకు వచ్చాను. అప్పుడక్కడ ఎవ్వరూలేరు. మామితుృడు రాలేదను కున్నాను. కానీ నాకు అనుమానంగానేవున్నది ఒక వేళవచ్చి నేను లేకపోవడం వలన వెళ్ళి పోయాడేమో ననుకున్నాను.

ఇలా నేను ఆలోచించినతర్వాత నాశరీరం ఆదుర్దాతో కంపించింది. గుండెదడదడకొట్టుకోడం ప్రారంభించింది. హారి భగవంతుడా, ఎందుకువెళ్ళాను నేను రోడ్డుమీదకు? ఒక వేళ నామితుృడు వచ్చిపోయినమాట నిజమైతే యింక నాపని ఖాళీ మళ్ళీనిరాశతో వుద్యోగాన్వేషణలో చాలాకాలంగడప వలసి వస్తుంది. ఎందుకు నాకా బుద్ధి పుట్టించావయ్యా? నా మీద నీకింకా దయకలగలేదా? నేనేం పాపంచేశానని నాకీ బుద్ధిపుట్టించావు? ఇలా విలపించాను. నాఏడుపు, నా గోల ఎవ్వరూ వినలేదు. ఇంకానయం, మళ్ళీ నాచుట్టూ జనం మూగి వుండేవారు. అలామనస్సులో అనుకుంటూ అక్కడే నిల్చున్నాను.

ఆవిధంగా అక్కడే చాలాసేపు నామితుృడి కోసం నిల్చున్నాను, కానీ ఆతని జాడేమీలేదు. ఇంకలా ఎక్కువ సేపు నిల్చోలేకపోయాను. అసలే మూడురోజులనుండి తిండి లేకపోవడం వలన ఆకలిదహించి వేస్తున్నది. కాళ్ళుపీక్కుపోతు

న్నవి. అప్పుడప్పుడు కడుపులోని ప్రేగులు రొద పెడుతున్నవి. కానీ ఏంచేయను? ఈబాధలు, ఈ కష్టాలు పడుతూ, యిలా బ్రతికేకన్నా, హాయిగా ఎవ్వరికీ చెప్పకుండా చస్తేబాగుండు. ఆ చావైనా నాలాంటి వారికి రాదుగా! దానికినన్ను చూస్తే భయమే, అందుకే నా చాయలకుగూడా రాదు.

ప్రతిరోజు దేశంలో ఎందరుమంచివాళ్ళు చచ్చిపోవడం లేదు? ఎందరు అంటురోగాలకు గురికావడం లేదు. నాకుఏదో ఒకరోగంరాగూడదు? కానీ నాకు రాదు. ఖచ్చితంగా చెప్ప గలను. నేనీ పట్టణం వచ్చినతర్వాతఎన్నిసార్లు, ఎన్నిజబ్బులు రాలేదు? ఎందరు చావలేదు? కానీ నాకు రావు. నాకువచ్చిం దల్లా ఒక్కటే. అదొక్కటే నన్ను జయించింది మిగతాఅన్ని టిని నేనుజయించాను. అదే, 'నిరుద్యోగం, ఆ రోగం నన్ను జయించింది. అదేనన్ను తిండి, గుడ్డ, సుఖంలేకుండా బికారిగా, సన్యాసిగా చేసింది. అదే నా జీవితాన్ని తారుమారు చేసింది. ఇప్పుడు కొందరి దృష్టిలో నేను మనిషినే కాదు, కొందరి దృష్టిలో నేను పిచ్చివాడిని, మరికొందరి దృష్టిలో బ్రతకడం చేతగాని దద్దమ్మను. ఇంకా రౌడీని, పోరంబోకును, యిలా నా కిన్ని పేర్లుపెట్టి లోకం నన్ను చూస్తున్నది. అందుకే ఏ చిన్న బిరుదు జారిపోకుండా, నన్నుకాపాడుతున్నారు.

అప్రయత్నంగా నా చూపు మేడమీది కిటికీమీద పడ్డది. అక్కడా అమ్మాయి వున్నది. నా కాశ్చర్యం వేసింది. అలాగే చూస్తూ నిలుచున్నాను. ఆ అమ్మాయి నా వైపే

చూస్తున్నది. అలా కొద్దిసేపుజరిగింది. ఆ అమ్మాయి అక్కడి నుండి కదలలేదు నేనే ఎవరైనా చూస్తారేమోనని నా దృష్టిని ఆ వైపే కేంద్రీకరించక, మధ్యమధ్య అటూయిటూ ఎవరైనా మనుష్యులను చూస్తున్నారేమోనని, ఆ అమ్మాయినిచూస్తూ నిల్చున్నాను. ఆ అమ్మాయి నావైపేచూస్తున్నది. ఆ కాసేపు నేను అన్నీ మరచిపోయాను. నా ఆదుర్దా, నా దిగులు ఆ అమ్మాయిని చూడటంతో పటాపంచలై పోయినవి. అలాఎంతసేపు చూచుకునే వారమోగాని యింతలో నామిత్రుడక్కడకు వచ్చాడు. అతను వస్తూనే 'ఏం మిత్రమా ఆ అమ్మాయిని పెండ్లి చేసుకుంటావా"? ఏమిటి అన్నాడు.

అతనలా మాట్లాడేసరికి నిజం చెపుతున్నాను. నాకెంతో సిగ్గేసింది. నా తల దానంతటదే వంచుక పోయింది. ఆ సమయంలో ఏమీ మాట్లాడలేక పోయాను.

'ఏమిటి ఆలోచిస్తున్నావు? నిజంగా పెండ్లిచేసుకుంటానంటే చెప్పు. మాట్లాడతాను" తిరిగడిగాడు. ఈసారి నేనేదైనా సరే జవాబు చెప్పాలి. లేకపోతే లాభంలేదు. యిలా అనుకున్నాను మనస్సులో. కానీ ఏమని సమాధానం చెప్పాలి? ఆ, సమాధానం దొరికింది. వెంటనే యిలా అన్నాను.

'నీవు మాట్లాడతా నంటున్నావు, ఎలామాట్లాడుతావు, వారుచూస్తేనో తే భాగ్యవంతులు. నేనేమో బీదవాడిని. నేను

వారికెలా అల్లుడవుతాను? నీవు నన్ను ఎగతాళి చేయడం కాక పోతే ఏమిటి నీమాటలు' అన్నాను. నేను కాస్త కోపంనటించి.

'నేనిప్పుడు నిన్ను ఎగతాళిచేయను మిత్రమా, ఇంతకు ముందెప్పుడైనా నేనలా నీవిషయంలో ప్రవర్తించానా? కానీ నీవు తీరా ఆ అమ్మాయిని చూచాక పెండ్లి చేసుకుంటావని నాకు నమ్మకం లేదు. అంచేత అలాఅన్నాను, అంతే.

'అదేమిటి అలాఅంటావు! ఆ అమ్మాయినిచూస్తే నేను పెండ్లిచేసుకోనంటావు. ప్రతిరోజు నేనా అమ్మాయిని చూడ టంలా?మళ్ళీయిక చూసేదేమిటి' కొంచెం ఆదుర్దా కనబరుస్తూ అన్నాను నేను.

'అదికాదుమిత్రమా! అయితే నీ కసలువిషయం తెలియ దన్నమాట. సరే! అయితే చెప్తానువిను. అని అతను చేతి గడియారంవైపు ఒకసారిచూచుకున్నాడు. అరె! టైముచాలా అయినది. ఇవుడుగాదు, తర్వాత చెప్తాను. పదపోదాం' అన్నాడు. ఇక నేనేమీమాట్లాడలేదు, అతనినిఅనుసరించాను.

అక్కడినుండి మే మిద్దరం రోడ్డుమీదకు వచ్చాము. నేను నా బట్టలవైపు ఒక్కసారి చూచుకున్నాను. చాలా అసహ్యంగావున్నవి. నెత్తిజుట్టు ముఖంమీదపడుతున్నది. అప్ప టికి తలకు నూనెరాచుకొని ఎన్నిరోజులైనదో? ఈ వేషంలో వెళ్ళితే ఖాళీ లున్నా, నాకు వుద్యోగం ఎవ్వరూ యివ్వరు. అసలు నన్ను ముందుగేటుదాటి లోపలకు రానిస్తారో లేదో? నాకే ఆశ్చర్యంగా వున్నది. పోనీ మిత్రుడి కిలా అని చెబుదా

మనుకున్నాను. ఆత నింతకుముందు నాకోసం ఎంతడబ్బుఖర్చు చేయలేదు? నావిషయంచెపితే తను తప్పకుండా నాకు పావలా యిస్తాడు, చెబుదామని నోటిదాకావచ్చింది. కానీ చెప్పలేక పోయాను. ఆతను నావిషయంలో ఏమీ అనుకోడని నాకు తెలుసు. కానీ ఆత నేమైనా అనుకుంటాడేమోనని నాభయం. అప్పటికి కొంతదూరంవచ్చాము. అతను నావైపుచూచాడు. నే నాతనిని చూడలేదు. క్రిగంటితో కనిపెడుతున్నాను. చివర కాతనే ఇలా అన్నాడు.

'మిత్రమా నే నొకటడుగుతానుసమాధానంచెప్తావా?'

"ఓ! తప్పకుండా, అడుగు"

"ఇలా అయితే నీ వీ బాధలుపడుతూ, ఈ నికృష్టపు జీవితం అనుభవించేకంటే, కాలం కలిసివచ్చేవరకు నా దగ్గర వుండగాదు?" అని నావైపు చూచాడు.

నే నేమీ సమాధానంచెప్పలేదు. ఆతను తిరిగి నన్ను ప్రశ్నార్థకంగా చూచాడు.

ఇక నేను చెప్పకతప్పింది కాదు. ఇలాఅన్నాను. "అదే మిత్రుడూ, నాలోని బలహీనత. కాలా న్ననుసరించి తెలివిగా కాలం వెళ్ళబుచ్చటం నాచేతకావడంలేదు. అందుకనే నేను లోకం దృష్టిలో వట్టి పనికిమాలినవాడిలా తయారయ్యాను." ఆతను మళ్ళీ ఏమీ మాట్లాడలేదు. అసలు ఆవిషయంగురించి మాట్లాడుట మానేసి యిలా అన్నాడు.

"ఇప్పుడు మనంపోయేది గవర్నమెంటు ఇంటర్వ్యూకు నీబట్టలు చాలా అసహ్యంగా వున్నవి. ఒక్కొక్కసారి ఆఫీసర్లు శుచి, శుభ్రానికే ఎక్కువ ప్రాముఖ్యత యిస్తారు" అన్నాడు.

దానికి వెంటనే నే నిలా అన్నాను. "అవును, ఆసంగతి నాకూ తెలుసు. కానీ ఏంచేయను? ఒక్క పావలా వుంటే లాండ్రీలో బట్టలు తెచ్చుకోవచ్చు. ఆ నాలుగణాల డబ్బులు నావద్ద లేకపోవడంవలన ఏంచేయడానికితోచక నీవువచ్చేవరకు ఆలోచిస్తూ వున్నాను" అన్నాను.

"మరి ఆ విషయం నాకక్కడ ఎందుకు చెప్పలేదు?" చెప్పలేక పోయాను. నీవు నాకు సహాయం చేస్తావని తెలుసు, కానీ ప్రతిచిన్నవిషయానికి నిన్ను అడగటంబాగుండదనిఅడగ లేకపోయాను."

"బలేవాడివి అందులో యిలాంటి సమయంలో మొహమాట పడితే ఎలా?"

ఇంతలో "ఎల్లోరా" హోటలు వచ్చింది. మేమిద్దరం కలిసి అందులోకి వెళ్ళాము. కుర్చీలో కూర్చుంటూ ఆతను మరొక్కసారి చేతిగడియారంవైపు చూచుకున్నాడు.

అక్కడ కాఫీ త్రాగి మే మిద్దరం గవర్నమెంటు ఆఫీసుదగ్గరకు వెళ్ళాము. అప్పటికి ఇంటర్వ్యూ మొదలుపెట్ట డానికి మరొక పదినిమిషాలు టైమున్నది. మే మిద్దరం గేటు దాటి లోపలికి వెళ్ళాము. అక్కడ ఒక బెంచీమీాద కూర్చు

న్నాము. అప్పటికే చాలామంది యువకులు వచ్చి కూర్చు న్నారు. ఇంకా వస్తూనే వున్నారు. వారందరిని చూచేసరికి నాకు నామీద ఎంతో అసహ్యము వేసింది. అక్కడున్న అందరూ ఎంతో "టిప్, టాప్"గా వున్నారు. అందరిలో నే నొక్కడినే చాలా అసహ్యంగా వున్నాను. ఇక అక్కడ నేను ఒక్క నిమిషం వుండలేకపోయాను. నా మిత్రుడికి సైగచేసి బయటకువచ్చాను. ఆతను నా వెనకాలే వచ్చాడు.

"ఒక పావలాయివ్వు, తొందరగా లాండ్రీకి వెళ్ళిబట్టలు తెచ్చుకుంటాను" అన్నాను.

అతను మాట్లాడకుండా, పావలాకాసుతీసి నా చేతిలో పెట్టాడు. నేను పరుగు లంగించుకున్నాను. "టైము చాలా తక్కువవున్నది, త్వరగా రా"అన్న నా మిత్రుడిమాట వినిపిం చింది ఆమాట వింటూనే నేను పరుగెత్త నారంభించాను.

గసపెట్టుకుంటూ లాండ్రీకి వెళ్ళాను. శరీరం అంతా చెమటపట్టింది. అప్పటికి స్నానంచేసి ఎన్నిరోజు లైందో ? శరీరంనిండా మట్టి పేరుకుపోయింది. నేను బట్టలువిడిచి ఆ ఇస్త్రీ బట్టలు కట్టుకుంటున్నాను. "ఏమండీ, చాలారోజులైంది బట్టలు వేసి. ఈమధ్య వూళ్ళోలేరా?" అడిగాడు లాండ్రి మేస్త్రీ.

"అవును" నేను బట్టలు వేసుకుంటూనే సమాధానం చెప్పాను. ఆ తొందరలో చొక్కా లాగూ గుండీలు పెట్టు

కోవడం మరచిపోయాను. విడిచినగుడ్డలు అతనికిచప్పగించి మళ్ళీ పరుగు లంకించుకున్నాను.

ఈసారి ఎక్కువసేపు పరుగెత్తలేక పోయాను. కొద్ది దూరం పరుగెత్తేసరికి ఆయాసం వచ్చింది. నోటితో గాలిపీలు స్తున్నాను. చెమటకు యిస్త్రీబట్టలు తడిసిపోయినవి. ముఖం నిండా జిడ్డు, చెమట కారి నోటిదాకా వస్తున్నవి. అయినప్ప టికి నేనుమాత్రం పరుగెత్తడం మానలేదు. ఇంకా, ఇంకా వీలైనంత తొందరగా పరుగెత్తాలని ప్రయత్నం చేస్తూనే వున్నాను. ఆతొందరలో నాచొక్కాలాగూగుండీలవిషయమే గుర్తుకురాలేదు. నేనలా నడిరోడ్డున పరుగెత్తడంవలన జనం నావైపే చూస్తున్నారు. కానీ నేనవేమీ పట్టించుకోనలేదు. నా గమ్యస్థానానికి చేరుకోవాలనే తొందరతప్పితే అపుడు నా మనస్సులో ఇంకే ఆలోచనా లేదు.

ఎలాగైతేనేం చివరకునేను ఆఫీసుకు వచ్చేవేళకు ఒక్క నిమిషం ముందుగానే నేను ఆఫీసుకు చేరుకో గలిగాను. మా మిత్రుడు నాకోసం గేటుదగ్గర ఎదురుచూస్తున్నాడు. అప్పటికే నిరుద్యోగులంతా లైనులో నిల్చున్నారు. నేనునా మిత్రుడు పోయి నిల్చున్నాము. అందువలన మేమిద్దరమే ఆఖరువాండ్లమయ్యాము.

ఇంతలో ఆఫీసరు వచ్చాడు. మొదటినుండి ఒక్కొక్క రనే పరీక్షచేస్తున్నాడు. నేను పరుగెత్తడం ఆపినప్పటికి శరీరం

మీద చెమటపూత్రింపో లేదు. ఇంకా నదులలోని 'చలము' లాగా స్వేదం కారుతూనేవున్నది. అప్పటికీ చొక్కాగుడ్డపెట్టి రెండుసార్లు ముఖం తుడుచుకున్నాను. కానీ పూర్తిగా తగ్గ లేదు. జుట్టంతా ముఖంమీదపడింది. ఆఫీసరు ఒక్కొక్కరినే పరీక్షచేస్తూ వస్తున్నాడు. అప్పటికి నేను చాలా దగ్గరలో వున్నాను.

ఆ ఆఫీసరును చూచేసరికి నా కెందుకో దడ పుట్టింది. కానీ ఎంతో ధైర్యంగా వుండా లనుకున్నాను. ఆయన ఒక్కొక్కరినే చూచుకుంటూ దగ్గరకువచ్చేకొద్దీ నేనుగుండెపైకివుబ్బి చ్చటం, పండ్లుబిగపట్టటం ఎక్కువైంది. కానీ నేను పైకిఎంత ధైర్యంగా వుండాలనుకున్నా గుండెదడ మాత్రం తగ్గలేదు.

ఆఫీసరు నల్లగా, లావుగా ఆరడుగుల ఎత్తువున్నాడు. కంటికి తెల్లద్దాల కండ్లజోడున్నది. అమెరికన్ జాకెట్టు పాంటు వేసుకున్నాడు. ఒక్కొక్కరినే పరీక్షగా చూస్తూ నాదగ్గరకు వచ్చాడు. నేను నాలోని నిస్సత్తువను, ఆకలిని పైకి కనబడ నీయకుండా, పేగులను అంటుకుపోయివున్న పొట్టనువుబికించి గట్టిగా గాలిపీల్చి రొమ్మును పైకివుబికించి మిలటరీ వాడిలా మొర పైకెత్తి నిల్చున్నాను. ఆఫీసరు నావైపు రెండు నిమి షాలు నిల్చుని చూచాడు నా గుండె మాత్రం ఆయన దగ్గరకు వచ్చిన తరువాత ఇంకా తొందరగా కొట్టుకోడం ప్రారంభించింది. ఇంతలో ఆయననన్ను దాటిపోయి వెనక్కు తిరిగి మీ అడ్రసులు ఇచ్చివెళ్ళండి. సెలక్టు అయినవారికి

కబురంపుతాము. అని పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళి పోయాడు.

అప్పటికిగాని నా గుండె దడ తగ్గలేదు. నేనూ నా మిత్రుడు ఆతని అడ్రెస్ యిచ్చాము. మరి నాకు ఇల్లు లేదుగా! అందుకని అలా చేశాను. అక్కడనుండి బయట పడ్డాము.

తర్వాత నేను నా మిత్రుడు కలసి రోడ్డు మీదకు వచ్చాము. అపుడు తొమ్మిది గంటలవుతుంది. వేసవికాలం కావడం వలన, అప్పటికే ఎండవేడిమి ఎంతో తీక్షణంగా వున్నది. నా కాలికి చెప్పులు లేకపోవడంవలన కాళ్ళుకొంచెం చురుక్కుమంటున్నవి కానీ నాకు అలానడవడం అలవాటేగా. అలాగే చాలా రోడ్లుదాటాము. నాపార్కుగూడా దాటాము. అలా ఎక్కడికి పోతున్నామో నాకు తెలియదు. నా మిత్రుడి వెనకాలే వెళ్ళిపోతున్నాను. అంతే!

కానీ ఆతనెక్కడికి వెళుతున్నాడో నాకు తెలియక పోవడం, ఎండవేడిమికి నేను తట్టుకోలేకపోవడం అతనినిఅడిగి వివరాలు తెలుసుకోవాలని కోరిక కలిగింది. 'ఏం మిత్రమా, ఇపుడు ఎక్కడికి పోవడం మనం' అని అడిగాను నేను.

'ఉదయం సినిమాకు' అని సమాధానం చెప్పాడతను.

ఆతను ఆమాట అనేసరికి హటాత్తుగా నాకు ఆనాటి సంఘటన గుర్తుకు వచ్చింది. వెంటనే ఇలా అన్నాను. 'ఆ రోజులా చేయవుగా'

'ఏరోజు, ఏమిటి' ఆశ్చర్యంగా నావైపు చూచాడు.

నేను ఆనాటిసంఘటన గుర్తుకు తెచ్చాను.

అంతా విని ఆతను విరగబడి నవ్వాడు. కానీమరేమీ మాట్లాడలేదు. అలా నడుచుకుంటూ మేమిద్దరంసినిమాహాలు వద్దకు వెళ్ళాము. అక్కడ రెండుతొమ్మిదణాలటికెట్లు ఆతను తీసుకున్నాడు. అది ఒక ఇంగ్లీషు స్టంటుసినిమా. నాకలాంటి వంటే అసలే గిట్టదు. కానీ నా మిత్రుడికలాంటివంటేబాగా యిష్టం. పైగా డబ్బులుగూడా అతనివే. ఇక నే నేంచేయను అయినా నేను రానన్నా, అతనెలాగూ మానేయడు. ఇష్టం లేకపోయినా వెళ్ళాను.

సినిమా హాలుదాటి బయటకు వచ్చేసరికి పన్నెండు న్నర గంటలైనది. పగలుసినిమా అవడంవలన తలుపులన్నీ వేయడం మూలంగా, గాలిలేక యిస్త్రీబట్టలు మరొకసారి పూర్తిగా తడిసిపోయినవి. అంతేకాదు. గుడ్డలకుకుర్చీలరంగు మట్టి అంటుకున్నవి. అక్కడినుండి ఇద్దరం కలసి ఒక హోటలుకు వెళ్ళి భోంచేశాము. అంతవరకు నన్ను అతను వదలి వెళ్ళనన్నాడు. మరిక నే నేం చేయను? ఆతను బలవంతం చేస్తుంటే నే నెలా కాదనను? అదే నాలోపం, అదే నాబల హీనత. అపుడు గాని అతను నన్ను విడిచిపెట్టనన్నాడు. అలా మే మిద్దరం కొంతదూరం పోయాము. ఇంతలో నాకుప్రొద్దుటి విషయం గుర్తుకు వచ్చింది. 'ఆఅమ్మాయిచరిత్ర ఏదో వున్నదని

చెపుతానన్నాడుగా, అప్పుడు ఇంటర్వ్యూ హడావిడిలో చెప్ప లేదు. ఇప్పుడు వినాలనికోరిక కలిగింది. వెంటనే వెళ్ళిపోతానం టున్న నామిత్రుడిని ఆపి ఆవిషయం అడిగాను. "ఆ, అప్పుడు చెప్తాన్నానుగదూ? మరి ఈ ఎండలో ఎక్కడకూర్చుందాము? నాగదికి వెళ్దాం రండి మీాకక్కడ చెప్తాను" అన్నాడు. కానీ నాకు అతనివెంట అతని గదికి వెళ్ళాలనిలేదు. ఏంచేయను. ఆ అమ్మాయివిషయం వినాలంటే అతనివెంట తప్పకుండా వెళ్ళాలి. ఇలా మనస్సులో అనుకుని "సరే పద" అన్నాను.

గదిలో అతను నేను కూర్చోవడానికి అతని బెడ్డింగు పరిచాడు! ఆతని గదిలో వున్నంతసేపు నా కెంతో చల్లగా వున్నట్లనిపించింది. అందులో క్రిందపరుపు మెత్తగా వున్నది. నేనింతవరకు అలాంటి పరుపుమీాద ఎప్పుడూ పడుకోలేదు. నా కెంతో హాయిగా వున్నట్లనిపించింది. ఆ కాసేపు అది స్వర్గంగా ఉన్నది నాబ్రతుకుకు.మరి ఎందుకుండదు? పాలుతాగనివాడికి పాలరుచి చూచినతర్వాత అదే అతనిప్రాణానికి పంచభక్ష్యపర మాన్నాలుగా వుంటుంది. అలాగే నాకూ, అలా వున్నదన డంలో ఆశ్చర్యంలేదు. ఆతను నా కాతని బెడ్డింగుపరచి ఆతను మరొకచాప పరుచుకుని, బెంగుళూరుబీడి ముట్టించి తరువాత ఇలా చెప్పడం ప్రారంభించాడు.

"ఆ మేడమీాదవున్నతను ఒకగవర్నమెంటు ఉద్యోగి. నెలకు దాదాపు మూడువందల రూపాయలు జీత ముంటుంది.

ఆయనకిద్దరు మగపిల్లలు, నీవు చూచే అమ్మాయి ఒక్కతే ఆడ పిల్ల. ఆయన కా జీతమే కాకుండా ఇంకా ఆస్థి ఉన్నది. ఇక ఈ అమ్మాయి పరిస్థితి, చిన్నతనంలో రెండు కాళ్ళూ విరిగిపోయినవి. అలాఎందుకు జరిగిందో ఎవ్వరికీ తెలియదు. ఆ అమ్మాయి చూట్టానికి చక్కగానేవే కానీ కాళ్ళు లేవు. ఎవ రైనాసరే ఆ అమ్మాయిని మనస్ఫూర్తిగా ప్రేమించి పెండ్లి చేసుకుంటానన్న వారికి, ఆయన ఆస్థిలో సగంఇచ్చి పెండ్లి చేస్తానంటున్నాడు. ఇక ఆ అమ్మాయికి దాదాపు 10 సంవ త్సరాలుంటాయి. యువకులు కనిపిస్తే అలాగే చూస్తుంది. ఇపుడు నీవైపు చూసిందంటే అందులో ఆశ్చర్యమేమీ లేదు. మరి ఇపుడు చెప్పు. నీవు ఆ అమ్మాయిని పెండ్లిచేసుకుం టావా?" నవ్వుతూ నావైపు చూచాడు.

అతనిమాటలు నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించినవి. ఆ అమ్మాయి అలాఉంటుందని నేను ఊహించనైనా లేదు. ఇక ఇప్పుడు నాకో కొత్త సమస్యవచ్చి పడ్డది. ఏంచేయాలి? కాలావి కెదురీదలేక ఆ అమ్మాయిని పెండ్లిచేసుకోవడమా, లేక బ్రతికినన్నాళ్ళు ఇలాగే కష్టాలు అనుభవించడమా—ఇదీ నాసమస్య. ఇదే నాఆలోచన. ఏంచేయాలి, ఏది నిర్ణయించు కోవాలి? నేను రెండు నిమిషాలు ఆలోచించాను. కానీ, నేను ఏ ఒక్క నిర్ణయానికి రాలేకపోయాను. ఇంతవరకు నామిత్రుడు నావైపే చూస్తున్నాడు. నే నేమీ మాట్లాడకుండటం చూచి

అతను నావైపు ఎగతాళి చేస్తున్నట్లుగా చూస్తున్నాడు. అతనలా చూడటం నాకిష్టంలేదు. నిజంచెప్పాలంటే నే నాచూపు భరించలేను. ఏమీ మాట్లాడలేకపోయాను. గట్టిగా కండ్లు మూసుకున్నాను. కానీ కండ్లుమూసుకున్నా ఆ అమ్మాయే కనిపిస్తున్నది. దీనస్వరంతో నన్ను బ్రతిమిలాడినట్లుగా ఉన్నది. ఇక నేను ఎక్కువసేపు అలా వుండలేకపోయాను. 'ఆ అమ్మాయి కుంటిదైనా, గుడ్డిదైనాసరే, నేను ఆఅమ్మాయిని పెండ్లి చేసుకుంటాను" అని అప్రియత్నంగా అనేశాను.

నామిత్రుడు నామాటలకు వులిక్కిపడి లేచాడు. 'బాగా ఆలోచించావా మిత్రమా! లేక ఎగతాళిగా అంటున్నావా?' ప్రశ్నించాడను.

"నిజం చెబుతున్నాను. నేను ఆ అమ్మాయినితప్ప మరెవ్వరినీ పెండ్లిచేసుకోను నేను వూరికే అనడంలేదు నిజమే చెపుతున్నాను. నాజీవితానికి వివాహం చేసుకోవడం అంటూ వుంటే ఆ అమ్మాయినితప్ప మరెవ్వరినీ చేసుకోను ఇది సత్యం, అని పెద్దగా అని పరుపుమీద లేచికూర్చున్నాను.

అతను నవ్వుతూ నావైపు చూస్తున్నాడు. నామాటలు ఆతనికి నిజం అనిపించలేదుకాబోలు! ఏంచేయను? అది నా తప్పు కాదు. నా అభిప్రాయం చెప్పాను. అంతకంటె నేనేం చేయను? 'అలాగైతే ముహూర్తం పెట్టించమంటావా?, ఆ మాటలు హాస్యంగా అన్నట్లున్నవి. నేను తలవూపాను. 'సరే!

అలాగే కాసేపు పడుకో. ఇంకా బాగా ఆలోచించు. తర్వాత బాధపడితే లాభంలేదు' అని అతను చాపమీద అవైపు తిరిగి వత్తిగిలాపడుకున్నాడు నేనలాగే పడుకున్నాను, ఆలోచిస్తున్నాను' కండ్లుమూసుకున్నాను కానీ నాకా అమ్మాయి చూపే మాటిమాటికీ గుర్తుకువస్తున్నది. ఆఅందమైన ముఖానికి, ఆ కాళ్ళు లేకపోవడం నిజంగా ఒకలోపమే. ఆమెమీద భగవంతుడికెందుకో అంతకోపం? ఆమె ఏంచేసిందో? అమాయకురాలు! ఈడుకు తగినకోర్కెలున్నవి. ఆమెకిప్పుడు పురుషుడి అవసరం కలిగింది. తత్ఫలితం మగవాడినిచూస్తే ఆమెకు తెలియకుండానే ఆమెమనస్సు అటువైపు లాగేది. అది ఆమె తప్పు కాదు. అది సహజం. అదే సృష్టి, దానిని ఎవరు కాదంటారు. యిలా ఆలోచించాను.

అలాఎంతోసేపుఆలోచిస్తూపడుకున్నాను. నిజంచెప్పాలంటే నేను ఏఒక్క నిర్ణయానికీ రాలేకపోయాను. కానీ, ఎలాగో యిలా అనేశాను 'ఆ అమ్మాయిని పెండ్లి చేసుకుంటాను. ఎవరేమనుకున్నా సరే, నేను ఆ అమ్మాయిని తప్ప మరొకరిని పెండ్లాడను. ఇది సత్యం. మీరునమ్మండి నమ్మకపోయినా సరే, ఇదే నా అభిప్రాయం, గట్టిగా అన్నాను ఎవరో నామాటలు, నమ్మడంలేదని నాకుతోచింది. అందుకే అంత పెద్దగా అన్నాను.

నామాటలకు నామిత్రుడు నిద్రనుండి ఉలిక్కిపడి లేచాడు.'ఏం మిత్రమా! మెళుకువగానే వున్నావా? యింకా

నిద్రపోతూ కలవరిస్తున్నావేమో ననుకున్నాను. ఏం, ఆ అమ్మాయిని అంతగాఢంగా ప్రేమించావా?' ఈసారి నిజంగా వెటకారంగానే అన్నాడు. 'అవును. నిజమే. నీకు నన్ను చూస్తే ఎగతాళిగా వుంటుంది. కానీ నేనుమాత్రం ఎవరినీ ఎగతాళి చేయను. ఎవ్వరినీ తూలనాడను. బహుశా అదే నాలోని బల హీనత కావచ్చు' అన్నాను. అతనికి సరియైన సమాధానం చెప్పాననుకున్నాను.

'లేదు' మిత్రమా! నీవు ఆ అమ్మాయిని పెండ్లిచేసు కుంటానంటే నాకు ఆశ్చర్యంగా ఉన్నది. అందుకే అలాగా అన్నాను. నీకుముందు ఆ ఆస్తికోసం ఆ అమ్మాయిని పెండ్లి చేసుకుంటామని చాలామంది వచ్చారు. కాని వారిలో యే ఒక్కరూ ఆఅమ్మాయినిచూచాక పెండ్లిచేసుకోటానికి ధైర్యం చేయలేదు. మరి నీ విలా ధైర్యంచేశావంటే నిన్ను ఎగతాళి కాదు చేసేది. అసలు నిన్ను ఎగతాళిచేసినవాడు వెధవ. కార ణం? మే మెవ్వరమూ చేయలేనిపని నీవుచేసి సమాజానికి ఒక నూత్నపంథా సృష్టించి మాకందరికీ మార్గదర్శకుడివౌతావు. నిజంగా నీవు ఆ అమ్మాయిని చేసుకోడం మాకందరికీ సంతో షమే. అందుకు మేముసిగ్గుపడాలి. నీ వంతటిఘనకార్యం చేస్తే తప్పకుండా నిన్ను అభినందించాలి. తర్వాత నిన్ను అనుసరిం చాలి." ఏమంటావు అన్నట్లుగా నావైపుచూచాడు.

ఆ సమయంలో నా కాతని మాటలు ఎంతో బాగు న్నవి. కేవలం ఆ అమ్మాయిని పెండ్లిచేసుకొనడం నాబ్రతుకు

తెరువుకోసమే కాదు. సంఘానికి పనికిరాని, ఒక నవయావన వతిని, సంఘంలో ఒక మనిషిలా రూపొందించుతున్నాను. అందులో అనేకకష్టాలను ధైర్యంతో ఎదిరించవలసివుంటుంది. కానీ, యిక్కడ ఆ కష్టాలు నేనే అనుభవించాలి. ఇలా ఆలోచించాను. ఎలాగైనా సరే, ఆ అమ్మాయిని పెండ్లిచేసుకోవాలి. అప్పుడుగాని సంఘానికి ఒకత్రోవ చూపినవాడినికాను.

అలా ఆలోచించేసరికి, నా కెంతోసంతోషం వేసింది. నేను చేసేపనికి నన్ను ఎవరో వెనకనుండి అభినందిస్తున్నట్లుగా వున్నది.

ఆ ఆనందంలో లేచాను. అసాయంత్రం నాపార్కులో కలుసుకుంటానని నామిత్రుడికి చెప్పి అక్కడినుండి బయట బడ్డాను. నే నిప్పు డెక్కడికైనాసరే, నిశ్శబ్దవాతావరణంలోకి వెళ్ళి అక్కడ తీరిగ్గా ఆలోచించుకోవాలి. నామిత్రుడు చెప్పినట్లు కళ్యాణవిషయంలో తొందర పనికిరాదు బాగా ఆలోచించుకొని వివాహంచేసుకోవాలి. పెద్దలు చెప్పినట్లు వెయ్యేండ్ల పంట! మరి, వివాహమంటే నేటి వివాహాలా, రిజిష్టరు వివాహాలు, అసలవి వివాహాలు ఎలా అవుతవో నా కర్థంకాదు. ఏదైతే నాకేం? నే నలాచేసుకోబోతుంటే కదా! కానీ అదీ ఒకందుకు మంచిదే. ఖర్చులేకుండా వివాహం అయిపోతుంది- బుద్ధిమంతు లెవరు కనిపెట్టారో? ఒక విధంగా చాలా మంచి పద్ధతి.

ఈ విధంగా ఆలోచించుకుంటూ నడుస్తున్నా. ఎక్కడికి పోవాలి? ఈ మిట్టమధ్యాహ్నపువేండలో ఎక్కడ నాకు అనువైన ప్రదేశం దొరుకుతుంది? ఆలోచించాను. సమయానికి చక్కటి ఆలోచనతట్టింది. ఆ వెంటనే నా ఆలోచనప్రకారం అక్కడికి బయలుదేరాను. ఆ సంతోషంలో చాలా శీఘ్రంగా నడిచి అనుకున్న ప్రదేశం చేరాను.

అది మహిళామండలి కార్యాలయం. అక్కడెప్పుడూ ఎవ్వరూ ఉండరు. ఎప్పుడోగాని అక్కడ ఉపన్యాసాలు జరగవు. అందుకే అక్కడికి వెళ్ళడానికి నిర్ణయించుకున్నాను ఈరోజు నే నక్కడికి వెళ్ళేసరికి అక్కడొక మహిళానాయకురాలు ఉపన్యాసం చెబుతున్నది. పట్టణంలోని చాలామంది మహిళలు వచ్చారు. హాలంతా స్త్రీలతో కిటకిటలాడుతున్నది. ఈరోజు ప్రత్యేకత ఏమిటోగాని, చాలామంది స్త్రీలువచ్చేరు. ఉపన్యాసం చెప్పే ఆవిడ ఎవరోగాని, చాలా గట్టిగా పెద్దగా మాట్లాడు తున్నది. మధ్యమధ్య స్త్రీస్వాతంత్ర్యం గురించి, పురుషులతో బాటు స్త్రీకి అన్నిటా సమానహక్కు లుండాలని, అందుకు స్త్రీలు సంసిద్ధులు కావాలని, పురుషులతో పోరాడాలని చెప్తు తున్నది.

ఆవిడ ఉపన్యాసం నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. ఒకవిధంగా బాధగూడా కలిగింది నన్ను చాలాకాలం నుండి వేధించేసమస్యలలో ఇది ఒకటి — స్త్రీకి స్వాతంత్ర్యం

కావా లంటారు. స్త్రీకి స్వాతంత్ర్యం ఎందుకో నా కర్థం కాదు. వా రా స్వాతంత్ర్యంతో ఏంచేస్తారు?ఏం చేసినా, ఎన్ని స్వాతంత్ర్యా లిచ్చినా, స్త్రీ స్త్రీయే గాని పురుషుడు కా లేదు గదా? పురుషునిలోని ధైర్యం, పట్టుదల, సాహసం, స్త్రీకి ప్రకృతిలోనే లేవు. మరి, స్త్రీ స్వాతంత్ర్యంతో ఏంచేస్తుంది? ఒకచోట సమావేశమై వీరు సాధించే దేమిటి? భారతదేశానికి స్వాతంత్ర్యం రావడం ఈవిధంగా ఉపయోగపడుతున్న దా? అందరికీసంఘాలే! ఏమిటిఈవింత ప్రకృతి? అంతరాత్మను కట్టు దిట్టంచేసుకొని,నిష్కలంకమనస్సుకలిగివుండనినాడు, దేశంలో ఎన్ని సంఘాలువస్తేనేం? వ్యక్తి మంచితనం నశించిన తరువాత సంఘాలు, సమావేశాలు, ఉపన్యాసాల వలన ఉపయోగ మేమిటి?

ఇప్పుడు ఉపన్యాసం చెప్పే స్త్రీ పురుషుడిని కాదం టుందా? ఆమె సంతానం, సోదరులు, తండ్రి వీరిని కాదం టుందా? ఏమిటో ఈ వింతప్రకృతి, ఈవింత మన స్తత్వం? నే నిక అక్కడ ఒక్కక్షణం ఉండలేదు. అక్కడివారు నన్ను చూడకుండగనే నేను బైటకు వచ్చేశాను. ఆకాశం కారు మేఘాలతో అలముకొని ఉన్నది. వేసవికాలంలో ఇంత తొంద రగా వర్షపు మేఘాలు రావడం నాకు కొంచెం ఆశ్చర్యాన్ని కలిగించినది. కొద్దిక్షణాలలో వర్షం పడేసూచనలు కనిపిస్తు న్నవి. అలాగే రోడ్డునవస్తున్నాను. ఇంతలో వర్షంపడట

ప్రారంభించింది. వర్షం చాలా జోరుగా కురవడం మొదలు పెట్టింది. ఒక్కక్షణంలో జనసమ్మర్దంగా వున్న మార్గాలన్నీ నిర్జనమై పోయినవి. నేను ప్రక్కనున్న కిళ్ళీకొట్టు దగ్గరకు చేరాను. అప్పటికే తలకాస్త తడిసింది. అప్పుడే వర్షంవలన వచ్చినజనం యిద్దరు క్కడికిచేరారు. నేనువారినానుకుని అక్కడేనిల్చున్నాను.వర్షంగాలివిసురుతో మధ్యమధ్యమమ్ము లను కదిలిస్తున్నది.అక్కడున్న ముగ్గురము వేరే గత్యంతరము లేక అక్కడే వున్నాము.

ఇంతలో అక్కడికి ఒక సన్యాసి తడుసుకుంటూ వచ్చాడు. ఈప్రాపంచిక విషయాలమీద విరక్తిచెంది, ఆ మానవుడు సన్యాసత్వం స్వీకరించాడు. మొదటినుండి నా కలాంటి మనుష్యులంటే ఎంతో యిష్టం. నే నెల్లప్పుడూ అలాంటివారియందు ఎంతో దయ కనబరుస్తుంటాను. అతని మీదుండే అభిమానంతో నే నాతనికి నాస్థానంలో కొంత ప్రదేశ మిచ్చాను. ఆతను అక్కడ ఒక్కక్షణం నిల్చుని, కమండలంలోనుండి ఒకఅణాతీసి కిళ్ళీకొట్టువాడికిచ్చి 'అరవై మూడని' చెప్పాడు. ఆతనిచేష్టలు నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించినవి. నాకతనిముఖం చూచుటకుగూడా మనస్కరించ లేదు. కానీ నాకొక అనుమానం వేసింది. నాకేకాదు, అక్క డున్న ముగ్గురికీ ఆ సన్యాసి బ్రాకెట్టుఆడటం విచిత్రంగా వున్నది. కానీ ఎవ్వరూఏమీ మాట్లాడలేదు. నేను మాత్రం ఇలా వూహించాను. నాదగ్గర ఒక్కఅణా వుంటే బాగుండు. నేనూ ఒకఅణా ఆ అంకెమీద వేసేవాడిని. ఇందులో ఏదో

రహస్య ముండి వుంటుంది. అందరికీ సన్యాసికీ వస్తుతః భేద ముంది. కాబట్టి ఏ తపస్సు ఫలితమో ఆతను అవచ్చే నెంబరు కనిపెట్టి వేసివుంటాడు. కాకపోతే అంత కష్టపడి సంపాదించుకున్న డబ్బు ఎవరైనా ఇలా అనవసరంగా ఖర్చు పెట్టుకుంటారా? లేదు. తప్పక ఈరోజు ఈ నెంబరే వస్తుంది. ఇలా అనుకున్నాను. ఇంతలో వర్షం వెలిసింది. నే నక్కడినుండి నా పార్కు వైపు బయలుదేరాను.

ఆ సాయంత్రం నేను, నా స్నేహితుడు సరాసరి వారింటికి వెళ్ళాను. ఆరోజు ఆదివారం అవడంవలన ఆ ఆఫీసరు (కాబోయే మా మామగారు) ఇంటివద్దనే వున్నాడు. మేము పోగానే ఆయన సాదరంగా మమ్మలను ఆహ్వానించాడు. మేము వెళ్ళి లోపల ఒక సోఫాలో కూర్చున్నాము. నా స్నేహితుడు మేము వెళ్ళిన పని ఆయనకు చెప్పాడు. ఆయన ముందు కొంచెం అనుమానంగా నా వైపు చూచాడు. కానీ వెంటనే 'అమ్మాయి! అని కేక వేసి, లోపలికి వెళ్ళాడు. మే మిద్దరం తప్ప అక్కడ మరెవరు లేరు. నౌకర్లుగూడా ఎవరూ లేరు బహుశా శెలవుదినం కావడంవలన వారు వెళ్ళిపోయి వుంటారు. ఇంతలో చిన్న బండిలో కూర్చుని గాన్లు నెట్టుకుంటూ ఆ అమ్మాయి వచ్చి మా ముందు ఆగినది. ఆమెను చూచేసరికి నాకెంతో జాలి వేసింది. నిజం చెపుతున్నాను. ఆసమయంలో నాకు ఏడవాలనిపించింది. కానీ దేముడు ఆమె యందు చూపిన నిర్దయకు నాకు దేముడుమీద ఎంతో కోపం వచ్చింది ఇలా నేను అనుకుంటూ అక్కడికి వెళ్ళినవిషయం మర్చిపోయాను. ఇంతలో

నా మిత్రుడు చిన్నగా నాకాలు నొక్కాడు. అప్పటికిగాని మళ్ళీ నేనీ ప్రపంచంలోకి రాలేదు. ఆ అమ్మాయిని చూచాను. ఆమె నావైపే పరికించి చూస్తున్నది. మాయిద్దరికీ మధ్య ఎంతో దూరంగూడా లేదు. ఆమె నావైపే ఎంతో జాలిగా చూస్తున్నట్లనిపించింది నాకు. ఫర్వాలేదు. తప్పకుండా నిన్నే పెండ్లి చేసుకుంటాను. అని ఆమెకు చెప్పుదామనుకుని మాట నోటి దాకా వచ్చినది. కానీ చెప్పలేకపోయాను.

ఆమెముఖంమీదినుండి నాచూపును క్రిందికి మళ్ళించాను. మోకాళ్ళవరకే కాళ్ళు, మిగిలినక్రిందిభాగం ఏమీ లేవు. అలా ఆమె పగలల్లా ఆ బండ్లో కూర్చొని ఆ యింటి నాలుగు గదులు తిరుగుతుంది. తర్వాత ఆ బాడీని ఆమె మంచం దగ్గరకు తీసుకవెళ్ళి దానిలోనుండి మంచంమీద పడుకుంటుంది. ఆహారంగూడా దానిలోనే. మిగతావాటికి ఒకమనిషి తీసుక వెళ్ళుతుంది. ఏమైతేనేం ఆమెను కనిపెట్టుకుని ఎప్పుడూ ఒక్కమనిషివుండాలి.

నేను నామిత్రుడికి సైగచేశాను. ఇద్దరం కలసి బయటకువచ్చాము. అలా మేమిద్దరం చాలాబజార్లు తిరిగాము. చివరకు ఒకపార్కుకు వెళ్ళికూర్చున్నాము అక్కడ చాలాసేపు మాట్లాడుకున్నాము. ఎంత సేపాలోచించినా ఆమెను పెండ్లి చేసుకోవడమే మంచి దనిపించింది. కానీ ఇక తర్వాత రెండో విషయాన్ని గురించి ఆలోచించలేకపోయాను. 'సరే' ఏసంగతీ రేపువచ్చి చెపుతాను' అని నేను అతనిని వదలి నా పార్కుకు

బయలుదేరాను. దారిలో ఆలోచించాను. ఎంతగానో ఆలోచించాను. ఆ అమ్మాయిని ఒకవిధంగా పెండ్లిచేసుకొనడం మంచిదే! కానీ అదేస్వర్గం, అన్నీ అదేగా! అక్కడేపడివుండాలి. ఇక మళ్ళీ రెండో ప్రాపంచికవిషయాలలో జోక్యంచేసుకోడానికి వీలుండదు. ఆ అమ్మాయిని పెండ్లిచేసుకుంటే మామగారు మంచివుద్యోగంగూడా యిప్పిస్తాడు. ఆస్తివస్తుంది. లక్షణంగా బ్రతకవచ్చు. కానీ అందుకేనా పుట్టింది. మానవుడు కేవలం తిండికి, పిల్లలు కనడానికే అనుకుంటే అసలు ఆతను ప్రపంచంలో బ్రతకడం అనవసరం. అందుకు కాదుగా మానవుడు పుట్టింది! ఆతనితోనే ప్రపంచంనడుస్తుంది. ఆతను అనేక విషయాలకు కారణభూతుడు. అంతేగాని, మానవుడుపుట్టడం గిట్టకొరకు ఎంతమాత్రంకాదు–అనిఎవరోనొక్క చెప్పినట్లుగా వున్నది. పార్కుకు వచ్చాను. అప్పటికి లైట్లన్నీ వెలిగినవి. పార్కులో జనం అంత ఎక్కువగాలేరు. కానీ అక్కడక్కడా ఒకరిద్దరు కూర్చునివున్నారు. నేనువెళ్ళి నా బెంచీమీద కూర్చున్నాను. ఒక్కసారి అప్రయత్నంగా నాచూపు ఎదురుగావున్న మేడమీద పడ్డది. అక్కడనుండి కిటికీవైపు చూచాను. కానీ నా కా యింట్లో ఎవ్వరూ కనపించలేదు. ఆదివారముకదూ, బహుశా ఎక్కడికో వినోద కాలక్షేపానికి వెళ్ళివుంటారనుకున్నాను. ఇపుడు ఆయింట్లో ఆ అమ్మాయి ఒకతేవుంటుది. మాట్లాడవచ్చు. గబగబా వెళ్ళాను. గేటు దగ్గర ఎవ్వరూలేరు సరాసరి లోపలికి వెళ్ళాను. ఆఅమ్మాయి

ఒక్కతే కూర్చొని ఏదో చదువుకుంటున్నది. నన్ను చూచి నట్లుగా లేదు. ఇప్పుడిక ఏం చేయను ? ఎలా పలకరించాలి? ఇదీ నా ఆలోచన. ఎందుకువచ్చారంటే ఏమని చెప్పాలి? మళ్ళీ సమాధానంకోసం ఆలోచించడం ప్రారంభించాను.

ఇంతలో ఆ అమ్మాయి నన్ను చూచినట్లుగావున్నది. గబగబా బండి నెట్టుకుంటూ నా దగ్గరకు వచ్చింది. నా కేం మాట్లాడాలో తోచలేదు. అలాగే నిల్చుని చూస్తున్నాను. ఆ అమ్మాయి నానుండి దృష్టిమరల్చి 'కూర్చోండి. మానాం డ్లంతా సినిమా కెళ్ళారు, పదిగంటలకువస్తారు' అని చెప్పింది. నేను సోఫాలో కూర్చున్నాను. కానీ ఏం మాట్లాడాలి?" ఎందుకో ఆ అమ్మాయిని చూస్తుంటే నాకు సిగ్గుగావున్నది. ఆ అమ్మాయిముఖంవైపు చూడలేకపోయాను. కాని ఎవ్వరూ లేరని ధైర్యంగావున్నది. అందులో కాబోయేభార్య. మరిక సిగ్గెందుకుపడాలి? అని ఓరగంటితో ఆ అమ్మాయిని చూచాను. ఆమె తదేకదృష్టితో నావైపే చూస్తున్నది.

నాకు కొంచెం ధైర్యం వచ్చింది. కానీ పూర్తిగా తలెత్తి ఆ అమ్మాయిని చూస్తూ మాట్లాడలేకపోయాను. 'మీ పేరు?' అని అడిగానునేను—మరి ఏదో మాట్లాడాలిగా? అందుకు. 'సుమిత్ర' అని సమాధానం చెప్పింది. 'సుమిత్ర!' ఒకసారికి నాలుగుసార్లు నోట్లో అనుకున్నాను. మరింకేమీ మాట్లాడలేక పోయాను. లేచి వెళ్ళిపోదా మనుకున్నాను. కానీ నాసంగతి కనిపెట్టిం దామె. నన్ను లేవనీయలేదు. 'కూర్చోండి, మిమ్మ

లను చూస్తుంటే నా కెంతో సంతోషంగా వున్నది. ఇప్పుడే వస్తాను. అని గబగబా బండి నడుపుకుంటూ లోపలికి వెళ్ళింది.

ఆమెను చూస్తుంటే నా కంతులేనిజాలి వేసింది ఆమె కే కాళ్ళువుంటే మల్లోకాల్లో అంతచక్కని స్త్రీ లేదు. కాని, కాళ్ళు లేవు అసలు కాళ్ళువుంటే ఆ అమ్మాయి నా కెందుకు దక్కు తుంది? ఈపాటికి పెద్దపెద్ద వుద్యోగస్థుల కుమారులో, ధనవం తుల బిడ్డలో పెండ్లిచేసుకొనివుండేవారు. కానీ కాళ్ళు లేక పోవడం మూలంగా ఆ అమ్మాయిని పెండ్లిచేసుకోడానికి ఎవ్వరూ ముందుకు రావడంలేదు. ఇలా అనుకుంటున్నాను. ఇంతలో ఆ అమ్మాయి ఒక వెండిపళ్ళెంతో వచ్చింది. ఆమె పళ్ళెం నా కందించి నాకు మరీ దగ్గరగా ఆ బండి నాపింది. నేను ఆ పళ్ళెంలోని వాటివైపు ఒకసారి చూచాను. లడ్లు, కారబూంది! నా కిష్టమైన ఫలహారం. నా కెంతో ఆశ్చర్యం వేసింది. నేతివాసనకొడుతున్నది. అవిచూస్తుంటే నాకవి తిన్న ట్లుగానే వున్నవి. మళ్ళీ ఒకసారి సుమిత్రవైపు చూచాను. ఆమె సంతృప్తిగా నావైపుచూస్తున్నది. నేను పళ్ళెంలోనివి తినడం మొదలెట్టాను. ఒక్కొక్కటే అయిపోయినవి. కానీ ఆ అమ్మాయి ఇంకా నావైపుచూస్తూ నేవున్నది. ఆమెచూపు లోని అంతరార్థం ఏమిటోగాని, ఆమె ఈప్రపంచంలో లేదు. ఏదో తెలియని వ్యామోహప్రపంచంలోనుండి సంతృప్తిపడుతోన్న దనుకున్నాను. నేను మెల్లగా లేచి 'మంచినీళ్ళు ఎక్కడున్నవో చెప్పండి, నేను వెళ్ళి తాగివస్తాను' అన్నాను.

అప్పటికిగాని ఆమె ఈ ప్రపంచంలోకి రాలేదు. 'అయ్యో! మంచినీళ్ళమాట మరచిపోయాను. మీరు కూర్చోండి. ఇప్పుడే వస్తాను' అని, బండి కదిలించబోయింది. కానీ నేనామె కాశ్రమ కలిగించదలుచుకోలేదు. 'మీరు చెప్పండి, నేను తాగివస్తాను. మీరు శ్రమపడటం నాకిష్టంలేదు,' అన్నాను. నామాటలు ఆమె కెంతో జాలిగా వినబడినట్లున్నవి. ఆమె మరి నావైపే కన్నార్పకుండా చూస్తున్నది. నేను లోపలికి వెళ్ళాను. ఎదురుగా పంపు కనిపించింది. రెండుగ్లాసుల నీళ్ళు తాగి హాల్లోకి వచ్చి సోఫాలో కూర్చున్నాను.

ఈసారి ఆమె సోఫాలోకి వచ్చి కూర్చున్నది. అది ముగ్గురుకూర్చునేసోఫా, ఆమె నావైపుతిరిగికూర్చున్నది. నేను ఆమె కెదురుగా కూర్చున్నాను. ఇద్దరం ఒకరికొకరు దగ్గరగా కూర్చొని చూచుకున్నాం. నే నేమీ మాట్లాడలేను. అసలెలా మాట్లాడాలో గూడా నాకు తోచడంలేదు. ఆమె ఇలా అడిగింది, 'మీరెప్పుడూ పార్కులోనేవుంటా రేమిటండి?'

ఆమె నన్నలా ప్రశ్నిస్తుందని నేను కల్లోగూడా వూహించలేదు. అసలు నేనే ఏవేవో విషయాలు ఆమెనే అడగా లనుకున్నాను. తీరా ఆమెదగ్గరకు వెళ్ళిన తరువాత ఒకప్రశ్నా ఆమెను అడగలేకపోయాను. అక్కడ కూర్చున్నంతసేపూ ఆమె కుటుంబవిషయాలు, ఆమెకు కాళ్ళెందుకు పోయినవి వైద్యులుఏమన్నది- ఇంకా యిలాంటి విషయాలు అడగా లనుకున్నాను. తీరా ఆమె నన్నిలా ప్రశ్నించిన తరు

వాత నే నేం సమాధానం చెప్పాలో నాకు తోచలేదు. 'నీ కోసమే అలా వుంటున్నాను' అని అందామనుకున్నాను. కానీ అలా చెప్పలేకపోయాను. అలా చెప్పడం అన్యాయ మనిపించింది. ఆ అమ్మాయి నాయందు అంత అభిమానంగా వున్నపుడు నేనలా చెప్పలేకపోయాను. నాపరిస్థితిఅంతా చెప్పాను నేను పడే బాధలు, నా వుద్యోగాలలోని అనుభవం అన్నీ చెప్పాను. అంతావిని ఆ అమ్మాయికి నామీదప్రేమ లేకుండా పోతుందేమోనని భయపడ్డాను. కానీ అలాజరగలేదు అంతా విని ఆమె ఎంతో సంతోషించింది. పైగామీలాంటికష్టజీవులు నాకు. భర్తగా దొరకడం నా అదృష్టం అనిగూడా అన్నది. ఆ సమయంలో ఆమెకు నామీద చెప్పలేని ప్రేమ కలిగింది. నాకుమరీదగ్గరగా జరిగింది నాకూ ఆ సమయంలో ఆమెమీద అదొకరమైనఅభిమానమేర్పడ్డది. ఆమె ఆ మాటలుఅంటుంటే నా కెంతో సంతోషం వేసింది. నాకు తెలియకుండానే నేను ఆమెకు దగ్గరగాజరిగి ఆమెబుజాలు పట్టుకున్నాను. ఆమె సంతోషంగా నా ఒడిలోతలపెట్టింది. ఆ క్షణం మా ఇద్దరికీ ఏదో లోకంలో వున్నట్లుగా వున్నది.

అలా కొంతసేపు గడిచింది,'నేను వెళ్ళిపోతాను. మీ వాండ్లు వచ్చే వేళయినది. అని నేనులేచాను. అలానేను అన్నానేగాని నిజంగా నాకు వెళ్ళాలనిలేదు. అలాగే తెల్లవార్లు కూర్చుంటే బాగుండని పించింది. కానీ అది ఎలా సాధ్యం? అందుకే లేచాను. ఆమెదానికేమీ మాట్లాడలేదు. సం

తృప్తిగా, నన్ను మరచిపోరన్నట్లుగా నావైపు చూచింది. నేను పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ మెట్లుదిగి బయటకు వచ్చాను.

అక్కడినుండి నేనురోడ్డుమీదకు వచ్చాను అప్పుడునాకు పార్కుకు పోవా లనిపించలేదు ఆ రాత్రి మరెక్కడికైనా పోయి గడిపితే బాగుం డనిపించింది. ఇలా ఆలోచించిన తరువాత రోడ్డుమీద నడవడం మొదలెట్టాను. అలా చాలా రోడ్లు దాటాను. తండోపతండాలుగా జనం ఎదురువచ్చారు రిక్షాలు, గుర్రిబ్బండ్లు గోలచేసుకుంటూ వస్తున్నవి. బహుశా సినిమా వదిలుంటా రనుకున్నాను. అంతే. పదిగంటలవుతుంది. ఇంక ఎక్కువదూరం తిరగలేను. ఎక్కడైనా పడుకోవాలి. కానీ దాహం వేస్తున్నది అవును మరి, నేతి నరుకుతింటే దాహం వేయక ఏంచేస్తుంది? పది గంటలైంది. మునిసిపల్ పంపులలో నీళ్ళురావు. రాత్రిపూట మనుష్యు లెవరూ నీళ్ళు తాగరని కాబోలు మునిసిపాలిటీవారి అభిప్రాయం! ఏ ఇంటికైనా పోయి కాసిని మంచినీళ్ళడిగితే బాగుండు ననిపించింది. అక్కడి నుండి ఒక సందులోకి వెళ్ళాను. వాకిట్లో ఒక నడికారుయువతి నిల్చొని వున్నది. నేను వెళ్ళి ఆమెముందు నిల్చొన్నాను. 'ఈ పూట ఏమీా మిగల్లేదు వెళ్ళు' అన్నది.

ఆమె మాటలు నా కెంతో ఆశ్చర్యాన్ని కలిగించినవి. నేను బిచ్చగాడి ననుకున్నది. అవునుమరి, నిజంగా నా పరిస్థితి గూడా అలాగేవున్నది. నేను అడుక్కోటానికి రాలేదు. కాసిని మంచినీళ్ళు అడగటానికి వచ్చాను అని చెపుదామనుకున్నాను కానీ ఇక అక్కడ ఒక్కక్షణం వుండలేకపోయాను. అసలు నా పార్కుదాటి రాబట్టి ఇన్నిమాటలు పడవలసి వచ్చినది

అనుకున్నాను అక్కడినుండి గబగబా నా పార్కువైపుకు నడిచాను.

నేను నా బెంచీమీద పడుకుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాను నాకు నిద్ర రావడంలేదు నా ఆలోచనంతా ఇందాకటి విషయాన్ని గురించే? ఆమె నన్ను ఒక బిచ్చగాడి ననుకున్నది కానీ నిజంగా ఆమె అనుకున్నంత పనికిరూలిన వాడినా నేను? అన్నం లేకపోతే ఆకలితో మాడి చస్తానుగాని, ప్రాణం పోయినా అడుక్కు తింటానా? అడుక్కున్నా లోకం నాలాంటి వాడికి పెడుతుందా? ఇలా ఆలోచిస్తున్నాను.

అసలు నేను నా వూరు వదలి ఇక్కడికి ఎందుకు వచ్చాను? ఇక్కడ నేను బ్రతుకుతున్న బ్రతుకేమిటి? అలాంటపుడు ఇక్క డెందు కిలా వంటరిగా వుంటున్నానో నా కర్థం కాలేదు. ఇలా బ్రతుకుతూ ఇక్కడ వుండేకంటే ఈ బ్రతుకు అక్కడైనా బ్రతకవచ్చు. నా వూరు, నా వాండ్లు అందరినీ వదలివచ్చినందుకు నాకు తగిన శాస్తి జరిగింది.

పట్టణాలలో సుఖంగా బ్రతకవచ్చని, ఏదో ఒక వుద్యోగం చేసుకుంటూ హాయిగా కాలంవెళ్ళబుచ్చవచ్చని అనుకున్నాను. కానీ అలాఏమీ జరగలేదు. పొగలోనుండి సెగలోకి వచ్చినట్లుగా అయింది నాపని. అక్కడికంటే ఇక్కడే మరీ అర్థాన్నంగా వున్నది అక్కడ నాలాగేఆకలితో మాడేవారుచాలా తక్కువ. ఇక్కడ వారే వేలసంఖ్యలో వున్నారు. అక్కడకాస్త పాపభీతి, న్యాయం, అన్యాయం వున్నది. ఇక్కడవేమీ లేవు. ఎవరి బ్రతుకువారిది, ఎవరికష్టాలు వారివి. ఇదీ ఇక్కడి పరిస్థితి.

కాకపోతే ఇక బాగా బ్రతకాలనుకుంటే ఆ కుంటి అమ్మాయిని పెండ్లి చేసుకోవాలి.అలా ఆమెతో అదేస్వర్గం, అదేలోకం,అన్నీఅదేలా వుండాలి.ఇంక అక్కడనుంచీఎక్కడికీ వెళ్ళడానికి వీలుండదు. ఏంచేయాలన్నా ఆలంకారే, ఇపుడు కూటికి మాడుతున్నా కాస్త స్వతంత్రం వున్నది అప్పుడవేమీ వుండవు.ఇన్నిటికి తట్టుకుని ఆ అమ్మాయిని పెండ్లి చేసుకున్నా సౌఖ్యం వుండదు. ఎక్కడికీ వెళ్ళగూడదు. ఏంచేయాలనినా వారి అనుమతి తీసుకోవాలి,ఇదీ పరిస్థితి.అలా వుండటం చాలా కష్ట మనిపించింది. ఆ సమయంలో నాకు ఆ అమ్మాయి, ఆ పట్టణజీవితం అన్నిటిమీద విరక్తి కలిగింది బయలు దేరాను. ఎక్కడికి పోతున్నానో నాకే తెలియనిపరిస్థితితో నడుస్తున్నాను.అలా కొంతదూరం నడిచాను. దాహం ఎక్కువైనది. ఈసారి మరెవరినైనా అడగక తప్పిందిగాదు.నాలో ఈ ఆలోచన రాగానే గబగబా ప్రక్కసందులోకి వెళ్ళాను అక్కడా స్త్రీయే నిల్చుని వున్నది. నన్నామె చూడగనే నన్ను లోపలికి ఆహ్వానించింది. అపుడు నా కామె నిజస్థితి తెలిసింది. అక్కడనుండి వెనక్కు తిరిగాను. ఏంచేయడానికి తోచలేదు. ఇంకెవరినీఅడగటానికి మన స్సంగీకరించలేదు.గబగబాస్టేషను వైపుకు పరుగెత్తాను.

కావలసినవాటికన్నఎక్కువగా మంచినీళ్ళు త్రాగాను. తిరిగి వస్తున్నాను. ప్లాటుఫారంమీద మా వూరిబండి సిద్ధంగా వున్నది.అప్రయత్నంగా దానిని చూచేసరికి నాకు మావూరు,

మావాండ్లు, అక్కడి స్నేహితులు గుర్తుకువచ్చారు. అనుకోన ట్లుగా వెళ్ళి ఒక పెట్టెలో కూర్చున్నాను. అంతే! ఇక్కడనన్ను గురించి ఏమనుకునేది నాకు తెలియదు. అసలు వారు నన్ను గురించి ఏమనుకున్నా నా కేం భయం లేదు. కానీ నేను సుమిత్రకు మోసంచేశానే అని మనస్సులో బాధగా వున్నది. కానీ కాలానికి ఎదురీదలేకపోయాను. అందుకే ఇలా బయలు దేరాను.

ఇంతలో రైలు కదిలింది ఒక్కసారి నాకా పట్టణజీవిత మంతా గుర్తుకు వచ్చింది. ఆ పట్టణాన్ని వదిలిపెడుతున్నాననే బాధలేదు. సుమిత్రవిషయంలో నాకు దిగులుగా వున్నది. ఏం చేయను? నేను అసమర్థుణ్ణి, పిరికివాణ్ణి, బ్రతకడం చేతగాని దద్దమ్మను, ఇలా అనుకున్నాను అప్రియత్నంగా కండ్లనిండా నీళ్ళు తిరిగినవి అలా ఎందుకు జరిగిందో నాకు తెలుసు. సుమిత్ర విషయం తలుచుకుంటే నాకలా కండ్లనీళ్ళు వచ్చినవి. ఎలాగైతేనేం నేనా పట్టణజీవితానికి స్వస్తిచెప్పాను. నన్ను గురించి ఎవరేమైనా అనుకోనీ; నన్ను కొందరురౌడీయని, మరి కొందరు మోసకారియని ఇలా ఇలా అనుకుంటారు. ఆ సంగతి నాకు తెలును కానీ నే నేంచేయను? నేను సమాజంలోని అసమర్థతకు ప్రతిబింబంగా జన్మించాను. ఆ విధంగా నేను ఆ పట్టణ జీవితానికి స్వస్తి చెప్పాను. ఆ పట్టణ అనుభవమే నేను జీవితంలో సంపాదించిన నా ఆస్థి.

సమాప్తం

# పడగలెత్తిన కాలం

ఒకనాటి సాయంకాలం ఆకాశంలో దట్టంగా మబ్బులు పట్టినవి. ఆ పల్లెప్రజల సంతోషానికంతు లేక పోయినది. చల్లని పైరుగాలికి శరీరం పులకరిస్తున్నది. చెట్లు సంతోషంతో అటూ ఇటూ వూగిసలాడుతున్నవి. అప్పు టికి మూడు మాసాలనుండి ఆ పల్లె మీద వరుణదేవుని కన్నుపడలేదు. ఈనాటికాసుయోగం వచ్చిందని ప్రజ లెంతో సంబరపడ్డారు. చేలోవున్నపంట నాలుగు రోజు లలో కోత కొస్తుందని రైతులు సంతోషించారు. నాలుగు చినుకులుపడితే వూరిబయటనున్న చెరువులోనికి నీరువస్తుందని పశువులకాపరులు, చాకలివాళ్లు మోరలు పైకెత్తి ఆకాశంవంక చూచారు. చెరువునిండితే తలనిండా స్నానంచేసి చెరువుగట్టున కూర్చుని ఒకవైపు చెరువులోని తామర పూవులను చూస్తూ, మరొకవైపు వరిపైరు మీది నుండి వచ్చుచల్లనిపిల్ల గాలులననుభవిస్తూ సంధ్యావందనం చేయాలని గ్రామాధిపతులైన బ్రాహ్మణులు వూహించారు. చెరువునిండితే చేపలుమస్తుగా దొరుకుతవని బెస్తవాడొకడు ఆకాశంలోని తెల్లనిమేఘాలను చూస్తూ ఎంత వర్షంపడేది మనస్సులో లెక్కవేసు కుంటున్నాడు. చెరువు నిండితే ఈతలు కొట్టవచ్చునని ఆపల్లెపిల్లలు, సంతోషపడు తున్నారు. బావులనీరు తోడుకుని తెచ్చుకోలేని ఒక ముస

లవ్వ చెఱువునిండితే బాగుండునని అరకన్నులతో ఆకాశం వంక చూస్తున్నది.

కానీ మేఘాలు వర్షించలేదు. ఆప్తబంధువు చని పోయాడని తెలుసుకుని పరుగెత్తే మానవునిలా మేఘాలు ఎక్కడికో పారిపోయినవి. సూర్యాస్తమయ్యేసరికి చెమట పట్టటం ప్రారంభించింది. చెట్లు తమతప్పేమీ లేదన్నట్లు నిశ్చలంగా వున్నవి. ఆపల్లెప్రజల ఆశ నిరాశయింది. పచ్చని పంట పొలాలు ఒక్కసారి బావురమన్నట్లనిపిం చింది. గ్రామదేవతకేదో అపచారం జరిగిందనుకున్నారు. కొలుపులు చేయాలనుకున్నారు.

అది ఒక పురాతనపల్లె, పేరు అగ్రహారం. కానీ పేరులోతప్ప యిపుడు ఆవూరిలో ఒక్క బ్రాహ్మణకొంప కూడాలేదు. కొత్తగా ముందు ఆవూరువచ్చే వారికి అదిఒక చిన్న పల్లెటూరుగా కనిపిస్తుంది. కానీ అదీ బస్తీయే. బస్తీలోవుండే సౌకర్యాలన్నీ అక్కడవున్నవి. కంకరరోడ్లు మట్టిరోడ్లు, సిమెంటురోడ్లు, తారురోడ్లు, ఒక అరడజను దాకా వుంటవి, రోడ్లకిరువైపుల ఎలక్ట్రిక్ దీపాలున్నవి. ఊరిమొత్తంలో యిప్పుడు మనకొక పూరి పాకగాని పెంకు టిల్లుగాని కనుపించదు. అన్నీ డాబాయిళ్లే. అంతా ధన వంతులే.

నిజానికగ్రహారమొక చిన్న పల్లెటూరు. దాని యిప్పటిస్థితి యాభై సంవత్సరాల నాటి స్థితికి చాలా వ్యత్యాసమున్నది. పూర్వం యిక్కడ బ్రాహ్మణ యిండ్లు వ్యవసాయదారుల యిండ్లు వుండేవి. ప్రాతఃకాలంలోనే

ఆబ్రాహ్మణులు శిష్యులను వెంటబెట్టుకుని వూరిమొదట్లో వున్న చెఱువులో మూడు మునకలువేసి తడిబట్టలతో చెఱువుగట్టునచేరి సంధ్యావందనం చేసేవారు. అలావారు సూర్యోదయం వరకు అక్కడేవుండి గృహోన్ముఖులయ్యే వారు. ఆతరువాత విభూతి ధారణచేసి శిష్యులకు ఉపని షత్తులు, పంచకావ్యాలు చెప్పేవారు. అలా ఆ గురుశిష్యు లకు మరొక యావలేదు. అపుడపుడు మధ్యవిరామ సమ యాలలో, శిష్యులచేత వేదపఠనం చేయించేవారు. మధ్యాహ్న భోజనాదులవరకు అలాచేసేవారు. భోజనా నంతరం ఒకగంట కాలం విశ్రాంతి తీసుకునేవారు. ఇంతలో వూరి వ్యవహారాలు, వ్యవసాయదారులు, గట్ల చెట్లదగ్గర వచ్చిన తగాదాలలో న్యాయంకలుగచేయమని వచ్చేవారు. అలా గ్రామపెత్తనంగూడా చూస్తూ ప్రజలు న్యాయ మార్గం తప్పకుండా గ్రామం, బొడ్రాయి, మహాలక్ష్మమ్మ, మహామ్మారి మొదలగు గ్రామదేవతల ఆగ్రహానికి గురికా కుండా కాపాడుకుంటూ వచ్చేవారు.

ఇంతలో సూర్యాస్తమయం అవవచ్చేది. మళ్ళీ ఆ గురు, శిష్యులు సాయంసంధ్యకు చెఱువుగట్టున చేరి సూర్యాస్తమయంవరకు అక్కడే సంధ్యావందనంచేసి తిరిగి వచ్చేవారు. అపుడపుడు రాత్రిళ్ళు అతిథులు వచ్చినపుడు గాని, గ్రామప్రజల కోరికపైగాని భారత, భాగవత, రామా యణాది ఆదికావ్యములపఠనం జరుగుచుండేది. మధ్యమధ్య వచ్చే చిన్నచిన్న సందేహాలకు పండితులకు తర్కంలో ఒక చిన్న యుద్ధంకూడా జరుగుచుండేది.

ఇవిగాక పండుగ రోజులలో బొమ్మలాటలు, కూచి పూడి నృత్యాలు ఆడించేవారు. ఇక వివాహసమయంలో భోగంమేళం లేనిదే వివాహం అయ్యేదేకాదు.

ఇలా మాసాలు, సంవత్సరాలు శిష్యులు శుశ్రూష పొందిన గురువులు, తమ శిష్యులు ప్రతి కావ్యంలోను పరిపూర్ణులయ్యారని తెలుసుకున్నప్పుడుగాని ఆ శిష్యులను వదలిపెట్టేవారుకాదు. అలా ఎప్పుడూ అక్కడ అవిరామంగా వేదపాఠాలు, పురాణకాలక్షేపాలతో ఆ ప్రదేశం మారుమ్రోగేది. అంతేగాదు.అక్కడి బ్రాహ్మణులుతపఃశక్తి సంపన్నులు. సమస్త విద్యలలోను ఆరితేరినవారు తమ విద్యా కౌశల్యాన్ని అప్పుడప్పుడు మహారాజులకు, జమీందారులకు చూపి వారినుండి కొల్లలుగా బహుమతులను పొందేవారు.

ఆనాడు అగ్రహారం పండితులంటే, కాశీ నుండి కన్యాకుమారివరకు, మిగతా పండితులకు, సింహస్వప్నంగా వుండేది. పండితులన్న ప్రతివారు ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో ఒకచోట అగ్రహారం పండితులకు తలవంచకుండా వుండివుండరు. అలా వారు సర్వవిద్యాపారంగతులై తమంత శిష్యులను తయారుచేసేవారు. ఇలా దశాబ్దాల తరబడి తమ ప్రతిభను నిలుపుకుని, తమనోటికి చేతికి రెండోమాట లేకుండా కాలాని వెళ్ళబుచ్చారు. అయితే వారంతాలేరిప్పుడు. కాలగర్భంలో ఏనాడో కలిసిపోయారు. వాళ్ళసంతతి మాత్రం మిదిలారు. అయినా వారు లేరిప్పుడు వాళ్ళంతా అగ్రహారం వదలి పట్టణాలకు పోయి, ఏదో విధంగా కాలక్షేపం చేస్తున్నారు. వారిభూములన్ని రైలు జిరాయతీ

హాక్కుక్రింద లాక్కున్నారు. ఉన్న శాస్త్రాలు అప్పులక్రింద పోయింది. వారి గృహాలిప్పుడు ధనవంతుల మేడలైనవి. వారి వేదపాఠశాలలిపుడు బాడ్మింటన్, టెన్నిస్ కోర్టులైనవి. వారివేదఘోష నేటి రేడియో సంగీతంగా వినిపిస్తున్నది. ఊరిబయటవున్న చెరువుమాత్రం కాల ప్రవాహాన్ని, నీటిప్రవాహాన్ని తట్టుకుని వున్నది.

అప్పటి అగ్రహారం, యిప్పటి అగ్రాపట్టణంగా ఎలా మారిపోయిందో చెప్పటానికే చేటభారతమంత లేక పోయినప్పటికి, పున్నకాస్త చరిత్ర దాచకుండామీకు చెపుతాను. పూర్వం ఈ ప్రాంతం, శ్రీవాసిరెడ్డి వెంకటాద్రినాయుడు పాలనక్రింద వుండేది. ఆ మహానుభావుడు పండితులం, కవులం అన్నవారినల్లా సత్కరించి పోషించాడు. అంతే కాదు. ఆనాడు కాశీపట్టణం, సకలశాస్త్రాలకు, విద్యలకు నిలయం. అక్కడినుండి కొంతమంది మహాపండితులను, తమ ఆస్థానాలకు రప్పించి పోషించారు. అప్పటినుండి తమ ఆస్థానానికి, ఆశ్రయించడానికి వచ్చిన పండితులకు, కవులకు, తమ ఆస్థానంలోవున్న పండితులకు, కవులకు పోటీపెట్టి, ఆ పోటీలో తమ ఆస్థానపండితులను, కవులను గెలిచినవారికే అగ్రహారాలు, బహుమతిగా యిచ్చేవారు. ఇలా రాను రాను ఈవిషయం దేశంఅంతా ప్రాకింది. కాసీ అనేక మంది పండితులు, కవులు వచ్చిగూడా, కాశీ పండితులను చూచి వాగ్వివాదానికి దిగేధైర్యం లేక, వచ్చినత్రోవనే వెళ్ళిపోయేవారు. ఇలా కొంతకాలం జరిగింది. ఇంతలో కృష్ణాతీరంలో గొప్పకరువు వచ్చింది. ఆకరువుకు, అశేష

ప్రజలు, భయభీతులకు లోనయ్యారు. అనేక వందలమంది ఇళ్ళూ, పొలాలూ, వస్తువాహనాలు వదలి వలసలు వెళ్ళారు. అలా వెళ్ళినవారిలో నరసింహశాస్త్రి ఒకరు. ఆయన సకల శాస్త్రాలు చదువుకున్న మహాపండితుడు. వేద, వేదాంత, తర్క, మీమాంసలలో అందెవేసిన చెయ్యి. సాటిలేని సాహితీ సంపదవుండికూడా దరిద్రబాధ అనుభవింప లేక వాసిరెడ్డిరాజును ఆశ్రయించడానికి వెళ్ళాడు. అక్కడాయన తన పాండిత్యంతో పండితులను వాగ్వివాదంలో ఓడించడమే గాక మహారాజుచే అగ్రహారాన్ని బహుమతిగా అందుకొని రాజోద్యోగులను మన్నలకు పాత్రుడైనాడు,

ఆవిధంగా నరసింహశాస్త్రి అగ్రహారాన్ని సంపాదించాడు. అయితే ఆనాటి అగ్రహారం యీ రూపంలో లేదు. అంతా అడవి. క్రూరమృగాలు, విషజంతువులు తరతరాలనుండి నివాసం ఏర్పరుచుకున్నవి. అది అంతా రెండువేల ఎకరముల చదరం. ఈమధ్యలో ఒకచిన్న యిల్లు గూడా లేదు. అసలు జనసంచారమే లేదు. అక్కడక్కడా కాలిబాటలు మాత్రం వున్నవి. అవైనా ఈ మధ్యఏర్పడినవే. చెంచులు, లంబాడీలు, కట్టెలకోసం ఏర్పాటు చేసుకున్న చిన్న కాలిబాటలు. ఆస్థితిలోవున్న భూమిని సాగు చేసుకొని, వ్యవసాయ క్షేత్రంగా మార్చుకొనుటకు నరసింహశాస్త్రి కుటుంబం అనేక కష్టాలకు లోనుకావలసి వచ్చింది.

అప్పటికాయనకు ఒక్కడే మగపిల్లవాడు అతడైనా చిన్నవాడు. ఆస్థితిలో నరసింహశాస్త్రిని మరొకమార్గం కన

బడలేదు. సరాసరి ఒకనాడు, మహారాజు వద్దకు వెళ్ళి తాను వచ్చినపని మనవి చేసుకున్నాడు. మహారాజు ఈయన విన్నపం విన్నవాడై వెంటనే ఒక యానాది కుటుంబాన్ని, ఒకరైతు కుటుంబాన్ని సహాయంగా నరసింహ శాస్త్రివెంట పంపారు.

ఆమూడు కుటుంబాలవారు, ఆభూమిని సాగులోనికి తీసుకరావడానికి తమ యావశ్శక్తిని ధార పోశారు. అప్పటికిగాని ఆభూమి సాగులోనికిరాలేదు. ఆనాటి అగ్రహారం పదికొంపల చిన్నిపల్లె. ఈనాటి అగ్రహారం ఒకచిన్నబస్తీ. ఇంతకొద్ది కాలంలోనే ఆగ్రామం ఈ విధంగా మారి పోయింది.

ఇలావుండగా నరసింహశాస్త్రి అంతిమ దినాలలో ఒక చిన్నసంఘటన జరిగింది. బహుశా, ఆనాటి చిన్న సం సంఘటనే ఈనాడు ఆ గ్రామచరిత్ర మార్చి వేసింది.

నరసింహశాస్త్రి వస్తుతహ చాలమంచివాడు. దయా దాక్షిణ్యాలకు, ఆయన పుట్టినిల్లు. దాన ధర్మాలకు అంతు లేదు. ఆయనను సహాయం చేయమని అడగనివారు, ఆ నాడా ప్రాంతంలో అరుదు. అంతో, యింతో, ఆయన సొమ్ము తిననివారులేరు. ఆవిధంగా ఆయన జీవితం వెళ్ళి పోయింది. ఆరోజుల్లో నరసింహశాస్త్రి, దాన ధర్మాలు, చిన్నచిన్న కథలుగా, బాగా ప్రచారంలో వుండేవి.

ఒకనాడు రాయలసీమ నుండి సుబ్బిశెట్టిఅని ఒక వ్యాపారి పొట్టగడవక భార్యబిడ్డలతో వలసవచ్చి నరసింహ శాస్త్రి దర్శనం చేసుకుని, తన కష్టసుఖాలాయనకు మొర

పెట్టుకున్నాడు. జాలి హృదయుడైన నరసింహాశాస్త్రి హృదయం సుబ్బిశెట్టి కష్టగాథలకు, వెన్నలాగా ద్రవించి పోయింది. మరురోజుకల్లా, సుబ్బిశెట్టికి జీవనమార్గం చూపి అతనికేలోటు లేకుండా, అంగ ఆర్థికబలంతో అతనికి సహాయంగా నిలచాడు. అయితే ఈసమయాన్ని మాత్రం సుబ్బిశెట్టి జారవిడుచుకోలేదు. అనతికాలంలోనే అగ్రహారంలో యాభై ఎకరాల పొలానికి కామందైనాడు.

ఆవిధంగా ఆయనతరం వెళ్ళిపోయినది నరసింహాశాస్త్రిగారి కుమారుడు పెత్తనానికి వచ్చాడు. ఆయన పేరు కృష్ణమూర్తి. గంభీరస్వభావం కలవాడు. ఏవిషయంలోను తండ్రికి తీసిపోడు. అతిథులు, అభ్యాగతులు, ఎప్పుడు రావలసిందే. వారిని తగినట్లు గౌరవించి పంపవలసినదే.

అయితే కృష్ణశాస్త్రి కాలంలో అగ్రహారం బాగా అభివృద్ధిచెందింది. ఊరిమొదట్లో పెద్దచెరువును త్రవ్వించి అనేక ప్రాణులకు త్రాగటానికి నీటికొరత లేకుండా చేశాడు. అంతవరకు మంచినీటి కొరతగావున్న అగ్రహారానికి తానే స్వయంగా ముహూర్తం పెట్టి ఊరికిదగ్గరిలో మంచినీటిభావిని త్రవ్వించాడు. గ్రామానికి గుడిఅంటూ లేదని తనకు ఆరాధ్యదైవంగావున్న ఈశ్వరుడికి గుడి కట్టించి అందుకుగాను దేవుని మాన్యంఅని తనపొలంలోని నూరు ఎకరముల భూమిని ఆ దేవునికి వ్రాసియిచ్చాడు. ఆ విధంగా అనేక ప్రయోజన కార్యాలు చేశాడు.

నరసింహశాస్త్రికి సహాయంగా పంపినరైతు కుటుంబము యిప్పుడు ఐదుకుటుంబాలైనవి. అయితే, ఈ ఐదు

కుటుంబాలు వేరువేరుగా వుంటున్నా అందరూ పెద్దవాడు కోటయ్య మాట కాదే నడుచుకుంటున్నారు. కోటయ్యకు చదువు రాకపోయినప్పటికీ, తెలివిగలవాడు కావడంవలన, కుటుంబంలో ఎలాంటి కల్లోలాలూ లేకుండా జాగ్రత్తగా చూసుకుంటున్నాడు. కోటయ్యకు కృష్ణశాస్త్రికి బాగా స్నేహం, అందువల్ల కోటయ్య ఎక్కువగా కృష్ణ శాస్త్రితోనే వుంటుండేవాడు. ఆయన కృష్ణశాస్త్రిని ఆలో చన అడగకుండా ఏపనీ చేసేవాడు కాదు. నరసింహ శాస్త్రి గారు ఆ అడవిని సాగుచేసుకొని తెచ్చేందుకు తనతో సహా కష్టపడిన కోటయ్య తండ్రికి రెండువందల ఎకరాలు, యానాది కుటుంబానికి సంవత్సరానికి సరిపడ మాన్యా లిచ్చాడు. అదే విశ్వాసంతో రైతులైన కోటయ్య కుటుం బీకులు నరసింహశాస్త్రి కుటుంబానికి తోడునీడగా వుంటుండే వారు.

కృష్ణశాస్త్రి పేరు ఆ చుట్టుపట్ల గ్రామాలలో వినని వారు లేరు. అయితేనేం, యాభై సంవత్సరాలకే, ఆయనకు నూరు సంవత్సరాలు నిండినవి. అప్పటికే ఆయనకు ముగ్గురు పుత్రులున్నారు. వారిలో వారికి, సయోధ్యత లేక తండ్రి శ్రాద్ధ కర్మలతోనే వారు వేరుపడ్డారు. అప్పటివరకు కలసి కట్టుగావున్న ఒక బ్రహ్మణకొంప యిప్పుడు మూడు కొంప లైనవి. ఎవరివాటాలు వారు పంచుకుని వేరుకాపురాలు పెట్టుకుని వేరు, వేరుగావుంటూ చూస్తుండగనే అన్న తమ్ములు దాయాదులైపోయారు. అన్నదమ్ముల తగాదాలు పెరిగి గ్రామంలోవున్న ఒక దేవాలయానికి పూజా పునస్కా

రాలు లేకుండా చేశారు. కానీ అలా ఎంతో కాలం జరగక ముందే చుట్టుప్రక్కల గ్రామాల నలుగురు పెద్దలుచేరి గుడి వున్నప్పుడు పూజారంటూ వుండాలనీ దేవునికి దిన నైవేద్యం దీపారాధన లేకపోతే ఆ చెడు గ్రామానికేనని సాంబయ్య అనే తంబి బ్రాహ్మణుడిని నియమించి దేవుని మాన్యం నూరుఎకరాలు ఆతను, ఆతని కుటుంబంలోనివారు ఆ దేవుని కని పెట్టుకుని వున్నంతవరకు, ఆ పొలంమీద సర్వాధి కారాలు ఆ కుటుంబానికే చెందేట్లుగా ఏర్పాటు చేశారు.

అప్పటికే అగ్రహారం ఒక చిన్న పల్లెగా రూపొం దింది. రెండువందల జనాభా ఆ గ్రామంలో వున్నారు. సుబ్బిశెట్టి కొడుకు నరహరిశెట్టి పెత్తనానికి వచ్చాడు. అయితేనేం నరహరిశెట్టి ధనార్జనలో తండ్రిని మించి పోయాడు. ఆతనెంత ధనార్జనపరుడో అంత పీనాసి కావడం వలన చిన్న వయస్సులోనే బాగా ధనార్జనచేసి అగ్రహారంలో ఒక చిన్న డాబాయిల్లు కట్టించి ఆ గ్రామచరిత్రలో మొదటి గచ్చుమిద్దె తనదే ననిపించుకున్నాడు.

అగ్రహారం పొలాలు అంతమంచివి కావు. దానికి పెద్దకారణం ఏమీలేదు. అప్పటివరకు అనేక వందల సంవత్స రాలనుండి ఆ ప్రదేశం అడవిగావుంటూ అనేక వృక్షజాతు లకు నిలయం కావడంవలన భూమిని సాగులోకి తీసుకరావ డానికి చాలా ప్రయాసపడవలసి వచ్చింది. ఆ నాటికింకా దేశంలో కొత్త రసాయనిక ఎరువులు లేకపోవడం వలన కేవలం వర్షాలమీదే ఆధారపడడంవలన పంటలుగూడా అలాగే పండేవి. ఆనాడు నూరుఎకరాల పొలంవున్న

ఆసామిగూడా ఏరువాక సాగేరోజులకు విత్తనాలకు వెతుక వలసి వచ్చేది.

కృష్ణశాస్త్రి మరణానంతరం అగ్రహారంలో అనేక మార్పులు వచ్చినవి. విడిపోయిన ముగ్గురు కుమారులు, మూడు వాకిళ్ళు తెరిచి, ముద్రముడుపుగా నున్న సుక్షేత్రం లాంటి పొలాన్ని ముక్కలుచేసి పంచుకున్నారు. ఇంటిగుట్టు రచ్చ కెక్కనట్లు అంతవరకు కలసికట్టుగావుండి, గ్రామానికి పెద్దలై గ్రామాన్ని తమ అభీష్టం ప్రకారం అదుపాజ్ఞలో వుంచిన ఒక కుటుంబం ఈనాడిలా అయ్యేసరికి, ఇతరులకు బాగా వీలుచిక్కింది. అంతేకాదు, అంతవరకు అన్న దమ్ములు పంపిణీవ్యవహారాలు యింతకు ముందెన్నడూ రచ్చ కెక్కలేదు. కృష్ణశాస్త్రి కుమారులే దానికి ప్రారంభం చేశారు. దానితో ఆ పల్లెలో అనేక కుటుంబాలు, యిలాగే చీలిపోయి కృష్ణశాస్త్రి కుమారుల ననుసరించారు.

అందుకుగాను, ఆ గ్రామంలో కొత్తగా అనేక ఇళ్ళు లేచినవి. ఎద్దుల కొట్టాలు, చొప్పదొడ్లు, యిండ్లగా మారి పోయినవి, విస్తీర్ణంలో గ్రామం పెరిగిపోయింది. అంతకు ముందు అగ్రహారంలో ఒక్కటే వీధుండేది. ఈ చివర బ్రాహ్మణ యిళ్ళుంటే ఆచివర వ్యవసాయదారు లిండ్లుండేవి. యిప్పుడు మూడువీధులైనవి. మూడువీధులలో మూడు పార్టీలు. కృష్ణశాస్త్రి ముగ్గురు కుమారులు, మూడు పార్టీలకు నాయకత్వం వహిస్తున్నారు.

కృష్ణశాస్త్రి కుమారులలో పెద్దవాడి పేరు శేఖరం. అతను సాంప్రదాయ ప్రకారం తాతకట్టించిన యింట్లోనే

వుంటున్నాడు. తల్లిదండ్రుల తద్దినాలు మిగిలిన అతిథి అభ్యాగతుల విషయం, బాధ్యతలు అతనివే. అందుకుగాను మిగిలిన తమ్ముళ్లిద్దరికంటే పదిఎకరాలు ఎక్కువ వచ్చింది

శేఖరానికి అప్పటికే ముప్ఫయి వసంతాలు దాటినవి. ఆయనకొక రెండు సంవత్సరాల కమార్తె పేరు భాగతి. చిన్నతనములోనే తండ్రిదగ్గర సకలవిద్యలు నేర్చుకున్నాడు. మిగిలిన యిద్దరు తమ్ముళ్లలా కాకుండా తాత, తండ్రులు సంపాయించిన పేరును పోకుండా కాపాడు కొస్తున్నాడు. ఇప్పుడతను గ్రామవిషయమేదీ పట్టించుకోవడం లేదు. తన కుటుంబమే, తనమాటమీద నడుచుకోనపుడు తాను యితరుల క్షేమని చెప్తాను అనుకున్నాడు అందుకు శేఖరం తన కుటుంబం సంగతే తను చూచుకుంటూ కాలం వెళ్ళబుచ్చుదామనుకున్నాడు

కానీ ఈ విషయంలో ఆయనమాట ఏమాత్రం సాగలేదు. కోటయ్య మూడో తమ్ముడు రామయ్య గట్టిపట్టుపట్టి తమ ముఠా నాయకుడని చేసుకొన్నాడు. శేఖరం ఈ విషయంలో వారికెంతో నచ్చచెప్పచూశాడు. ఇలాంటి చిన్న గ్రామంలో పార్టీలుండటం అది గ్రామ పురోభివృద్ధికి భంగకరమని చెప్పాడు ఊరంతా కలసికట్టుగా వుంటే మంచిదని తన అభిప్రాయం చెప్పాడు. కానీ రామయ్యకివేవీ రుచించలేదు. బలవంతంచేసి నాయకునిగా పెట్టుకున్నారు.

ఈలోపు హఠాత్తుగా కోటయ్య మరణించాడు అప్పటివరకు ఆయనకు పిల్లలు కలుగకపోవడ మూలంగా మిగిలిన ముగ్గురు తమ్ములు కోటయ్య ఆస్థినిగూడా పంచు

కొని వేరు కాపురాలు పెట్టారు. కోటయ్య బ్రతికుండగా తమ్ముల ఆటలు సాగనివ్వలేదు. గ్రామంలో అందరూ విడి పోతుంటే కోటయ్య తమ్ములతో ఒక్కటే కూటన్నాడు. "నా బొందిలో ప్రాణమున్నంతవరకు అన్నదమ్ములు వేరు పడడం నేను చూడలేను. అలా మనింట్లో జరగటానికి వీలు లేదు." అని ఖచ్చితంగా చెప్పేశాడు. ఆ మాటతో కోటయ్య తమ్ములు వేరుపడాలని మనస్సులో ఎన్ని కోర్కెలున్నప్పటికి అన్న బ్రతికుండగా సాగనివ్వడని ఊరు కున్నారు.

అయితే వేరుపడాలని మనస్ఫూర్తిగా కోటయ్య తమ్ములకా ఉద్దేశ్యంలేదు. గ్రామంలో అందరూ అలా చేస్తుంటే తాము అలాచేస్తే బాగుంటుందనే ఊహాకు వచ్చాడు మూడోవాడు రామయ్య. మిగిలిన యిద్దరూ, రామయ్య అభిప్రాయంతో ఏకీభవించారు. అంతేకాని వారి కుటుంబంలో స్త్రీ పురుషులలో విడిపోవాలనిగాని, లేక విడి పోవడానికిగల కారణాలు ప్రత్యేకవిధంగా ఏమీ లేవు అంతే కాదు. పెద్దవాడు కోటయ్య అంటే ఆ కుటుంబంలో గౌరవం వుండటానికి మరొక కారణంకూడా వున్నది.

కోటయ్యతప్ప మిగిలిన ముగ్గురు పసికందులుగా ఉన్నప్పుడే తల్లిదండ్రి మరణించారు. అప్పటినుంచి తమ్ము లకు ఏలోటు లేకుండా సంసారాన్ని లాక్కొచ్చాడు. కోటయ్య. తండ్రి చనిపోయేనాటికి కోటయ్యకి ఇరవై వెళ్ళి ఇరవై ఒకటి వచ్చింది. అంతవరకు ఆ కొంపలో శుభకార్య మంటూ ఒక్కటే జరిగింది. అదే కోటయ్య వివాహం. అది

మినహా ఆ తల్లిదండ్రులు, మరొక శుభకార్యంచేసి ఎరుగరు. సంవత్సరం తేడాతో చచ్చిపోయిన తల్లిదండ్రులను తలుచుకుంటూ తమ్ముళ్లకు ఆస్తిలో ఎలాంటి అన్యాయం లేకుండా సొంతబిడ్డలలాగా జాగ్రత్తగా కట్టుబాటులో పెంచాడు. అదే అభిమానంతో మిగిలిన ముగ్గురు అన్న చనిపోయేవరకు ఊరుకున్నారు. అలా అన్నను సమాధిచేసి యిలా యింటికివచ్చి ఆస్థివి ముక్కలుచేసి తాము గ్రామ చరిత్రలో కలసిపోయారు.

కోటయ్య మరణానంతరం ఆ కుటుంబంలో అనేక మార్పులు వచ్చినవి. అందులో ఒకటి అన్నదమ్ములు విడిపోవడం. అలా విడిపోయిన అన్నదమ్ములు, వారి భార్యాబిడ్డలను తీసుకొని వేరు కాపురాలు పెట్టారు అందుకు గాను ఉమ్మడి ఖర్చుతో రెండు పెద్ద పూరిపాకలను వేసి ఆఖరిద్దరు అందులో ఉండేట్లు, మొదటిద్దరు తండ్రి కట్టించిన యింట్లో ఉండేట్లు ఏర్పాటు చేసుకున్నారు. అయితే కృష్ణ శాస్త్రి కుమారులలా, వేరుకాపురాలు పెట్టినప్పటికి వారిలో వారికి సయోధ్యత లేకపోలేదు. రామయ్య అన్నను కలుపుకొని శేఖరాన్ని నాయకుడిని చేసి, పాతవీదిలో పార్టీ పెట్టాడు. ఆఖరు యిద్దరులో ఒకరు కృష్ణశాస్త్రి కుమారులలో రెండోవాని పార్టీ. మిగిలినవాడు మూడోవాని పార్టీ ఇలా అనతి కాలంలో ఆ పల్లె, అన్నదమ్ములమధ్య తగాదాలతో ఈ రూపం దాల్చినది.

అప్పటికే నరహరిశెట్టికి కుమారుడు చేతికి వచ్చాడు. అతని పేరు రామలక్ష్మయ్య. రామలక్ష్మయ్యను హైస్కూలు

చదువు పూర్తి చేయించాలని నరహరిశెట్టి అనేక ప్రయత్నాలుచేసి పట్నంలో ఉంచాడు. అక్కడే అతని కన్ని సదుపాయాలు కలుగచేసి వచ్చాడు. కాని తండ్రి అభీష్టానికి కొడుకు పూర్తివ్యతిరేకుడయ్యాడు ప్రతిక్లాసు మూడేళ్ళు చదివితేగాని, అతను ఆ క్లాసుదాటి పైక్లాసుకు పోవడం లేదు. దానితో నరహరిశెట్టికి విసుగుపుట్టింది. కాని చిన్నతనం లెమ్మని సరిపెట్టుకున్నాడు. ఎలాగైనా కుమారుడు స్కూల్‌ఫైనల్ పాసయ్యాడనిపిద్దామని అతను ఎంతో ప్రయత్నం చేశాడు. విడిగా ప్రైవేటు మేష్టరును కుదిరించాడు. కాని రామలక్ష్మయ్య చదువు కివేమీా అక్కరకు రాలేదు. ఇరవయ్యో సంవత్సరం వచ్చినా మూడోఫారం చదువుతున్నాడు. అంతవరకు ఎలాగో ఓపికపట్టిన నరహరిశెట్టి కుమారుడి కెలాగు చదువురావని పట్నం కాపరం తీసెయ్యాలని చూచాడు. కాని రామలక్ష్మయ్యకు పట్నంలో చదువు రాకపోయినప్పటికి పట్నవాస జీవితం బాగా అలవాటైపోయినది. దానితో నరహరిశెట్టికి దిగులు మరీ ఎక్కువైంది. రామలక్ష్మయ్యను పట్నంనుండి కదలించాలని ఎంతో ప్రయత్నం చేశాడు. కాని రామలక్ష్మయ్య పట్నం జీవితాన్ని జీర్ణించుకుని వుండటంవలన తండ్రి బెదిరింపులను లెఖ్ఖచేయ్యలేదు. దానితో అబ్బాకొడుకులమధ్య తీవ్రమైన ముభావకం ఏర్పడింది.

అయితే రామలక్ష్మయ్య పట్నంలో చదువుద్వారా జ్ఞానాన్ని సంపాదించినదీ ఏమీా లేకపోయినప్పటికి తిరుగుడు ద్వారా అనుభవాన్ని బాగా సంపాదించాడు. అసలు

మొదటినుండి రామలక్ష్మయ్య అభిప్రాయంకూడా అలా
ఉండేది. అయితే విద్యావిహీనుడైన తండ్రికి రాగిపైసలను
వెండినాణెములుగా మార్చడమే తెలుసుగాని కుమారుని అభి
ప్రాయం తెలుసుకునే సామర్థ్యం లేకపోవడంవలన అబ్బా
కొడుకుల మధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలేర్పడినవి

అయితే యిలా ఎంతోకాలం జరగలేదు. సంవ
త్సరం తిరిగేసరికే పైసాబొట్టుబడిలేని రామలక్ష్మయ్య పది
వేలరూపాయలు సంపాదించాడు.

ఈవిషయాలు విన్నరోజు నరహరిశెట్టి ఆశ్చర్యపడకుండా
వుండలేకపోయాడు. కొడుకింతటి ప్రయోజకుడవుతాడని
అతను కల్లోకూడా ఊహించలేదు డబ్బుసంపాదనలో తనే
ననుకుంటే తనకొడుకు తననే మించిపోయాడని తెలిసి
నపుడు ఏతండ్రి మాత్రం సంతోషించడు మరురోజునే నర
హరిశెట్టి పట్నం వచ్చాడు, కొడుకు వ్యాపారం దానిలోని
లాభాలు స్వయంగావిని ఆశ్చర్యచకితుడై ఎంతో ఆనందిం
చాడు. తాను ఎన్నిరోజులనుండో ఆపట్టెటూళ్లో ఉన్నా
యింతలాభం ఒకసంవత్సరంలోగాదు, నాలుగైదు సంవ
త్సరాలలోకూడా సంపాదించలేకపోయినందుకు నిజంగా
తనకంటే కొడుకే ఎన్నోరెట్లు గొప్పవాడని అపుడు మన
స్ఫూర్తిగా అంగీకరించాడు. అయితే నరహరిశెట్టికి అంత
లాభసాటిబేరమేమిటో ఎంత ఆలోచించినా అంతుపట్ట
లేదు. మొదట కొడుకునడిగి తెలుసుకుందామనుకున్నాడు,
కాని అభిమానం అడ్డువచ్చింది. ఇంకా కుమారునకు చుల
కనైపోతానేమోనని భయపడ్డాడు. కాని రెండురోజులు

గడిచి రా కొడుకు చెప్పకపోయేసరికి నరహరి శెట్టికి అడగక తప్పింది గాదు.

రామలక్ష్మయ్య, తండ్రి తనదగ్గరకే వచ్చినందుకు, తండ్రితో మాట్లాడకుండా వుండలేదు. ఎప్పటికైనా తండ్రి తనదగ్గరకు వస్తాడని నమ్మకం వున్నవాడిలా ముభావంగా వున్నాడు. అయితే కొడుకు ముభావంగా వుండటం తండ్రి అయిన నరహరి శెట్టికి కిష్టంలేదు. ఎలాగైనా కొడుకు నుండి గుట్టు రాబట్టాలని వూహించాడు. అక్కడా పల్లెటూరులో అసలే పార్టీలు. అంచేత తాను లేకపోతే, కొట్టు ఎలా వుందోనని, పీకడ ఎక్కువైంది నరహరి శెట్టికి. అందుకే ఒక రోజు తెగించి, భోజనాలదగ్గర కొడుకును అడిగేశాడు.

నర :- ఏరా అబ్బాయి, ఒక్క సంవత్సరంలోనే యింతలాభం ఎట్టావచ్చిందో సెప్పావు కాదేమిరా ?

తండ్రి అడిగిన ఈ ప్రశ్నకు రామలక్ష్మయ్య చిరు నవ్వు నవ్వాడు.

రామ :- ఆ ఏముంది నాన్నా, నీవేమో కానీ ఇవ్వక పోతివి ఏంచేయను, నాకేమో మొదటినుండి ఏదైనా యాపారం చెయ్యాలనివుండె. ఇక్కడ నాకొక స్నేహితు డున్నాడు. వాడిని పెట్టుబడి పెట్టమన్నాను. లాభాలు చెరిసగం అని సెప్పాను. దాని కిష్టపడ్డాడు. ముందు రెండు వేలు తెచ్చాడు. దానితో, జనుముల యాపారం చేశాము. వాటిని మారుబేరానికి పట్టణాలకు ఎగుమతి సేసాము ఖర్చులు బోను సెసగం వచ్చింది.

నర :- అంతలావుపాటి లాభముండదిరా, ఆ మాట ముందే సెప్పావు కాదు. ఎఱ్ఱిమొగమా, అనవసరంగా వాడికి భాగం యిచ్చినావు.

రామ :- అ యిదేముంది లే, యిదొక లాభమా? యింకా పెట్టుబడిప్పుంటే, యింకా ఎక్కువ లాభాలొత్తవి, ఏదీ, సంవత్సరంలో నీవు ఒక్కనాలైనా వచ్చావా. యిక్కడ నేను బతికానో సచ్చానోగూడా సూడకపోతివి.

నర .- అదేమిటిరా ఎఱ్ఱిమొగమా, నీ సంగతి నాకు తెలీదనుకున్నావా, ఎప్పటికప్పుడు నేను నీ సంగతే తెలుసు కుంటున్నాను. నాకు తెలుసు అమ్మా, నాయన్ను సూడక పోతే బెంగెట్టుకుంటావని.

రామ :- ఏమో, ఈ పేమంతా, యిప్పుడేంలాబం, నాకాడ నాలుగుడబ్బు లున్నవని సివాటున్నావు. నాకు తెలవ దనుకున్నావా!

నర :- ఓరీ ఎఱ్ఱిమొగమా, నీకోసం మీ అమ్మ బెంగెట్టుకుని, పదిరోజులు అన్నం ముట్టలా. నేను నిన్ను గురించి యిశారించని రోజులేదె. ఒక్కొక్కరోజు నువ్వు తలువుకొత్తే నీల్లుగూడా ముట్టుకునేవాడిని కాదు. సత్తె పెమానంగా సెపుతుండాను. అమ్మతోడు.

రామ :- పెమానం ఎందుకులే నాన్నా

నర :- ఇప్పుడురా, మనూరుకుపోదాము. ఆ దెవడో, చెప్పు. ఇకే ఆడిని, ని యాపారంలోకి రానీయకు సూశావా, అనవసరంగా పదివేలురూపాయలు ఆడి మొగాన పెట్టావు

అసలే నీవు పిచ్చి మొగానివి. అప్పుడు నాకు, చెప్పం బిన్చ కూడదు. నేను, వచ్చేవాడిని. అనవసరంగా వాడిముకాన పదివేలరూపాయలు... అమ్మా, మనూల్లో వంద ఎకరాల పొలం వచ్చేది మొన్న ఆ శేఖరం గాళ్ళు, ఆయన రెండో తమ్ముడు రామభద్రయ్య, పార్టీవాళ్ళు కొట్టుకుని కోర్టు కెళ్ళారు. వాళ్ళదగ్గర డబ్బు లుంచేకమా. ఆకరకు, ఎకరం యాభైరూపాయల కిత్తామన్నాడు శేఖరం. కొంటా నను న్నాను.

రామ :- కొనలేక పోయావా?

నర :- ఆ, ఆ బాంబలపొలం ఎందుకన్నాను.

రామ :- అదేమిటి నాన్నా ఎవరి పొలం అయితే మనకేం మనకు కావలసింది డబ్బులెక్కచ, చవుక అదే గదా ?

నర :- పిచ్చి మొగమా, అందుకే నీకు తెలీదన్నాను. వాళ్ళు కొనమనిగానే కొంటే మనదగ్గర డబ్బున్నదని చీటికి మాటికి పది, పాతిక అప్పడుగుతారు. యివ్వకపోతే కచ్చేగా.

రామ :- మరి అపుడు ఏం సేశావు ?

నర :- ఏముంది, ముందది బాంబలపొలం నాకెందు కన్నాను. వాడు రామయ్యలేదు. వాడు నా పొలం యిత్తా తీసుకో అన్నాడు.

రామ :- అపుడు నీవేమన్నావు ?

నర :- ఏముంది. అసలు నాకాడ డబ్బులేదు అన్నాను.

రామ :- మరి వూరుకున్నారా !

నర :- ఊరుకుంటారురా, యింకా ధర తగ్గాలనేగా అలా అన్నది.

రామ :- మరి వారేం అన్నారు ?

నర .- పదిరూపాయలు తగ్గిత్తాం అన్నారు.

రామ :- మరి తీసుకున్నావా ?

నర:- అబ్బే లేదు.

రామ:- అబ్బ పో నాన్నా, చెడగొట్టావు.

నర:- ఛా, ఎర్రిమొగమా, అదే నీకు తెలవదంటాను.

రామ:- మరి ఏం చేశావు?

నర:- ఏముంది, అబ్బాయి. నాకాడ డబ్బులేదు అన్నాను.

రామ:- తర్వాత.

నర:- ఉండు సెప్పనీ, నీ వా మాట అంటే ఎట్టా మరి అన్నారు. మావాడు పట్టణంలో వున్నాడు. వాడి కాడ వున్నది. తీసుకరావాలె అన్నాను, సరే సూడు. అప్పటినుండి మరీ తొందరపడ్డారు. నన్ను ఈడకెళ్ళి రమ్మన మని, సరే అప్పుడు రాకపోతే బాగుంటుందా, రమణమ్మ పిన్నిని సూసి సాలారోజులైందని. ఆ వూరు ఎల్లి రెండు రోజులుండి అగ్రహారం వెళ్ళాను. అప్పటికే మనింటిచుట్టూ తిరిగారుట. నేను పోగానే, నన్ను అడగటం మొదలు పెట్టారు.

రామ:- అప్పుడేం చేశావు ?

నర:- ఏముంది, కచ్చితంగా సెప్పేశాను. డబ్బాశ

రామః- ఏమని?

నరః- ఏముంది. అయ్యా! మావోడుదగ్గరా డబ్బు లేదు. వాడు ఎవరికో అప్పు పెట్టిండంట ఏదో యీ సందర్భం సెప్పి తీసుకొచ్చాను. మళ్ళీ పున్నమి ఎల్లినాక మిగతాది యిత్తాను. పొలంమాత్రం యిప్పుడే నా పేరపెట్టమని సెప్పిండు అన్నాను.

రామ:- వారు ఒప్పుకున్నారా?

నర:- ఎర్రిమొగమా ఒప్పుకోక ఏం సిత్తారుమరి డబ్బు అవుసరంగదా!

తండ్రికొడుకులు అలా సంభాషించుకుంటూ భోజనాలు ముగించారు. ఇక ఆ తరువాత వారిద్దరిమధ్య అట్టే సంభాషణ జరగలేదు.

నరహరిశెట్టి పట్నంవచ్చింది కేవలం కుమారుడిని చూచిపోదామనేకాదు. సంపాదించినడబ్బు మూటకట్టుక పోదామని వచ్చాడు. తీరా యిక్కడకు వచ్చినతర్వాత, కొడుకు పరిస్థితివిని డబ్బేమీ అడగలేకపోయాడు. తనను ఎదురుడబ్బు అడగందే చాలని సాతృప్తి చెందాడు. కానీ, ఈ విషయంలో రామలక్ష్మయ్యమా తం తండ్రిని విడిచి పెట్టలేదు. తను చేయబోయే వ్యాపారం దానికి కావలసిన పెట్టుబడి చెప్పాడు. అంతమొత్తం వినేసరికి నరహరిశెట్టికి గుండె ఆగినంతపనైంది.

అసలు మొదటినుండి నరహరిశెట్టిఅభిప్రాయం కొడుకు విషయంలో ఒకవిధంగా వుండేది. కాని, రామలక్ష్మయ్య,

మాట వినకుండా పట్నంలో వుంటానని చెప్పినవాడే డబ్బుమీద కోరికకు నరహరిశెట్టి తిలోదకా లిచ్చాడు. కాని, నరహరిశెట్టికి కొడుకు ఎప్పటికైనా తనమాట వినక పోతాడా అనే ధైర్యంమాత్రం వున్నది. ఇపుడు రామలక్ష్మయ్య తననే డబ్బు అడిగేసరికి, తప్పించుకునేందుకు ప్రయత్నం చేశాడు. చెప్పవలసినవన్ని చెప్పాడు. అనేక విధాల అతన్ని మాటలతో సంతృప్తిపరచాలని చూచాడు. లాభం లేకపోయింది. కొడుకుదగ్గర తన మాటలకు ఆట కట్టింది. చివరకు అడిగినంతడబ్బు యివ్వక తప్పదను కున్నాడు. అయితే ఈ విషయంలో అబ్బ కొడుకుల మధ్య అభిప్రాయభేధాలు చిన్నవైనప్పటికి, అదే వారిద్దరి స్థితిగతులను మార్చింది. మొదటినుండి నరహరశెట్టి డబ్బు లేకుండా వ్యాపారం చేయాలంటాడు. అలా వచ్చిన కొద్ది లాభాలే చాలు లెమ్మనుకుంటాడు. కానీ రామలక్ష్మయ్య దానికి పూర్తి వ్యతిరేకి. పెద్దమొత్తంతో వ్యాపారంచేసి పెద్దలాభాలు సంపాదించాలి, కానీ, అగ్గిలా కూడబెట్టితే ఎన్నైతే రూపాయవుతుంది అని అంటాడు.

అలా తన అభిప్రాయం, తానికముందు చేయబోయే పనిసంగతి వివరంగా తండ్రికి చెప్పాడు రామలక్ష్మయ్య. కాని నరహరి శెట్టి, కొడుకుమాటవిని డబ్బు యివ్వటానికి ధైర్యం చేయలేకపోయాడు. ముందు తానీ పట్నంనుండి ఎంత తొందరగా కదిలిపోతే అంతమంచికొదనున్నాడు. అలాగే ఒకనాడు అగ్రహారం వెళ్ళిపోయాడు.

రామలక్ష్మయ్యకు తన తండ్రే తననునమ్మి డబ్బు యివ్వలేనప్పుడు యితరులుమాత్రం అడిగితే యిస్తారని ఆశ పోయింది. అంచేత తాత్కాలికంగా ఆ సంవత్సరం తన ఆలోచనకు, చేయబోయే వ్యాపారానికి స్వస్తిచెప్పాడు. మళ్ళీ తన పాతమిత్రుడిని కలుసుకుని యథాప్రకారంగా వ్యాపారం కొనసాగించుకుంటున్నాడు.

## 2

ఇలావుండగా, అగ్రహారంలో ముఠాతత్వం బాగా ప్రజ్వరిల్లింది. అన్నదమ్ములు విడిపోవటాలు కోర్టులదాకా వచ్చింది. గ్రామంలో వర్షాలు పడకపోయేసరికి అంతా కలసి కొలుపులు చేయాలనుకున్నారు. కాని, ఆదిలోనే బ్రాహ్మాయిదగ్గర పేచీవచ్చి చిన్న ఘర్షణ జరిగింది. క్రమంగా అది కొట్లాటగా మారింది. ఆ కొట్లాటలో మూడో ముఠావారు తటస్థంగా వున్నారు. వారికిందులో సంబంధ మేమీ లేదు. కానీ, రామభద్రయ్య అలా వూరుకో లేదు ఆ ముఠాకూడా, శేఖరం ముఠాకు, వెనుక కుమ్మక్కుగా వున్నారని పట్నంలో కేసు బనాయించాడు.

రామభద్రయ్య పట్నంలో స్కూల్ ఫైనల్ వరకు చదివాడు. అంతవరకు అగ్రహారంలో అంతచదువు చదువు కున్నవారెవరూ లేరు. అతనే ఆ గ్రామచరిత్రలో మొదటి ఇంగ్లీషు చదువుకొన్న వ్యక్తి. కృష్ణశాస్త్రిగారు పెద్దవానికి సంస్కృతంనేర్పి అందులో అద్వితీయమైన పండితుడిని

చేశాడు. రెండోవానిని వ్యవసాయంలో రాటుతేల్చాడు. అతనిపేరు వెంకట్రామశాస్త్రి. మూడోవానికి మాత్రం ఇంగ్లీషు చెప్పించాడు.

కాశీ కృష్ణశాస్త్రి కుమారునికి ఇంగ్లీషు చెప్పించాలనే వుద్దేశం లేదు. అంతవరకు ఆ గ్రామంలో ఒక్కడూ నాలుగు ఇంగ్లీషుముక్కలు వచ్చిన మగవాడు లేకపోవడం దానికి తగినట్లు ఆనాడు ప్రతిచిన్నకాగితం ఇంగ్లీషులో రావడంవలన, ఆ భాషరాక చాలా ఇబ్బందులు పడవలసి వచ్చేది. ఆ వచ్చిన యింగ్లీషుకాయితం పట్నం తీసుకుపోయి, ఏ తెలుగువచ్చిన దొరకో, లేక ప్లీడరుకో చూపవలసి వచ్చేది. అలాంటి చిన్నయిబ్బందులే కాక మరొక యిబ్బంది గూడా వున్నది. ఆ వచ్చిన కాగితం రహస్యమైందైతే ఆ రహస్యం బయటపడేది. అందుకుగాను, ఆ రహస్యం దాచినందుకు ఆ వ్యక్తికి, ఏదో ముట్టచెప్ప వలసి వచ్చేది. అందుకే కృష్ణశాస్త్రిగారు, కుమారునికి ఇంగ్లీషు చెప్పించాలని లేకపోయినప్పటికి యిలాంటి బాధలు పడలేక ఇంగ్లీషు చెప్పించాడు.

రామభద్రయ్య ఇంగ్లీషు చదివినవ్యక్తే కాదు. కోర్టువ్యవహారాలు బాగా తెలిసినవ్యక్తి కావడంవలన, ఏ కేసును ఎలా నడిపించాలో ఎవరిని ఎందులో యెలా యిరికించాలో, బాగా తెలుసు అందుకే దూరదృష్టితో వాస్తవంగా, మూడోముఠావారికి, కొట్లాటలో సంబంధం లేకపోయినప్పటికి. వారిని కోర్టుకు లాగాడు. దానితో

వారికి ముందెప్పుడైనా తమకు వ్యతిరేకంగా ఉండడానికి భయంగా వుంటుందని వూహించాము.

రామభద్రయ్య ఊహ నిజమే అయింది. పట్నం వెళ్ళి రామభద్రయ్య యిలా తమకుపూడా కాయితంలో యిరికించాడని తెలుసుకున్నాడు, వూరువూరంతా అట్టుడికి నట్టుడికిపోయింది. కొందరాతని పార్టీవారు తెలివంటే రామభద్రయ్యదే నన్నారు. మరికొందరు ఎలాగైనా, ఇంగ్లీషు చదువుకున్న మనిషి, అన్నారు. ఇంకా కొందరు తెల్లోడి చదువు అక్కరకు రాక యాడికిపోతది. అన్నారు. ఇలా గ్రామంలో ఎవరికి తోచినట్లు వారు చెప్పుకున్నారు.

ఈవార్త మూడో ముఠావారికికూడా తెలిసింది. ఆ పార్టీలో చదువుకున్న వ్యక్తి ఎవరూ లేరు. అంతా నిశానీ వేసేవారే. కాకపోతే వెంకట్రామశాస్త్రి మాత్రం కొద్దిగా తెలుగు చదువుకున్నాడు. అదైనా ఏదో సంతకంమోయిన. అంతేగానీ అన్నలాగా తెలుగు, సంస్కృతాలలో ఆరితేరిన పండితుడు కాదు, తమ్ముడిలాగా, యింగ్లీషు చదువుకున్న వ్యక్తి కాకపోవడం వలన అతకిడికి ఆభాష, ఈభాష కొత్తగానే వుండేది. ఊరి వ్యవహారాలలోగూడా, ఎప్పుడూ పాల్గొనేవాడు కాదు. తనపనేదో తను చూచుకునేవాడు కాని ఈనాడిలా తమ్ముడు తననుకూడా కాయితంలో యిరికించి కోర్టు కీడిపించాలని తెలుసుకున్నప్పుడు ఆయనకు కట్టలు తెగిన ప్రవాహంలా వచ్చింది కోపం. అనవసరంగా తమ ముఠా వారి కిందులో జోక్యం లేకపోయినప్పటికి యిలా చేసినందుకు ఆయన మండిపడ్డారు ఆ సమయంలో ఆయన

చేలో వున్నాడు. ఆయన ముఠాలోని వ్యక్తి చేనికి వెళ్ళి ఈ వార్త చెప్పాడు. అప్పుడు మిట్టమధ్యాహ్నమయినది. సూర్యుడు నడినెత్తిమీద కొచ్చాడు. ప్రచండమైన తన వేడి కిరణాలతో లోకాన్నే నామరూపాలు లేకుండా భస్మీపటలం చేస్తాడా అనిపిస్తున్నది. ఆ సమయంలో ఈవార్త విన్న వెంకట్రామశాస్త్రి మేడి భుజాన పెట్టుకుని రామభద్రయ్య యింటికి బయలుదేరాడు.

ఈ విషయం ముందే తెలుసుకున్నాడు రామభద్రయ్య. అన్న కోపంగూడా అతనికి తెలుసు. అది ఎలా చల్లార్చాలోగూడా ఆయనకు బాగా తెలుసు.

వెంకట్రామశాస్త్రి సాధువు. మెత్తని మనస్సు కలవాడు, లౌకికం తెలియని శుద్ధ ఛాందసుడు. కానీముక్కంటి ఆయనకు సామాన్యంగా కోపం రాదు. వచ్చిందా నిజంగా ముక్కంటే ఈశ్వరుడు తనమూడో కన్ను తెరిస్తే ఏ విధంగా ఎదుటివారు భస్మీపటలం అవుతారో, వెంకట్రామశాస్త్రి గూడా అంతేన అగ్రహారంలో ఆయనను ఎవ్వరూ కదలించరు. ఆయనతో అవుసరం వున్నంతవరకే మాటాడి వస్తారు. ఎప్పుడూ, ఎవ్వరికీ, అపకారం తలపెట్టడు. అందరిని సమభావంతో చూస్తాడు. మనిషిని, మనిషిగా చూచే మనస్తత్వంగల మనిషి. నిజానికి ఆయన అగ్రహ, అనుగ్రహాలకు చాల దూరంగా వుంటాడు.

గ్రామప్రజలతో హాస్యానికైనా మాట పొల్లు రానీయడు. కల్లోగూడా అబద్ధం చెప్పడు. తను నమ్మినపనే

చేస్తాడు. తను వకరి తప్పులు యెంచడు. తన నెవరైనా యెంచితే వూరుకోడు. అందుకే ఆ గ్రామంలో కొందరి కాతనంటే భయం, మరికొందరికి గౌరవం. యింకా కొందరికి అసూయ ద్వేషం, కానీ ఆయన అవేమీ లెక్కచేయడు. ముక్కుసూటిగా పోతాడు. అభ్యుదయవాది కాదు, వేదాంతి గాదు, అదో రకం మనిషి. అలాంటి మనుషులు ప్రపంచంలో ప్రతి దేశంలోను యెక్కడో ఒకచోట వుంటారు. ప్రపంచంలోని వివిధరకాల మనుషులచేత, విడివిడిగా చూడబడుతుంటారు. ఇప్పుడు వెంకట్రామశాస్త్రి అదేకోవకు చెందిన వ్యక్తి సామాన్యంగా అలాంటివారు యెప్పుడో తప్ప, యితరులమీద కోపగించరు. కానీ ఆ కోపం తగ్గే కోపంగాదు. అది అంతు తేలుస్తుంది.

అలాగే వెంకట్రామశాస్త్రి తమ్ముడింటికి నాగలిమీద మేడి భుజానపెట్టుకుని వచ్చాడని విన్నప్పుడు వూరిలోని వారెంతో ఆశ్చర్యపడ్డారు, కొందరు భీతిచెందారు. పర్యవసానం యెలా వుంటుందో అని వూహించారు. కానీ యెవ్వరికి వారిద్దరిమధ్యకు వెళ్ళే ధైర్యంలేదు, కళ్ళప్పగించి చూస్తూన్నారు.

ఆ సమయంలో రామభద్రయ్య వీధి అరుగుమీద కూర్చుని వున్నాడు. అనతి దూరాన్నే అన్న ఆగమనం చూచి, ప్రేమ నటిస్తూ భార్యచేత కాళ్లు కడుక్కునేందుకు నీళ్ళు తెప్పించాడు. తాను ఒక విసనకఱ్ఱ తీసుకుని యెదురు వచ్చాడు.

ప్రచండమైన సూర్యవేడిమికి మంచుకొండలు కరిగి నట్లు వెంకట్రామశాస్త్రి కోపం కరిగి చల్లారిపోయింది. తమ్ముడు మరదలు చేసే సపర్యలకు లొంగిపోయాడు. చాలా కాలానికి కలుసుకున్నట్లు యోగక్షేమాలు విచారించి వచ్చాడు.

ఈ విడ్డూరం చూచి, ఊరి ప్రజలు ఆశ్చర్య పోయారు. వెంకట్రామశాస్త్రి తమ్ముని ఇంటికి పోయి యిలా చప్పబడి తిరిగివస్తాడని యెవ్వరూ ఊహించలేదు. అసలు అలాంటి మనుష్యుల మనఃప్రవృత్తులు వారికేం తెలుసు. అలాంటివారు అల్పసంతోషులని, కడుపులో కండ్లు లేని వారని, చెప్పేదొకటి చేసేదొకటి లేనినాడీ బుద్ధి సామా న్యంగా అలాగే వుంటుందని వారూహించలేక పోయారు. అందుకే వారందరి ఊహలు తప్పిపోయినవి. ఆసమయంలో అలాంటి మనుషులను యెల్లా లొంగదీయాలో, ఒక్క రామ భద్రయ్యకే తెలుసు. అందుకే అన్నను, మారుమాటాడ నీయకుండా సగౌరవంగా సాగనంపాడు ఇకముందుకూడా పంపగలనని ఋజువు చేసుకొన్నాడు.

ఈ విషయంలో యెవరిసంగతి యెలావున్నా కాంత మ్మకు మాత్రం యిలా జరగడమే మంచిదనిపించింది. వెంక ట్రామశాస్త్రి, రామభద్రయ్య ఇంటికి వెళ్ళాడన్న సంగతి విన్నప్పటినుండీ, ఆమె మనస్సు అనేక విధాలుగా పరితాపం చెందింది. మనస్సుతో బొట్టాయికిగూడా మ్రొక్కు కున్నది. కానీ ఆమె ఆసమయంలో ఏం చేయగలదు. తన బాధ యెవరితో చెప్పగలుగుతుంది విన్నా ఆమెను యెవరు

లెక్కలోనికి తీసుకుంటారు. పైగా ఆమెను సంఘం కులట, మోసకత్తె అంటారు. కానీ నిజపరిస్థితి వారికేం తెలుసు. ఆమెపట్ల ఈ విషయంలో ఎవరు సానుభూతి చూపగలరు. ఆమెను ధ్వంసం చేసుకునే వారే ప్రపంచములో ఎంతమంది వుంటారు. అందుకే మనస్సులోనే భావాన్ని వుంచుకున్నది.

కాంతమ్మ కోటయ్య మరదలు. పెద్దతమ్ముడి భార్య ఆమె భర్త వెంకటయ్య, తమ్ముడు రామయ్య మాట ప్రకారం శేఖరం పార్టీలో చేరాడు.

వెంకటయ్య శాంతస్వభావుడు. కారణంలేనిది చీమకు కూడా హానిచేయడు కానీ చిన్నతనంనుండి అతను పచ్చి పోకిరి. చేలవెంట తిరుగుతూ, గడ్డికివచ్చే అమ్మలక్కలితో వేళాకోళంగా మాట్లాడుట ఆతనికి సరదా పెండ్లయిన తర్వాత చాలా కాలానికిగాని, తన భర్త యిలాంటివాడని తెలుసుకోలేక పోయింది అప్పటినుండి ఆమెలో తీరని ఆశా జ్యోతి వెలిగింది. భర్తవల్ల సుఖపడ్డంలేదని తెలుసుకున్నది. కాని తొందరపడలేను మరి కొంతకాలం ఓర్పుతో నుండాలను కున్నది. కామతృష్ణ ఆమెను దహించి వేస్తున్నప్పటికి సహించింది. యవ్వనదశలోనే, ఆమె పురుషునిద్వారా పొందవలసిన సుఖంలో కొంతభాగంకూడా ఆమె పొంది వుండలేదు. కానీ, భర్తకు కళంకం తీసుకరాదలుచుకో లేదు రోజులు గడవటం ప్రధాన మనుకున్నది, ఇవ్వాళ కాకపోతే రేపైనా, భర్త తనను సరిగ్గా చూస్తాడనే, మొండి నమ్మకంతో గడిపింది.

కానీ ప్రకృతిలో స్త్రీ కాని. పురుషుడు కాని, కాలు జారకుండానే వుండాలి. ఒకసారి జీవితంలో కాలుజారితే తిరిగి మామూలు స్థితికి రావడం చాలకష్టం అనే సంగతి ఆ పల్లెటూరి పడుచు గ్రహించలేక పోయింది. భర్తద్వారా లేని సుఖం మరొకరిద్వారా తానుమాత్రం ఎందుకు పొంద కూడదనే అభిప్రాయానికి వచ్చింది. కానీ అప్పటికి సాహ సించలేదు. భర్తలో మార్పుకోసం స్వాతివానకు ముత్యపు చిప్పలా యెదురు చూచింది. కానీ ఫలితం శూన్యమే అయింది.

తానుమాత్రం తన అభీష్ట ప్రకారం యెదుంకు నడు చుకో కూడదని ప్రశ్నించుకొన్నది. అంతే కాలుజారింది, పడింది ఆపదటమే, వెంకటామశాస్త్రి ఒళ్ళో పడ్డది. అంతే అప్పటినుండి మరొక పురుషుడిని ఆశించలేదు. వెంకట్రామశాస్త్రి ద్వారా వచ్చిన సుఖంతోనే సంతృప్తి చెందింది. అందుకే ఏండ్లతరబడి వాండ్ల స్నేహంవున్నా, వారు విడిపోలేదు. ఈ మధ్యలో అనేక ఆటంకాలు వచ్చి నవి, వారిద్దరు కలిసివుండగా ఆ గ్రామంలో అనేమంది చూచారు. కాని, అవేమీ వారిప్రేమకు, కామానికి అడ్డు రాలేదు. నిరాటంకంగా, నిరభ్యంతరంగా వారి ప్రేమకలా పం కొనసాగుతున్నది.

వెంకట్రామశాస్త్రికూడా, కాంతమ్మను తప్ప వేరొక స్త్రీముఖం యెరుగడు. ఆతని స్వభావాన్ని బట్టి ఆ గ్రామంలో అనేకమంది ఆతనితో పొత్తు కలుపుకోవాలని పయత్నం చేశారు, బెదిరించారు, బ్రతిమిలాడారు. కానీ,

వెంకట్రామశాస్త్రి వాటి వేటికి లొంగిపోలేను. అందుకే ఈనాడు వెంకట్రామశాస్త్రి రామభద్రయ్య యింటికి వచ్చాడన్న సంగతి విన్నప్పుడు ఆమె హృదయములో భయం వికటాట్టహాసం చేసింది. నివురుకప్పిన నిప్పువలె నున్న రామభద్రయ్య వలన తన ప్రియుడికి ఏ ముప్పం వస్తుందో నని అలాంటి వేమీ జరగకుండా వుండాలని, ఆమె బొబ్రా యికి జోడు టెంకాయలు కొడతానని మనస్సులో మొక్కుకున్నది. బొబ్రాయికూడా ఆమె మొరాలకించింది. అందుకే ఆమె పక్షమే వహించింది.

# 3

ఆ సంవత్సరం వ్యాపారంలో రామలక్ష్మయ్య పెట్టు బడికి మించిన లాభాన్ని సంపాదించాడు. అతను, అతని భాగస్తుడు చేరి పదివేల రూపాయలు కలిపి ఇరవై వేలు చేశారు. సమయంచూసి, ఇరవై వేలకు జనుములు కొనేసి గోడవున్ లో దాచారు. ఇతర ప్రదేశాలకు ఎగుమతి చెయ్యా లనుకుంటున్న సమయంలో ఒక్కసారిగా ధరలు ఆకాశా న్నంటినవి. యెక్కడి వక్కడ దాచేశారు. యింకా పెరుగు తుందనే ఆశతో, వ్యాపారస్తులు గోడవునులకు నింపారు. కానీ రామలక్ష్మయ్య అతిఆశకు పోలేను అమ్మనూపాడు. రామలక్ష్మయ్య గోడవునులలో వున్న సరుకంతా అమ్ము తున్నాడని తెలుసుకొని ఆ పట్టణంలోనే మరొక వర్తకుడు ధరలు యింకా పెరుగుతవనే వుద్దేశ్యంతో వున్న సరుకంతా కొన్నాడు. రామలక్ష్మయ్య డబ్బు తీసు న్నాడు. ధరలు

చప్పగా పడిపోయినవి. ఏ ఖర్చులు లేకుండా అంతలాభం సంపాదించిన వర్తకుడు, ఆ సంవత్సరం మరొకరు లేరు. రామలక్ష్మయ్య వ్యాపారంలో అనతికాలంలోనే ఆ పట్ట ణంలో ఒక మేడను కట్టించాడు. అనేకమంది వ్యాపారస్తులు కాయన మార్గదర్శకుడయ్యాడు పెద్దపెద్ద వ్యాపారస్తుల చూపు రామలక్ష్మయ్యమీద ప్రసరించింది. ఫలితంగా ఆ పట్టణంలో ఒక ధనవంతుడు తన కుమార్తెనిచ్చి అదనంగా అల్లుడికి ఒక లక్షరూపాయలనిచ్చి వివాహం చేస్తానన్నాడు.

ఈ సంగతి విని నరహరిశెట్టి ఆనంద బాష్పాలు రాల్చాడు. కుమారుని భవిష్యత్తు తలుచుకుని మనస్సులో వుప్పొంగిపోయాడు. వివాహం ఏ ఆటంకాలు లేకుండా జరిగితే గ్రామంలోవున్న ఈశ్వరుడికి, లక్ష ప్రతిపూజ చేయిస్తానని మొక్కుకున్నాడు ఇకముందు, తను. తన కుమారుని గురించి సగౌరవంగా చెప్పుకోవచ్చునను కున్నాడు. ఆడంబరంగా రామలక్ష్మయ్య వివాహం జరిగి పోయింది.

## 4

రామభద్రయ్య పట్నంవచ్చి, మంచి ప్లీడరును విచా రించి కుదుర్చుకున్నాడు. ఈవార్తవిన్న రామయ్య క్షణం వూరుకోలేదు, ఆమరురోజే పట్టణానికి, శేఖరయ్యను పంపాడు కాని, శేఖరయ్యను అంతకుముందెన్నడూ పట్నం చూడవలసిన అవుసరం రాలేదు. కానీ తప్పిందికాదు. కేసుచూడబోతే బలమైనది ఓటమి గెలుపు తెలావున్నా

ముందు చేయవలసిన పని చేయాలి. అందుకు రామయ్య అభిప్రాయం ప్రకారం ఒకనాడు పట్టణం వచ్చాడు శేఖరయ్య.

## 6

అవి గాంధిజీ సత్యాగ్రహం రోజులు. ప్రజలలో గాంధి తత్వం బాగా తలకెక్కింది. గాంధిపేరు చెప్పి ఎంత ఘనకార్యమైనా చేయడానికి సిద్ధంగా వున్నారు ప్రజలు. దేశంలో, కుల, మత, ముఠా, రాజకీయ తత్వాలు లేవు. చిన్న, పెద్ద. స్త్రీ పురుషుడు, చదువుకున్న వాడు, చదువు లేనివాడు, అగ్రజాతి, హీనజాతి భేదాలు లేవు. అందరూ స్వాతంత్ర్య రణరంగంలో పాల్గొంటున్నారు. అంతో యింతో ఎవరిచేతనైన సహాయం, స్వచ్ఛంద సేవకులకు వారు చేస్తున్నారు. సత్యాగ్రహం ముమ్మరంగా సాగుతున్నది. బ్రిటీషు ప్రభుత్వానికి ఒళ్ళు మండింది. మరిమండదూ. బానిసలా బ్రతకవలసిన భారతీయులు, స్వాతంత్ర్యం అడుగుతుంటే వూరుకుంటారా? సత్యాగ్రహులను, పిల్లా, జెల్లా అందరిని జైళ్ళకు తోశారు. జరిమానాలు విధించారు. ఇంకా వీలుగావుంటే ఉరిశిక్షలు, కాల్పులు, ఓ! ఒకటేమిటి చేతిలోవున్న సర్వాన్ని సద్వినియోగం చేసుకున్నారు. కానీ పాపం వారికి ఫలితం శూన్యమైంది. ఒకరుపోతే మరొకరు, చలములోని సీటిలాగా, స్వచ్ఛంద సేవకులు పుట్టుకొస్తున్నారు.

సరిగా అదేరోజుల్లో, మొదటిసారిగా పట్నంవచ్చిన శేఖరయ్యకు పట్నంలో తెల్లవాళ్ళ భీభత్సం కనిపించింది.

అనేకవందలమంది సామాన్య ప్రజలు, స్వాతంత్రం కావా లంటూ, నినాదాలుచేస్తూ బజారులవెంట వస్తున్నారు. అలా ఒక వీధిలో కాదు. పట్టణమంతా స్వచ్ఛంద సేవకులే! ఎక్కడవిన్నా స్వాతంత్ర్యం మాటే! ఏ గోడన చూచినా, గాంధీజీ సందేశాలే! ఇలా ఒకవైపు స్వచ్ఛంద సేవకులు, మరోకవైపు తెల్లవాళ్ళు మరతుపాకులు పట్టుకుని మార్చి కొట్టుకుంటూ, కనిపించిన వారినల్లా అరెస్టుచేస్తూ, లాటీలతో మోదుతూ వస్తున్నారు.

ఈ దృశ్యం ఎక్కువసేపు చూడలేకపోయాడు శేఖ రయ్య. ఆయనముఖం, మ్లానితమైంది. అనుకోకుండా రెండు కన్నీటి బిందువులు రాలి క్రిందపడ్డాయి.

ఆయన జీవితంలో అదొక మరపురానిరోజు. అసలు ఒక్కొక్కరి జీవితాలే అంత ఒక్కొక్కరోజునే వచ్చి, తారుమారుచేసి వారి జీవితంలో ఆరోజు మరపు రాకుండా స్థిరపడి పోతుంది. అలాగే మంచి రోజులు వచ్చినా, శేఖరయ్య జీవితంలో పట్టణంలో చూచిన సంఘటనలు, దృశ్యాలు, చాలామార్పు తెచ్చినవి. ఆయన అంతకు ముందెన్నడూ యిలాంటి సంఘటనలు చూడలేదు. కనీసం వినికూడా వుండలేదు. ఏ మంచికార్యం లేనిదే వారలా ఎందుకు బాధలు పడుతుంటారు అనేదే ఆయనకు సందేహా స్పదంగా నిల్చిపోయింది. కాని ఆ విషయం గురించి, ఆయ నింక ఎక్కువసేపు ఆలోచించలేకపోయాడు. తాను వచ్చిన పని గుర్తుకు తెచ్చుకుని, గబగబా, ప్లీడరుకోసం బయలుదేరాడు.

అలా ఒక వీధి, ఒక బజారుకాదు. పట్టణమంతా తిరిగాడు. అలా యెందుకు తిరుగు తున్నాడో తెలియదు. ఆయన వెతకడం ప్లీడరునైనా, మనస్సు మాత్రం ప్లీడరు కోసం చూడటంలేదు. జరిగిన సంఘటనకు ప్రాధాన్యత వహించినవి. ఆ సంఘటనలను మరిచి పోదామన్నా మరువలేకుండా వున్నాడు. చాలావీధులు తిరిగి చివరకు ఒక సత్రంవద్దకు వచ్చాడు, చూచుటకా సత్రం యెంతో అందంగా వుంది. కానీ లోపల చాలా అసహ్యంగా వున్నది. గోడలకు సున్నంలేదు. అక్కడక్కడా చోకాక్కా కేసిన మాసికలలా, గోడలనుండి పెచ్చికలు వూడిపోయినవి.

మధ్యలో ఒక పెద్ద సావిడున్నది. వెలుతురు కోసం అక్కడ పైకప్పు వేయకుండా వుంచినట్లుగా వున్నది. మధ్యలో ఆ వైపునుండి ఈ వైపుకు ఇనపకడ్డీలు వేశారు. వాటిక్రింద వర్షం పడకుండా అద్దం అమర్చినట్లుగా వున్నది. కాని యిప్పుడా అద్దంలేదు. అద్దంపెట్టిన అరమాత్రం వున్నది. శేఖరయ్య అక్కడకువచ్చి సత్రంచుట్టూ కలయ చూచాడు. పొగచూరిపోయిన పైకప్పు, వాసాలకు మధ్యలో బూజు యెంతో అసహ్యంగా కనిపిస్తున్నది. సత్రంలో ఒకవైపు మూరెడుపొడుగు గడ్డాలు పెంచుకుని కునికపాట్లు పడుతున్న సన్యాసులు, కటికబాధలు పడుతూ జీర్ణావస్థలోవున్న సంసారులు అక్కడవున్నారు. ఆదృశ్యం చూచిన వారికెవరికైనా, ఆనాటి భారత దేశస్థితి ఆ రూపంలో వున్నదని సులభంగా తడుతుంది.

కానీ శేఖరయ్యా కవేమీా పట్టలేదు. సత్రంలో ఒక మూలనున్న యిద్దరు పెద్దమనుష్యు లాయనను ఆకర్షించారు. వారు ఏదో తీవ్రంగా చర్చించు కుంటున్నారు. శేఖరయ్యా వారున్న వైపు నడిచాడు. మెల్లగా అక్కడ నడుం వాలాడ్చు.

ఆ యిద్దరు వ్యక్తులు. వాదనలో వుండి సత్రంలో మిగతా వారిని గమనించలేదు. శేఖరయ్యాను వారు చూడ లేదు. కానీ శేఖరయ్యా వారిసంభాషణను కుతూహలంగా వింటూ కూర్చున్నాడు. వారెవరో బాటసారులు. అందులో ఒకాయన యువకుడు. సన్నగా, పొడుగ్గా వున్నాడు, మల్లుధోవతి, మల్లు చొక్కా వేసుకుని కంటికి చల వద్దాల జోడు పెట్టుకుని చూడముచ్చటగా వున్నాడు. రెండో ఆయన కాస్త వయస్సు మళ్ళినట్లు కనిపిస్తున్నాడు. క్రిందికి, మీాదికి ఖద్దరు గుడ్డలు. ఆయనే మాట్లాడు తున్నాడు. ఆయన మాట్లాడిన మాటలకు, మధ్యలో అడ్డు వస్తున్నాడు రెండో మల్లుచొక్కా వ్యక్తి.

అక్కడనేకమంది వున్నప్పటికి వీరిమీాద దృష్టి ఎవ్వ రికీ పోలేదు. ఎవరికి వారు ఏదో పిచ్చాపాటీ మాటలాడుకుం టున్నారు. కొందరు మాకివేమీా అక్కరలేదన్నట్లు ప్రశాం తంగా పడుకుని గురకలు పెడుతున్నారు. అప్పటికి శేఖ రయ్యా ఒక్కడే వారిమాటలందు ఆసక్తి చూపి వింటు న్నాడు. మాట్లాడేవ్యక్తికి కొంచెంవయస్సు దాటి వుండ టంవలన ధాటిగా మాట్లడలేక పోతున్నాడు మధ్య మధ్య కొంచెంసేపు ఆగిగాని మాట్లాడలేక పోతున్నాడు.

అలా మాట్లాడుకుంటున్న యిద్దరూ ఆ పట్టణవాసులు కాదు. అందులో ఒకాయనిది ఏదో పల్లెటూరు. ఆయనే యిందాకటినుండి వింటున్నాడు, మాట్లాడేవ్యక్తిది మరొక పట్టణం. ఆయన సత్యాగ్రహి. గాంధిజీ ఆదేశం ప్రకారం యిక్కడ సత్యాగ్రహులకు నాయకత్వం వహించడానికి వచ్చాడు. ఆ ఉదయం జరిగిన సత్యాగ్రహంలో ఆయన ముందున్నవాడే మిట్టమధ్యాహ్నం కావడంవలన విశ్రాంతి తీసుకుంటున్నాడు. అయితే యీపాటికి మీకు వారు మాట్లాడే మాటలేమిటో దేన్నిగురించో అర్థమైవుంటవి, ఆనాటి వుదయం జరిగిన సంఘటనలను, ఆ పల్లెటూరివ్యక్తికి ఆయన చెప్తున్నాడు.

శేఖరయ్య వారి మాటలందు ఆసక్తిని చూపుతున్నాడని తెలుసుకుని, ఆవ్యక్తిగొంతును కాస్త పెద్దదిచేసి మాటలాడుతున్నాడు. వినేది యిద్దరే అయినప్పటికి ఆయన మొదటినుండి స్టేజీమీదవుండి చుట్టూ అనేక వందలమంది ప్రేక్షకులున్నపుడు ఉపన్యసించినట్లుగా మాటలాడుతున్నాడు. అపుడపుడు మధ్య చిన్న చిన్న పిట్టకథలు, చెప్తూ, చాలా వుత్సాహంగా వున్నాడు. శేఖరయ్య అతని మాటలు వింటూ భోజనమే మరచిపోయాడు.

ఆయన చాలాసేపు మాటాడాడు. ఇంతలో వీధిలో స్వచ్ఛంద సేవకుల కేకలు. తుపాకుల శబ్దాలు వినిపించినవి. మాటలాడే సత్యాగ్రహి మాటాడుతూనే లేచి నిలబడ్డాడు. 'చూచారా' ఒకవైపు మనస్వచ్ఛంద సేవకుల స్వాతంత్ర్య దీక్ష, మరొకవైపు తెల్లపిశాచాల కాల్పులు. ఇదేన్యాయం.

వారేంతప్పు చేశారని తెల్లవాళ్ళకంత కోపం, స్వతంత్రం అడిగారనేగా! యింకా మాట్లాడుతున్నాడు. ఆయన కంఠం కోపంతో వణికిపోతున్నది.

"ఈ తెల్లమూక భావించినట్లుగా మనదేశంలో ఐక్యత చావలేదు. మనకు స్వాతంత్రం ఇవ్వకుండా వుండాలని వారు కోరుకుంటున్నారు. స్వాతంత్రం కావాలని మనం కోరుకుంటున్నాం. పైన భగవానుడున్నాడు. ఎవరి మొరాలకించుతాడో చూడాలి. ఈ దెబ్బతో భారతదేశం బానిస బంధాలనుండి విముక్తియైనా కావాలి. లేదా, భారతీయులు స్వాతంత్రోద్యమంలో మరణించారని పేరైనా రావాలి... వీరి కుత్రంతాలు, కుయుక్తులు. మోసాలకు ఇంకా ప్రజలు తలవొగ్గుతారని భావిస్తున్నారు. ఆరోజులు పోయాయని తెలుసుకోలేక పోతున్నారు. తెల్లనక్కలు, వీళ్ళింకా మనదేశంలో ఉండాలనే వీరికోరిక. మనలో మనకు విరోధాలు కల్పిస్తూ, చూస్తూ ఆనందిద్దామనుకుంటున్నారు. ఇంతలో వీధిలో ఒక్కసారిగా నినాదాలు జాస్తి అయినవి. ఆ వెనువెంటనే 'ఢమ్' 'ఢమ్' అని, తుపాకుల చప్పుడి, అనేకమంది ఆర్తనాదాలు, విజిల్సు, నినాదాలు వరుసగా జరిగిపోయినవి. ఉపన్యాసంయిచ్చే వ్యక్తి గబగబా బయటికి పరిగెత్తాడు. ఎందుకైనా మంచిదని సంత్రలోని జనం వీధి తలుపు మూసేశారు. సత్రంలోని జనం అప్పటికే లేచారు. ప్రాణాలను అరచేతిలో పెట్టుకుని కిక్కురుమనకుండా కూర్చున్నారు.

ఆ సాయంత్రంవరకు ఎలాగో గడిచిపోయింది. ఈ లోపు యెప్పుడు యెవరువచ్చి సంత్రం తలుపులు బద్దలు కొడతారో నని స్త్రంలోని జనం క్షణమొక యుగంలా గడిపారు. ఆసాయంత్రానికి గాని, సత్యాగ్రహం ఆగలేదు. పట్టణంలో ఏ ఆటంకాలు లేకుండా రహదార్లు సాగుతున్నవి. ప్రజలు యథాప్రకారం తమతమ పనులలో నిముగ్నులైనారు. బ్రిటీషువారు స్వచ్ఛంద సేవకులను జైళ్ళకు పంపారు. విచారణలేకుండా లాటీచార్జీ చేశారు. యెదిరించిన వారిని కాల్చేశారు. ఇంకా ఉరిశిక్షలు, ఆశిక్షలకైనా ఒక చట్టంలేదు. ఆఫీసర్లే న్యాయశాస్త్రాలు, బ్రిటీషు వారి బంటులే చట్టాలు, చట్టం యెలావుంటే న్యాయశాస్త్రం అలా పలికేది. గవర్నర్ జనరల్ దగ్గరనుండి, బ్రిటీషుఆఫీసులలో ప్యూన్ వరకు ఒకటే చట్టం. ఒకటే 'లా'. దానికి మార్పు లేదు.

దానికి ఒక స్థలం లేదు. 'కోర్టు, న్యాయస్థానాలు, నిల్చున్నపాటుగా నిముషంలో న్యాయశాస్త్ర ప్రకారం, శిక్షలు విధించేవారు. ఆశిక్షలు జడ్జి విధించ నక్కరలేదు. ప్రభుత్వ ఉద్యోగి యెవ్వడైనాసరే, వాడి కేవిధంగా గిట్టని వాడెవడైనాసరే, వాడు స్వాతంత్రయోధుల క్రింద జమ. వాడు బ్రిటీషు సామ్రాజ్యానికి శత్రువు. అంచేత వాడి కేవిధంగా శిక్ష విధించినా విధించవచ్చు. ఆశిక్ష యిచ్చిన వాడు ప్రభుత్వోద్యోగి యైతేసరి. ఇది ఆనాటి న్యాయశాస్త్రం. దానితో సామాన్య ప్రజలకు గూడా బ్రిటీషువారంటే ద్వేషం ఏర్పడింది. ఇందులో సంబంధంలేని అమా

యకు లనేకమంది జైళ్ళకు పోయినారు. ప్రాణాలు పోగొట్టు కున్నారు. ధన, మానాన్ని మంచినీళ్ళ ప్రాయంగా వదిలే శారు. స్వాతంత్ర రణరంగలో దూకారు. గాంధీజీ ఆదేశం ప్రకారం తాముస్వచ్ఛంద సేవకులలో కలిశారు.

అలా దేశంలో రోజురోజుకు, స్వాతంత్రంయందు ప్రజల కభిమానం ఎక్కువకాజొచ్చింది. పెద్దపెద్ద ధన వంతులు, లాయర్లు. ఆఫీసర్లు, గాంధీశిష్యు లవుతున్నారు. స్త్రీపురుష భేదంలేకుండా స్త్రీలుసహితం పురుషులతో బాటు పాలుపంచుకుంటున్నారు, తమ భర్త, సోదరులతో బాటు, తాము, తమ పిల్లలు నడుంకట్టుకుని ముందుంటు న్నారు. ప్రజలలో జనించిన ఈ స్వాత్రంత్ర వాంఛకు ప్రకృతే స్థంభించి విలయతాండవం చేసినట్లుంది. ఎక్కడ చూసినా స్వాతంత్రసమర సంఘటనలే. ఎవరినోట విన్నా స్వాతంత్ర సమరగీతాలే. సామాన్య ప్రజల జీవితాన్ని నగ్నంగా చిత్రించు అనేక పాటలు, పద్యాలు, తెల్లవారి రాజ్యంలో సామాన్యుల బాధలు స్పష్టంగా చిత్రించు కథలు, గాథలు, వెలువడినవి. నాయకులు ప్రతి పల్లె, పట్టణంలో మారుమూలలకుపోయి స్వాతంత్ర శంఖారావం పూరించారు. ఆ ఘోషకు ప్రకృతే స్థంభించిది. తెల్ల వాళ్ళకు యిలా జరుగుతుందని తెలియదు. కుటిలోపా యంతో మొదట్లోనే తృంచివేద్దా మనుకున్నారు. కాని వారి ఆటలు సాగలేదు. వారి ఎత్తులకు పై ఎత్తులు వేస్తు న్నారు నాయకులు. దానితో వారికి మండింది. నాయకు లను, ప్రజలను స్త్రీపురుష భేదంలేకుండా జైళ్ళలో

పెట్టారు. ఇలాగైనా కొంత శాంతి కలుగుతుందేమోనని వారు భావించారు.

కాని భారతీయులెవ్వరూ భయపడలేదు. వారిలో దారుణ కోపాగ్ని రగిలింది. బ్రిటీషు వారికి ఏ విషయంలోను సహాయం చేయగూడదని తీర్మానించుకున్నారు. అదే సహాయ నిరాకరణోద్యమం. ఈ ఉద్యమం దేశమంతటా జరిగినది. ప్రభుత్వ కార్యకలాపాల్లో భారతీయు లెవ్వరూ పాల్గొనకూడదు. ప్రభుత్వానికి భారతీయులెవ్వరూ ఏ విధంగాను సహాయం చేయగూడదని నాయకులు ఆదేశించారు. ఆ ప్రకారమే దేశమంతటా సహాయ నిరాకరణోద్యమం దిగ్విజయంగా సాగింది.

# 6

ఆ సాయంత్రం సందడంతా తగ్గినతరువాత సత్రం తలుపులు తీశారు. సత్రంలోని జనం ఒక్కొక్కరే వీధిలోనికి రావడం ప్రారంభించారు. శేఖరయ్య అంతవరకూ పచ్చి గంగకూడా ముట్టుకోలేదు. సత్రంలో నీళ్ళు లేక కాదు. ఆయన నిత్యాగ్నిహోత్రుడు. మడికట్టుకుని వంట చేయాలి. తాను సంధ్యావందనం చేయనిదే భోంచేయడు. ఆయనకు ఈ పట్టణంలో ఎవ్వరూ తెలియదు. సత్రంలోని భోజనం మడిగా వుండదని భోజనం చేయటానికిష్టపడక ఆ సాయంత్రం వరకు పచ్చి గంగనుకూడా ముట్టుకోలేదు. ఎందుకైనా మంచిదని అగ్రహారంనుండి వస్తూ దేవతార్చన పెట్టెను వెంట తెచ్చుకున్నాడు కాని అది అలానే చంకనున్న

సంచీలోనే ఉండిపోయింది. ఆ రోజు ఆయనకు, ఆయన దేవుడికి ఏకాదశి.

శేఖరయ్య సత్రం బయటకు వచ్చాడు. పెద్దగాలివాన వచ్చి వెలసినట్లుగా, కేకలు, తుపాకి శబ్దాలు తగ్గి యిప్పుడు కొంచెం ప్రశాంతంగా వున్నది. వీధులలో జనం తమ మామూలు పనిపాటలు చేసుకుంటున్నారు. అక్కడక్కడా జనం ఒకచోట చేరి ఏవేవో మాట్లాడుకుంటున్నారు.

శేఖరయ్య వీధివెంట నడుస్తున్నాడు. ఆయనకు ఆకలి పూర్తిగా పోయింది. కాని నాలిక పిడచకట్టుకపోయి నట్లయింది. ఆ మధ్యాహ్నం భోజనం లేదు. ఈ రాత్రికి కూడా భోజనం చేయకుండా వుండగలడుకాని సాయం సంధ్య చేయకుండా వుండలేక పోయాడు ఎక్కడికైనా వెళ్ళి ఒక బావిగట్టున సంధ్యవార్చుకుంటే బాగుండనుకున్నాడు. ఆయనకా ఆలోచన తట్టగనే గబగబా చేరువనేవున్న భావిదగ్గరకు వెళ్ళి సంధ్యావందనం చేసుకోవాలనుకు న్నాడు.

బావిదగ్గర జనం అట్టేలేరు. ఇద్దరుస్త్రీలు ఒకవైపు తోడుకుంటున్నారు. అది గిలకలబావి. నాలుగువైపులా, చదరంగావున్న ఆ బావికి ఎనిమిది గిలకలున్నవి. ఆ బావి నాలుగు వీధుల కూడలిలో వుండుటవలన చిన్న బావి అయినా ఎనిమిది గిలకలున్నవి. శేఖరయ్య చేతి సంచిలో నుండి రెండు తుండుగుడ్డలు తీసి, ఒకటి నడుముకు చుట్టు కున్నాడు. రెండోది భుజాన వేసుకుని ఆ స్త్రీలదగ్గరకు వెళ్ళి బక్కెటు అడిగితీసుకొని గబగబా రెండు బొక్కెనల సిరు

నెత్తిన పోసుకున్నాడు. ఓ బక్కెట్టు నీటితో భావిగట్టున ఒక మూల కూర్చుని గబగబా సంధ్యావందనం పూర్తి చేదామనుకున్నాడు.

ఇంతలో అక్కడికి ఒక ఆజానుబాహుడు వచ్చాడు. నల్లగా వున్నాడు. అతనివాలకం చూడ నీళ్ళు త్రాగటానికి బొక్కెన అడగటానికి వచ్చినవాడిలా వున్నాడు. శేఖరయ్య అతనితో మాటాడలేదు. దూరంగా వుండమని సైగచేశాడు. కాని అతను మరికాస్త దగ్గరకు వచ్చాడు.

'ఎవరునీవు' అని గద్దించిఅడిగాడు శేఖరయ్య.

'క్రిస్టియన్ను' జవాబిచ్చాడా ఆగంతకుడు.

'అయితే అక్కడేవుండు, సంధ్యావందనం పూర్తి కానీ?

"ఏం ఎందుకు! ఏవూరుమంది!" ఎదురు ప్రశ్నించాడు.

"మాది అగ్రహారం. ఒక్క క్షణంవుండు. సంధ్యావందనం అయిపోవచ్చింది. బక్కెట్టుయిస్తాను!"

కాని ఆత నాగలేదు. గబగబా శేఖరయ్య వద్దనున్న బక్కెట్టు తీసుకున్నాడు. శేఖరయ్యకు కోపం ఆగలేదు. వైశాఖ మాసంలోని మిట్టమధ్యాహ్నపు సూర్యుడిలా మండి పడ్డాడు. సంధ్యావందనం పాడుచేయడమే కాకుండా అంత వరకు పచ్చిగంగకూడా ముట్టుకోకుండా వున్న తనకు ఇంక ఆరోజుగూడా ఏమీ ఆహారం పుచ్చుకోకుండా మయల పడేశాడని పవిత్రమైన సంధ్యావందన నీటిని తాకాడని

ఉగ్రుడైనాడు. అదే అగ్రహారం అయితే ఎలాఉండేదో, కాని అది పట్టణం కావడంవలన శేఖరయ్య మాటలు ఆలకించినవారు లేరు. ఆయనపరిస్థితికి జాలిపొందినవారు లేరు. ఆ వచ్చినమనిషి గబగబా ఒక బక్కెట్టు నీళ్ళు తోడుకుని త్రాగి వెళ్ళిపోయాడు.

అంతవరకు ఆ చుట్టుపక్కలవున్న జనం చూస్తూ నిల్చున్నారేగాని ఎవ్వరేమీ కల్పించుకోలేదు. శేఖరయ్యకు ఒకవైపు కోపం, మరొకవైపు సానుభూతిలేని తన పరిస్థితి చూచి నిర్ఘాంతపోయాడు.

అది ఆయన జీవితంలో మరొక మరుపురాని రోజు. పట్టణ వాతావరణం పూర్తిగా తెలియకపోయినప్పటికి పట్టణంలోని బ్రాహ్మణులు, మడీ, ఆచారాలలో పల్లెటూరి బ్రాహ్మణులకు తీసికట్టేనన్న విషయం ఆయనకు తెలియనిది కాదు. అయినప్పటికి పట్టణంలో యింతకట్టుబాటు కాకుండా పెద్ద, చిన్నా బేధం తెలియకుండా జీవిస్తారనిమాత్రం ఆయన వూహాకందని విషయం. అందుకే కోపంతో వుండి కూడా ఆశ్చర్యపడ్డాడు. అక్కడినుంచి శరీరంకూడా తుడుచుకోకుండా తడిబట్టలు నెత్తిన వేసుకుని సత్రంవైపుకు బయలుదేరాడు.

అపుడు షుమారు ఎనిమిది గంటలు కావచ్చు. సత్రంలోని జనం అప్పుడే భోజనాలు ముగించుకుని సత్రానికి చేరుకున్నారు. అలా కొద్దిసేపటిలోనే జనంతో సత్రం పూర్తిగా నిండిపోయింది. ఎక్కడా కొద్దిచోటు కూడా లేదు. శేఖరయ్య ఒకమూల గుడ్డపరుచుకుని పడు

కున్నాడు. కాని ఆయనకు నిద్రపట్టడంలేదు. ఆకలి దహించి వేస్తున్నది. ఆరోజల్లా కడుపులో పచ్చి గంగకూడా పడక పోవడం మూలంగా జడుపులోని ప్రేగులు అరుస్తున్నవి. నాలిక మడతపడినట్లుగా, నోటిలోనుండి మాట స్పష్టంగా రావడంలేదు. నాలిక పిడచకట్టుక పోయింది. ఆ పరిస్థితిలో వుండికూడా శేఖరయ్యకు నీళ్ళు త్రాగబుద్ధి పుట్టడంలేదు. మైలపడ్డ జంద్యాన్ని మార్చి కొత్తజంద్యము వేసుకుని ప్రారంభంనుండి సధ్యావందనం చేస్తేగాని ఆ మైల పోదు. అంతవరకు ప్రాణంపోయినా పచ్చి గంగకూడా ముట్టుకో కూడదనుకున్నాడు, ఇంతలో అక్కడికి ఆ మధ్యాహ్నం మాట్లాడిన సత్యాగ్రహి వచ్చాడు. ఆయన వస్తూనే శేఖ రయ్యను పలుకరించి శేఖరయ్య ప్రక్కన కాస్తచోటు చేసుకుని కూర్చున్నాడు.

శేఖరయ్య ఆయన పలకరించువరకు ఈ లోకంలో లేడు. ఊహాప్రపంచంలో వూగిసలాడుతున్న తనను ఎవరా యింత ఆప్యాయంగా ఈపట్టణంలో పలుకరించు నదని ఒక్కసారి ఆశ్చర్యంగా ఆయనవైపుచూచి వెంటనే లేచి కూర్చున్నాడు.

"ఏమండి అలావున్నారు" ఆవ్యక్తే పలకరించాడు. 'ఏమీలేదండి' అన్నాడు శేఖరయ్య.

శేఖరయ్య తన పరిస్థితి ఆయనకు చెప్పుకుందామను కున్నాడు కాని తీరాతాను చెప్పినతర్వాక, ఆ వ్యక్తి మాత్రం తనను సానుభూతితో చూస్తాడని ఏముంది. అం

దుకే చెప్పలేదు. మాటలమధ్యలో ఒకటిరెండుసార్లు చెప్ప బోయి అభిమానం చంపుకోలేక పోయాడు.

శేఖరయ్య యిచ్చిన జవాబు ఆవ్యక్తిని సంతృప్తి పరచలేదు. మనస్సులో దేన్నిగురించో బాధపడుతూ చెప్ప లేకుండా వున్నాడని పసిగట్టాడా వ్యక్తి.

"మీారేదో దాస్తున్నారు?"

"లేదు"

"పోనీయండి మీామనస్సుకు బాధకలిగించడం నా కిష్టంలేదు, తమదేవూారు."

"అగ్రహారం"

"ఏ అగ్రహారం?"

"వేట్రాయుని అప్పాపుర అగ్రహారం"

"తమ పేరు!" కాస్త ఆశ్చర్యంగా అడిగినాడావ్యక్తి.

"శేఖరయ్య"

"నరసింహశాస్త్రిగారి మనుమలా మీారు" ద్విగుణీ కృత ఉత్సాహముతో ప్రశ్నించాడు.

"అవును"

'అరే, నీవా శేఖరయ్యవు! ఆవ్యక్తి పారవశ్యంతో శేఖరయ్యను కౌగలించుకొని నేను మీా ఇంట్లో చాలా రోజులుండి మీానాన్నగారివద్ద సంస్కృతం పంచకావ్యాలు చెప్పుకొన్నాను. అపుడు మీారు చాల చిన్నపిల్లలు. పాపం ఈ మధ్యే మీా నాన్నగారు పోయారని తెలిసింది. ఒకసారి వచ్చి మిమ్ములనందరిని చూచేపోదామనుకున్నాను. కాని

తీరికవుంటేగా! ఈ తెల్లజాతి మన దేశమునుండి పోయేదాకా యింతే, క్షణం తీరిక వుండదు.

"శేఖరయ్యకు" చివర వాక్యం మనస్సులో బాగా నాటింది.

"మీరు మానాన్నగారివద్ద చదువుకున్నారా"
"అవును, అపుడు మీరు చాలా చిన్నపిల్లలు,"
"తమ పేరు?"
"కామేశ్వరరావు"

శేఖరయ్య కిపుడు బాగా పీలుచిక్కింది. అసలు సంగతులన్నీ వివరంగా కామేశ్వరరావు నడిగి తెలుసుకోవాలనుకున్నాడు. ఇంతకుముందైతే పరిచయంలేని వ్యక్తి, కొత్త వాడు, అని వూహుకున్నాడు. కాని యిపుడు అతను కూడా ఎవరో పరాయివాడుకాదు. కేవలం ఒక శాఖవారే. అంచేత శేఖరయ్యకు చిన్నతనంలో ప్రాణస్నేహితులుగా ఉన్నవారు, ఏదో కారణాలచేత విడిపోయి చాలాకాలానికి కలుసుకుంటే ఎలావుంటుందో అలా వున్నది.

"అయితే మీరిందాక అన్నారే, తెల్లవాళ్ళవి షయం అదేమిటండి కాస్త తెలియచెప్పండి!

"అదా, దానికేమున్నది. అయినా పండిత పుత్రులు మీకు తెలియక పోవడమేమిటి, మూడువందల సంవత్సరాలగా మన దేశంలో ఉంటూ మనసొమ్ము తింటూ, మనలనే పాలనచేస్తూ అన్నివిధాలా మనలను, మన మతాన్ని, మన సంస్కృతిని, నాగరికతను అణగత్రొక్కుతున్న

ఆ తెల్లవారిసంగతా? ఏముంది? వారు జిత్తులలో నక్కను మించిపోతారు. పూర్తి అవకాశ వాదులు. మనం మనకు స్వాతంత్రం కావాలంటున్నాం, మారాజ్యాన్ని మేము పరిపాలించు కుంటాం. మీరు మా దేశాన్ని వదలి పొమ్మని చెప్పాం, కాని వారు వినరు. పైగా మనలో ఆమాట అడిగిన వాడిని జైలుకు పంపడం, శిక్షలు విధించడం, యిదీ వారిపని. అందుకే. మేమంతా స్వరాజ్యం కోసం పోరాడుతున్నాం. అయితే యిది చాలదు. ఇంకా, వేలకు వేలు ప్రజలు స్వాతంత్ర్య సమరంలో చేరాలి. ఇప్పుడు పట్టణాలలోనే అలజడిగా వున్నది. పల్లెలనుండి కూడా ప్రజలంతా ఏక కంఠంతో బ్రిటీషు ప్రభుత్వాన్ని ఎదిరించాలి. అప్పుడు గాని మనసత్తా ఏమిటో వారికి తెలియదు. అంతవరకు యింతే.

'అయితే, స్వాతంత్రం వచ్చినందు వలన మనకు వుపయోగ మేమిటండి.'

'ఉపయోగం లేకేమి' అన్నివిధాలా వుపయోగమే. మనదేశంలో పత్తినంతా వాళ్ళదేశానికి తీసుక పోతున్నారా, అదే బట్టగానేసి సొగసుగా మిల్లు బట్టలు మనకు అంటకడుతున్నారు. దానితో మనదేశంలో అనేక వేల మంది నేతపనివారు నిరుద్యోగు లవుతున్నారు. చేసేందుకు పనులులేక, భార్యబిడ్డలను పోషించే శక్తి లేక రత్నగర్భం లాంటి మనదేశాన్ని వదలి వలసలు వెళ్ళి పోతున్నారు. ఈనాడు బర్మా, రంగూన్‌లో లక్షలాది భారతీయు లెందుకున్నారు? వారంతా భారత దేశంనుండి వలసలు వెళ్ళిన

వారే. అలాగే మతవిషయంలో తీసుకున్నా, మరే విష
యంలో తీసుకున్నా జరిగేది యింతే. అందుకే మన
నాయకులు యిదంతా గ్రహించి బ్రిటీషువారిని మన దేశా
న్నుండి వెళ్ళగొట్టా లంటున్నారు.

కామేశ్వరరావు ఒక్క బిగువున మాట్లాడేసరికి ముఖ
మంతా కందిపోయింది. సత్రంలో గాలి లేకపోవడం వల్ల
నైతేనేమి, ఆ వచ్చేగాలి అంత జనాభాకు సరిపోక పోవడం
మూలంగానైతేనేమి బాగా చెమట పట్టింది. కామేశ్వరరావు
ముఖం కందిపోయి వుండటం, దానికి చెమటపట్టడం
వింతగా వున్నది.

'ఆఁ, మాటల సందడిలో మరచాను. ఇంతకూ నీ
వెందుకొచ్చావు?'

శేఖరయ్య అగ్రహారం సంగతులన్నీ కామేశ్వ
రరావుకు చెప్పాడు. తా నక్కడికి ఎందుకువచ్చిందీ, తన
పార్టీ వ్యవహారాలు, కుటుంబ కలహాలు అన్నీ చెప్పాడు.
కామేశ్వరరావు విని ఎంతో బాధపడ్డాడు.

"మనదేశం ఈనాడీ రూపంలో వుండటానికి ముఖ్య
కారణాలే అవి. మనలో ఐక్యత లేకపోవడం మూలంగానే
ఈనాడు మనం బానిసలలా బ్రతకడానికి కారణభూతు
లమైనాం."

అంతా విని శేఖరయ్యకూడా తన అభిప్రాయం
కూడా అదేనని చెప్పాడు. గ్రామంలో పార్టీలు, కక్షలు
క్షేమంకావని గత్యంతరంలేక తానిలా వచ్చానని చెప్పాడు.

అప్పటికే సత్రంలో గడియారం కునికిపాట్లు పడుతూ, చిన్నగా పదకొండు గండలు కొట్టింది. కామేశ్వరరావు భావి దగ్గరకు వెళ్ళి కాసిన నీళ్ళు త్రాగి వచ్చి పడుకున్నాడు. కానీ శేఖరయ్య నీళ్ళు మాత్రం త్రాగలేదు. నీళ్ళతో ముఖం తుడుచుకుని కాళ్ళు చేతులు కడుక్కొని వచ్చి పడుకున్నాడు.

తెల్లవారింది. సత్రంలోని జనం భావిగట్టున చేరి పిచ్చాపాటి మాట్లాడుకుంటూ దైనందిన కార్యాలలో లీనమైనారు. శేఖరయ్య ఎలాగో చిన్నగా వీలుచూసుకుని ముఖం కడుక్కొన్నాడు. స్నానానికి అప్పుడు వీలు దొరికేట్లుగా లేదు. ఇంతలో కామేశ్వరరావు వచ్చాడు వస్తూనే "శేఖరయ్యా నేను వెళ్లుతున్నాను. ఈవీధి చివరలో ఒక ప్లీడరున్నాడు. ఆయన దగ్గరకు వెళ్ళి నేను చెప్పానని చెప్పు, ఫరవాలేదు" అని వెళ్ళిపోయాడు.

శేఖరయ్య స్నానం, సంధ్యా పూర్తికానిది ఎక్కడికి పోకూడదనుకున్నాడు. అలాగే అక్కడేవుంటే ఎప్పటికైనా వీలు దొరకకపోదని అక్కడే కూర్చున్నాడు.

ఒకగంట కాలం గడిచింది. సత్రంలోని పురుషులు బయటికి వెళ్లిపోయారు స్త్రీలు యిత్తడి బిందెలు చంకన బెట్టి, భావిగట్టుకు చేరుతున్నారు. శేఖరయ్య కప్పుడే వీలు దొరికింది. గబగబా స్నానంచేసి, ఆ సత్రంలోని ఒక కుటుంబీకుల వద్ద చిన్న గ్లాసు అడిగిపుచ్చుకుని సంధ్యావందనాని కుపక్రమించాడు.

శేఖరయ్య సంధ్యావందనం పూర్తిచేసేసరికి సూర్యుడు నెత్తిమీదకు వస్తున్నాడు. అప్పుడు షుమారు పదిగంట లవుతుంది. గబగబా మూట చంకన బెట్టుకుని కామేశ్వరరావు చెప్పిన గుర్తు ప్రకారం ప్లీడరుకోసం బయలు దేరాడు.

# 7

అది న్యాయవాది ప్రకాశరావు బి. ఎ. బి. యల్ గారి బంగళాలాంటి మేడ. ఇల్లు చిన్నదైనా నవీనంగా చాలా అందంగా వున్నది. ఇంటిముందు తాటికాయంత అక్షరాలతో బోర్డు వుంది. ముందు గేటు, తోట. ఆలోపల అనేకరకాల పరిమళ పుష్పజాతులున్నవి

శేఖరయ్య వెళ్ళి గదిముందున్న బెంచీమీద కూర్చు న్నాడు. పట్టణంలో ప్రకాశరావుగారు పేరుపొందిన న్యాయవాది. న్యాయవాది అనే నాలుగక్షరాలకు ఆయన ఎప్పుడూ, ఎక్కడా భంగకరంగా ప్రవర్తించలేదు. మనిషి ముక్కుకు సూటిగా పోయేవాడు. పార్టీలతో నిర్మొహమాటంగా మాట్లాడుతాడు. కష్టానికి తగిన ప్రతిఫలం తీసుకుంటాడు. అన్యాయంగా ప్రవర్తించడు. కేసు గెలుస్తుందని తనకు నమ్మకముంటేనే ఆ కేసు తీసుకుని వాదిస్తాడు. అందుకే సామాన్యంగా ఆయన తీసుకునే కేసులు చాలా తక్కువ.

శేఖరయ్య వెళ్ళేసరికి ఆయన కోర్టుకు పోవడానికి సిద్ధమవుతున్నాడు. ఎవరో వచ్చారని చిన్నపిల్ల చెపితే,

కోటు తొడుక్కుంటూనే బయటికి వచ్చాడు ప్రకాశరావు. ఆయనను చూచి శేఖరయ్య లేచి నమస్కారం చేశాడు.

"ఏవూరండి?"

"మాది అగ్రహారం"

"నాతో పనివుండి వచ్చారా?"

"అవును"

"కూర్చోండి. ఇప్పుడే వస్తాను" అని ప్రకాశరావు గబగబా లోపలికిపోయి క్షణకాలంలో తిరిగి వచ్చాడు.

శేఖరయ్య తాను వచ్చినపని అంతా చెప్పాడు. ప్రకాశరావు శేఖరయ్యతో ఎంతో ఆప్యాయతగా మాట్లాడాడు.

"మీ కేసు తీసుకుంటాను, అంతేకాదు మీరీపూట భోజనం గూడా మాయింట్లోనే చేయండి" అన్నాడు.

"అక్కర లేదండి"

"ఫరవాలేదు. మీకు మడీ ఆచారములు జరగదని అనుమానపడకండి. ఒకప్పుడు మాది పల్లెటూరే. మాఅమ్మగారు ఎంతో ఆచారవంతురాలు. మీరు తప్పకుండా ఈ పూట మాయింట్లో భోంచేయాలి. కేసు ఒకటున్నది, కోర్టుకు వెళ్ళుతున్నాను. మధ్యాహ్నం మిమ్మల్ని మా గుమస్తా కోర్టుకు తీసుకవస్తాడు. అక్కడ మాట్లాడుకుందాం" అని చెప్పి ఆయన వెళ్ళిపోయాడు.

శేఖరయ్య ఇక మారుమాట్లాడలేక పోయాడు. తాను వచ్చిన పనైనందుకు సంతోషించాడు. ఆపూట భోజనం

అక్కడే చేశాడు, ప్రకాశరావుగారి కుటుంబ మర్యాదకు ఆయనెంతో మనస్సులో సంతోషించాడు.

ప్రకాశరావుది ఆపట్టణానికి దగ్గరలోనే ఒక అగ్రహారం. ఆస్థిలో జమీందారులు కాకపోయినప్పటికీ, కూర్చొని తినటానికి ఏలోటు లేదు. విజ్ఞానం కోసం ప్రకాశరావు మేనమామ మేనల్లునికి చదువు చెప్పించాడు. కానీ ప్రకాశరావుకు మొదటినుండీ న్యాయవాది కావాలని కోరికగా వుండేది. ఆ వుద్దేశ్యంతోనే ఆయన పట్టణంలో చదువు పూర్తికాగానే అక్కడే ప్రాక్టీసు ప్రారంభించి నీతిగా, నిజాయితీగా వుండటంవలన అనతికాలంలోనే ఆయనపేరు పెద్ద న్యాయవాదుల చిట్టాలోకి వచ్చింది. పార్టీలతో ఆయనెప్పుడు కోపంగా మాట్లాడడు. వారికి తెలియని విషయాలు చెప్తాడు. అందుకే పార్టీలకుగూడా ఆయనంటే ఎంతో అభిమానం. ఒకసారి వచ్చిన పార్టీ యిక మరొకసారి మరొకరి దగ్గరకు వెళ్ళరు.

ప్రకాశరావు తండ్రికి ప్రకాశరావు ఒక్కడే కుమారుడు. ఆయన శుద్ధ శ్రోత్రీయుడు. కుమారుడు కిరస్తానీ చదువు చదివితే మైలపడి పోతాడని ఆయన భావన. అందుకే కుమారుని చదువువిషయంలో ఆయన తీవ్రంగా వ్యతిరేకించాడు. ఉన్న ఒక్క కుమారుడు కిరస్తానీ చదువు చదివి, కిరస్తానీ మతం పుచ్చుకుని, కిరస్తానీలో కలిసి పోతాడని ఎవరో ఛాందసుడు ప్రకాశరావు తండ్రికి చెప్పారుట. అది విని ఆయన భయపడి పోయాడు ఉన్నఒక్కకుమారుడు

అలా అవుతాడని ఆయన కుమారుని ఉన్నత చదువును పూర్తిగా వ్యతిరేకించాడు.

కానీ ప్రకాశరావు మేనమామ నచ్చచెప్పిచూచాడు. కానీ, ముసలాయన మతం మార్చడానికి బావమరిది ఎంత ప్రయత్నం చేశాడో అంత విఫలుడు కావలసి వచ్చింది. దానితో ఆయనకు విసుగుపుట్టి మేనల్లునికి వేదాలు చెప్పిస్తానని తనతో పంపమని తనవెంట తీసుక వెళ్ళి, పట్నంలో స్కూల్లో చేర్పించాడు. ఆతరువాత ఎన్నాళ్ళకోగాని ముసలాయనికీ విషయం తెలియలేదు అలా మేనమామ పట్టుదలతో ప్రకాశరావు చదువు సాగింది.

ప్రకాశరావు తండ్రి బ్రతికుండగా అగ్రహారంలో ఒక కాపురం, పట్టణంలో ఒక కాపురం పెట్టి అక్కడి ఆస్థి దెబ్బతినకుండా, యిక్కడ పట్టణంలో తన వృత్తికి ఆటంకం లేకుండా కాలం వెళ్ళబుచ్చాడు. తండ్రిగారి మరణానంతరం తల్లినిగూడా తీసుకుని గ్రామంలో పొలం పాలికిచ్చి పట్నంలో ఒక్కచోటనే వుంటున్నారు.

తిండిగింజలకు సరిపడ ధాన్యం పొలాలమీద పల్లెటూరినుండి రైతులు తీసుకువచ్చి యిచ్చేవారు. వృత్తిమీదవచ్చేది ఆ పట్టణంలో తగిన హంగులతో ఖర్చుకు సరిపోతుండేది కాస్తా కూస్తో మిగిలినది దానధర్మాలు చేస్తుండేవారు. ఇలా కాలం వెళ్ళిపోతున్నది.

అసలు మొదటినుండి ప్రకాశరావుగారి వంశం ఎంతో గౌరవమర్యాదలతో బ్రతికినది. రాజులవద్ద వారు మంత్రిపదవులు చేశారు. ఒకవైపు మంత్రిపదవులో వుండే,

ఆస్థాన పండితులుగా వుండేవారు. ఆరోజుల్లో విన్నకోట వంశలో పండితుడిగా చెలామణీ కానివారు లేరంటే అతిశయోక్తిగారు. అసలు విన్నకోట వంశమే ఒక పెద్ద వంశం. ఆవంశంలో జన్మించడం ఎంతో పుణ్య పురుషులకు తప్ప, మిగిలినవారికా అదృష్టం పట్టదని ఆనాటి ప్రజాభిప్రాయం. అంతేకాదు, ఆనాడు, విన్నకోటవారి వంశంలో జన్మించడం ఎంత అదృష్టంగా భావించేవారో, వారితో వియ్యమందటం, ఇచ్చి పుచ్చుకోటాలుగూడా అంత మహా భాగ్యంగా భావించేవారు.

అలాగే రాజ్యాలు, చక్రవర్తులు, మంత్రిపదవులు కాలగర్భంలో కలిసిపోయినా, వంశకీర్తి ప్రతిష్టలుమాత్రం పోకుండా అప్పటినుండి కాపాడుకుంటూ వచ్చారు. ఆ వంశంవారిలో బాగా పేరు తెచ్చుకున్నవారిలో నృసింహశాస్త్రి ముఖ్యుడు, ఆయన ప్రకాశరావుకు ముత్తాత. అంటే తాత తండ్రి అవుతాడు. నరసింహశాస్త్రిగారికి అగ్రహారం బహుమతిగా యిచ్చిన వెంకటాద్రి నాయుడుగారి దివాణంలో మంత్రిగా వుండేవాడు. తన తెలివితో రాచకార్యాలేకాక, రాణీవాసపు కార్యాలుగూడా చూస్తూ, ఇరువైపులా అభిమానానికి పాత్రుడయ్యాడు.

అసలు ఈ విన్నకోట వంశంవారు యింతటి కీర్తి గడించడానికి ఒక కారణంగూడా వున్నదంటారు.

ఆ వంశంలోని మూలపురుషులెవరో దేవీ వుపాసన చేసి, కావలసినదల్లా కోరుకుని, ఆ కోరిక తీర్చుకునేట్లుగా దేవిదగ్గర వరం పుచ్చుకున్నారని ప్రతీతి. అయితే నేతిబీర

కాయలో నెయ్యి ఎంతో యిదీ అంతే కావచ్చు. నిజం సంగతి ఎలావున్నా, విన్నకోట వంశస్థులు మంచి పేరు, కీర్తి, ఘనత సంపాయించిన మాటమాత్రం వాస్తవం. బహుశా అందుకే ఏదో అలా జరిగుంటుందని వూహించి యిలా ప్రజలలో కట్టుకథను అల్లివుంటారు.

విన్నకోట వంశంవారి ఘనత యిక్కడనుండే ప్రారంభమయిన దనటానికి తగిన ఆధారాలకంటే, అంతకు ముందుగూడా ఆ వంశస్థులు మంచి ఘనత వహించారని చెప్పటకు చారిత్రిక సత్యాలున్నవని కొందరంటారు. అయితే ఈ వంశంవారిని గురించి మాత్రం ఎవ్వరికి అంత బాగా తెలియదనే చెప్పవచ్చు. అసలు వీరు ఆంధ్రదేశంలో ఏప్రాంతంవారో? ఎక్కడినుండి వలస వచ్చారు? అని అనేక మందికి అభిప్రాయభేదాలున్నవి. ప్రపంచంలో రకరకాల మనుషులున్నట్లే యీ వంశంవారిని గురించి ప్రజలలో రక రకాల అభిప్రాయా లున్నవి. అయితే మన ప్రస్తుత కథకు వాటితో సంబంధంలేదు.

నృసింహశాస్త్రి వెంకటాద్రి మహారాజులవద్ద మంత్రి పదవి ఎలా సంపాదించాడనేది వదిలేద్దాం. ఆయన మంత్రి పదవిలోనుండి అనేక ఘనకార్యాలు చేశాడు. రాజులకు రాచకార్యాలలో సహాయంగా అనేక నూతన సంస్కరణలు చేశాడు. ఒకవైపు రాచవారి ఆదాయాన్ని పెంచుతూనే; మరొకవైపు ప్రజోపకార్యాలు చేశాడు. పన్నులు తగ్గించి బీద, మధ్యతరగతి ప్రజల అభిమానానికి పాత్రుడయ్యాడు, అనేక ప్రదేశాలలో ఆయన పేరుతో ఈనాటికి మాసి

పోకుండ వుండేటట్లుగా అనేక త్రవ్వకాలు, కట్టడాలు కట్టిం చాడు. బీదజనానికి అనేకచోట్ల ధర్మశాలలు వేయించాడు. అనేక సత్రాలు కట్టించాడు. ఇలా అనేక ప్రయోజన కార్యాలు చేశాడు.

ఆయన తదనంతరం ఆయన కుమారుడు మంత్రి అయ్యాడు. ఆయన తండ్రిగారిని అనుసరించే పనులు చేసే వాడు అయితే ఆయన తరంలోనే, భారతదేశంలో బ్రిటీషువారి ధర్మమా అంటూ స్వదేశసంస్థానాలు, జమీం దారీలు, రాజులు, రాజ్యాలు పోయినవి. దానితో వెంకటగిరి సంస్థానాన్నికూడా బ్రిటీషువారి కబంధ హస్తంలోపడి నలిగిపోయింది.

మంత్రి పదవులవలన ఆస్తులు సంపాయించడమే కాకుండా, అంతధనాన్ని ఖర్చుకూడా చేసేవారు. దాన ధర్మాలు, అతిథి అభ్యాగతుల సంగతి లెక్కలోనిది కాదు. ఎప్పుడూ భోజనానికి వారితోబాటు పాతిక జనానికి తక్కువ వుండేవారు కాదు. శుభకార్యాలకు విరివిగా ధన సహాయం చేసేవారు. ఇంటికివచ్చిన అతిథులను సత్కరించనిదే పోనిచ్చేవారు కాదు. ఇలా ఆ వంశంవారి గౌరవప్రతిష్టలు యినుమడించినవి. అదే యీ నాటికి ఆ కుటుంబంలో పోకుండా వస్తున్నది. అందుకే శేఖరయ్యను భోంచేయనిది వెళ్ళనివ్వలేదు ప్రకాశరావు.

శేఖరయ్య భోజనం కాగానే కోర్టుకు వెళ్ళి ప్లీడరు గారితో మాట్లాడి ఆపూటే అగ్రహారం వెళ్ళి పోదామను కున్నాడు. కానీ భోజనంకాగానే ప్రకాశరావుగారి తల్లి,

శేఖరయ్యకు ఒకగదిలో పడక ఏర్పాటుచేసి విశ్రాంతి తీసుకుని వెళ్ళమని చెప్పింది. శేఖరయ్య ఆ ముసలామె మాటలకిక బదులు చెప్పలేక పోయాడు. కాసేపు పడుకుని భుక్తాయాసం తీర్చుకుని వెళ్లాలని గదిలోకి పోయేముందు అనుకున్నాడు శేఖరయ్య.

గదిలో శేఖరయ్యకు, ముసలామె ఒకపట్టెమంచము, దానిమీద పరుపు వేయించి, రెండువైపులా దిండ్లు పెట్టించినది. శేఖరయ్య, ఆ పరుపుమీద పడుకుని, ఆద మరచి నిద్రపోయాడు.

శేఖరయ్యకు, నాలుగు గంటలకుగాని మెళుకువ రాలేదు ఆయనలేచిన అలికిడి కనిపెట్టి దాసీమనిషి వచ్చి 'పెద్దమ్మగారు ఒక్కసారి మిమ్ములను లోపలికి రమ్మం టున్నారు. అని చెప్పింది. శేఖరయ్య, పనిమనిషి మాట ప్రకారం లోపలికి వెళ్ళాడు. శేఖరయ్యను చూస్తూనే ముసలామె పీటవేసి 'మీలాంటి సద్బ్రాహ్మణులు నా అదృష్టంకొద్ది దొరికారు, లేకపోతే యిక్కడ మంచి బ్రాహ్మణు లెవరున్నారు' అని కంచుచెంబునిండా నీళ్ళు బెట్టి, ఫలహారం బెట్టింది.

శేఖరయ్య, ముసలామెమాటలకు, ముందు కొంచెం ఆశ్చర్యపడి, తర్వాత మనస్సులో సంతోషించి "ఏంఇక్కడ మంచి బ్రాహ్మణులు దొరకరా!" అన్నాడు.

"అయ్యో రామ. యీ పట్టణంలో బ్రాహ్మణులు గూడానా, ద్వాదశి బ్రాహ్మణుడికే రూపాయి అడుగు తారు. మా అగ్రహారం వదలివచ్చిన తరువాత నాకీ పట్ట

ణంలో సరైన బ్రాహ్మణుడే దొరకలేదు." అంటూ ముస లామె మరి నాలుగు గారెలు వేసింది. శేఖరయ్య ఆమె మర్యాదకు మనస్సులో ఎంతో ఆనందించాడు. అతిథి అభ్యాగతుల విషయం ఆయనకు తెలియనిది కాదు. కానీ ఆయనెందుకో బిడియపడ్డాడు. శేఖరయ్య తనకు తానెంత సమాధాన పరచుకోవాలన్నా ప్రయత్నం విఫలమైనది. దానికి కారణం ఆయన చెప్పుకున్న సమాధానమిది. "తా నింతకు ముందెన్నడూ ఇతర ప్రదేశాలకు వెళ్ళి భోజనం చెయ్యకపోవడమే! నిజంకూడా అంతే.' శేఖరయ్య తన యిన్ని సంవత్సరాల వయస్సులో, యెప్పుడూ యెక్కడికీ వెళ్ళలేదు. వెళ్ళినా, ముఖపరిచయం లేనిచోట భోజనం చేయలేదు. అయితేనేం ఆయనకు ఆమహ్యాహ్న భోజనం, యిప్పటి ఫలహారం, క్రితంరోజు భోజనం చేయలేదనే విష యాన్ని మరుగునపరచినవి. ఆయన యీ హడావుడిలో వుండుటవలన కోర్టుకు వెళ్ళలేక పోయాడు. దానితో ప్రయాణంగూడా ఆరోజున ఆగిపోయినది.

ఆ సాయంకాలం శేఖరయ్య వూరికిపోకుండా ఆగి నందుకు ప్రకాశరావుగూడా యెంతో సంతోషించాడు. ఆ రాత్రి పెందలకడనే భోజనం పూర్తిచేసుకుని ప్రకాశరావు శేఖరయ్య కేసును పరిశీలించాడు శేఖరయ్య అడిగిన విషయాలకన్నిటికి ఓపికతో సమాధానం చెప్పాడు. ప్రకాశ రావు కేసుకు హామీ యిచ్చినతరువాత శేఖరయ్య మన స్సుకు ప్రశాంతత చిక్కినది. అగ్రహారం గురించి ఆ రాత్రి చాలా పొద్దుపోయేవరకు యిద్దరూ మాట్లాడుకున్నారు.

ఉదయమే శేఖరయ్య అగ్రహారానికి ప్రయాణమై వెళ్ళి పోయాడు.

## 8

రామలక్ష్మయ్య వివాహం అయిన పదహారు రోజుల పండుగలోపలనే, భార్యను కాపరానికి తీసుకువచ్చి పట్టణంలో తమస్వంత భవనంలో కాపురం పెట్టాడు. మామగారు కట్నంయిచ్చిన డబ్బుతో పెద్దఫ్యాక్టరి ఒక దానిని పట్టణం చివరలో కట్టించాడు. వ్యాపారం యింతకుముందులా కాకుండా యిప్పుడు సరుకులకు తయారుచేసి యితర పట్టణాలకు ఎగుమతి చేయడం ప్రారంభించాడు. తన ఫ్యాక్టరీలోనే ఎక్కువగా వస్తువులను తయారుచేయించడం, ఆవస్తువులను ఏజన్సీలద్వారా అమ్మించడం ప్రారంభించాడు.

రామలక్ష్మయ్య ఫ్యాక్టరీ పునాదులలో వుండగనే భార్య సమేతంగా పెద్ద పెద్ద పట్టణాలు చూచివచ్చి అక్కడ ఫ్యాక్టరీ నమూనాలు తీసుకుని ఆధునిక పద్ధతిలో తన ఫ్యాక్టరీని కట్టించాడు. రామలక్ష్మయ్య పర్యటనకు భార్యనుకూడా వెంటబెట్టుకుని వెళ్ళడానికి ఒక కారణం కూడా వున్నది. కేవలం వ్యాపారరీత్యానేగాక తనకు మొదటి నుండి దేశంతిరిగి చూడాలని కోరికున్నందున నూతన దంపతులలా కొంతకాలం పర్యటన చేసినట్లవుతుందని రామలక్ష్మయ్య భార్యనుకూడా వెంటబెట్టుకుని వెళ్ళాడు.

రామలక్ష్మయ్య భార్య ధనవంతుల ముద్దులకుమారి కావటం కాబట్టి అల్లారుముద్దుగా పెరిగింది. చదువులలో సరస్వతి గాకపోయినప్పటికి కేవలం చిన్నచదువులు చదువు

కున్నది మాత్రంకాదు. బాల్యంనుండి సంగీతాభిరుచి ఎక్కువగా నుండుటవలన ఆమె తండ్రి సంగీతపు మేష్టరుని బెట్టి, సంగీతం చెప్పించాడు అయితే ఆమె సంగీతంలో గురువుగారివద్ద ఎంతనేర్చుకున్నదో, చెప్పలేంగాని, లతా మంగేష్కరుకు కొంచెం తక్కువగా, సుశీలకు కొంచెం ఎక్కువగా పాడుతుంది. చక్కదనం పోటీలు ఆనాడు లేవుగాని, వుంటే, సూర్యకుమారికి పోటీచేసి ఆ మిస్ మద్రాస్ పదవి ఆమే నెగ్గేది. అందుకే ఆమెను అందరూ కన్యకాపరమేశ్వరి ఆ రూపం దాల్చినదని అంటారు ఆమె పేరు సుందరి.

రామలక్ష్మయ్య ఫ్యాక్టరీ పూర్తికాగానే అందులో పనిచేసేవారికోసం చిన్న రెండు గదులతో యిండ్లు ఒక యాభై దాకా కట్టించాడు. పనిచేసేవారికి జీతం బట్వాడా సరిగ్గా జరగటానికి ఫ్యాక్టరీ పక్కనే ఒక ఆఫీసు పెట్టాడు, మొత్తం వందమంది ఆయన ఫ్యాక్టరీలో పని చేస్తున్నారు. వ్యాపారం నవీనపద్ధతిలో నడపటానికి ఆయన భార్యాసమేతంగా పర్యటనకు వెళ్ళినపుడే ఒక మేనేజరును చూచి వచ్చాడు. ఆతను ఒక ఆంగ్లోయిండియన్, బొంబాయిలో ఒక నూలుమిల్లులో మేనేజరుగా పనిచేస్తున్నాడు. అంతవరకూ రామలక్ష్మయ్య అనేక ప్రదేశాలలో అనేకమంది మిల్లు మేనేజరులను చూచి వచ్చాడుగాని, యీ ఆంగ్లో యిండియన్ యువకుడు ఆకర్షించినట్లుగా మరెవ్వరూ ఆయనను ఆకర్షించలేదు తన ఫ్యాక్టరీ పూర్తికాగానే, కబురుచేస్తానని జీతం వివరాలు మాటాడుకుని వచ్చాడు

అనుకున్న ప్రకారం రామలక్ష్మయ్య ఫ్యాక్టరీ పూర్తికాగానే ఆయువకునికి టెలిగ్రాంయిచ్చి పిలిపించాడు.

రామలక్ష్మయ్య ఫ్యాక్టరీలో మొదటిపుద్యోగి అతనే. అతినిపేరు ఎడ్వర్డు మనిషి స్థూలంగా ఎర్రగా వుంటాడు. వయస్సుకూడా ముప్పయిదాటలేదు. తెల్లని కండ్లు, మని షెంతతీవిగా పైకి సౌమ్యంగా కనిపిస్తాడో ఆతని చూపు గూడా అంత లోతుగావుంటుంది. మాటల్లోనే ఎదటిమనిషి తరహాను యిట్టేకనిపెట్టె స్వభావం ఆతనిది.

యెడ్వర్డువస్తూనే ఫాక్టరీని యెలా నడపాలో ప్లాను వేసుకవచ్చాడు. రాగానే తనఅభిప్రాయం రామలక్ష్మయ్యకు చెప్పాడు. రామలక్ష్మయ్య అభిప్రాయ 'గూడా అదే పని చేసేవారెవరైనా, యెంతో బాధ్యతతో పనిచేస్తూవుండాలని నవీనపద్ధతిలో తయారైనా, తనఫ్యాక్టరీ ఇతర ఫ్యాక్టరీలలాగే ఎంతో అభివృద్ధి చెందాలని ఆయనకోరిక. అందుకే ఎడ్వర్డుకే పనివారల నిర్ణయాలు వదిలేశాడు. ఆఫీసుఉద్యో గులలో ఏకొద్దిమందినోతప్ప మిగిలినవారంతా ఎక్కువగా మేనేజరు ఎడ్వర్డు అభీష్టం ప్రకారమే జరిగింది.

ఈవిధంగా ఎడ్వర్డు కొత్త మేనేజిమెంటులో ఆఫ్యాక్టరీ యెంతో అభివృద్ధిచెందింది. చూస్తుండగనే ఆంధ్ర దేశంలోని ఉత్తమఫ్యాక్టరీలలో అది ఒకటని పేరుపొందినది. అయితే ఈ విషయంలో రామలక్ష్మయ్యగారు ఆపేరును యెక్కువ కాలం నిల్పదలుచుకోలేదు. దానికి ఒక కారణం గూడా వున్నది రామలక్ష్మయ్య మొదటినుండి పట్టణ జీవి తానికి వ్యతిరేకి ఆయన పట్టణజీతంకన్నా అన్నిహాంగు

లున్న పల్లెకే ఎక్కువ ప్రాధాన్యత యిస్తాడు. అయితే మొదట్లో చదువుకునే రోజులలో తండ్రిని వ్యతిరేకించినపుడు గత్యంతరం లేక పట్టణాలలో వున్నాడు. అసలు సంపాదనకు పట్టణమే మంచిదని ఆయన అభిప్రాయం. అందుకే మొదట్లో పట్టణంలో వుండటాని కిష్టపడ్డాడు. ఇపుడాయనకా అవుసరం లేదు. నిజంగా ఈ నాడు రామలక్ష్మయ్యగారి ఫ్యాక్టరీమీదనే ఆంధ్రదేశం ఆధారపడి వున్నదంటే అతిశయోక్తి ఏమాత్రములేదు అందుకాయన యెక్కడున్నా ఒకటే, పల్లెలోవున్నా ఆయనకు వ్యాపారం సాగకపోదు. అందుకే బస్తీనుండి తనమకాం, ఆఫీసు పల్లెటూరికి మార్చుదా మనుకున్నాడు.

అయితే రామలక్ష్మయ్యకు బస్తీజీవితం నచ్చక పోవడానికి ప్రబలమైన కారణాలు రెండే రెండు. అయి నప్పటికి ఆ రెండు చిన్నకారణాలే ఆయనను పూర్తిగా పట్టణంనుండి మార్చా లనిపించినవి

పట్టణంలో గాలిసదుపాయాలు, సక్రమంగా వుండవని పట్టణం మురికీ. రద్దీ. దోమకాటుతో వుంటుందని ఆయన భావన . ఈ రెండు చిన్నకారణాలవలన ఆయన నివాసం,ఆఫీసులు, పల్లెటూరుకు మార్చాలను కుంటూన్నాడంటే హాస్యాస్పదంగా వుంటుంది. కానీ నిజపరిస్థితికూడా అదే.

అయితే రామలక్ష్మయ్య తనవ్యాపారాన్ని పల్లెకు మార్చా లనుకున్నప్పుడు, ఆపల్లె యెలా ఏరూపంలో వుండా లనేది ఆయన వూహించక పోలేదు. తన వ్యాపారానికి అనువుగా ఆపల్లె పట్టణానికి దగ్గరలో వుండాలి, పట్టణంనుండి

రోడ్డు సౌకర్యా లుండటమే కాకుండా ఒకగంట ప్రయా ణంలో పట్టణం చేరేట్లుగా వుండాలి. పట్టణంలో వుండే గందరగోళం వుండకుండా, పట్టణసౌకర్యాలన్నీ వుండాలి. వీటన్నిటికి సరిపోయే గ్రామం ఒక్క అగ్రహారమే కనిపించి నది రామలక్ష్మయ్యకు. ఆయనకి ఆలోచన రాగానే తన సంకల్పాన్ని ఆచరణలో పెట్టటానికి ఆయత్తాపడ్డాడు.

రామలక్ష్మయ్య వ్యాపార విషయాలేగాక యింటివ్యవ హారాలుగూడా ఆయన తన అభిప్రాయం యితరులకు చెప్పి వారి అభిప్రాయం తీసుకునిగాని ఏపనీ చేయడు సామా న్యగా ఆయన అడిగేవారు ఆయన ప్రాపకంలోనే వారే కాబట్టి, ఆయన ఆలోచనలు నూటికి నూరు జరుగుచుండేవి. అలాగే మామూలు ప్రకారం తన ఈ అభిప్రాయాన్ని గూడా యితరులకు వ్యక్తం చేశాడు.

రామలక్ష్మయ్య అభిప్రాయం విన్నవారు ఆయన ఆప్త అనుచరులే అయినప్పటికీ, ఆయన అభీష్టం ప్రకారం చేస్తే బాగుంటుందని, అందులో ఏ ఒక్కరూ చెప్పలేక పోయారు దానికి ఒక కారణంగూడా వున్నది. వారంతా యువకులు ఆపట్టణవాసులు. వారందరికి ఇల్లు, ఇల్లాండ్రు వున్నవారగుటవలన వారు అవన్నివదలి ఆపల్లెకు పోవ డానికిష్టపడ లేదు. అంతేగాక పట్టణంలో వుండే సౌకర్యాలు, ఆనందం, సినిమాలు, డ్యాన్సులు, వారికాపల్లెలో లభింప వని, ఆ పల్లెకు వెళ్ళటానికి వారంతా సుముఖత వెలిబుచ్చ లేదు. దానితో రామలక్ష్మయ్య ఆలోచనకు తాత్కాలి కంగా నిలుపుదల జరిగినది.

9)

# 9

అప్పటికి శేఖరయ్య పట్టణంవెళ్ళివచ్చి మూడురోజు లైనది. ఈ గడచిన మూడురోజులు గ్రామంలో ప్రజలకు శేఖరయ్య విషయం ఆశ్చర్యాన్ని కలిగించినది. ఎప్పుడూ ప్రక్కనున్న గ్రామం వెళ్ళని శేఖరయ్య యీనాడు పట్ట ణమే వెళ్ళి ప్లీడరును మాట్లాడివచ్చాడంటే ఎంతో ఆశ్చర్య పడ్డారు.

పట్టణం విషయాలేమిటో, కేసువిషయంలో ప్లీడ రే మన్నది తెలుసుకుందామని వెంకట్రామ శాస్త్రి నాలుగో రోజుదయం అన్న యింటికి వచ్చాడు. అన్నదమ్ములు విడిపో యిన తరువాత తిరిగి ఒకరింటికి ఒకరురావడం యిదే ప్రథమం. అయినప్పటికి తమ్ముడి నెంతో ఆప్యాయంగా పలక రించాడు శేఖరయ్య. కుమార్తె భారతిచేత కాళ్లుకడుక్కు నేందుకు నీళ్ళు తెప్పించాడు. కుశలప్రశ్నలైన తరువాత పట్టణంలో విషయాలు, పట్టణంలో తనున్న రెండురోజులు తన అనుభవం, తమ కేసునుగురించి ప్లీడరు చెప్పినది, అన్ని విషయాలు వివరంగా తమునికి చెప్పాడు శేఖరయ్య.

అన్న చెప్పినదంతా వినేసరికి వెంకట్రామశాస్త్రికి తమ్మునిమీద తిరిగి కోపంవచ్చింది. తమ వంశంలో చెడ బుట్టాడని మనస్సులో అనుకున్నాడుశాస్త్రి. ఎప్పుడూ, ఎవ్వరికీ అపకారం చెయ్యని ధర్మరాజులాంటి తమ అన్న ఈనాడిలా పట్టణంపోయి యిన్ని యిబ్బందులు పడ్డాడని,

వాటికి కారణం తమ సహోదరుడని ఆయన అన్నకు మన స్సులో నమస్కరించాడు.

అయితే శేఖరయ్య తమ్ముని మనస్సు కనిపెట్టక పోలేదు. తమ ఆఖరు తమ్మునిమీద యీ తమ్మునికి కోపం వచ్చిందని మాట్లాడుతున్నా మాటలుమార్చి 'ఏం శాస్త్రి' యీ సంవత్సరం నీవ్యవసాయం ఎలావున్నది? అని ప్రశ్నించాడు. తన కోపాన్ని అన్న గ్రహించి, యిలా మాటాడే విషయాన్ని మార్చి యిలా ప్రశ్నించి వుంటాడని శాస్త్రి గ్రహించక పోలేదు. అన్న అడిగిన ప్రశ్నకు సమ ధానంగా "పంటలు మామూలుగానే పండినవి" అని ముక్త సరిగా సమాధానం చెప్పాడు శాస్త్రి.

శాస్త్రి ముక్తసరి సమాధానం శేఖరయ్యను ఆశ్చర్య పరచలేదు. "ఆ పల్లపుచేలో ఈ సంవత్సరం ఏ మేద్దామను కుంటున్నావు" అని మాటలను కొనసాగించాడు.

"జనుములుగాని, కందిగాని వేద్దా మనుకుంటున్నా నన్నయ్యా"

"నేనూ అలాగే అనుకుంటున్నానురా తమ్ముడూ, వ్యవసాయం నాకేమీ తెలియదుగా, పాలేర్లు ఎలా చెపితే అలా వినేవాడి నయితిని."

"అవునన్నయ్యా నీసంగతి నాకుమాత్రం తెలియదూ. అయినా నీపొలం, పంట విషయంలో నీవేమీ అధైర్యపడ వద్దు, నేనున్నానుగా. నాపొలం ఎంతో నీది అంతే! అమా

వాస్య వెళ్లగనే, వర్షం పడగానే వెనువాక సాగిద్దామనుకుంటు న్నాను. నాతోపాటు సిపాయీర్లనుకూడా పంపించు."

సరే, అలాగే చేద్దాము తమ్ముడూ. నీవు కాస్తకని పెట్టివుంటే నాకంతకంటె కావలసింది ఏముంది.

"సరే అన్నయ్యా పట్టణంలో విషయాలు చెప్పావు కాదే!"

"ఏమున్నవి. నేను పట్టణం వెళ్లేసరికి పట్టణమంతా నానా భీభత్సంగా వున్నది."

"ఎందుకూ" ఆశ్చర్యంగా అడిగాడు శాస్త్రి.

"స్వరాజ్యం కావాలని ప్రజలంతా దొరతనంమీద ఎదురు తిరిగారు."

"దొరలమీదనా!"

"అవును. వీధులవెంట ప్రజలు కాంగ్రెసు జండాలు పట్టుకుని స్వరాజ్యం కావాలి! తెల్లదొరలను మనదేశం నుండి వెళ్ళగొట్టండి!! అని పెద్దగా అరుచుకుంటూ తిరి గారు."

"అప్పుడేమైంది" ఆత్రుతగా శాస్త్రి ప్రశ్నించాడు.

"మరి దొరలు ఊరుకుంటారా? వారు తుపాకులు పట్టుకుని కంటబడిన వాడినల్లా చావబాదుతూ. వారూ వీధులవెంట తిరిగారు. అలా దొరికినవారికినల్లా కొట్టి. జైల్లో పెట్టారు. కొందరిని కాల్చారు." అని శేఖరయ్య యింకా ఏదో చెప్పబోతుండగా 'కాల్పులు కూడానా' శాస్త్రి మధ్యలోనే ప్రశ్నించాడు.

"అవును, ఒకర్నేమిటి నా కండ్లముందే చాలా మందిని కాల్చారు కొంతమంది వెంటనే చనిపోయారు. చాలా మంది గాయపడ్డారు. నేనున్న రెండురోజులు పట్టణ మంతా యిలాగే ఉన్నది. ఎక్కడచూసినా యివే సంఘట నలు, ఎవరినోట విందామన్నా యివే మాటలు." అని శేఖరయ్య పట్టణంలో తాను చూచివచ్చినదంతా శాస్త్రికి చెప్పాడు,

శేఖరయ్య పార్టీ వారితో వెంకట్రామశాస్త్రి లాలూచీ పడ్డాడని విన్నవాడు రామభద్రయ్య మినహా మిగి లినవారంతా ఎంతో ఆశ్చర్యపడ్డారు. కొందరు భయ పడ్డారు. మరికొందరు విచారించారు. రామభద్రయ్య పార్టీ లోనివారు రామభద్రయ్యను నమ్మిఉన్నందున తమకెప్పు డే హాని జరుగుతుందోనని ప్రాణాలకు భయపడి, చప్పబడి వూరుకున్నారు.

గ్రామంలో ఉన్న మూడుపార్టీలలో రెండు పార్టీలు ఒకటైనపుడు వారివలన మిగిలినపార్టీకి ఎప్పుడు ఏ కీడు జరుగుతుందోనని విద్యావిహీనులైన ఆ పల్లెప్రజలు గ్రహిం చక పోలేదు. అందుకే వారు తీవ్రంగా పరితపించారు. ఆనాడు పల్లెలో పార్టీలువద్దని పెద్దలు చెప్పిన మాటలు విన కుండా, పార్టీలలో చేరినందుకు ఆనష్ట కష్టాలేమిటో భవి ష్యత్తులో తమ బ్రతుకు లెలావుంటవో వారు వూహించు కోలేక పోయారు. రామభద్రయ్య పట్టణంలో ఇంగ్లీషుచదువు కున్నాడని ఆ గ్రామప్రజలలో కొందరాతని పక్షం చేరి

నందుకు తాము సుఖంకంటె దుఃఖం ఎక్కువగా భరించ వలసి వస్తుందని వారూహించలేదు.

ఒకప్పుడు నరహరిశెట్టి విషయంలో ఆ గ్రామప్రజలు తీవ్రంగా పోట్లాడుకున్నారు. మూడు పార్టీలవారు నరహరి శెట్టిని తమపార్టీలోకి చేర్చుకోవాలని ముందు ఎవరికివారు వెళ్ళి నరహరిశెట్టిని కలుసుకుని వచ్చారు. కాని అందులో ఏ ఒక్కరూ శెట్టిఉద్దేశాన్ని చెప్పలేక పోయారు అసలు నరహరిశెట్టి మాటలు, ప్రవర్తన వారివూహాకు మించినవై నవి. దానితో వారు ఊరుకున్నారు. శెట్టి విషయంలో, ఆ తరువాత ఎవరూ గట్టిగా జోక్యం చేసుకోనూలేదు అతని విషయం గురించి తగాదాలేవీ రానందుకు అంతా సంతోషంతో సంతృప్తి చెందారు.

కాలం గడచిపోయిన కొలది ఆ గ్రామప్రజలు ఆనాటి తగదాను మరచిపోయారు. మళ్ళీ అందరూ కలసికట్టుగా వుంటున్నారు. నరహరిశెట్టి తెలివిగా యెవరిపార్టీలోనూ చేరక తనవ్యాపారాన్ని సాగించుకుంటున్నాడు. ఇంతవరకు ఆ వూరిలో మధ్యవర్తిగా ఉన్న ఒక కుటుంబం ఒక్క నర హరిశెట్టిదనే చెప్పవచ్చు.

కాని ఈనాడు తిరిగి కొలువులు చేయాలనడంతో సమసిపోయిన వైరం తలెత్తినది. ఊరిలో ఒక్కటే మధ్య వర్తికుటుంబమైన నరహరిశెట్టి ఏ పార్టీవారు కొలువులు చేస్తున్నప్పుడు పాల్గొనాలనేది సమస్య అయినది. మళ్ళీ గ్రామంలో తీవ్రఅభిప్రాయ భేధాలు, కచ్చెలు, పోట్లాటలు వచ్చినవి.

అసలిలా జరగకుండా ప్రారంభంలోనే శేఖరయ్య దూరం ఆలోచించి పార్టీ భేదాలు లేకుండా మూడుపార్టీల వారు ఒక్కుమ్మడిగా అమ్మవారికి కొలుపులు చేయాలని చెప్పాడు. శేఖరయ్య అభిప్రాయానికి అందరూ అంగీకరించినా శేఖరయ్యపార్టీ రామయ్య అంగీకరించక పోయేసరికి మాటలు పెరిగి కొట్లాటలైనవి. రామయ్య ఉద్రేకస్వభావమే ఆనాటి పోటాటకు దారితీసినది. ఆ సమయంలో రామభద్రయ్య మాటలు, రామయ్య ఉద్రేకానికి అగ్నిలో ఆజ్యం పోసినట్లయి పోట్లాటపోయి కొట్లాటగా మారింది.

ఈ తగాదాలు చూస్తున్న నరహరిశెట్టి తాను మూడుపార్టీలవారికి కావలసినవాడినని, అందరికీ అణుకువగా ఉంటానని, తనకోసం కొట్లాడుకో వద్దని తననెవరూ వారివారి పార్టీలలో చేరమని బలవంతం చేయవద్దని మొరపెట్టుకున్నాడు. కాని ఆరోజాతని మొరాలకించినవారు లేరు.

ఒకవైపు తగాదాలలోనే మూడుపార్టీలవారు అమ్మవారికి కొలుపులు పెద్దఎత్తున జరిపించాలని ఎవరికి వారు సన్నాహాలు చేస్తూనే వున్నారు,

## 10

పట్నంవెళ్ళి రామభద్రయ్య కోర్టులో పెట్టిన కేసు విచారణ కొచ్చింది. శేఖరయ్య పార్టీలోని, శేఖరయ్య, రామయ్యలను, వెంకట్రామశాస్త్రి పార్టీలోని కోటయ్య నాలుగోతమ్ముడు రాఘవులు, శాస్త్రిని కోర్టులో హాజరు కావలసినదని కోర్టువారు సమన్లు జారీచేశారు.

శేఖరయ్య అంతకుముందే కోర్టుఖర్చుల కోసం నరహరిశెట్టికి పొలం ఎకరం నలభై రూపాయలకు పాతికెకరాలు అమ్మి డబ్బు ఇనపపెట్టెలో పెట్టి దాచివుంచాడు. ఎందుకైనా మంచిదని వెంకట్రామశాస్త్రి తనపార్టీవైపున డబ్బు కిబ్బంది పడకుండా పొలం అమ్మకుండా నరహరిశెట్టి దగ్గర నూటికి నెలకు రెండున్నర రూపాయల వడ్డీకి ఐదువందల రూపాయలు తీసుకుని దాచాడు. ఇలా జరగడమే మంచిదని నరహరిశెట్టి, శాస్త్రి అనుకున్నారు. ఆ సంవత్సరం పంటలో వచ్చిన కాయధాన్యం శెట్టికే బాకీక్రింద జమకడితే సరిపోతుందని భావించాడు శాస్త్రి పొలంకొని మళ్ళీ ఆ పొలం చేయడానికి రైతుకు యిస్తే అతడు సరిగ్గా లెక్క చెప్పక వాడితో అనవసరంగా ఘర్షణ పడవలసి వస్తుందని, యిలా గయితే వడ్డీవస్తుందని యిదీ మంచి పద్ధతని ఊహించాడు శెట్టి అందుకనే వెంకట్రామశాస్త్రి ఆదిలో డబ్బు అప్పు అడిగినప్పుడు లేదంటూనే ఐదువందల రూపాయలు ఇచ్చాడు శెట్టి.

శాస్త్రి, శెట్టిదగ్గర డబ్బు ఈవిధంగా తీసుకున్నాడని శేఖరయ్యకు తెలియదు. ఆయనకు తెలుసుంటే ఈ పద్ధతికి తిరస్కరించివుండేవాడు. తీరా ఈ విషయం శేఖరయ్యకు కోర్టుకుపోయిన తరువాతగాని తెలియలేదు. తమ్ముడు చేసిన పనికాయనెంతో విచారించాడు. గత్యంతరంలేక తాను అమ్మినందుకే ఎంతో బాధపడ్డాడు శేఖరయ్య. పెద్దా చిన్నా లేకుండా అలా స్వతంత్రించినందుకు తమ్ముడిని మందలించాడు దానివలన నష్టం విప్పిచెప్పాడు. నరహరి

శెట్టి కుతంత్రాని కాయనెంతో బాధపడ్డాడు. గతంలో తమ వారుచేసిన మేలుకు కృతజ్ఞత లేకుండా తమయందే ఆతనింత కృతఘ్నుడైనాడని ఆయన విచారించాడు.

కోర్టువారిఉత్తరువు ప్రకారం వాయిదానాటికి అంతా హాజరైనారు. ఈసారి అంతా కలసి పట్టణం వచ్చినందు వలన భోజనయిబ్బంది లేకుండా సత్రంలో గదితీసుకున్నారు. వెంకట్రామశాస్త్రి నలుగురికి వంటచేశాడు. పెందలకడనే భోజనాలు ముగించుకోని కోర్టుకు వెళ్ళారు.

కోర్టులో ప్రకాశరావు కలిశాడు, శేఖరయ్య తనవా రందరిని ప్రకాశరావుకు చూపాడు. ప్రకాశరావు వారం దరితోనూ సాదరంగా మాట్లాడాడు. కోర్టులో వారిపని పూర్తిఅయ్యేదాకా వారితోనే వుండి వారడిగిన వాటికన్ని టికి సమాధానం చెబుతూ గ్రామంలో యికముందు, పోటా టలు పెట్టుకోవద్దని అందరికీ గట్టిగాచెప్పి ఆయన వెళ్ళి పోయాడు.

శేఖరయ్య ఆ సాయంత్రమే అగ్రహారం వెళ్ళిపోదా మని అన్నాడు. కాని రామయ్య కారోజక్కడవుండి పట్ట ణంలోని విశేషాలు చూచి మరురోజు ఉదయమే పోదా మన్నాడు. అందుకని ఆరాత్రికూడా వారక్కడే వున్నారు. ఆ మరురోజు ప్రాంతః కాలంలోనే నలుగురు సత్రంగదిఖాళీ చేసి అగ్రహారం వెళ్ళారు.

ఆ విధంగా మూడువాయిదాలు గడచిపోయినవి. కోర్టువారి విచారణ అప్పటికింకా ఒక వంతుకూడా కాలేదు. సాక్షుల విచారణ, పిర్యాదివాదన, పిర్యాదివైపు

సాక్ష్యం, తీర్పు వున్నవి. అందుచేత శేఖరయ్య డబ్బును చాలా జాగ్రత్తగా వాడుతున్నాడు ఒక్కపైసాను కూడా వృధా చేయడం లేదు.

కానీ ఎప్పుడూ, ఏవీ, ఎక్కడా అనుకున్నట్లు జరగవు. అందులో కోర్టువిషయాలు అసలు జరగవు డబ్బు విషయములో శేఖరయ్య ఎంత జాగ్రత్తగా వుంటున్నాడో, అంత కంటే ఎక్కువగా వాయిదాలు పడుతున్నవి కోర్టువారు అనవసరంగా వాయిదాలు పెంచుతున్నారనుకున్నాడు మన స్సులో శేఖరయ్య వీటికి కారణం రామభద్రయ్య కుతంత్రమే అనుకున్నాడాయన ఏది ఏమైన, యీ వాయిదాలకు గాను శేఖరయ్య చేతిలోని ఐదువందల రూపాయలు హారతి కర్పూరంలా అయిపోయినవి.

ఆదిలో రెండుపార్టీలవారు కోర్టుఖర్చులు చెరిసగం అనుకున్నారు ఆ ప్రకారం వెంకటాద్రిశాస్త్రి, తన పార్టీ తరఫున కొంతడబ్బు శేఖరయ్యకివ్వబోయాడు. అప్పట్లో శేఖరయ్య తీసుకోలేదు. తనవద్ద డబ్బు పూర్తి అయిన తర్వాత అవసరంవస్తే తీసుకుంటానన్నాడు. అప్పుడు జమా ఖర్చులు ఆయనకే వప్పగించారు. కోర్టువ్యవహారంకింద ఖర్చుఅయిన డబ్బంతా ఆయనచేతికుండానే వుంటే బాగుం టుందని ఆనాడు అంతా భావించారు. శేఖరయ్య కూడా అందుకు భిన్నంగా నడుచుకోలేదు. ఆయన ఎప్పటి కప్పుడు, ఖర్చులు వ్రాస్తూనే వున్నాడు. తీరా ఒక్కసారి అయినఖర్చు చూపించుకునేసరికి వారికి భరించలేనివిగా కనిపించినవి కోర్టుఖర్చులు ఈ విధంగా యింతకాలం

యింత సుందర కోర్టుకు వచ్చిపోతుండాలని యింతడబ్బు ఖర్చు వుంటుందని వారు భావించలేదు. విచారించి నేరస్థులను శిక్షిస్తారనుకున్నారు. కోర్టువ్యవహారం యింత మొండిగా వుంటుందని, యింతడబ్బు, శ్రమ వుంటుందని వారు భావించలేదు ఇంతకుముందెన్నడూ వారికి కోర్టుకు రావలసిన అవసరం కలగకపోవడమే వారు చింతించవలసి వచ్చింది. ఇలా జరుగుతుందని వారు వూహించివుంటే రాజీపడి, అగ్రహారం లోనే ఏదో ఏర్పాటు చేసుకుని వుండేవారు. అందుకే రాజీ మార్గం లేకుండా పోటాపోటీలమీద కోర్టులకెక్కారు. ఫలితం ఎలావున్నా డబ్బులా ఖర్చవుతుందని యోచించనందుకు శేఖరయ్య ఎంతో బాధపడ్డాడు రామయ్య మొండిపట్టుదలే యిందుకు కారణమని శాస్త్రి రామయ్యను చీవాట్లు పెట్టాడు. ఈ విధంగా వీరిలో వీరు ఎంత ఆతురత చెందినా కోర్టువారికి మాత్రం దయగలగలేదు.

ఒకనాటి సాయంకాలం శేఖరయ్య సాయంసంధ్య చెరువుగట్టున పచ్చికమీద కూర్చుని వార్చుకుంటున్నాడు. ఆయన సంధ్యావందనం పూర్తి అయ్యేసరికి సూర్యుడు పశ్చిమకొండల చాటుకు పోయాడు వెలుతురుపోతూ, చీకటిని ఆహ్వానించుతున్నది ఆ చక్కని సంధికాలంలో శేఖరయ్య, ఒంటరియై దీర్ఘ ఆలోచనలతో పచ్చికమీద వాలాడు. దాపులో మంచినీటిబావి, ఎడమన పెద్దకట్ట, నలమూలకారంలో వున్నవి. చెరువుకింద కేదారక్షేత్రం, అవతల నల్లని

తుమ్మలు నిండుగా వున్నవి. పగలే ఆకాశం చీకటి, మిణుగురు పురుగులు, పగలేదివిటీల్లా ఎగురుతుంటవి.

ఈ సంవత్సరం ఎందుకో వర్షాలు పడలేదు. తన తాత యిక్కడ నివాసం ఏర్పరచుకున్న తరవాత, గడచిన కాలంలో ఎప్పుడూ వర్షాలు పడలేదని తాను వినలేదు. వేసినవరకు పంటలు బాగా పండేవి. చెఱువు చిన్నదైనా వర్షంమీద ఆధారపడినదైనా, తనకు తెలిసినతరవాత చెఱువెప్పుడూ ఎండిపోవడం తాను చూడలేదు. ఎప్పుడూ పిల్లఅలలతో తొణికిసలాడుతూ, పెద్ద సరస్సులా వుండేది.

ఈ సంవత్సరం పంటలుకూడా పోయినవి. పచ్చగా కనుచూపుమేర కళకళలాడుతూ వుండవలసిన పొలాలు, వర్షాలులేక ఎండిపోయినవి. చెఱువునిండా వుండే తామర, చెఱువుమధ్యలోకి వచ్చింది. ఏమిటీ వైపరీత్యం! ఏమిటీ వింత! శేఖరయ్యకా సామంతం, ఎంత ఆలోచించినా మనస్సుకు తట్టలేదు.

అగ్రహారం చిన్నదైనా, వూరుపేరుచెప్పితే, చుట్టూ పాలికగ్రామాలకు భయం. హుసేన్‌సాహెబ్‌లాంటి బంది పోటుదొంగ, అగ్రహారం చుట్టూవున్న గ్రామాలను దోచాడుగాని, అగ్రహారంజోలికి రాలేదు. కనికట్టు, మంత్రకట్టు, తుచ్ఛమంత్రాలు నేర్చుకుని, దొంగఎరుకలజాతి అగ్రహారం చుట్టూవున్న గ్రామాలప్రజలను యిబ్బంది పెట్టి, పీడించి వస్తు వాహనాలు పొందారుకాని, అగ్రహారం వచ్చి పిడికెడు గింజలుడగకపోయారు శాస్త్రియున్ దొర, హుస్సేన్‌సాహెబ్‌ను పట్టిత్వమని అన్నిగ్రామాలకు

వెళ్ళి, ఆయా గ్రామ ప్రజలను చిత్రహింసలు పెట్టాడు గాని, అగ్రహారం వచ్చి, బందిపోటుదొంగల వివరాలేమైనా చెప్తారా? అని అడగలేకపోయాడు. తన తండ్రి, తాతల కాలంలో పంటఃబపాడక చుట్టుప్రక్కల గ్రామాల రైతులు గింజలు, గ్రాసానికి, తమ వూరు వచ్చారు గాని, తమవూరి రైతులూ, ప్రక్క గ్రామాలకు వెళ్ళే అవసరం కలగలేదు. ప్రక్కగ్రామాలలో కొలుపులు, జాతర్లకు తమవారే వెళ్ళి నాయకత్వం వహించివచ్చారుగాని, యితర గ్రామాల వారెవరూ, తమగ్రామానికి పెద్దలమంటూ రాలేదు. అగ్రహారం తీర్పులు న్యాయంగా ధర్మంగా వుంటవని, అగ్రహారం ప్రజలకు పెద్దరికాన్నిచ్చారు ప్రక్క గ్రామాల ప్రజలు.

ఈ విధంగా, అన్నిటా పెద్దలైన అగ్రహారం యీనాడిలా ఎందుకైనది, ఏమిటీ కొట్లాటలు, పంట లిలా ఎందుకు పాడైపోయినవి! తమ పెద్దరికాలేమైనవి? వీటికన్నిటికీ కారకులెవరు ?

ఈ యక్షప్రశ్నలకు తాను సమాధానం చెప్పకోలేక పోయాడు. అన్నివిధాలా, పతనం చెందిన అగ్రహారాన్ని తానిక మరమ్మతు చేయలేడు. అది తన శక్తికిమించినది. వెలుతురున్న ప్రదేశాన్ని చీకటి కమ్మేసింది. యింకిపోయిన భావిలోని మంచినీటిని ఎవరో ఆ చీకట్లో ఇనప బక్కెటుతో తోడుచున్నారు. ఇనపబక్కెట్టు భావి అడుగుకు తగిలిన శబ్దం స్పష్టంగా పైకి వినిపిస్తున్నది. ఎండిపోయిన

మాగిలిలోకి నక్కలు వచ్చి అరుస్తున్నవి చెఱువులోని కప్పలు, ఈ కాసినినీరు ఎండిపోతే తమ గతేమిటని బెక బెకమని గోల పెడుతున్నవి. పంట పొలాలల్లో ఎండిపోయిన జొన్నదంట్లు, గాలికి ఒక్కొక్కటే వ్రాడిపోతున్న ఒళు డాకులను ఒడిలిపెట్టలేక ఒడలిపెడుతూ బొయ్యిమని మోత పెడుతున్నవి. కట్టపొడుగునా చింతచెట్లమీద స్థిరనివాసం ఏర్పరచుకున్న కాకులు, ఈ కొల్లు ఎండిపోతే తమ గతేమి టన్నట్లు పెద్దగా అరుస్తున్నవి.

శేఖరయ్యకా సంధికాలంలో ఏం చేయాలో తోచ లేదు. అక్కడి పరిస్థితి ఆయన రోజూ చూచేదైనా, ఈ రోజెందుకో భరించలేకపోయాడు. లేచి యింటికి వెళ్ళి పోదామని కాలు కదిలించాడు. బుసలు పెడుతూ నొక సర్పము శేఖరయ్య ప్రక్కగా పోయినది. శేఖరయ్య శరీరం గగుర్పొడిచినది. గబగబా అడుగులు వేసుకుంటూ కట్టపైకి వచ్చాడు.

"ఎవరామనిషి?" చెఱువులోనుండి శాస్త్రి కట్టపైకి వస్తూ ప్రశ్నించాడు.

"ఇప్పటదాకా ఏం చేస్తున్నావురా శాస్త్రీ?"
"నీవా అన్నయ్యా! ఎప్పుడొచ్చావిక్కడికి?"
"నేను సాయంత్రమే వచ్చాను."
"సంధ్యావందనం పూర్తిచేసుకుని యింటికి పోలేదా?"
"లేదు"

"లేదా ?" ఒక్కక్షణకాలం ఆశ్చర్యపోయాడు శాస్త్రి. శాస్త్రికి తెలిసినంతవరకు శేఖరయ్య, యిలా చీకట్లో ఎప్పుడూ యిల్లొదలి రాలేదు. వచ్చినా సంధ్య పూర్తికాగానే యింటికి వెళ్ళేవాడు. ఈరోజు ఏమిటీ విచిత్రం. అన్న దేనిగురించో బాధపడుతున్నాడని శాస్త్రి గ్రహించాడు. అన్నను కారణం అడగలేకపోయాడు. "పద అన్నయ్యా, యింటిదాకా వస్తాను. తమ్ముడు కొలుపులకు ముహూర్తం పెట్టిస్తున్నాడట విన్నావా" అంటూ శాస్త్రి ముందు నడిచాడు. తమ్ముడి మాటకి శేఖరయ్య సమాధానం చెప్పలేదు.

ఆ రాత్రి ఆయనకు నిద్రపట్టలేదు. ఆయనకి పరిస్థితులు, సంఘటనలు ఏదో అనుమానానికి సూచనగా భాసించాడు. రామభద్రయ్య తనకంటె చాలా చిన్నవాడు. కానీ ఎవ్వరిమాటా వినడు. గొప్ప నాస్తికుడు. అతడిని ఎలాగైనా మార్చాలి. లేకపోతే తమ వంశ ప్రతిష్ఠతో బాటు తమ గ్రామం సర్వనాశనమవుతుంది. అగ్రహారంలో తను బతికున్నంతకాలం అలా ఎన్నటికీ జరగడానికి వీల్లేదు. అనుకున్నాడు శేఖరయ్య.

ఇలా ఆలోచనలతో ఆయనకే అర్ధరాత్రికోగాని నిద్రపట్టలేదు. నిద్రలో ఆయనకో కల వచ్చింది. కలలో కారణజన్ములైన ఆర్యచాణుక్యులు కనిపించారు. ఆయన అర్ధశాస్త్రంలో చెప్పినట్లు రానురాను, కలియుగబ్రాహ్మణులు వారి ఆచారాలను, జప, తపాలను వదలి, బ్రాహ్మణత్వాన్ని కోల్పోయి, స్వార్ధపరులై, మోహాజనితులై

వుంటారని క్రీస్తుపూర్వం ఆయన చెప్పిన మాటలు యీనాడు అక్షరాలా జరుగుతున్నందుకు శేఖరయ్య హృదయం దుఃఖంతో నిండిపోయింది. ఆనాడు ఆయన చెప్పిన మాటలు ఆయన ఉల్లుని నాటి పరిస్థితుల్ని ప్రతిబింబించేవైనా. రామభద్రయ్య లాంటివాళ్ళు, జనానికి ప్రబోధించదగ్గవి నాటి ఆర్య చాణక్యుల మాటలే అని యీనాటి ప్రజలు అంగీకరించక తప్పదు అనుకున్నాడు శేఖరయ్య. ఆ మరురోజు ప్రాంతఃకాలంలో రామభద్రయ్యను పిలిచి అతని ఆలోచనను మార్చాలని తలపోశాడు. మాటలలో, ప్రవర్తనలో రామభద్రయ్యను తను మార్చగలిగితే, ఆ గ్రామంలో యిక పార్టీల ప్రసక్తే వుండదు. పూర్వంలాగా అంతా సోదరులులా వుండవచ్చుని భావించాడు.

ఈ ఆలోచనలు శేఖరయ్యకు ప్రశాంతత నిచ్చినవి. ఆరాత్రి ఆయన ప్రయత్నం లేకుండానే సుఖంగా నిద్ర పోయాడు

# 11

ఎందుకైనా మంచిదని రామభద్రయ్యగూడా రహస్యంగా కొంతపొలాన్ని సరహార శెట్టికి తాకట్టుపెట్టి ఐదువందల రూపాయలు తెచ్చి, పెట్టెలో దాచాడు. ఈ విషయం ఆ గ్రామంలో, ఆ యిద్దరికితప్ప మరొకరికి తెలియదు. తాకట్టు దస్తావేజులలో శెట్టి రామభద్రయ్యపొలం కుమారుని పేర వ్రాయమన్నాడు. అయితే చట్టం తెలిసిన రామభద్రయ్య

ఆదిలో అందు కంగీకరించలేదు. కానీ చివరకు శెట్టి అభీష్టం నెరవేర్చక తప్పలేదు.

రామభద్రయ్య గత్యంతరంలేక అలా చేశాడే గాని, మనస్ఫూర్తిగా చేయలేదు నరహరిశెట్టి ప్రవర్తన రామభద్రయ్యకీ రోజు క్రొత్తేమీ కాకపోయినప్పటికీ, తన స్వంత విషయంలో శెట్టి ప్రవర్తన అలా వుంటుందని వూహించలేకపోయాడు. రామభద్రయ్య వూహాలు, ఎప్పుడైనా నరహరిశెట్టి విషయంలో విఫలమవుతున్నవి. ఆ గ్రామంలో రామభద్రయ్యకిక తిరుగులేదు. శెట్టి ప్రవర్తనలో భద్రయ్య ఒక నిర్ణయానికి రాలేకపోయాడు. ఆతను శత్రుకోటిలోని వాడు కాదు. మిత్రుడని నమ్మడానికి వీలులేదు. గతంలో కౌలుపుల విషయంలోగూడా తన మాటను వ్యతిరేకించాడు. శెట్టి విషయం తేల్చాలి. తన కెదురు నిలబడి ఎంతకాలం యీ గ్రామంలో వుంటాడో చూడాలి. అని మనస్సులో రామభద్రయ్య ప్రతిజ్ఞ చేశాడు.

ఆ మరురోజే తన పార్టీవారిని పిలిపించాడు. అంతా కలిసి బొడ్రాయిదగ్గర సమావేశమైనారు. రామభద్రయ్య ఆ సమావేశాన్ని ఎందుకేర్పాటు చేసినది ఎవరికీ తెలియదు. అంతా రామభద్రయ్య మాటప్రకారం హాజరైనారు తన ముఠాలోనివారిలో తన తరువాతవాడు, మిగిలిన వారిలో సమర్థుడు కోటయ్య తమ్ముడు చెలమయ్యతో నరహరిశెట్టి విషయం ప్రస్తావించాడు.

కోటయ్య తమ్ములందర్లోకి చెలమయ్య అధికోద్రేకి, రామభద్రయ్య అంటే ఆతనికి పంచప్రాణాలు. ఏకలవ్య

శిష్యుడు, చలమయ్య శెట్టికి కబురంపాడు. ఈలోపు అక్కడ చేరిన పెద్దలతో శెట్టివిషయం మాట్లాడాడు చలమయ్య. సభికులలో చాలామంది, శెట్టిని తమవైపే చేర్చుకోవాలను కున్నారు. కొద్దిమందిమాత్రం, అతని యిష్టప్రకారం ఆతనిని యిప్పటిలాగే వుండనీయడం మంచిదని చెప్పారు.

ఇంతలో అక్కడికి శెట్టివచ్చాడు. అందరంతా ఆతనిని అభిప్రాయం చెప్పమని కోరారు. శెట్టి యధాప్రకారమే సమాధానం చెప్పడంతో చలమయ్యకు ఉద్రేకం ఆగలేదు. శెట్టిని, అంతమందిలో చీవాట్లు పెట్టాడు. ఇష్టంవచ్చినవైపు చేరమని అన్నాడు. అంతవరకూ మధ్యస్థంగావున్న రైతులు, చలమయ్యతో ఏకీభవించారు. నరహరశెట్టి ప్రాణాలు పైనే పోయినవి. ఆతని లౌకికం ఇక్కడ సాగలేదు. తీవ్ర ఆలోచనలతో అలాగే స్తబ్దుడై నిలబడ్డాడు.

రామభద్రయ్య శెట్టిని దగ్గరకు పిలిచాడు, నీ ఇష్టం ప్రకారం వుండు. కానీ ఎటో నీయిష్టంవచ్చిన పార్టీలో చేరడం ధర్మమేనని నా అభిప్రాయం అన్నాడు రామ భద్రయ్య.

"నేనందరికీ కావలసినవాణ్ణి, నన్నలా చేరమనడం తమకు ధర్మంకాదు" అన్నాడు శెట్టి.

ఈ మాటకు రామభద్రయ్య నవ్వాడు. "సరే శెట్టీ, నీ యిష్టం. నీవిప్పుడెలా వుంటున్నావో యికముందు కూడా అలాగే వుండు" అని శెట్టిని పంపేశాడు.

రామభద్రయ్య ఔదార్యం, మంచితనం, యిటు గ్రామప్రజల నెంత ఆశ్చర్యపరచినదో, అటు శెట్టిని అంత ఆశ్చర్యపరచినది. గురువుగారి మంచితనానికి చలమయ్య రామభద్రయ్యను దేముడిగా భావించాడు అయితే, శెట్టిని సాగనంపుతూ రామభద్రయ్య నవ్విన నవ్వులో ఆనందం ఎలాంటిదో అక్కడున్నవారెవరూ వూహించలేదు.

శెట్టి వెళ్ళిపోయినతరువాత రామభద్రయ్య, కొలుపులు తమపార్టీవారే ముందు చేయాలని, అందుకు మంచి రోజు చూడమని పురోహితునికి చెప్పాడని అక్కడున్నవారికి చెప్పాడు. అయితే ఈసారి కొలుపులలో జంతుబలి బాగా జరగాలని, అరకకు పాతికరూపాయలు వేసుకుని తమ ఒక్క పార్టీ కొలుపులను దిగ్విజయంగా చేయాలని తీర్మానించాడు. రామభద్రయ్య అభిప్రాయం కొందరికి నచ్చకపోయినా అంతా ఏకగ్రీవంగా తలలూపారు.

రామభద్రయ్య తాను ప్రవేశపెట్టిన రెండు తీర్మానాలు సులభంగా తీరినందుకు మనస్సులో ఎంతో ఆనందించాడు. చలమయ్యలాంటి వ్యక్తి తనకండగా వుంటే, ఈ గ్రామంలో యిక తనకు ఎదురు లేదనుకున్నాడు. ఆరాత్రి తన కార్యక్రమం నిర్విఘ్నంగా నెరవేరితే, కొలుపులలో అదనంగా ఒక బస్తా కొబ్బరికాయలు, అమ్మవారికి సమర్పించుకుంటానని మొక్కుకున్నాడు.

రామభద్రయ్య ఆరాత్రి పెందలకడనే భోజనంచేసి యానాది నరసింహులను పిలిపించాడు. నరసింహులు యానాది కులపెద్ద అగ్రహారం కాపలా అతని వృత్తి.

అందుకు నరసింహాశాస్త్రిగారు అగ్రహారం తమకు వచ్చి నపుడు యానాది కుటుంబానికి సరిపడ మాన్యాలిచ్చాడు. అప్పటినుండి గ్రామంలో దొంగతనాలు జరగకుండా రాత్రిళ్లు గ్రామంచుట్టూ పహారా తిరుగుతుంటాడు. రాత్రిళ్ళు యితర గ్రామాలనుండి యితరులు ఎవరువచ్చినా, నరసింహులు అనుమతి పొందే అగ్రహారంలో ప్రవేశించాలి ఆ ప్రాంత మంతా అడవిగా వున్నప్పుడు గ్రామ మేర్పడిన కొత్తల్లో నరసింహాశాస్త్రిగారు ఈ ఆచారాన్ని ప్రవేశపెట్టారు. ఐతే ఆ మనుష్యులుపోయినా ఆ ఆచారం ఇంతవరకూ పాటింప బడుతూనే వున్నది.

అగ్రహారంలో యిప్పటివరకూ దొంగతనాలు లేవు. గ్రామప్రజలలో ఒకరిమధ్య ఒకరి కెన్ని విరోధాలున్నా, ఒకరిసొత్తు మరొకరు దోచుకోవాలంటే యానాది నరసింహు లను లోబరచుకోవాలి. ఆ తర్వాత వచ్చే మాటలకన్నిటికి వాడు సరియైన సంజాయిషీ చెప్పుకోవాలి. అందుకని యీ ప్రయత్నం ఆ గ్రామంలో ఎవ్వరూ యిప్పటివరకు తలపెట్టలేదు.

o

రామభద్రయ్య మాటకు అగ్రహారంలో అడ్డులేన దున నరసింహులుగూడా రామభద్రయ్య మాటప్రకారం నడుచుకోక తప్పలేదు గ్రామపెద్దయైన శేఖరయ్య సోదరుడు రామభద్రయ్య కబురందగనే కాపలా వెళ్ళడానికి సిద్ధంగా వున్న నరసింహులు తలగుడ్డ చుట్టుకుని రామభద్రయ్య యింటికి వచ్చాడు అప్పుడప్పుడే రైతులు భోజనాలు

ముగించుకుని చుట్టలు మీటుతూ వీధి అరుగులమీద చేరు తున్నారు.

రామభద్రయ్య నరసింహులను వెంటబెట్టుకుని, ఊరి చివర చెరువుదగ్గరకు వచ్చాడు. అంతవరకూ ఎవ్వరూ మాట్లాడలేదు రామభద్రయ్య నడకనాపి, చుట్టూ ఒకసారి పరిశీలించి "నరసింహులూ, నీతో పనుందిరా!"

"ఏంటిదొరా?"

"మరి నే చెప్పినట్లు చేస్తావా?"

"ఓం, నాకొక లెక్కా, నేనుసేయలేంది యీ వూల్లో ఎవరుసేత్తారు దొరా"

"అందుకే నిన్ను పిలిచాను. మరి చేస్తావా ?

"సెప్పండి దొరా"

"చూడు, పాపం నీతో చాలాకాలంనుండి చెప్పాలను కుంటున్నాను. కానీ నీవు వింటావో, వినవోనని చెప్పలేదు"

"ఏంటది సెప్పండి దొరా! మీ మాట యినక నేనీ గామంలో సేసేదేంది దొరా!"

"అయితే విను. ఎక్కడా సెప్పకు చాలా రహస్యంగా జరిగిపోవాలి. పైగా ఈ పని నీవల్ల నే కావాలి"

"ఓ సత్తెపెమానంగా శెపుతుంటాను, ఓరికీసెప్పను,"

"నీకు మా తాతగారిచ్చిన మాన్యాలలో వచ్చిన గింజలు సరిపోతున్నాయాం?"

"యాడిది దొరా, తమరికి తెలవంది ఏముంది? యీ

సంవత్సరం ఏ యిపరీతం వచ్చిందో, అసలు పంటలే లేవుగా !"

"అందుకే చెపుతున్నాను. నీ వెలా యిబ్బందులు పడుతున్నావో ఆ భగవంతుడికే తెలియాలి."

"అవును దొరా ? కట్టాలు దెలిసినోరు కాబట్టి మీారన్నారు యిన్నాలకు మనూాల్లో యీా మాత్రరం తెలుసుకున్నో డెవరు దొరా !

"అయితే ఒక పని చేయి. ఈ రాత్రికి సరహరి శెట్టి పడమంటింటికి కన్నం వేయి."

"అమ్మో మనూాల్లోనే ?"

"ఏం ?"

"అది ఆశారం కాదుగా "!

"ఆచార మేమిటిరా నీ మొహం, ఏమైనా వస్తే నేను చూచుకుంటాను నీవేమీా భయపడకద్దు."

"అమ్మో. యీా యిసయం తెలిస్తే నరహరి శెట్టి పొగాకు కాడ గూడ యియ్యడు దొరా"

"ఆ, ఒకప్పుడు యిచ్చిచచ్చాడా నీకు? నా కా మాత్రం తెలియదటా్రి !"

"ఏమైనా మనూాల్లో కట్టం దొరా"

"మన వూాళ్ళో చేయకుండా, పరాక్ర వూాళ్ళో చేస్తా వుటాౌ"

"అదీ నిజమే దొరా"

"అందుకే చెపుతున్నాను, నా మాట విను. నిన్నె వరూ అనుమానించరు. నీవు పట్టుపడవు ఆయినా ఫరవా

లేదు. నేనున్నానుగా నీవైపు. మనకు పోటీకి ఎవరు వస్తారో చూస్తాను."

"ఏమో దొరా! నా కెందుకో యిట్టం లేదు."

"నీ మొఖం నాకు తెలియదు, నీవేమీ భయపడ వద్దు. సగం నాకియ్యి.

"సరే అట్టయితే ఈ రాత్రికే సేత్తాను."

"జాగ్రత్తగా చేయి, పట్టుపడ్డావంటే నిన్ను వదిలించ డానికి నా పరువు పోతుంది."

"తెలిసేట్టు సేత్తానా! నూత్తారుగా నా పనితనం. నరసింహులు అంటే ఏటనుకున్నారో"

"ఆఁ, మరొక విషయం. ఈ రాత్రికే, మా అన్న శేఖరయ్య యింట్లో గూడా చేయాలి"

"ఈ రాత్రేనా ?"

"మరి రేపు చేస్తావా ?"

"ఒకరోజే రెండు యిళ్ళలో ఎట్టా సేయాలి ?"

"నీ పనితనం నాకు తెలియొద్దూ ?"

"సరే అట్టాగయితే రెండూ సేసేత్తాను."

"మంచిది. మా అన్న యింట్లో శెట్టి కమ్మిన పొలం తాలూకు 500 రూపాయలున్నవి. అవి పట్టుకురా"

"ఓ, అదొక లెక్కా మనకి"

ఈ విధంగా నరసింహులను పురమాయించి రామ భద్రయ్య యింటికి వచ్చి పడుకున్నాడు అనుకున్న ప్రకారం మొదట శెట్టి యిల్లు, తర్వాత శేఖరయ్య యిల్లు దొంగి

లించి నరసి హులు యథాప్రకారం కాపలా తిరిగాడు. నరసి హులు, శేఖరయ్య యింట్లో ప్రవేశించుటకు కొద్ది సేపు ముందే శేఖరయ్య గాఢ సుషుప్తిలో లీనమైనాడు. అందుకే ఆటంకాలు, అడ్డంకులు లేకుండానే రామభద్రయ్య ఊహ ఆచరణలో నిజమైనది.

# 12

అలవాటు ప్రకారం ఆ మరురోజుదయమే శేఖరయ్య నిద్ర మేల్కొన్నాడు వంటయింటి తలుపు తీసివుండుట ఆయన కనుమానం వేసి గబగబా యింట్లోకి వెళ్ళి చూచాడు. డబ్బున్న పెట్టె తాళం తీసి వున్నది అందులో డబ్బు లేదు శేఖరయ్యకు ఆశ్చర్యం కలిగినది. శాస్త్రికి, రామయ్యకు చెప్పంపాడు. అంతా వచ్చారు. కానీ ఎవరు మటుకేం చేస్తారు? ఆ రాత్రి ఆయనకు కల వచ్చినందుకు తెల్లవారేసరికిలా జరిగిందని శేఖరయ్య విచారించాడు. ఒకటి రెండూ కాదు, ఐదువందల రూపాయలు. అంతా విచారించారు ఎవరికి తోచినమాటలు వారన్నారు.

ఇంతలో శెట్టి యింట్లో ఆ రాత్రి నగలు, డబ్బూ తీసుక వెళ్ళారని, శెట్టి తల బాదుకుంటూ దుఃఖిస్తున్నాడని ఎవరో చెప్పారు. శేఖరయ్యతో అంతా అక్కడికి వెళ్ళారు. దొడ్డివైపు పడమటింటికి పెద్ద కన్నం వేసి వున్నది. ఉన్నదంతా పోయినందుకు శెట్టి శేఖరయ్యని, శాస్త్రిని చూచి పెద్దగా దుఃఖించడం ప్రారంభించాడు.

అగ్రహారం చరిత్రలో యిదొక మరుపురానిరోజు ఆ గ్రామం ఏర్పడిన యిన్నాళ్ళకూ గ్రామంలో దొంతనాలు జరగడం యిదే ప్రథమం. ఏదో దారుణ చరిత్ర అంతర్గతంలో వున్నదని అంతా భావించారు ఎవరో కుతంత్రంతో చేసినదేనని అనుకోడానికా గ్రామ ప్రజల కెవ్వరూ సేపు పట్టలేదు. ఆ రోజల్లా అంతా విచిత్రంగా, విడ్డూరంగా యీ విషయాన్ని చెప్పుకున్నారు.

శేఖరయ్య అనుకున్న ప్రకారం ఆ ఉదయం రామ భద్రయ్యను పిలిపించలేదు. శెట్టి ఆ రోజు భోజనం మానేశాడు ఈ విషమ పరిస్థితులు ఎందుకు వస్తున్నాయో శేఖరయ్య కర్థం కాలేదు. ఈ దొంగతనాలెలా జరిగినవో ముందు తేల్చుకోవాలి. ఏమిటీ కల్లోలం! వీటికి కారకు లెవరు ? ఎప్పుడూ ఎవ్వరూ ఆశించని సంఘటనలు అగ్రహారంలో జరుగుచున్నవి. ఏమిటీ వైపరీత్యం—

ఈ విషయంలో రామయ్య, శాస్త్రి వూరుకోలేదు. యిదేదో తేల్చుకోవాలని, రిపోర్టు యివ్వాలని అన్నారు. గ్రామ ప్రజలలో చాలామంది యీ పై అభిప్రాయంతోనే ఏకీభవించారు కానీ శేఖరయ్య అందు కిష్టపడలేదు. ఇప్పటికి కోర్టుకు వెళ్ళి, దానికి వ్యవహారాలు తెగక యిబ్బందులు పడుతున్నారు. మరల యిప్పుడు రిపోర్టిస్తే యిదొక కొత్త వాయిదా. ఏమైనాగాని మనలో మనమే యీ విషయం తేల్చుకోవాలి, అనుకున్నాడు శేఖరయ్య.

ఆ సాయంత్రం, అంతా శేఖరయ్య యింటి దగ్గర సమావేశమై, యానా నరసింహులను పిలిపించారు.

ఈలోపు శెట్టిని, గ్రామంలో వున్న పెద్దలను పిలిపించారు. శెట్టి అప్పటి వరకు దుఃఖంతో వున్నందున ఆయన కళ్లు ఎర్రగా వున్నవి. ఆ రోజు భోజనం మానేసినందున మనిషి నీరసించి వున్నాడు. అలాగే శేఖరయ్య యింటికి వచ్చారు. నరసింహులు వచ్చారు. గ్రామంలో వున్న నలుగురు శేఖరయ్య యింటిముందే వున్నందున ఎవరికి తోచినమాట వారు అన్నారు అప్పట్లో ఎవ్వరికీ నరసింహుల మీద నమ్మకం పోలేదు.

శేఖరయ్య నెమ్మదిగా నరసింహుల బాధ్యత గుర్తు చేశాడు. తమ పూర్వీకుల రోజులలో అలా ఎప్పుడైనా జరిగినదా ? అని ప్రశ్నించారు. గ్రామంలో యిలాంటివి జరిగితే వాటికి కాపలావారే కారకులని శేఖరయ్య నొక్కి చెప్పాడు. అక్కడున్న వారంతా శేఖరయ్య మాటలతో స్వరాలు కలిపారు.

ఒకవైపు మాటలలా జరుగుచుండగనే, శెట్టి పెద్దగా దుఃఖించడం ప్రారంభించాడు. మధ్య మధ్య యూనాది నరసింహులను తిట్టడం మొదలెట్టాడు. శేఖరయ్య శెట్టి నాపుచేసి గ్రామంలో యిలా జరుగుతూ, పెద్ద, చిన్న, లేకపోతే ఈ గ్రామం ఎంతో కాలమిలా వుండదని సర్వ నాశనమైపోతుందని చెప్పాడు. అంతా శెట్టితో సహా శేఖరయ్య మాటల నంగీకరించారు.

నరసింహులు చెప్పిన కారణాలు, అక్కడెవరికీ సంతృప్తి నివ్వకపోయినా, వ్యతిరేకించి పెద్దగా ఎవరూ మాట్లాడలేదు ఇక ముందు జాగ్రత్తగా వుంటానని, నర

సింహులు చెప్పిన తరువాత, ఎవరి పనుల్లో వారు వెళ్ళిపోయి నారు.

ఈ విషయం ఈ విధంగా వదిలి పెట్టడం రామయ్యా, శాస్త్రుల్లు కిష్టం లేదు. పోతే పోయినవి ఖర్చులు, పోలీసు రిపోర్టు యివ్వాలని తీర్మానించుకున్నారు. కానీ శేఖరయ్య మాటకు వారు వ్యతిరేకించలేక వూరుకున్నారు.

అయితే శేఖరయ్య అభిప్రాయంలో కూడా రామ భద్రయ్య ప్రోద్బలంతో ఈ రెండు దొంగతనాలు జరిగిన వని, ఇంతకు మించి ఆ గ్రామంలో ఈ విధంగా ప్రవర్తించ గల ధైర్యం వున్నవారు మరొకరు లేరు. అయితే యీ విషయంలో రిపోర్టు యిస్తే మళ్ళీ కేసులు, విరోధాలు ఎక్కువ అవడము తప్ప తగ్గేదేమీ లేదు. అందుకని శేఖ రయ్య, ధైర్యంతో ముందడుగు వేయలేదు.

ఆ రోజు చలమయ్య రామభద్రయ్యను కలుసుకుని ఈ విషయం ప్రస్తావించాడు. చలమయ్యకు అగ్రహారంలో యిలా జరగడం ఆశ్చర్యంగా వున్నది ఇంతకు ముందెన్నడూ లేని దీ పని ఎవరు చేయిస్తారు? అసలెవరు చేస్తారు. కాపలా నరసింహులు, చాలా ఘటికుడు. వాడుండగా ఆ గ్రామాని కే మొప్పమూరాదు. కానీ ఏమిటీ వింత పరిస్థితి. తనకు కలిగిన అనుమానం బైట పెట్టాడు.

రామభద్రయ్య, సమాధానంగా నవ్వాడు. చల మయ్య ఆశ్చర్యంతో రామభద్రయ్యవైపు చూచాడు.

"ఏం, ఎందుకిలా ఆశ్చర్యపడతావు చలమయ్యా!

ఈ గ్రామంలో సంఘటన గ్రామంలోనివారు గాక, యితరు లెలావచ్చి చేస్తారోయ్?"

"మన గ్రామంలో అంతమాత్రిపోళ్ళెవరండీ?"

"ఏం ఎందుకు లేరు! యిదేం గొప్ప విషయమా?"

"కాకపోయినా మనకాచారం లేదుగా"

"ఆచార మేమిటోయ్? అసలేమున్నది ఆచారం? పుట్టుకుంటే అన్నీ ఆచారాలే?"

"మన గ్రామంలో అంతమాత్రిపోళ్ళెవరుంటారు?"

"ఏం మా అన్న శేఖరయ్య లేడు? ఆయనే చేయించి వుంటాడు."

"ఆయనింట్లో ఓరు చేయిచ్చారు?"

"అది నిజమేనంటావా?"

రామభద్రయ్య మాటకు చలమయ్య ఆశ్చర్యపోయాడు. శేఖరయ్య అంటే ఆ గ్రామంలో ప్రజలకు మంచి అభిప్రాయ మున్నది ఆయన మంచిమనస్సు కలవాడని, మంచి చెడులు తెలిసినవాడని ఆ గ్రామప్రజ లాయనంటే భక్తిగౌరవాలు చూపుతారు. రామభద్రయ్య మాటలు చలమయ్యను వూపిరిసలపనివ్వలేదు. "అంతేనంటారా" అనిమాత్రం అన్నాడు.

"కాకపోతే ఏమిటి, మనగ్రామంలో మరెవరు చేస్తారు?" రామభద్రయ్య గట్టిగా చెప్పడంతో చలమయ్య మళ్ళీ మాట్లాడలేదు. చలమయ్య తిరిగి వూపిరి తెచ్చుకొనే సరికి చాలా కాలం పట్టింది.

"ఆ పనెందుకు చేయించాడంటారు?"

"ఆయన ఈమధ్య పొలం నరహరిశెట్టికమ్మాడట, తెలుసుగా, శెట్టి ఆ పొలాన్ని చాలా తక్కువలో తీసుకున్నాడని శెట్టిమీద అప్పటినుండీ మా అన్నయ్యకు కోపంగానే వున్నది. రె. డో విషయం, ఆ వచ్చినడబ్బులో సగం కోర్టు ఖర్చులైనవి ఆ ఖర్చులెలాగైనా రాబట్టుకోవాలి అందుకిది తప్ప మార్గంలేదు" అని చెప్పాడు.

రామభద్రయ్య మాటలు చలమయ్యకు నమ్మకం కలిగించినవి. "చూశారా మీ అన్నయ్య పైకి ఎంతమెత్తగా కనిపిస్తారో"

"నిజం చలమయ్యా! ఈరోజుల్లో న్యాయాన్యాయాలు ఎవరికి కావాలి?"

"అంతేనండి. మనిషిని చూచి మోసపోకూడదండి" అంటూ చలమయ్య వెళ్ళిపోయాడు.

రామభద్రయ్య చలమయ్యకు దొంగతనాల్ని గురించి చెప్పినమాటలు అగ్రహారంలో తెలియడానికెంతో సేపు పట్టలేదు. ఆ సాయంత్రానికే గ్రామమంతా గుప్పుమన్నది. చలమయ్య మాటలు చాలామంది నమ్మారు ఇందులో ఏదో రహస్యం లేకపోతే యిలా జరగదని అంతా తలపోశారు శేఖరయ్య యింత అఘాయిత్యానికి తలపడినప్పుడిక ఆ గ్రామంలో మంచి, చెడులు పోయినవని, న్యాయాన్యాయాలు నశించినవని అంతా భావించారు.

# 13

ప్రకాశరావు మాటమీద జడ్జి అగ్రహారం కేసు విషయంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకున్నాడు ఆదిలో గబగబా సాక్షులను విచారించి, తీర్పు చెప్పాలనుకున్నాడు. ఆ ప్రకారం ఒక మాసంలోనే నాలుగు వాయిదాలు వేసి కేసుకు సగంపైగా విచారణ జరిపాడు ఇంతలో అగ్రహారంలో దొంగతనాలు జరిగినవి. శేఖరయ్య మాటల సందర్భంలో ప్రకాశరావు కి విషయం చెప్పాడు. ప్రకాశరావు యీ విషయాన్ని కూడా కోర్టులో న్యాయాధికారి సముఖాన చెప్తానన్నాడు. శేఖరయ్య అందుకిష్టపడలేదు పోతే పోయిం దని వూరుకుంటానన్నాడు.

ఆదిలో నరసింహశెట్టి పోలీసు రిపోర్టు యిద్దామనుకున్నాడు. కానీ పోలీసులు అంతతొందరగా తేల్చుతారని శెట్టి అనుకోలేదు. రిపోర్టిచ్చిన తరువాత అగ్రహారంలో తను అందరికీ విరోధి నైతానేమోనని మనస్సులో కలిగిన ఈ ఆలోచనను పైకి రానీయలేదు

అయితే రామభద్రయ్య వూరుకోలేదు శెట్టి తను పార్టీవాడని, ఆయనింట్లో నగలు దోచారని, న్యాయం కలుగచేయవలసిందిగా కోర్టువారికి తెలియజేశాడు. ప్రకాశరావు ఈ విషయం విని చాలా ఆశ్చర్యపడ్డాడు రామభద్రయ్య కుతంత్రానికాయన నివ్వెరపోయాడు. శేఖరయ

కి విషయం చెప్పాడు. ఈ వార్తవిన్న శాస్త్రి కోపంతో ఎగిరిపడ్డాడు. రామయ్య ఆగ్రహంతో పండ్లు కొరికాడు. శేఖరయ్య ఒక్క క్షణకాలం నిశ్చేష్టుడైనాడు.

ప్రకాశరావు వారి మనఃప్రవృత్తులు తెలుసుకున్నాడు. శేఖరయ్య, శాస్త్రి మనస్తత్వాలు ఆయనకు తెలుసు. వీరింత మంచివారుకాబట్టి రామభద్రయ్య అలా చేస్తున్నాడని ప్రకాశరావు భావించాడు. ఈ కేసు తను తీసుకున్నాడు. తనకు నిజానిజాలు తెలుసు. న్యాయరక్షణకోసం తను పాటుపడటంలో తప్పులేదు. ఎలాగైనా ఈ కేసులు గెలిపించాలి అని గట్టిగా పట్టుదల పట్టాడు ప్రకాశరావు.

శేఖరయ్య డబ్బుపోయిన తరువాత, శాస్త్రి కోర్టు ఖర్చులు పెడుతున్నాడు. రామభద్రయ్య దొంగతనం విషయం కోర్టువారి ముందు బెట్టేసరికి, పూర్తి అయి తీర్పుకు సిద్ధంగావున్న కేసు తిరిగి మొదటికి వచ్చింది. గడచిన దినాల్లో జరిగిన వాయిదాలలో జడ్జి రెండుపార్టీలవారిని చూస్తున్నారు. శేఖరయ్య శాస్త్రిల మంచితనం ఆయన గ్రహించకపోలేదు. కానీ చట్టాన్నిబట్టి తను నడవాలి. అందుకే కాలహరణం జరుగుచున్నది అనుకున్నాడాయన.

# 14

శాస్త్రి నరహరిశెట్టిదగ్గర డబ్బు వడ్డీకి తెచ్చాడని కాంతమ్మకు తెలియదు. శాస్త్రి ఎప్పుడూ ఆమెకు చెప్పనూ

లేదు. పార్టీలేర్పడిన తరువాత వారిద్దరూ తరచుగా కలుసు కోవడంలేదు. కాంతమ్మ భర్త వెంకటయ్య శేఖరయ్య పార్టీలో చేరడంతో, భార్యను కట్టుదిట్టంలో పెట్టాడు. కాంతమ్మ శాస్త్రిని కలుసుకోవాలని ఎంత ప్రయత్నించినా ఎప్పుడోగాని అవకాశం దొరకడంలేదు ఆ గ్రామ ప్రజలతో పాటు వీరిద్దరి సంబంధం, భర్త వెంకటయ్యకు, రామయ్య, చలమయ్యలకు తెలుసు. ఇటు శేఖరయ్య, రామభద్రయ్య లకు తెలుసు. కానీ అప్పట్లో ఈ విషయంలో ఎవరూ అంతగా పట్టించుకోలేదు.

పార్టీ లేర్పడి అన్నదమ్ములు దాయాదులైన తరు వాత, ఈ విషయం ఒక సమస్య అయినది కోటయ్య మరణానంతరం వెంకటయ్య పెద్ద అయినాడు ఒదిన ప్రవర్తనలో మరదులంతా తమ విముఖతను వెలిబుచ్చారు. అన్నకు చెప్పి ఆమె ప్రవర్తనను మార్చుకోమన్నారు ఈ విషయంలో వెంకటయ్య భార్యమనసును మార్చడాని కనేక ప్రయత్నాలు చేశాడు. అందులో ఒకటి ఆమెను కట్టు దిట్టంలో పెట్టడం. అయితే కాంతమ్మ భర్త అభీష్టానికి పూర్తి వ్యతిరేకురాలైనది. శాస్త్రిని ఆమె వదలిపెట్టాలని ప్రయత్నం చేసింది. కానీ ఆచరణలో తన ప్రయత్నాన్ని సాధించుకోలేకపోయింది. దానితో ఒదిన మరదులమధ్య తీవ్ర అభిప్రాయభేదాలు వచ్చినవి. వెంకటయ్యమాత్రం ఆ పరి స్థితిలో ఏం చేయగలడు.

కాంతమ్మకు వెంకటయ్యలో సగంవయస్సు లేదు. కోటయ్య బ్రతికుండగా బంధుత్వం పోతుందని దూరపు

బంధువుల అమ్మాయిని తమ్మునకిచ్చి వివాహం చేశాడు. వివాహంనాటికి కాంతమ్మకు పది సంవత్సరాలు వెంకటయ్యకప్పటికి ముప్పయి దాటినవి. కాంతమ్మ కాపురానికి వచ్చేలోపునే స్త్రీ సుఖం బాగా అనుభవించాడు. వయస్సులో వున్న కాంతమ్మ జీవితం ఎడారిన పూచినపూలే అయినవి. అయితే అప్పట్లో వెంకటామిుశాస్త్రి బ్రహ్మచారిగా వున్నాడు. మొదటినుంచీ ఆతను వ్యవసాయంలో రాటుతేరియున్నందున, రైతులా ఆయన జీవితం వ్యవసాయంలో పడినది. కాంతమ్మ, శాస్త్రి అప్పుడు తరుచూ పొలాలల్లో కలుసుకుంటూ వుండేవారు. అప్పుడప్పుడూ పనులలో ఒకరికొకరు సహాయం చేసుకుంటూండడంవలన వారి స్నేహం ఈ సంబంధానికి దారితీసింది. అంతే అప్పటినుంచి శాస్త్రి వివాహం మాటే తలపెట్టలేదు కృష్ణశాస్త్రిగారు కుమారుని పరిస్థితి గ్రహించి రామభద్రయ్యకు వివాహం చేశాడు. అప్పటినుంచీ వెంకటామిుశాస్త్రియందు కాంతమ్మకు ప్రేమ ఎక్కువైనది తనకోసం వివాహంచేసుకోవడం మానుకున్నాడని, ఆమె వెంకటయ్యనెలా చూచేదో, శాస్త్రిని అంత ప్రేమగా చూచేది.

అన్నదమ్ములు వేరుపడిన తరువాత వెంకటామిు శాస్త్రి తల్లిని తనింట్లో వుంచుకున్నాడు. ముసలామె వంట చేసి పెడుతుంటే శాస్త్రి పొలంపనులు చూచుకుంటుంటాడు. అప్పుడప్పుడి ముసలామెకు సహాయంగా కాంతమ్మ వచ్చి కొన్ని పనులుచేసి పెట్టి పోతుండేది.

శాస్త్రి, శెట్టిదగ్గర డబ్బు వడ్డీకి తెచ్చాడని విన్న ప్పుడు ఆమె అతనిని మందలించకుండా వుండలేకపోయింది. ఒకనాటి మధ్యాహ్నం భోజనంచేసి, తిరిగ్గా శాస్త్రి ఇంటికి వచ్చింది కాంతమ్మ. శాస్త్రి భోజనంచేసి మధ్యయింట్లో మంచంమీద పడుకున్నాడు. ముసలామె చెంగుపరుచుకుని వంటయింట్లో పడుకుని నిద్రపోతున్నది. కాంతమ్మ వస్తూ వీధివాకిలి వేసి వచ్చింది.

కాంతమ్మ వస్తూనే తను విన్నవిషయం సంగతేమిటని అడిగింది.

శాస్త్రికెంత ఆలోచించినా ఆమెకీ విషయం ఎవరు చెప్పారో తోచలేదు. శాస్త్రి సమాధానం చెప్పేలోపునే "ఏమిటాలోచిస్తున్నారు నిజమేనా?" అని అడిగింది.

"నిజమే" అన్నాడు శాస్త్రి నెమ్మదిగా.

శాస్త్రి సమాధానం విని కాంతమ్మ కోపం ఆపుకో లేకపోయినది. ఆమె కింతకుముందెన్నడూ తన ప్రియుడిమీద కోపం రాలేదు. కాంతమ్మ కోపంగా వుండటం శాస్త్రి ఇతకు ముందెన్నడూ చూడనూలేదు.

"ఎందుకమ్మావు?" అధికారస్వరం వుట్టిపడేలా అడిగింది.

"ఏం, నీకు చెప్పాలా"

శాస్త్రి సమాధానం ఆమెను మరికాస్త ఉడికించి నది

"నాకు చెప్పమని మిమ్ము నేనేం కోరటంలేదు. ఐనా

నేనెవరను, మీరెవరు, నాకు చెప్పడానికి. కాంతమ్మ కోపాన్ని దిగమింగి మాట్లాడింది. శాస్త్రి నిలబడివున్న కాంతమ్మను మంచంమీదికి లాక్కున్నాడు. కాంతమ్మ అతని వక్షస్థలంలో తల ఆన్చి వెక్కి వెక్కి ఏడ్చింది. శాస్త్రి ఆమెను ఓదార్చడానికి చేసిన ప్రయత్నం విఫలమైనది. కాంతమ్మ ఏడుస్తూనే నాకు చెప్పకుండా మీరేపనీ చేయ రనుకున్నాను. కట్టుకున్నదాన్ని కాకపోయినా, మీరు నన్నంతకంటే ఎక్కువగా చూస్తున్నారనుకున్నాను" అని నెమ్మదిగా అన్నది.

శాస్త్రి ఆమెను గట్టిగా అదుముకుని కన్నీటికండ్లను చుంబించాడు. "కాంతం! నీకు చెప్పకుండా నేనిప్పుడేం చేశాను? ఎందుకు నీవలా దుఃఖిస్తావు"

"మీరు రా శెట్టిదగ్గర డబ్బెందుకు తెచ్చారు?"

"ఇచ్చి పుచ్చుకోవడాలు లేకుండా అవుసరాలెలా గడుస్తవి?

"తిరిగా అప్పుఎలా తీరుస్తారు? ఈ సంవత్సరం పంటలు కూడా లేవు."

"నిజమే కాంతం, కానీ కోర్టు వ్యవహారం నీకు తెలి యదు. చూస్తున్నావుగా, గ్రామపరిస్థితులు? ఎప్పుడు ఏం జరుగుతుందో ఎవరూ చెప్పలేకపోతున్నారు. అంతా అగమ్యగోచరంగా వున్నది"

కాంతమ్మ శాస్త్రిమీదినుండి లేచి ప్రక్కన పడు కున్నది. "మీరా అప్పు తీర్చేలోపు ఆ శెట్టి వడ్డీ ఎంత తీసుకుంటాడో నాకు భయంగా వున్నది."

"అవును నాకూ అలాగే వున్నది. మన గ్రామానికి రోజులు బాగాలేవు" కాంతమ్మ యింకేమీ మాట్లాడలేదు. శాస్త్రిమీద చేయివేసి పడుకున్నది.

శాస్త్రి మనస్సు ఆనందంతో పులకరించినది. కాంతమ్మ తన భార్యయైవుంటే ఎంతో బాగుండేది. ఆమెకు తనమీదున్న ప్రేమకు శాస్త్రి ఆశ్చర్యపోయాడు.

ఆమె సహృదయానికి, ఆమెకు తనయందున్న ప్రేమాభిమానాలకు శాస్త్రిశరీరం ఉత్సాహంతో ఉప్పొంగి పోయినది. ప్రక్కనున్న ఆమెను గట్టిగా తన వేపుకు ఒత్తుకున్నాడు. కాంతమ్మ అతనిని తనచేతులతో పెనవేసినది.

# 15

ఫాల్గుణశుద్ధ పంచమి గురువారం, కొలుపులు ప్రారంభించాలని గ్రామపురోహితునిచేత ముహూర్తం పెట్టించాడు రామభద్రయ్య. అందుకు తగిన ఏర్పాట్లు చేశాడు. అరకకు పాతికరూపాయల చొప్పున ముందే ఎనిమిది వందలరూపాయలు వసూలుచేసి, శెట్టిదగ్గరుంచాడు. ముందే నిర్ణయించిన కార్యక్రమం ప్రకారం, కొలుపులు నిర్విఘ్నంగా సాగించుటకు, తగిన ఏర్పాట్లు చేశాడు.

ఈ కొలుపుల విషయంలో గ్రామప్రజల అభిప్రాయాలలో భేదాలున్నప్పటికి ఎవ్వరూ, రామభద్రయ్యను పైకి అభినందించకుండా వుండలేదు పైగా, అడిగినదే తడవుగా పాతికరూపాయలు సమర్పించుకున్నారు. రామభద్రయ్య

నెదిరించడమంటే, అంత సులువైన పని కాదని ఆ గ్రామ ప్రజల అభిప్రాయం. అందుకే అందుకు భిన్నంగా వారుండ లేక పోయారు.

ఆరోజుల్లో రామభద్రయ్య అగ్రహారంలో సాటిలేని కార్యశూరుడు చదువుకున్నవాడు కావడంవలన, ఆయన నెదిరించాలని మనస్సులోవున్నా, ఆయన అభిప్రాయాలతో ఏకీభవించలేకపోయినా, ఆయన ననుసరించక తప్పడంలేదు. ఆ పల్లెకువచ్చిన ప్రతి చిన్న కాగితంముక్కను చదివి చెప్ప గలవాడొక్కడే కావడంవలన, మనస్సులో రామ భద్రయ్యమీద ఎంత ద్వేషంవున్నా, ఆయన వద్దకు రాక తప్పదు. పైగా పట్నంపోయి ఆయన నెదిరించిన వారిమీద ఎప్పుడే కాగితంరాసి పడేసివస్తాడోనని, ఆగ్రామ ప్రజలకు జంకుగావుండేది. పైగా కుటిలోపాయుడు. అందుకని మంచిగా వుండక తప్పడంలేదు

ఈ విషయం రామయ్యకు తెలిసింది. అప్పటికింకా కొలుపులు పదిరోజులున్నవి. ఈ పదిరోజులముందే తాము అమ్మవారికి కొలుపులు చేయాలని, మనస్సులో నిశ్చయించుకున్నాడు రామయ్య. ఒక్కపార్టీతో రామభద్రయ్య కొలుపులు చేయంగలేనిది రెండు పార్టీలవారు తామెందుకు చేయలేమని మనస్సులో అనుకున్నాడు రామయ్య. తనకు తోచిన యీ అభిప్రాయాన్ని ఆచరణలో పెట్టడానికాదుర్దా పడ్డాడు.

అప్పుడే శాస్త్రిని కలుపుకుని, యీ విషయం శేఖ

రయ్యతో ప్రస్తావించుటకు యిద్దరూ కలిసి శేఖరయ్య యింటికి వచ్చారు.

రామయ్య అభిప్రాయం ఆచరణకు దుస్సాధ్యమని, శేఖరయ్య చెప్పాడు. కానీ రామయ్య అందుకు ఒప్పుకోలేదు. కష్టమైన పనులు తనకు ఒప్పగించమన్నాడు. అందుకు శేఖరయ్య యిష్టపడలేదు. ఈ శేఖరయ్య ఎప్పుడూ ఇంతే అని మనస్సులో అనుకున్నాడు రామయ్య.

రామయ్యకు అతనిమాట కాదన్నందుకు కోపం వచ్చిందని శేఖరయ్య గ్రహించాడు. "రామయ్యా! నేనందుకు తొందరపడవద్దన్నానో నీకు తెలుసా ?"

రామయ్య "మీరెందుకైనా చెప్పండి, మనం రెండు పార్టీలవారము కలిసి కొలుపులు చేయలేకపోతే, మనం ఈ గ్రామంలో వుండటమే అనవసరం. గ్రామంవదలి యింకెక్కడికైనా వెళ్ళి సుఖంగా బ్రతకవచ్చు. మనం యింత మంది ముండిగూడా, ఆ రామభద్రయ్య కెదుగు చెప్పలేకపోతే, మనం వుండిన ప్రయోజనమేమిటి ?"

రామయ్య సూటిప్రశ్నకు శేఖరయ్య సమాధానం వెంటనే చెప్పలేకపోయాడు. అతని పట్టుదలే అంత అనుకున్నాడు శేఖరయ్య. ఎంతచెప్పినా ఈ శేఖరయ్యయింతే, శాంతం, ఓప్ప అంటుంటాడు యీాయనను మార్చడం కష్టం" అనుకున్నాడు రామయ్య

ఆ తర్వాత వారిద్దరిమధ్య ఎక్కువసేపు ప్రసంగం సాగలేదు. శాస్త్రి ఎటూ మాట్లాడకుండా స్తబ్దుడై కూర్చున్నాడు.

# 16

రామలక్ష్మయ్య తనమాట తనకిేంది వుద్యోగస్థులు కాదని తీసివేశారని బాధ పడలేదు. వారలా చెప్పడం తన మేలుకోరేనని మనస్సుకు సంజాయిషీ చెప్పుకున్నాడు. మళ్ళీ తన మామూలు వ్యాపార వ్యవహారాలలో లీనమై పోయాడు. రామలక్ష్మయ్య వ్యాపారంలోని గొప్పతనం అదేనంటారు ఆయన విషయం బాగా తెలిసినవారు.

ఎడ్వర్డు మేనేజరు కాగానే. ఫ్యాక్టరీకి కావలసిన పరికరాలను చాలా తెప్పించాడు. మానవశక్తితో కంటే, యంత్రశక్తితో పనచ్యే పరికరాలు ఎక్కువగా తెప్పించడంవలన, మొదట్లో పెట్టుకున్న పనివారిని చాలామందిని తీసివేయవలసి వచ్చింది. ఆ పరికరాల సహాయంతో, ఫ్యాక్టరీ తక్కువ కాలంలో ఎక్కువపని చేయడం ప్రారంభించినది. అంతవరకు ఆ పట్టణంలో, యిలాంటి కొత్త మిషనులున్న ఫ్యాక్టరీలు లేవు. పనికూడా చాలా తొందరలో కావడం వలన, ఇతర ఫ్యాక్టరీలకంటే యీ కొత్త ఫ్యాక్టరీకి పని ఎక్కువరావడం ప్రారంభించినది.

పనికి తగినట్లు ఎడ్వర్డు మంచితనంతో, పనివారలతోనే గాక, పట్టణవాసులతో వుండటంవలన ఆ ఫ్యాక్టరీ అంటే సదుద్దేశం ఏర్పడినది. చుట్టుప్రక్కల ప్రదేశాలనుండివచ్చే పని ఎక్కువగా ఈ ఫ్యాక్టరీకే వస్తున్నది. ఆ వచ్చిన వారితో

ఎడ్వర్డు వినయవిధేయతలతో కూడటమువలన, ఆ వచ్చిన వారు సంతోషంగా పని పూర్తిచేసుకొని పోతున్నారు.

ఫ్యాక్టరీ విషయంలో రామలక్ష్మయ్య ఎడ్వర్డుకు పూర్తి అధికారమివ్వడంవలన, ఎడ్వర్డుగూడా చాలా జాగ్రత్తగా ఫ్యాక్టరీని నడుపుతున్నాడు. ఎల్లప్పుడూ తానెంతో ఉల్లాసంగా వుంటూ తోటి పనివారికి ఉత్సాహాన్నిచ్చేవాడు. దానితో అక్కడి పనివారికి అతను పరాయి దేశస్థుడు అన్న మాటే వారు మరచారు. తమ సోదరునికంటె ఎక్కువగా చూచుకుంటున్నారు. తన ఫ్యాక్టరీ పరిస్థితి చూచి రామలక్ష్మయ్య ఎంతో సంతోషించాడు. సమ్మెలు, పికెటింగులు, తగూలు లేకుండా, యిలా నడుస్తుందని ఆయన భావించలేదు. ఇదంతా ఎడ్వర్డు తెలివితేటలేనని ఆయన సంతోషించాడు.

## 17

కోర్టువారు వాయిదామీద వాయిదా వేస్తూ సంవత్సర కాలం జరిపారు. ఈ వాయిదాలకోసం పట్టణం వచ్చినందుకుగాను, శాస్త్రివద్దనున్న ఐదువందల రూపాయలు పూర్తిగా అయిపోయినవి. శేఖరయ్యవద్ద డబ్బు అయిపోయిన తరువాత, శాస్త్రి తన దగ్గరున్న ఐదువందల రూపాయలు అన్నకిచ్చాడు. ఆ డబ్బు శేఖరయ్య చేతిమీదుగానే ఖర్చయినది

ఒక రాత్రి శేఖరయ్య పడుకుని దీర్ఘంగా ఆలోచించాడు. ఏమిటీ వాయిదాలు? తగూలు? తనేం పాపం

చేశాడు ? తెలిసినంతవరకు చిన్న కీటకానికిగూడా అన్యాయం తలపెట్టలేదు. మరి రామభద్రయ్యకు తనమీదఎందుకో అంత శత్రుత్వం, ఆ రాత్రి ఆయన ఎంత ఆలోచించినా బోధపడ లేదు. రామభద్రయ్యతో మాట్లాడి, అతనిని మంచి మార్గం లోకి తీసుకురావాలని తను ఆశించాడు. ఆరాత్రే రామభద్రయ్య తనింట్లో దొంగతనం చేయించాడు. పైగా తామే శెట్టియింట్లో దొంగతనం చేయించినట్లుగా పట్నంలో కేసు పెట్టాడు. ఏమిటీ పరిస్థితి ? ప్రకృతి ఇలా ఎందుకు తటస్థించు కట్టుబానింది ? నిజానిజాలు తెలిసున్న అగ్ర హారం పెద్దలుగూడా, రామభద్రయ్యనే సమర్థిస్తున్నారు. కోర్టువారు సరియైన న్యాయం కలుగచేయలేకపోతున్నారు తన నెమ్మదితనం, మంచితనం, ఈ కాలానికి సరిపడకనా ఏమిటి ? యిక ముందుమార్గమేమిటి ? ఊహించిన మేర వరకు, ఆయనకు భవిష్యత్తు గాఢాంధకారంగానే కన్పించింది. శేఖరయ్య కారాత్రి నిద్రపట్టలేదు ఆలోచనలు తెగనూ లేదు.

ఏకగర్భజనితులైన అన్నదమ్ములు. దాయాదులై నారు. కారణంలేని తగాలుపడి, గ్రామాన్ని ఈ రూపంలోకి తీసుకువచ్చారు. ఈ నాడు అగ్రహారంలో మంచి, చెడు, న్యాయాన్యాయ విచక్షణ లేదు. రామభద్రయ్యను కాదని ఆ గ్రామంలో ఏ పనీ జరగదు. అతనిని కాదనే ధైర్యం ఆ గ్రామస్థులకు లేదు అందరికీ భయమే కాని అతనంటే అందరికీ ద్వేషమే, అయినా, అంతా అతనిని సమర్థించువారే

అతని మాటను శిరసావహించువారే. అతనుకోరితే ఏపనైనా చేయుటకు ఆ గ్రామస్తులు సిద్ధంగానే వుంటారు.

తెల్లవారగానే శాస్త్రి, శేఖరయ్యయింటికి వచ్చాడు. తమ్ముని రాకలోని అంతరార్థం ఆయన గ్రహించకపోలేదు. గతరాత్రిల్లా తను ఆలోచించిన విషయమే తమ్ముడు మాట్లాడడానికి వచ్చాడనుకున్నాడు.

"ఏరా శాస్త్రీ, వాయిదా దగ్గరకు వచ్చినట్టున్నది"

"అవునన్నయ్యా. యింక రెండురోజులే వున్నది"

"ఈసారి వాయిదాకు రామభద్రయ్య వస్తాడా?"

"ఏం, కొలువులింకా వారంరోజు లున్నవిగా"

శేఖరయ్య శాస్త్రిని మరేమీ ప్రశ్నించలేదు.

శాస్త్రి అన్ననిలా అడిగాడు:

"అన్నయ్యా, తమ్ముడు కొలువులకు మనలను పిలుస్తాడంటావా?"

"ఏమో ఎలా చెప్పగలం? వాడు పిలిచినా, పిలవకపోయినా మనం ఆశ్చర్యపడవలసిన పనిలేదు.

"ఈసారి కోర్టుఖర్చులు ఆలోచించావా అన్నయ్యా"

'లేదు' ముక్తసరిగా సమాధానం చెప్పాడు.

"మరెలా?"

"అదే నేను ఆలోచిస్తున్నాను. పాతికెకరాలు అమ్మినా ప్రయోజనంలేకపోయెనే నిఐదువందలు అయిపోయె, కోర్టువ్యవహారమూ యింకా పూర్తికాకపోయె? ఏమిటో నాకేమీ తోచడంలేదు శాస్త్రీ"

వారిద్దరిమధ్య ఎక్కువసేపు ప్రసంగం సాగలేదు. ఆ విధంగా ఒక్కక్షణకాలం యిద్దరూ మౌనంగా ఉన్నారు.

శాస్త్రి "అన్నయ్యా, నీవేమీ ఆలోచించకు. నేన లాగో చూస్తాను." అని లేచి వెళ్ళిపోయాడు. తమ్ముడి మాటకు 'పాలంమాత్రం అమ్మకు తమ్ముడూ' అనిమాత్రం కేక వేశాడు.

అన్నదగ్గరనుండి శాస్త్రి సరాసరి యింటికివచ్చి కాంతమ్మకు కబురంపాడు. శాస్త్రి కబురుపోయేటప్పటికి వెంకటయ్య యింటోలేడు. కాంతమ్మ వెంటనే వచ్చింది.

'కాంతం, నీతోపనుండి పిలిపించాను.'

కాంతమ్మతో శాస్త్రికి పరిచయమైనప్పటినుండి ఆమెను అలాగే పిలిచేవాడు. కాంతమ్మకుకూడా అలాగే పిలిపించు కొనడం యిష్టం. వెంకటయ్య ఎప్పుడూ ఆమెను అలా పిలిచుండలేదు అది వారి సాంప్రదాయమూ కాదు.

శాస్త్రిమాటకు కాంతమ్మ ముందు కొంచెం ఆశ్చర్య పడినది. తనతో ఈయన కవసరమేమైవుంటుందా అని ఆమె ఆలోచిస్తూ అలాగే నిల్చున్నది.

"కూర్చో కాంతం చెప్తాను" అని శాస్త్రి మంచం వాల్చుకుని కూర్చున్నాడు. కాంతమ్మ దగ్గరలో నున్న స్థంభాని కానుకుని కూర్చున్నది.

"కోర్టుఖర్చుల విషయం మీఆయన నీతో చెప్పే ఉంటాడు." అంటూ ప్రారంభించాడు శాస్త్రి.

కాంతానికి కొంచెం స్థిమితం చిక్కింది. శాస్త్రి పిలిచాడనంగానే ఆమె ఎందుకోననుకున్నది. తీరా విషయం తెలిసిన తరువాత ఆమె మనస్సులో ఆందోళన తగ్గింది.

"మా ఆయన నాతో ఏమీ చెప్పలేదు" కాంతమ్మ ముక్తసరిగా సమాధానం చెప్పింది.

"నీతో ఖర్చులవిషయం కూడా చెప్పలేదా?"

"లేదు"

"నేను వరహాలశెట్టి దగ్గర తీసుకున్నడబ్బు పూర్తిగా అయిపోయినది. అన్నయ్య ఐదువందలు, నా ఐదువందలు కోర్టుఖర్చుల క్రిందనే అయినవి. అన్నయ్య పొలంలోని మిగతా డబ్బు వొంగలెత్తుకుపోయినారు. మళ్ళీ వాయిదా రెండు రోజులలో ఉన్నది. అందుకనే నిన్ను పిలిపించాను." అన్నాడు శాస్త్రి.

"అయితే యిప్పుడు నన్నేం చేయమంటారు?"

"అందుకేగా నిన్ను పిలిపించినది." శాస్త్రి మంద హాసధోరణిలో అన్నా, కాంతమ్మ తీవ్రఆలోచనలో నిమగ్న రాలైనది. శాస్త్రి ఆమె నెందుకు పిలిపించినది, ఆమెకిప్పటికి పూర్తిగా తెలిసినది డబ్బు విషయంలో తననాలోచన అడగటానికి కారణం ఆమెకు గతంలో ఒకనాడు జరిగిన సంఘటన లీలగా జ్ఞప్తికివచ్చినది. శాస్త్రి ప్రవర్తన ఆమెకు మనస్సులో సంతోషాన్ని కలిగించినది.

'ఖర్చులెలాగనుకున్నారు' కాంతమ్మ చిరునవ్వుతో ప్రశ్నించింది.

"ఖర్చులవిషయం ముందంతగా పట్టించుకోలేదు. మా అన్నయ్యా, ఆ తర్వాత నేను వున్నది ఖర్చుపెట్టాము. ఇపుడిద్దరిపద్దా రాగిపైసాలేదు. ఇప్పుడు ఖర్చుగురించి ఆలోచించవలసి వచ్చినది" శాస్త్రి చెప్పాడు.

"అయితే మా ఆయన నడగలేకపోయారా?"

"ఇప్పుడవన్నీ మాట్లాడుకొనడానికి వీలులేదు. ఆదిలో ఈవిషయం నేనుగాని, మా అన్నయ్యగాని మీ ఆయనతోగాని, మీ మరదితోగాని, ప్రస్తావించలేదు"

"పోనీ ఇప్పుడు చెప్పవచ్చుగా"

"ఇప్పుడవన్నీ పెట్టుకుంటే ఎలా?" శాస్త్రి అనుమానాస్పద ప్రశ్నకు ఆతనే సమాధానం చెప్పుకున్నాడు.

"ప్రారంభంలో మీవాండ్లకీవిషయంలో మీరు భాగస్వాములు కావలసివుంటుందని తెలిపలేకపోతిమి. యిప్పుడిలాఅంటే వారేమంటారో?"

కాంతమ్మ ఒక్కక్షణం ఆలోచించినది. నిజాని కామె ఈ విషయంలో న్యాయాన్యాయాలు చెప్పే అవుసరములేదు. కాని ప్రియుని కామె ఏదో సమాధానం చెప్పాలి. ఆమె చెప్పే సమాధానం అర్థబలంకలిగి, ఉపయోగమైనదిగా ఉండాలి. లేకపోతే శాస్త్రి ఆమెకు కబురుపెట్టి పిలిపించడం వృధాప్రయాసే అవుతుంది కాంతమ్మ ఆలోచనలతో ఒకనిర్ణయానికి రాలేకపోయినది.

"ఏమిటి కాంతం నీ ఆలోచన?" శాస్త్రి మంచం మీదనుండి లేచాడు. కాంతమ్మా వేచింది - ఇంతలో వంట ఇంటోనుండి ముసలామె చేటపట్టుకుని వీరిదగ్గరికివచ్చింది.

"కాంతా, ఆ గరిసెలో బియ్యం ఈ చేటలో పోసిపో, అడుగంటినవి, నా కండటంలేదు." కాంతం చేటనిండా బియ్యంపోసి ముసలామె కిచ్చింది. ముసలామె లోపలికి వెళ్తూ "కాంతా, సాయంత్రం రా వేఒకసారి, రొట్టెలుచేస్తాను" అని చెప్పి వెళ్ళిపోయింది.

కాంతమ్మంటే ముసలామెకు మంచిప్రేమ, ఆపేక్ష ఉన్నవి. కాంతం తొలిసారి ఆ గ్రామానికి కోడలుగా వచ్చి నప్పటినుండే కాంతమ్మమీాద ఆమెకు పై అభిప్రాయాలు యేర్పడినవి. అప్పట్లో కృష్ణశాస్త్రిగారి స్నేహం కోసం కోటయ్య వస్తున్నప్పుడు కాంతం వివాహ విషయం కృష్ణశాస్త్రిగారితో సంప్రదించి ఆయన అనుమతి పొందే కాంతమ్మను మరదలుగా తెచ్చుకున్నాడు. వివాహం కాగానే మూడునిద్రలకు వచ్చినపుడు వెంకటయ్య, కాంత మ్మలను వెంటబెట్టుకొని కోటయ్య కృష్ణశాస్త్రి ఆశీర్వాదం పొందటానికి తీసుకవచ్చాడు. శాస్త్రిగారి ఆశీర్వాదం కాగానే ముసలామె ఆశీర్వ ంచినది. అప్పట్లో కాంతమ్మ చిన్నపిల్లేఅయినా ఆమెఅందానికి ముసలామె ఎంతోఆశ్చర్య పడ్డది. తన ద్వితీయతనయుడి కిలాంటిభార్య రావాలని ఆమె మనస్సులో అనుకున్నది

ఆ తర్వాత కాంతమ్మ కాపురానికి వచ్చినప్పటి నుండి తరచూ వచ్చి ముసలామెకు సహాయంగా పనులుచేసిపెడు తూండేది. ముసలామె ఆమె పరాయదని చూడకుండా చేసినవన్నీ పెడుతుండేవి. ఇలా వారిద్దరూ వుంటుండేవారు. ఆ తర్వాత చాలా కాలానికిగాని ఆమెకు, కుమారునికి

కాంతమ్మకున్న సంబంధం తెలియలేదు. తెలిసినతరువాత ఖన్నురాలుకాకుండా వుండలేదు కాని ఆమె స్త్రీ. ఏంచేయ గలదు? కృష్ణశాస్త్రుల్లగారే ఈ విషయం తెలుసుకొని కుమారుని మనస్సు మార్చలేకపోయాడు. కోటయ్యతో చెప్పి కాంతమ్మను శాస్త్రినికలుసుకోకుండా కట్టుదిట్టాలు చేశాడు. ఎన్ని చేసినా క్రియ ఫలించలేదు. అందుకని ద్వితీయుడైన శాస్త్రినివదలి తృతీయతనయుడైన రామభద్రయ్యకు వివాహమతివైభవంగా జరిపించాడు.

అప్పటినుండే కాంతమ్మకు శాస్త్రియందు ప్రేమ అధికమైనది. ఏ విషయంలోనూ అతని కేలోటూ లేకుండా చూచేది. అతను కోరినపుడల్లా ఆమె అతని అభిప్రాయాల కనుగుణంగా నడుచుకుంటుండేది. ఈలోపు ఎన్ని అవాంతరాలు వచ్చినా ఆమె ఏమొన్నడూ శాస్త్రి అభీష్టానికి వ్యతిరేకంగా నడుచుకోలేదు, శాస్త్రి తనకు కబురంపినపు డెప్పుడూ ఆమె తిరస్కరించలేదు. ఎన్ని పనులున్నా ఆమె ఆ మరుక్షణమే అతను కలుసుకోమలిన ప్రదేశంలో కలుసుకునేది. ఇలా వారిద్దరిమధ్య ప్రేమ అధికమైనది.

శాస్త్రి తనను పిలిపించిన ఉద్దేశ్యంలోని అంతరార్థం గ్రహించిన తరువాత ఆమె ఆలోచనలు ఒక నిర్దిబద్ధమైన నిర్ణయానికి రాలేదు. ఈ విషయంలో ఆమె ఏమీ మాట్లాడలేకపోయింది. శాస్త్రి ఆమెస్థితిని గమనించాడు ఆమె మౌనం వహించడమే మంచిదనుకున్నాడు. "కాంతం! ఈసారి పొలం అమ్మక తప్పదు. అందుకే పిలిపించాను. పనుంది. నే వెళ్తున్నా!"

శాస్త్రి మాటకు కాంతమ్మ నిర్బుద్ధురాలైనది. ఆమె తేరుకుని సమాధానం చెప్పేలోపునే శాస్త్రి వీధిగడప దాటాడు. కాంతమ్మ ఒక్క క్షణకాలం అలాగే గడపకు చేరగిలపడ్డది.

"ఏమిటే కాంతం! యింకా యిక్కడే వున్నావుటే?" అంటూ ముసలామె మంచినీళ్ళబిందె బుజాన బెట్టుకొని లోపలినుండి వస్తూ అడిగింది. ముసలామె మాటలతో కాంతమ్మ ఆలోచనలు పోయినవి. లేచి చీరకుచ్చెళ్ళు ఒక్కసారి విదలించుకొని ముసలామె ననుసరించినది.

ఆ రాత్రి మామూలు వేళకు పడుకున్నా కాంతమ్మకు నిద్రపట్టలేదు. ఇంతకాల పరిచయంలో ప్రియుడు తన సఖిప్రాయం కోరినదిలేదు తన అంగీకారంతో చేసినది లేదు. అసలింతకుముందెప్పుడూ ఆయనకా అవసరము కలుగలేదు ఈనాడు ఆయన ప్రత్యేకంగా పిలిచి అడిగినా తను సహాయము చేస్తానని చెప్పలేకపోయింది అందుకామె యెంతో బాధపడ్డది. ఆయనకెంతో తను రుణపడివున్నది. తనయం దాయనచేసిన త్యాగాలలో సగంకూడా తను ఆయన విషయంలో చేయలేదు.

కాంతమ్మకీ ఆలోచన హృదయాన్ని కదలించినది. మనస్సు బాధతో నిండిపోయినది. అనుకున్నట్లుగా ఆమె నేత్రాలు అశ్రుపూరితాలైనవి మంచంమీద లేచి కూర్చున్నది వాతావరణం ప్రశాంతంగావున్నా ఆమె మాత్రం ఆ ప్రశాంత వాతావరణం భరించలేక పోయినది. తను శాస్త్రి కేవిధంగానైనా సరే సహాయంచేయాలి. అప్పుడే

తనజన్మ సార్థకమవుతుంది. శాస్త్రి స్నేహానికి చిహ్నంగా ఏనాడో తనకొక కాసులపట్టెడ చేయించాడు. ఆ రోజుల్లో అది రెండువందల రూపాయలు. అనుకోనట్లుగా కాంతమ్మ కానాటి సంఘటన గుర్తుకువచ్చింది ఆమె మనస్సు ఆనందంతో చిందులు తొక్కినది.

వారిద్దరు కలుసుకున్న ప్రథమ దినాల్లో ఒకసారి, శాస్త్రి కాంతమ్మను కౌగిలిలో చేర్చుకొని "కాంతం! నేను నీ కొక బహుమతి యివ్వదలచాను. అది చిరకాలం మన స్నేహంతోబాటు వుండాలి అలాంటిదేదో నీవే ఆలోచించి చెప్పు" మని చెప్పాడు. కాంతమ్మ వెంటనే కాసులపట్టెడని చెప్పింది. ఆ మరురోజే శాస్త్రి గ్రామకరణం దగ్గరకు వెళ్ళి తన తల్లి పెట్టుకుంటూ బరువుగా వున్నదని తీసివుంచిన బంగారుకంటెను చెడగొట్టించి కాంతమ్మకు కాసులపట్టెడ చేయించిచ్చాడు. అప్పటినుండి కాంతమ్మ దానిని మెడలోనుండి తీయకుండా ఎప్పుడూ ధరించే వుంటున్నది!

ఆనాటి సంఘటన గుర్తుకు రాగానే కాంతమ్మకు దుఃఖంపోయి సంతోషం కలిగినది. సిగ్గుతో ఆమె దుప్పటి నిండా కప్పుకొని ముడుచుకొనిపడుకున్నది. ప్రియునికి కాసుల పట్టెడ నుప్పుడుయిస్తే అవసరము గడుస్తుంది తను చేయవలసినపని తెలియగానే ఆమె సంతోషంతో మెడలోని కాసులపట్టెడతీసి యింట్లోపెట్టి వచ్చింది.

అప్పటికి సగంరాత్రి గడచినది. వెంకటయ్య ఎడ్లకు మేతవేయుడానికి లేచాడు. ప్రక్కమంచంమీద పడునికు

వున్న భార్యను చూచాడు. ఆమె నిద్రపోలేదని గ్రహిం చాడు. అయితే ఆతనికి కారణమేమిటో బోధపడలేదు. అలాగే ఆలోచిస్తూ ఎడ్లకు మేత వేసి వచ్చాడు భర్త తన విష యం గ్రహించాడేమోనని కాంతమ్మ మనస్సులో భయ పడింది. నిద్రపోయేదానిలా ముడుచుకుని పడుకున్నది.

వెంకటయ్య వచ్చి తన మంచంమీద కూర్చున్నాడు. భార్యను లేపి సంగతేమిటో తెలుసుకుందా మనుకున్నాడు. కానీ వెంటనే ఆతనికి మరొక ఆలోచన కలిగింది. ఆమె అంతకుముందే లేచి మళ్ళీ పడుకున్నదేమోనని భావించాడు.

ఇలా అనుకున్న తరువాత వెంకటయ్య దుప్పటి నిండుగా ఒక్కని ముసుగుపెట్టి పడుకున్నాడు.

ఆ విధంగా మరికొన్ని క్షణాలు గడిచినవి.

కాంతమ్మ కెంత ప్రయత్నించినా నిద్రరావడం లేదు. లేచి ప్రక్కకు వెళ్ళివచ్చింది. భర్త మంచంవైపు ఒకసారి చూచి యధాప్రకారం పడుకున్నది.

వెంకటయ్య దుప్పటి ముసుగుపెట్టి పడుకున్నా, భార్యను గమనిస్తూనే వున్నాడు. ఆమె లేచి అవతలికి వెళ్ళి వచ్చిన తరువాత తనవూహ తప్పని తెలుసుకున్నాడు. ఆమె నిద్రపోని కారణం మరొకటై వుంటుందని ఆతను భావిం చాడు. మెల్లగా దుప్పటి పక్కకునెట్టి లేచి ఆమె మంచం మీదకు వెళ్ళాడు. భర్త ప్రవర్తన కామె ఏమీ అడ్డు చెప్ప లేదు.

అదేరాత్రి వెంకటశాస్త్రి కూడా కాంతమ్మను గురించి చాలా పొద్దుపోయేవరకు ఆలోచించాడు. ఆనాటి ఆమె ప్రవర్తన, ఆ రాత్రిశాస్త్రికి నిద్రాభంగానికి కారణమైనది. ఆమెమనస్తత్వం ఆతనికి తెలియనిదికాదు. అయినా ఈరోజు ఆమెనుగురించి మరికొంత తెలుసుకున్నా ననుకున్నాడు. అయితే యిన్నిసంవత్సరాలనాటి పరిచయంలో, యిలాంటి సంఘటన లెప్పుడూ రాలేదు. అందుకే ఈరోజు నాటి సంఘటనను గురించి ఆలోచించక తప్పలేదనుకున్నాడు శాస్త్రి.

తెల్లవారింది. కాంతమ్మయింకా నిద్రలేవలేదు. మామూలుగా తెల్లవారు జామునే అరకకట్టుకుని వెంకటయ్య పొలం వెళ్ళిపోతాడు. రాత్రిళ్లు ఆతను నిద్రపోకపోయినా తెల్లవారుజామున వెళ్ళవలసినదే! అలా లేవడం అతని కొక అలవాటైనది. ఈరోజు అలవాటు ప్రకారం అరకకట్టుకుని పొలం వెళ్ళాడు వెంకటయ్య. రోజూ కాంతమ్మకూడా ఆతనితోబాటు నిద్రలేచి, పశువులకొట్టాన్ని శుభ్రపరచేది. ఆతరువాత దూడనువిడిచి రెండు చేర్లపాలు గేదెదగ్గర పిండేది. గేదెనువిడిచి, తనచెంబు తీసుకుని డొంకదాకా గేదెను తోలివస్తూ పొయిలోకి కంపలదగ్గర నాలుగు పుల్లలు ఏరుకవచ్చి పొయ్యి వెలిగించేది. పొయ్యిమీద చద్దిబువ్వపుడికేలోపు, తను యితరపనులు ముగించుకొనేది. తర్వాత చద్దిబువ్వతిని. భర్తకు కొంచం మూటకట్టుకుని యిల్లు తాళంవేసి గడ్డిగంప నెత్తిన బెట్టుకుని పొలంపోయేది.

మిట్టమధ్యాహ్నం గంపనిండా గడ్డితో చెమట తుడుచు కుంటూ కాంతమ్మ, అలసిపోయిన ఎడ్లను అరకకుకట్టి వెం కటయ్య యింటికి వచ్చేవారు. తెల్లవారింది మొదలు మధ్యాహ్నం వరకు యిది వారికార్యక్రమం.

కానీ ఈరోజు తెల్లవారినా కాంతమ్మకు మెళుకువ రాలేదు. గేదికూడ మోరపైకెత్తి పాలకు అరుస్తున్నది. కన్నబిడ్డ అరుపుకు, ఆ మాతృహృదయం మెడకుకట్టిన పలుపు, ఆ పలుపు కట్టినగుంజను గమనించ కుండా బలా బలాలు చూచుకుంటున్నది. అప్పటికీ కాంతమ్మకు మెళుకువ రాలేదు.

కాంతమ్మకు డొంకలో కలిసే స్నేహితురాలు ప్రక్కింటి పుల్లమ్మ. ఆవిడకారోజు డొంకలో కాంతమ్మ కలవకపోయేసరికి కారణమేమిటో తెలుసుకుందామని కాం తమ్మ యింటికి వచ్చింది. ఆమెవచ్చి చూచేసరికి ఎక్కడ పనులక్కడే వున్నవి. ఆమె కాశ్చర్యం వేసినది. గబగబా కాంతమ్మ పడుకున్న మంచందగ్గరకు వచ్చి లేపింది.

కలలుకంటున్న కాంతమ్మ ఉలిక్కిపడి లేచింది ఎదురుగా పుల్లమ్మ, చేయవలసినపని ఆమెకు కనిపించినది. గేదెకూడ 'అంబా' అని అరుస్తున్నది. గబగబా లేచి కాం తమ్మ పుల్లమ్మను కూడా పలకరించకుండా, పనుల్లో లీన మైనది. పుల్లమ్మ కాంతమ్మను మరేమీ పలుకరించలేదు. చేనికి గడ్డికివచ్చినపుడు సంగతేమిటో తెలుసుకుందామని, "నేనీ పూటపట్నం దోవలో చేనికెళ్తుండాను. నీవక్క

డికి వత్తావుగా' అని సమాధానం గూడా వినకుండా వెళ్ళి పోయినది.

స్నేహితురాలితో మాట్లాడటానికి కాంతమ్మకు మనస్సంగీకరించలేదు. సిగ్గుతో ఆమె మిత్రురాలిని పలకరించలేక పోయింది. తానింత ఆలస్యంగా నిద్రలేవడానికి కారణం రాత్రి జరిగిన సంఘటన. ఆ సంఘటన ఆమె మనస్సులోనుండి పోలేదు. ఆసంఘటన గుర్తుకు వచ్చిన తరువాత, ఆపూట ఆమె పనేమీ చేయలేక పోయినది. ఎలాగో గేదెపాలు పితికి, గేదను డొంకలోకితోలి వచ్చింది. రాగానే పొయ్యిమీద ఎసరు పెట్టింది. ఆ కాస్త చద్ది బువ్వ నోట్లోపెట్టుకుని, భర్తకు మూటగట్టుకుని గడ్డిగంప నెత్తికి తగిలించుకుని బయలు దేరింది.

కాంతమ్మ రాకకోసం వెంకటయ్య చాలాసేపటి నుండి ఎదురు చూస్తున్నాడు. ఆతనికి ఆకలి వేస్తున్నది. పొద్దున్నే కాస్త కడుపులో పడనిది వెంకటయ్య వుండ లేడు. కాస్త వేళదాటితే ఆతనిక పనిచేయలేడు. ఉదయమే అయినా, బాలసూర్యుని లేతకిరణాలకు, మెలితిరిగిన ఆతని శరీరపు కండలు చెమటతో నిగనిగలాడు తున్నవి. రోజూ వేళకువచ్చే భార్య, యీరోజు ఆలస్యానికి కారణమేమిటో ఆత నెంతసేపాలోచించినను బోధపడలేదు.

ఇతంలో అక్కడికి పుల్లమ్మ వచ్చింది. ఆమె వస్తూనే 'ఏం ఎంకయ్యమామా రేత్తిరి మాఅత్తను నిద్రపోనీయలే దల్లేవుందే!' అన్నది మామూలు ధోరణిలో!

'ఏంటే పుల్లమ్మా నీవనేది' పుల్లమ్మ జవాబు కోసం అరకనాపి నిల్చున్నాడు వెంకటయ్య.

'ఆ-ఏంలేదు మామా! రేత్తిరి మాఅత్త, నీవు సాలా సేపు ఏదో సెప్పుకున్నారటగా?

'ఎవరు చెప్పారే నీకు?'

'మాఅత్తే సెప్పింది'

'ఏమని?'

'నేనిందాక అన్నమాట'

'నిజంగా చెప్పినట్టే వున్నదే! ఓసి నీదుంపతెగా, భలే, టక్కులమారి దానివైనావు, అదిసరేగాని ఏదేయిది?"

'ఏమో మామా, నేనువత్తూ నిద్దరలేపి వచ్చాను. పుల్లమ్మమాటకు వెంకటయ్య నిర్ఘాంతపోయి చూస్తూ నిల్చున్నాడు. భార్య ఆలస్యంగా నిద్దరలేవడం ఆతనిదే మొదటిసారి వినడం. ఇన్ని సంవత్సరాల వారిద్దరి దాంపత్య జీవితంలో అనేకసార్లు రాత్రిళ్ళు చాలా పొద్దుపోయేదాకా గడిపారు. కానీ కాంతమ్మ ఎప్పుడూ ఆలస్యంగా నిద్దుర లేచి ఎరుగదు. ఏది ఎలావున్నా భార్య విషయంలో యీ సంగతి మాత్రం అతనికి బాగాతెలుసు. అందుకే పుల్లమ్మ మాటకు వెంకటయ్య ఎంతో ఆశ్చర్యపోయాడు.

"ఏమిటి నీవనేది పుల్లమ్మా? నిజమేనా నీవుచెప్పింది?"

'నిజమేమామా కాకపోతే, నీకాడ నాకు ఆబద్ధం సెప్పాల్సిన అవుసరం ఏముంది.'

పుల్లమ్మమాటకు వెంకటయ్య ఏమీ ప్రశ్నించలేదు. కాసేపు అలాగే నిల్చున్నాడు. 'సరే పుల్లమ్మా, ఈపూట ఏ చేను మాటుపెట్టడానికి పోనున్నావు?'

'అదిగో అదే మావా నేననొద్దనేది' ఏం నేనొక్క దాన్నేనా నీకు దొరికింది. మీ ఆవిడ రావటంలా, ఆవిడ నడుగు సెప్పుతుంది. నాకేం తెలవదు.

'ఓసి నీ దుంపతెగా, ఎన్నిటక్కులు నేర్చుకుండావే! అదిగాదే నేననేది, నన్ను రమ్మంటావా అని'

'అమ్మో యిపుడు కాదులేమామా' గడ్డోంళ్ళంతా వత్తారు.

'ఇప్పుడేం వత్తారే! నీ బయమేగాని'

'ఏమో మామా'

'సరే ఆడవద్దులే, అదిగో ఆ రాళ్ళగుట్ట వుండదిగా' వెంకటయ్య, ఉత్సాహంతో ముందుకు వచ్చాడు.

'ఏండ్లు వచ్చినా యింకా ఎదవ బుద్ధులు పోలేదు' పుల్లమ్మ అన్నది.

'ఎట్లా పోతయ్యే మొదటి నుండీ వచ్చినవి' అని పుల్లమ్మ చేతిని పట్టుకున్నాడు.

'అదిగోమామా అత్త వత్తునది సూత్తాది. నేనెల్లొత్తా మామా' పుల్లమ్మ గబగబా గంపతీసుకుని పరుగెత్తుకుని వెళ్ళిపోయింది.

భర్త ఆకలికి వుండలేడని కాంతమ్మకు తెలుసు. అందుకే ఆమె చద్ది చంకన పెట్టుకుని, యింటికాడ్ని పసులు గూడా సరిగ్గా చూడకుండా అదరా బాదరాగా పరుగెత్తు

కుంటూ వస్తున్నది. ఆమెను చూచేసరికి, వెంకటయ్యకు మాటల సందర్భంలో మరచిపోయిన ఆకలి, తలెత్తింది. వెంకటయ్య అరకను ఆపి కుంటలోని నీళ్ళలో ముఖం పళ్ళు కడుక్కొని, రాళ్ళగుట్ట ప్రక్కన గట్టుమీద చతికిలబడ్డాడు.

కాంతమ్మ రావడంతోనే మూటవిప్పి భర్తముందు పెట్టింది. వెంకటయ్య మూటలోని రెండుముద్దలు గబగబా మింగి, కుంటలో చెయ్యి కడుక్కొని రాళ్ళగుట్ట ప్రక్కన తుమ్మచెట్టు క్రింద తీరిగ్గా కూర్చున్నాడు.

కాంతమ్మ భర్త తిండితినడం అయిపోగానే ఆ గుడ్డను పిండి గంపలో వేసుకుని 'నేనెల్లొత్తా' ఎండపడు తున్నది.' అన్నది.

'ఎల్లుదుగానిలే రా, కాసేపుకూకొనిపో'

భర్త మాటకు కాంతమ్మ, "ఎండబడుతున్నది, గడ్డో ళ్ళంతాపోతారు. అసలు ఎండబడితే సేలోగడ్డి కనిపించదు." అని అంటూనే భర్త కెదురుగా చతికిల పడ్డది.

వెంకటయ్య- 'ఏమే, నీద్దర మెలకువ రాలేదా?

కాంతమ్మ.- అప్పుడే ఎవరు సెప్పారు.

వెంకటయ్య:- ఎవరు సెప్పాలా, నీవు ఆలస్యంగా వస్తే నాకా మాత్రం తెలవదూ?

భర్త మాటకు కాంతమ్మ సమాధాన మేమీ చెప్ప లేదు. యివి భర్తమాటలు కావని ఆమెకు తెలుసు. అయితే అప్పుడే ఎవరు చెప్పివుంటారు. అసలు తను ఆల స్యంగా లేచింది ఎవరికి తెలుసు. అని ఆలోచించుకుంటు న్నది. కానీ ఆమెకు అంతతొందరగా సమాధానం దొరక

లేదు. పుల్లమ్మకు తెలుసు కానీ పుల్లమ్మకు చెప్పవలసిన అవుసరమే వచ్చింది. అయినా ఆరోజు పుల్లమ్మ పట్నం త్రోవ చేనికి పోతానన్నది. ఇటెందుకు వస్తుంది. పోనీ, పుల్లమ్మ రాకుండా తనను మరెవరైనా చూచారా! అయితే ఎవరుచూచి వుంటారు?

'ఏమిటో, ఆలోచిస్తుండవ్?' వెంకటయ్య ప్రశ్నించాడు

ఊహాప్రపంచంలో నుండి, మామూలు ప్రపంచం లోకి వచ్చింది కాంతమ్మ. "ఆ ఏమిలేదు" అనిమాత్రం అన్నది. కాని ఆమె మనస్సు ఆలోచనలతో నిండివున్నది. ఎంతసేపలా ఆలోచించినా ఆమెకు "ఎవరుచెప్పివుంటారు." అనేది అనుమాన స్పదంగానే వుండి పోయింది.

అలా మరి కొంతకాలం గడిచింది. అంతవరకు వెంకటయ్యగూడా భార్యనుగురించే ఆలోచించాడు. కాని అతనికీ కారణం బోధపడలేదు, వెంటనే భార్యను అడగా లనుకున్నాడు. అయితే భార్యను ఏవిధంగా అడిగితే బాగుంటుందో వెంకటయ్యకి స్ఫురించలేదు.

భర్త ఆలోచనను కాంతమ్మ గ్రహించింది. ఆమెకిక అక్కడవుండటం యిష్టంలేదు, అయితే వెళ్ళాలి. కానీ, వెళ్ళలేక పోయింది. ఏదోశక్తి ఆమెకు అక్కడనుండి కదల కుండా చేసింది. వెంకటయ్య మనసుని భార్యమీదనుండి కొలువులమీదికి పోయింది. కాంతమ్మకు మనస్సులో అక్కడినుండి పోవాలన్నా ఆసమయంలో భర్తను వ్యతిరే కించలేక పోయింది. భర్త ఏమడుగుతాడో, దానికి సమా

ధానం చెప్పి అక్కడనుండి కదలానుకుని, భర్త వేయ బోయే ప్రశ్నకు సమాధానం ఆలోచిస్తున్నది.

అప్రయత్నంగా వెంకటయ్య దృష్టి కాంతమ్మ మెడ లోని కాసుల పట్టెడ మీద పడినది. మెడలో పట్టెడ లేకపోయే సరికి, వెంకటయ్య మనస్సు గతుక్కున్నది.

'మెడలో పట్టెడ ఏదే?' ఆదుర్దాగా అడిగాడు. భర్త ఆదుర్దాను కాంతమ్మ గ్రహించినది. ఆమె తొణకలేదు. అసలు ఎప్పటికైనా అడగకుండా వుండడని, ఆమె సమా ధానం ముందే వూహించుకుని వున్నది. 'పోలేరమ్మకు మీదు కట్టాను' అని మెల్లగా చెప్పినది.

"ఎందుకు, మొక్కులేమైనా వున్నాయా? లేక మొక్కు కున్నావా?" వెంకటయ్యమరింత ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

కాంతమ్మ తలతిప్పి వూరుకుంది. కానీ వెంక టయ్యకు తను ప్రశ్నించిన రెంటిలో దేనికామె తల తిప్పిందో అర్థంకాలేదు.

"అమ్మోర్ని ఏమని మొక్కుకున్నావే? భర్త ప్రశ్నకు కాంతమ్మ సమాధానమేమీ చెప్పలేదు. తలవంచుకునే కూర్చున్నది. కాంతమ్మ సిగ్గుతో మొక్కుకున్న విషయం చెప్పలేక పోతున్నదని వూహించాడు వెంకటయ్య. వారిద్దరి మధ్య మరికమాటలేమీ సాగలేదు.

## 18

రామలక్ష్మమ్మకు అగ్రహారంలో కొలువులు జరుగు తున్నవన్న సంగతి తెలిసింది. ఒక్కసారి అగ్రహారం వెళ్ళి

కొలుపులు చూచివస్తే బాగుండుననుకున్నాడు. కాని యిక్కడి వ్యవహారాలు వ్యాపారం వదలిపోవడానికి, వీలుచిక్కలేదు.

ఇంతలో ఒకనాడు నరహరిశెట్టి కుమారునికి 'కొలుపులు బాగా జరుగుతాయని తప్పకుండా సతీసమేతంగా బయలుదేరి రావలసినదని' జాబువ్రాశాడు. తండ్రి జాబుకు రామలక్ష్మయ్య అగ్రహారంపోవడానికి యిష్టపడ్డాడు. అయితే ఈ విషయంలో భార్య అభిప్రాయం కూడా తెలుసుకొనిదే నిర్ధారణ చేసుకోకూడదనుకున్నాడు.

రామలక్ష్మయ్య అగ్రహారంలో కొలుపుల సంగతి తండ్రి తమకు వ్రాసిన జాబువిషయం భార్యకుచెప్పాడు. అసలింతకుముందే ఆమె తమ స్వంతగ్రామంలో కొలుపులు జరుపుతున్నారని వినివుండటంవలన ఆమె భర్తను అడగాలనుకొంటున్నది. తీరా యిప్పుడు భర్త అడిగిన తర్వాత ఆమె మారు మాట్లాడలేదు. ఆనందంతో అంగీకరించినది.

అయితే రామలక్ష్మయ్యకు భార్యను అగ్రహారం తీసుకవెళ్ళడం యిష్టంలేదు. పెండ్లికాగానే తన తండ్రి మూడునిద్రలకు అగ్రహారం వెళ్ళి సత్యనారాయణవ్రతం చేసుకోవాలన్నప్పుడు తండ్రిమాటను వ్యతిరేకించాడు. ఆయనతోబాటు మరికొందరు ఆయన ప్రాపకం కోరేవారు కూడా, ఆ సమయంలో మిత్రునినే సమర్థించారు. దానితో తాత్కాలికంగా నరహరిశెట్టి ఆలోచనకు, నీళ్ళు వదులుకోవలసి వచ్చింది.

కానీ అప్పట్లో సరహరిశెట్టికి, కొడుకు కోడలును అగ్రహారం తీసుకవెళ్ళి, పదిమంది చూస్తూండగా, సత్యనారాయణవ్రతం చేసుకోవాలని, గ్రామంలో అమ్మవారికి లక్షపత్రిపూజ చేయించి, గ్రామంలోని వారిచేత ఘనంగా చూడబడాలని, తనకోడలు అందానికి అగ్రహారం ప్రజలు ఆశ్చర్యపోవాలని, శెట్టికి కోరికగా వుండేది. తను అలాంటి అందాలభరిణను, భాగ్యవంతుల పిల్లను కోడలుగా పొందినందుకు నలుగురూ తనవెంతో ఆదరణతో చూస్తారని అభినందించుతారని ఆశించాడు. కాని కుమారుడు తన కోర్కెను తిరస్కరించే సరికి ఆయన మనసులోనే తన కోర్కెను తలచుకుని సంతృప్తి చెందాడు.

అయితే రామలక్ష్మయ్య భార్యను అగ్రహారం తీసుకపోకుండా వుంటానికి ఒక కారణంకూడా వున్నది. ఆమె కేవలం పట్టణ నివాసిని. ఆమెకు పల్లెటూళ్ళు, అక్కడి పద్ధతులు తెలియవు. అంతేకాకుండా ఆమె పుట్టింటివారు వ్యాపారం లక్షలమీద చేస్తున్నారు, అవసరమొస్తే వేల రూపాయలు సంపాదించగలరు, ఖర్చు చేయగలరు. కానీ తనతండ్రి యిందుకు పూర్తి వ్యతిరేకి. తనతండ్రి అగ్రహారంలో యింకా చిల్లరకొట్టుతోనే కాలం గడుపుతున్నాడు. ఈస్థితిలోవున్న తన ఇంటిని, తమ పరిస్థితిని, భార్యకు చూపడం రామలక్ష్మయ్య కిష్టంలేదు. భార్య తన నిజస్థితి చూదిన ఆమె దృష్టిలో తాము హేళనగా చూడబడతానని రామలక్ష్మయ్య ఊహించాడు ఆయనకీఊహ

రాగానే అగ్రహారంలో కొలుపులకు పోవడం మానుకు న్నాడు.

అయితే సుందరి ఈ విషయంలో భర్త అభీష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించలేదు. ఏదో వ్యాపారపనులొత్తిడి వలన భర్త రాలేకపోతున్నాడని ఆమె భావించినది.

# 19

అగ్రహారంలో కొలుపులు పెద్దఎత్తున రామభ ద్రయ్య ముఠావారు చేయడం ప్రారంభించారు. అసలంతకు ముందే రామయ్య, వెంకట్రామశాస్త్రి ముఠాలవారు కొలు పులు చేయాలని శేఖరయ్యకు తెలియకుండా తీర్మానించు కున్నారు కాని వారికి రెండుసార్లు కొలుపులు చేయబో యినా అపశకునాలు కలగటంవలన వారు కొలుపులు తాత్కాలికంగా ఆపుచేశారు. అయితే కొలుపుల్లో రామ భద్రయ్య ముఠాలో తాము కలవాలా వద్దా? అనే విషయం వారికి సందేహంగానే ఉండిపోయింది మొదట్లో శేఖ రయ్య తమ్ముడు రామభద్రయ్య కొలుపులు చేస్తుంటే తాము అందులో పాల్గొనాలని చెప్పాడు. కాని రామయ్య శేఖరయ్య మాటను గట్టిగా వ్యతిరేకించడం వలన శేఖ రయ్య తన అభిప్రాయాన్ని ఆచరణలో పెట్టలేకపోయాడు.

తన అన్న ముఠావారు కొలుపులు చేయాలని సంకల్పించుకొనినప్పుడు వారికి అపశకునాలకు కారణం అమ్మవారికి వారు కొలుపులుచేయడం యిష్టంలేకనే అలా

అపశకునాలను సృష్టించిందని రామభద్రయ్య తన పార్టీ వారికి చెప్పాడు గ్రామదేవత ఎప్పుడూ అన్యాయాన్ని అధర్మాన్ని సహించదని ప్రతికక్షుల రెండు ముఠాలవారు కలిసి ఒంటరిగావున్న తనముఠాకు హానిచేయాలనే సంకల్పం వారికి వుండుటవలననే వారినలా అమ్మవారు చేసిందని చెప్పాడు.

రామభద్రయ్య తనమాటలకు తనముఠావారు పూర్తి సంతృప్తులవుతారని ఊహించినట్లుగనే జరిగింది రామభద్రయ్య నోటినుండి ఈ పై మాటలు రాగానే అనుచరులు గ్రామమంతా ప్రచారం చేశారు. ఆ సాయంత్రం ఈవిషయం గురించి రచ్చబండవద్ద కొంత ఘర్షణతోగాని తాత్కాలికంగా ఈ దుమారం ఆగలేదు.

అయితే రామయ్య యిలా జరుగుతుందని ముందు ఊహించలేకపోయాడు. ఊహించివుంటే కొలువుల విషయం మరొకవిధంగా వుండేదేమోకాని అలా జరగలేదు. రామభద్రయ్య అతని ముఠావారి ప్రచారం తీవ్రరూపం దాల్చింది. వారి ప్రచారాన్ని అదుపులో వుంచడానికి ఖండించడానికి రామయ్య, వెంకట్రామశాస్త్రిలకు ఏ విధంగానైనా సంతృప్తికలిగించే సమాధానం దొరకలేదు. అవతలివారు మనస్సులో రామభద్రయ్య ముఠావారి ప్రచారాన్ని ఖండించాలనివున్నా పైకి ఏమీ మాట్లాడలేక పోయారు. అనుకున్నప్రకారం రామభద్రయ్య భాద్రపద శుద్ధపంచమి గురువారము కొలువులు ప్రారంభించి నాలుగు రోజులు అవిఘ్నంగా పూర్తిచేశారు. మొత్తం అమ్మవారి కొలు

పులు పదకొండురోజులు జరపడానికి నిశ్చయం చేసుకుని, ఉజ్జాయింపుగా ఖర్చులపట్టిక తయారుచేసి చందా వసూలు చేశాడు రామభద్రయ్య.

ఈ విషయంలో రామభద్రయ్య నరహరిశెట్టితో సంప్రదించకుండానే ఆయనను తన ముఠాలోవాని క్రిందనే లెక్కవేసి నూటపదహార్లు వేశాడు ఆ మొత్తం నరహరిశెట్టికి మనస్సులో యివ్వాలని లేకపోయినా, రామభద్రయ్యను ఎదిరించే శక్తిలేక అడిగిన మొత్తం సమర్పించుకున్నాడు. ఇలా రామభద్రయ్య యుక్తితో, కొలుపులు పదకొండు రోజుల ఖర్చు పూర్తిగా వసూలు చేశాడు.

అయితే నరహరిశెట్టి అంతమాత్రంచేత వూరుకోలేదు. రామభద్రయ్య విషయం, శేఖరయ్యకు వెళ్ళి మొర పెట్టుకున్నాడు. ఆ సమయంలో రామయ్యకూడా అక్కడే వున్నాడు.

నరహరిశెట్టి తనకు జరిగిన అన్యాయాన్ని గురించి శేఖరయ్యకు చెప్పేటప్పుడు రామయ్యకు మనస్సులో భద్రయ్యమీద ద్వేషం కుతకుతలాడింది. ఎలాగైనా రామభద్రయ్య పొగరు అణచాలని మనస్సులో అనుకున్నాడు.

అయితే కొలుపులు ప్రారంభించగానే ఆ సాయంత్రం జరుగు జంతువుల బలికి పెద్దలుగా ఎవరిని నిర్ణయించాలని అందరూ ఆలోచించారు. రామభద్రయ్యముఠాలోని అధిక సంఖ్యాకులు శేఖరయ్యను పిలవటమే బాగుంటుందని వారి వారి అభిప్రాయాలను వెలిబుచ్చారు. రామభద్రయ్య గూడా

అదే మంచిదనుకున్నాడు మరొకప్పుడు ఎలావుండేదో
ఈ విషయంలో రామభద్రయ్య తన ముతావారి నెది
లని వుద్దేశ్యం లేకపోయింది. దానికి కారణం రామయే
కున్నాడు: రామభద్రయ్య తమ ముతావారూహించి
శేఖరయ్యను పెద్దచేస్తే వెంకట్రామశాస్త్రి సంగతి
ఉన్నా ముందు రామయ్యనుమటుకు చిత్తుచేసినట్లవు
ఊహించాడు.

తానిలా నిర్ణయానికివచ్చి తన ఆలోచనను
ణలోపెట్టి తమ ముటావారి అభీష్టం ప్రకారం చే
మరొకవైపు అంతర్గతంగా రామయ్యను దెబ్బదీ
ఉద్దేశ్యంతో రామభద్రయ్య శేఖరయ్యను
చాడు.

కొలుపులకు పెద్దగా తమ్ముడు తనను పిలిపిం
తెలుసుకున్నప్పుడు శేఖరయ్య ఎంతో ఆనందిం
తమ్ముడు తనకు వ్యతిరేకంగా ఎన్నిపనులు చేసి
సాంప్రదాయానుసారం పెద్దగా తనను పిలిచినందుకు
రయ్య ఎంతో సంతోషించాడు. ఈవిధంగానైనా తవ
పర్పడే వైషమ్యాలు సమసిపోతవని ఆయన తలపోశా

శేఖరయ్య విషయం రామయ్యద్వారా విని
ట్రామశాస్త్రి ఆశ్చర్యపోయాడు ప్రత్యర్థులు తమ ప
వారిని పెద్దగా ఎన్నుకున్నందుకు సంతోషించక
ఎందుకు మాట్లాడుతున్నాడో అర్థంకాలేదు వెంక
శాస్త్రికి. ఆ విషయమే రామయ్య నడిగాడు.

"రామయ్యా కొలుపుల విషయం ఏమంటావు

"మనం కొలుపులలో పాల్గొనగూడదని ముందు అనుకున్నాంగదా? అలాగే ఆమాటమీదే వుందాం" అన్నాడు రామయ్య.

"మనం యిలా జరుగుతుందని ముందనుకోలేదుగా" శాస్త్రి ప్రశ్నించాడు.

"అనుకోనప్పటికి మనం వాండ్ల ముఠాలో కలవగూడదు."

"అన్నగారేమన్నారు?"

"కొలుపులకు వస్తానని మాటిచ్చారు."

"వాగ్దానంగూడా చేశారా?"

"ఆ"

"అయితే యిప్పుడు మనం ఏం చేయగలం?

"అలాగైనా సరే? శేఖరయ్యగారిని కొలుపులకు పోకుండా చెయ్యాలి!"

"అదెలా సాధ్యం?"

"మీరు తలుచుకొంటే సాధ్యం కానిదేముంది"

"అవుననుకో, అన్నగారు ముందు మాటయిచ్చారుగా."

"అందుకే నేనువచ్చి చెప్పడం."

వెంకట్రామశాస్త్రి, మాట్లాడలేదు. రెండు నిమిషాలు మౌనంగా ఆలోచించాడు. చివరికిలా అన్నాడు.

"అన్నగారు మాటతప్పరు రామయ్యా. ఆయన విషయం నీకు తెలుసుగా?"

"ఎలాగైనా మీరు చెప్పి ఒప్పించాలి! లేకపోతే మనం గ్రామంలో ఉండలేము. వారికి మనం మరీ చులకనై పోతాము. ఇక వారిని పట్టపగ్గాలు చాలవు. అందుకే నేను మొదటినుండి చెపుతున్నాను. మీరు వింటేగా."

రామయ్య ఉద్రేకంతో చెప్పిన మాటలు శాస్త్రి ఆలకించక పోలేదు "అన్నగారేమంటారో," అని మాత్రం అన్నాడు.

"ఏమంటారు ఆయనకు చెప్పేవిధంగా చేప్పితే తప్ప కుండా వింటాడు."

"ఏమైనా ఆయన ఆడినమాట తప్పరు."

"అన్నీ మీరే చెప్పుచున్నారు" రామయ్య కోపంతో లేచాడు. "సరే, నామీద నీకెందుకంతకోపం కాసేపు ఆగి వెళ్ళి అలాగే చెప్పిచూస్తాను."

"అలావీల్లేదు. యిప్పుడేవెళ్ళి చెప్పి ఒప్పించి రావాలి." అని మొండిపట్టుపట్టి కూర్చున్నాడు రామయ్య. శాస్త్రికిక వెళ్ళక తప్పలేదు. రామయ్యను వెంటబెట్టుకొని అన్నగారింటికి వెళ్ళాడు.

అప్పుడు సాయంత్రమైంది. సూర్యుడు పశ్చిమాద్రికి వచ్చాడు, ఊరి పశువులు పగల్లా బీళ్లకు మేతకువెళ్ళి సాయంత్రం కావడంవలన యింటికి తిరిగివస్తున్నవి. పశువులకు కుడితి పనిపాటలకు నీటికోసం పురుషులు కావిళ్లు బుజానపెట్టుకుని ఊరి మొగట్లోవున్న శాస్త్రిగారి బావిదగ్గరకు వస్తున్నారు. కొందరు స్త్రీలు, మట్టిబుంగలను, ఇత్తడి బిందెలను, బుజాన పెట్టుకుని వయ్యారముగా నడుస్తున్నారు.

పశువుల కాపరులు పగలల్లా చేలవెంట తిరిగి చెఱువులో ఈతలుకొట్టి తడిగుడ్డలు బుజానవేసుకుని పొడిగుడ్డలు గోచీలు పెట్టుకుని పశువులను తోలుకుంటూ వెనకాల వస్తున్నారు మరికొందరు. అల్లరిపిల్లలు బలసివున్న చిన్న గేదెలను ఎక్కి వస్తున్నారు. ఊరిమొదట్లో అడుగు బెట్టగనే ముందు బ్రాహ్మణయిండ్లూ, ఆ తరువాత వ్యవసాయదారుల యిండ్లు వున్నవి.

ఆ సమయంలో రామయ్యను వెంటబెట్టుకొని శాస్త్రి అన్నగారింటికి వచ్చాడు. శేఖరయ్య శుభ్రముగాచిమ్మి నీండ్లుచల్లిన వీధి అరుగుమీద రాగిపంచపాత్ర, రాగి ఉద్ధరిణ్ణే, లోహాంతో తయారుచేసిన పళ్ళెము ముందు పెట్టుకొని సాయంసంధ్య చేసుకొంటూన్నాడు. వెంకట్రామశాస్త్రి వచ్చి అన్నగారి కభిముఖముగా కూర్చున్నాడు. రామయ్య అరుగుముందువున్న నల్లని కొండరాయిమీద చతికిలపడ్డాడు.

అప్పటికి మూడు మాసాలనుండి ఆ గ్రామంలో వర్షాలు పడనందున, నిత్యావసరాలకు, గ్రామంలో నీటి కరువే కాకుండా కోతకువచ్చిన పంటలు ఎండిపోయినవి. అందుచే అగ్రహారం ప్రజలంతా కలసి ముందు కొలుపులు చేయాలనుకొన్నారు. కాని ఆదిలోనే అభిప్రాయాలలో భేదాలువచ్చి అన్నదమ్ములు శత్రువులైనారు, తిరిగిప్పుడు రామభద్రయ్య కొలుపులు ప్రారంభించడంతో కథ ఇలా వచ్చింది.

వర్షాలు లేకపోవడంవలన ఒక అగ్రహారం పొలాలకే గాక, ఆ చుట్టుపక్కల ప్రాంతంఅంతా ఆ సంవత్సరం అనావృష్టికి లోనుకావలసి వచ్చింది. కేవలం వర్షాలమీద ఆధారపడిన ఆ ప్రాంతం ఆ వర్షమే లేకపోతే ఎలాంటి దారుణ పరిస్థితులకు లోనుకావలసి వుంటుందో, వూహించ డంకష్టం. ఇప్పుడదే ఆ ప్రాంతంలో సంభవించడంవలన ధాత కరువులాంటి కరువు మరొకటి వస్తుందేమోనని ఆ ప్రాంతం ప్రజలు భయపడ్డారు. అందుకనే ముందుగా అగ్ర హారం లో అమ్మవారికి కొలుపులు ప్రారంభించారు.

అయితేనేం అప్పటికే కొందరు దుండగీండ్రు పని పాటలు లేని కొందరు సోమరిపోతులను వెంటేసుకొని ఆ ప్రాంతంలో దోపిడీలు చేయనారంభించారు. మొదట్లో వీరి దోపిడీలు ఎవ్వరూ లెక్కచేయలేదు. మామూలుగా జరి గేవేనని వూరుకొన్నారు. అందుకని ప్రత్యేకంగా ఆ దోపి డీలు చేసేవారినిగాని ఆ దోపిడీలకు గురైన మనుష్యులను గాని నిర్లక్ష్యముగా చూచారు అయితే దోపిడీ దొంగలు, మొదట్లో దీనిని కాలక్షేపంగా తీసికొన్నా, ఆశించినదాని కంటే ఎక్కువగాధనం,వస్తువులుదొరకడంవలన వారిలో ప్రధా నంగా యిదేవృత్తిలో జీవించడం బాగుంటుందని, నాయకుడిగా అందులో ఒకరిని ఎన్నుకొన్నారు, అప్పటి నుండి ఆ నాయకుడిమాట ప్రకారం వారొక ముఠాగా ఏర్పడి గ్రామాలువదలి కొండలలో నివాసం ఏర్పరచుకొని

దోపిడీలు చేయనారంభించారు. ఆ ముఠాకు నాయకుడు హుస్సేన్‌సాహెబ్.

ఆరోజుల్లో హుస్సేన్‌సాహెబ్ పేరువిననివారు ఆ ప్రాంతంలో లేరు. ప్రజలాతనిని యమధర్మరాజు క్రింద జమ కట్టారు. ఆతనిదోపిడీలు, లూటీలు, చాలా చిత్రవిచిత్రంగా వుండేవి. అతనంటే ప్రజలకు హడల్. చిన్నపిల్లలు పాలు త్రాగరు. ఆనాటి ప్రజలంతా, అరచేతిలో ప్రాణాలు పెట్టుకుని, కాలం గడిపారు. హుస్సేన్‌సాహెబ్ ముఠా మొత్తం నలభై మందికంటే ఎక్కువ లేరు. అయితేనేం రెండువందల తెల్ల పటాలాన్ని మూడుసార్లు నీళ్ళు త్రాగించారు.

హుస్సేన్‌సాహెబ్ చరిత్రవింటే చాలా విచిత్రగా వుంటుంది, మొదట్లో ఆతను కావాలని దుండగీడుగా, దోపిడీముఠా నాయకుడిగా కాలేదు. పరిస్థితుల ప్రాబల్యం వలన ఆతనలా అయినాడు. మతకలహాలలో ఆతను చిక్కుకుని, అందుకు తమకన్యాయంచేసిన పగవారిని హతమార్చి ఆ రక్తంతో సైదుల దేవతని సంతృప్తిపరుస్తాననీ ప్రతిజ్ఞ చేశాడు. ఆ పట్టుదలతో, నీతి, నిజాయితీ, ధర్మం కలిగిన కుటుంబంలో పుట్టిన హుస్సేన్ సాహెబు దుండగీడుగా దోపిడి ముఠానాయకుడుగా తయారయ్యాడు. అప్పుడప్పుడు ఆతనికా సంఘటన గుర్తుకువచ్చి బాధపడేవాడు. ఆతనికేకాదు. ఆతని చరిత్ర తలుచుకుంటే మనకుకూడా హృదయం బాధతో నిండి ఒక్క కన్నీటిచుక్కనైనా రాల్చకుండా వుండలేము.

హుస్సేన్ సాహెబ్ ఎంతటి దుర్మార్గుడు కఠినుడో అంతటి సున్నిత మనస్సు జాలిగలవాడు. అసహాయులను, స్త్రీలను, పిల్లలను ఏమీ అనేవాడుకాదు. వారు తనకు చిక్కినపుడు వారిని జాగ్రత్తగా కాపాడి పంపేవాడు. చేచిక్కిన శత్రువైనా శరణువేడితే వదలిపెట్టేవాడు. ఎప్పుడూ కఠినంగా ప్రవర్తించేవాడుకాదు శత్రువులుగూడా అతని నుంచి గుణాలను చెప్పుకునేవారు.

కాని కొద్దిమంది దృష్టిలోతప్ప, మిగిలిన ప్రజలదృష్టిలో అతను పెద్దబందిపోటుదొంగ. అంతేకాదు అతను పెద్ద వ్యభిచారి. చేచిక్కిన స్త్రీలని చెఱచనిదే వదలడని, ఆతని మీద అభూత కల్పనలు ప్రచారంలో వున్నవి. అయినప్పటికి ఆతని మనస్తత్వం తెలుసుకున్నవారు ఆతనిని గురించి యిలా విన్నప్పుడు అవి ఖండించకుండా వుండలేరు, అయితేనేం ఆతని గురించి చరిత్ర ఆ విధంగానే ప్రచారంలో వుండిపోయింది.

సంధ్యావందనం ముగిసిన తరువాత సంగతేమిటని శేఖరయ్య వెంకట్రామశాస్త్రిని ప్రశ్నించాడు. వెంకట్రామశాస్త్రి కొలువుల విషయంలో తన అభిప్రాయం రామయ్య అభిప్రాయం ఒకటేనని అలాచేస్తే బాగుంటుందని చెప్పాడు. శేఖరయ్య తమ్ముడి మాటలువిని ముందు కొంత ఆశ్చర్యపడ్డాడు వీటన్నిటికి కారణం రామయ్యేనని ఆయన మనస్సులో ఊహించాడు. తమ్ముడికి సమాధానం చెప్పడంకోసమని కొంతసేపు ఆగాడు.

"మీరు ఆలోచించండి అన్నయ్యా. యింతవరకు

మనమీద కత్తికట్టి అన్యాయంగా మనలను కోర్టుకీడ్చిన వాళ్లు ఈనాడు మిమ్మల్ని పెద్దగా ఎన్నుకున్నారంటే ఇందులో ఏదో కుతంత్రం వుండే యిలా చేస్తున్నారని నాకనిపిస్తున్నది." వెంకట్రామశాస్త్రీ యిలా చెప్పడం రామయ్యగారి కొప్పచ్చిని కలిగించింది. కాని శేఖరయ్యలో మాత్రం తమ్ముని మాటలకు పెద్ద మార్పేమీ కనబడలేదు.

"ఇందులో కుతంత్రానికి స్థానం యేముంది?" అని ఆయన తన అనుమానాన్ని వెలిబుచ్చారు.

"కుతంత్రంకాక మరేమిటి శేఖరయ్యగారూ వాళ్ళు యింతవరకు మనమీద పగసాధించి యిప్పుడు మిమ్మల్ని పిలిచారంటే ఏమిటి అర్థం."

"అవునన్నయ్యా. నా అభిప్రాయంకూడా అదే!"

"అయితే నన్నేమిచేయమంటారు" శేఖరయ్యకా సమయంలో యింతకంటే మంచిసమాధానం యేమీ దొరకలేదు.

"మీరు కొలువులకు పోవడం మానేయండి. అదే చాలు."

"నేను లేకపోతే కొలువులు ఆగిపోతాయా అయినా యిది దేవుని కార్యం. ఎవరిలో ఎన్ని కల్మషాలున్నా అందరూ పాల్గొనవలసిందేగా!"

"అయినా మరొకసారి ఆలోచించండి అన్నయ్యా. నిష్కారణంగా మనమీద పట్టణంలో కేసుబనాయించి ఎంతధనాన్ని నష్టపరిచాడో మీకు తెలియనిది కాదుగా! అయినా రామభద్రయ్య మనస్తత్వం మీకు తెలియక

-పోలేదు. ఆతడి ప్రవర్తన మొదటినుంచి అంతే! మనం ఎవరి భాగాలు వారు పంచుకుని వేరుపడ్డాక మనతో యెప్పుడైనా సఖ్యతగా ఉన్నాడా? పైగా అన్యాయంగా మనలను రాచి రంపాన పెడుతున్నాడు. అందుకే యిందులో మోసం వున్న దనిపిస్తోంది ”

శేఖరయ్య తమ్ముడి మాటలకు యెటూ నిర్ణయించుకో లేకపోయాడు కొలువులకు తప్పకుండా వస్తానని మాటయిచ్చి యిప్పుడు రానంటే తనమీద యింతవరకు గ్రామ ప్రజల కున్న గౌరవాభిమానాలు పోవడమే కాకుండా తనను మిగతా వారితోపాటు జమకడతారు. గ్రామానికి పెద్ద అంటూ యెవరూ లేకపోతే ఎంత నష్టమో అగ్రహార ప్రజలకు అను భవపూర్వకమే. ఇప్పుడు తనుకాదంటే గ్రామప్రజల దృష్టి చాలా హీనంగా వుంటుంది. కొలువులకు వెడితే అప్పులకు దూరంకావలసి వుంటుంది. అడకత్తెరలో పోకచెక్కలా వున్నది శేఖరయ్య స్థితి.

1920 వ సంవత్సరం మహాత్ముడు ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమం దేశమంతా వ్యాపించినది. స్వరాజ్య నినాదాలతో దేశమంతా మారుమోగుతున్న రోజు లవి. మరొకవైపు మాంటేగ్ ఛెమ్స్ఫర్డు సంస్కరణలు అమలు తెచ్చినారు బ్రిటిష్‌వారు. వారికి వ్యతిరేకంగా భారత నాయకులు శాసనసభలలో బైట స్వరాజ్యంకోసం బ్రిటిష్ వారిమీద తీవ్రమైన ఒత్తిడి తెచ్చారు.

ఆసమయంలో ఆంధ్రదేశం యావత్ భారతదేశానికి త్రోవచూపింది.

అంతవరకు అధ్యాపకుడుగానున్న శ్రీ॥ శే॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు తమపదవికి రాజీనామాయిచ్చి రాజకీయ జీవితంలో అడుగుపెట్టి శాసనసభ సభ్యత్వం సంపాదించి బ్రిటిష్‌వారికి కొరకరానికొయ్యగా తయారయినాడు. శాసన సభలో ప్రభుత్వ పక్షాన్ని దుయ్యబట్టని రోజులేదు ఈయన వాగ్ధాటికి ప్రభుత్వంవారు కూడా సెబాసనకుండా వుండలేక పోయారు.

అలా ఒకవైపు రెడ్డిగారు రెండవవైపు కొండా వెంక టప్పయ్యగారు, గాంధీజీ ఆదేశాలను అనుసరించి శాసనసభకు రాజీనామాయిచ్చి స్వరాజ్య శంఖారావమును పూరించి దేశం నలుమూలలా వ్యాపించునట్లు చేసినారు ఇదే సమ యంలో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఆ తరువాత శ్రీ పులుపుర వెంకటశివయ్యగారు గుంటూరుసీమలో స్వరాజ్య సిద్ధాంతాలను ఎంతో ప్రచారం చేసినారు.

ఆనాడు గాంధీజీ భారతప్రజల కిచ్చినపిలుపుకు దేశం నలుమూలలనుండి అసంఖ్యాకంగా ధనవంతులు, లాయర్లు, పెద్దలు, చిన్నలు స్వాతంత్ర్యరణరంగంలో దూకారు. అంతే కాక ఆయన 1920 సంవత్సరం ఆంధ్రదేశం వచ్చినప్పుడు దేశంనలుమూలలా ప్రత్యక్షంగా చూచి తన సందేశాన్ని అందించాడు. ఆనాడు స్వయంగా ఆయనను చూచి ఆయన ఉపన్యాసం వినిన అనేకమంది స్వాతంత్రరంగంలోకి దుమి కారు. అందులో ప్రముఖులు కీర్తిశేషులయిన టంగుటూరి ప్రకాశంపంతులుగారు, అయ్యదేవర కాళేశ్వరరావుగారు.

ఆనాడు చెన్నపట్టణంలో ప్రకాశం పంతులుగారు పేరుమోసిన లాయరు. అప్పటికే ఆయన లక్షల రూపాయలు సంపాదించాడు ఆ రోజులలో ఆయన నెలసరి ఆదాయం వేలమీద వుండేది. అంతటి లాయరుగూడా మహాత్ముని ఆదేశప్రకారం తన పదవి ఆదాయం, గౌరవం, అభిమానం వదలుకొని స్వాతంత్ర్యోద్యమంలో చేరి అనతికాలంలోనే ఆంధ్ర రాజకీయాలలో ప్రముఖపాత్ర వహించాడు. ఇలాంటివారు నాడు అనేకమంది వున్నారు. అదే మహాత్ముని లోని గొప్పదనం. అందుకే కాబోలు ఒక సుప్రసిద్ధ తెలుగు కవి "కొల్లాయిగట్టితే నేమి మా గాంధి మాలడై తిరిగితే నేమి!" అని మహాత్ముని స్తుతించాడు.

ఈ విధంగా రాజకీయాలలో ఆంధ్రదేశం ముందు అడుగు వేయడానికి ఇతర రాష్ట్ర ప్రజలతోపాటు సాహితీ సంస్కృతిక రంగాలలో సమానంగా వుండడానికి తెలుగు ప్రజలు ఇంతటి చైతన్యానికి కారకులలో ముఖ్యులు కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు వారే ఆంధ్ర దేశంలో జన్మించివుండక, ఆంధ్రపత్రిక స్థాపించి వుండక పోతే బహుశ ఆంధ్రదేశ చరిత్ర మరొక విధంగా వుండేది. తమ పత్రిక ద్వారా స్వాతంత్ర్యాన్ని గురించి, జాతీయ నాయకుల వ్యాసాలు, ఉపన్యాసాలు ప్రచురించి వుండక పోతే తెలుగు ప్రజలింత చైతన్యవంతులు కాలేరు. అంతే కాదు. పంతులుగారు పత్రికద్వారా స్వాతంత్ర్యాన్ని గురించి ప్రచారమేకాక ఇతర నాయకులతోపాటు బ్రిటీషు

ప్రభుత్వానికి వ్యతిరేకంగా అనేక వుద్యమాలు లేవదీసి శాంతి యుతంగా సత్యాగ్రహంచేసి జైలుకు వెళ్ళారు. ఆయన చేసిన సేవ ఆంధ్రదేశ చరిత్రలో ఒక సువర్ణఘట్టం.

ఇటు రాజకీయ రంగంలోనేగాక తమ ప్రతికద్వారా అనేకమంది తెలుగు కవులకు ఆర్థికంగా సహాయం చేశాడు. బీదప్రజలకు ఆయన చేసిన సహాయం మరువరానిది. ఆయన త్యాగబుద్ధికి, దానధర్మాలకు గాంధీమహాత్ముడు ఆశ్చర్య పోయి 'విశ్వదాత' అని పిలిచారు.

ఇలా ఆంధ్రదేశ చరిత్రలో అనేక ఉజ్వల ఘట్టాలు జరిగిపోయినవి. ఆంధ్రపత్రికద్వారా దేశవిషయాలు యెప్పటి కప్పుడు మారుమూల గ్రామాలవారికి అందుతున్నాయి. ఈ విధంగా యావత్ భారతదేశం స్వాతంత్ర్యోద్యమంతో వున్నది. వేరొకవైపు హుస్సేన్ సాహెబులాంటి దోపిడి ముఠాలను అణచలేక పోవడంవలన మారుమూల ప్రజలకు కూడా బ్రిటిషు ప్రభుత్వంమీద భక్తి పోయింది. విదేశ పాలన మాకువద్దని బహిరంగంగా అనేక ప్రదేశాలలో అనేకమంది చాటారు. ఈ పరిస్థితులను అణచలేక పోతున్నా మని ఒకవైపు తమ బలహీనతకు చింత, వేరొకవైపు కోపంతో నిర్ణయరహితంగా ఆజ్ఞలు జారీచేస్తుంది ప్రభుత్వం.

## 23

రాత్రిజాము ప్రొద్దుపోయినది. చంద్రుడు చల్లని మల్లెపూవులాంటి వెన్నెలను లోకానికి ప్రసాదిస్తున్నాడు

గ్రామం నిద్దురతో మాటుమణిగింది. కాని శేఖరయ్యకు నిద్దుర రావడంలేదు. ఆ సాయంత్రం జరిగిన సంఘటనకే ఆయన మనశ్శాంతి కోల్పోయాడు. ఒకటి రెండుమార్లు మంచంమీద అటు యిటు పొర్లి పడుకున్నాడు. పంట పొలాలమీద చల్లని మారుతం యెంతో హాయినిస్తున్నది. అయినా శేఖరయ్యకు నిద్రరాలేదు.

ఆవిధంగా చాలారాత్రి గడిచింది. ఆయన అలాగే ఆలోచిస్తున్నాడు. కొలుపులలో తను పాల్గొంటే వచ్చే నష్టమేమిటో బోధపడలేదు. దేవుని పెండ్లికి అందరూ పెద్దలే. విడిసమయాలలో ఎవరిపద్ద ఎన్ని కల్మషాలు, ద్వేషాలున్నా అవన్నీ విస్మరించి దేవుని కార్యం శుభకరంగా జరుపవలసిన బాధ్యత గ్రామ ప్రజలపైన వున్నది. అలాంటప్పుడు ఒకే గ్రామవాసులయిన వారికి విరోధాలెందుకో! అనుకున్నాడు శేఖరయ్య.

ఇంతలో తూర్పువీధిలో కుక్కలు ఒకవారి 'భౌంయ్' మని అరవడం ప్రారంభించినవి. విశేషమేమిటో వుందని శేఖరయ్య వీధిలోకి వచ్చాడు. కాని యెక్కడా అలికిడి లేకపోవడంవల్ల తిరిగి లోపలికి వచ్చి పడుకున్నాడు. అయితే యీసారి ఆయనకు కొత్త సమస్య వచ్చిపడింది. తూర్పు వీధిలో కుక్కలు అన్నీ ఒక్కమారే యెందుకు మొరిగినవా అని ఆయనకు సందేహం కలిగింది. కాని కారణ మేమిటో నిర్నిబద్దంగా తెలియనప్పుడు తానేమి ఆలోచించ గలడు?

తూర్పువీధిలో వున్నవన్నీ గొల్లవారి యిండ్లే పగలల్లా వారు గొఱ్ఱెలను అడవికి తోలుకువెళ్ళి మేపుకుని బాగా చీకటిపడినతరువాత యింటికి వచ్చేవారు. వాటితోనే తూర్పువీధిని వున్న గొల్లకుటుంబాలు జీవనయాత్ర చేస్తున్నవి.

ఇలా అనుకుంటూ శేఖరయ్య మంచంమీద మేను వాల్చాడు. ఇంతలోతూర్పువీధిలో ఒక్కసారిసముద్రపు అలలు చెలియలికట్టను త్రెంచుకునివచ్చినట్టుగా మధ్యమధ్య 'పట్టుకో' 'పోనీయకు' అని అరుపులతో గ్రామమంతా మేల్కొంచింది. అర్ధరాత్రి యేమిటీ అల్లరని కొందరు విసుగుచెందారు. కొందరు తూర్పువీధివంక పరిగెత్తారు. మిగిలినవారు యింటిలోనే భయంతో తలుపులు బిగించుకుని కూర్చున్నారు. శేఖరయ్య అరుపులు వినగానే పరుగుతీశాడు.

కానీ కారణంమాత్రం యిదై వుంటుందని యెవరూ చెప్పలేదు. తూర్పువీధి అంతా హడావుడిగా వుంది. ఆయనతోపాటు వెళ్ళిన అనేకమందికి వారి హడావుడి చూచి ముందు ఆశ్చర్యం కలిగించినది కాని కారణం యేమిటో యెవరూ చెప్పకపోవడంవల్ల శేఖరయ్య విషయమేమిటని అడిగాడు. అప్పుడా గొల్లవారిలో ఒకడు యిలా చెప్పాడు.

కుక్కలు మొరిగిన కొద్దిసేపటికి యెవరో ఒకడు వచ్చి రెండు గొఱ్ఱెపిల్లలను తీసుకుపోయాడని, తనకు మెళుకువ వచ్చి చూచేటప్పటికి వాడు పారిపోయాడని చెప్పాడు. ఆవ్యక్తి యెవరో, యెలావుంటాడో యెవరికీ తెలియదు. అయితే ఆ గ్రామంలో యీవార్త పెద్ద సంచలనం కలి

గించింది. హుసేన్‌సాహెబ్ ముఠాలోనివాడే యీపని చేసుంటారని అన్నాడు వయసుమళ్లిన ఒకవృద్ధుడు దానితో గ్రామమంతా యీవార్త వ్యాపించింది. తెల్లప్రభుత్వాన్ని యెదిరించిన హుసేన్‌సాహెబ్ ముఠావారే తమగ్రామంలో అడుగు పెట్టారని విని కొందరుభయంతో యేడుపులు మొదలెట్టారు. పదిమందికూడి ఈ విషయాన్ని గురించి చర్చలు జరిపారు. కాని ఆ రాత్రి యింకేమీ జరగలేదు. తిరిగి రెండు ఘడియల కాలంలో గ్రామమంతా నిశ్శబ్దంతో నిద్రలో మూటుముణిగింది.

శేఖరయ్య యింటికి వచ్చాడు. ఆకాశంలో నక్షత్రాల కాంతి తగ్గిపోతున్నది. రెండుఝాముల పొద్దు పోయిందనుకున్నాడు ఆయనకు ఆ రాత్రి నిద్రపోదామని లేదు. అందుకు భగవద్గీత తీసుకుని చదపడం ప్రారంభించాడు. శేఖరయ్య అన్ని శాస్త్రాలు, కావ్యాలు, గ్రంథాలు చదివినవాడే అయినప్పటికి అప్పుడప్పుడు మనస్సు వికలత్వం చెందినప్పుడు తిరిగి వాటినే చదవడం ఆయనకొక అలవాటు. అలాగే ఈరోజు ఆయన ఆముదం దీపంముందు కూర్చుని రాగయుక్తంగా గీతాశ్లోకాలు చదవడం ప్రారంభించాడు.

కొంతసేపు చదివి శేఖరయ్య ఒక్కక్షణం స్తబ్దుడై కూర్చున్నాడు. 'నేను, నాది' అనే అహంభావంతో మానవుడెలా పతనమౌతాడో శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశించాడు. శేఖరయ్య యీ ఘట్టం చదివాక తానెలా పతనమవుతున్నదీ ఆలోచించాడు.

ఆ గ్రహారంలో అసలు కొలుపులు యెందుకు చేస్తా లనుకుంటున్నారో ఆ గ్రామ ప్రజలందరికీ తెలుసు. అప్పటికి మూడుమాసాలనుండి వర్షాలు లేకపోవడంవలన గ్రామంలో కొలుపులు చేస్తున్నారు. గ్రామంలో పార్టీలున్నా వర్షం అందరికీ కావలసినదే. పార్టీల ప్రకారం వర్షంరాదు. మరి అలాంటప్పుడు దేవుని కార్యంలో పార్టీ భేదాలు విస్మరించరెందుకో, ఆయనకెంత ఆలోచించినా ఊహాకందలేదు.

ఈ ప్రకారం ఆలోచించుకుని శేఖరయ్య చివరకు కొలుపులలో తను పాల్గొనటానికి నిర్ణయించుకున్నాడు. దీని వలన తన తమ్ముడికి రామయ్యకు తనమీద కోపంరావచ్చు. వారినెలాగో వొప్పించవచ్చునని, దేవుని కార్యం ఏ ఆటంకం లేకుండా కొనసాగాలని ఆయన మనస్సులో గ్రామ దేవత పోలేరమ్మను ప్రార్థించాడు. తెల్లవారుజాము కోళ్ళు కూసినవి ఆయన అంగవస్త్రం బుజానవేసుకుని ప్రాతఃకాల సంధ్యకు చెరువుకు వెళ్ళాడు.

శేఖరయ్య చెరువుదగ్గర కాలకృత్యాలు తీర్చుకుని స్నానంచేసి చెరువుగట్టునే సంధ్యావందనాదికాలు ముగించుకుని ఘడియ పొద్దెక్కినతరువాత యింటికి వచ్చాడు. అప్పటికే అమ్మవారి గుడిదగ్గర అగ్రహారం ప్రజలంతా పోగయ్యారు, శేఖరయ్య పార్టీలోనివారు, రామయ్య పార్టీలోని వారు చాలామంది స్త్రీలు, పురుషులు కొలుపులెలా ప్రారంభిస్తారో, జంతువుల బలియెలా జరుగుతుందో చూడాలని వచ్చారు. ఈరెండు పార్టీలలోని పురుషులలో పెద్దలు

మటుకు యింకా హాజరుకాలేదు. శేఖరయ్య నిర్ణయం ప్రకారం వారు ఆయన్ను అనుసరించాలనుకున్నారు.

తెల్లవారినప్పటినుంచి రామయ్య అవమానంతో ముఖం చూపలేకపోయాడు. జరుగుతున్న ఒక్కొక్క క్షణం అతనికొక సమ్మెటపోటులా వుంది. తాము యింత బలగం వుండికూడా రామభద్రయ్య పార్టీ వారికంటే ముందు తాము కొలుపులు చేసి మాట దక్కించుకోలేక పోయామే నని అతని ముఖం అవమానంతో మ్లానితమైంది. తన స్నేహితులయిన సాటివారిముందు యిక ముందు తానెలా తలెత్తుకు తిరగగలనని ఆతనికి బాధగావున్నది. అందుకే తెల్లవారి నప్పటినుండి అతను తనముఖం ఎవరికీ చూపలేక పోయినాడు. అసలు యీ నాలుగురోజులు యెక్కడికైనా వెళ్ళిపోవాలనుకున్నాడు. కాని తనకెవ్వరూ ఆ చుట్టు ప్రక్కల గ్రామాలలో బంధువులు లేరు పోతే పట్టణం పోవాలి. అది తనకు క్రొత్తప్రదేశమైనప్పటికి ఎలాగో ఒక రోజు గడపగలడు, కొలుపులు జరిగిన రోజులన్నీ నూతనప్రదేశంలో వుండాలన్నా అది చాలా కష్టమైనపని. అందుకు యెటూపోలేక అగ్రహారంలోనే వున్నాడు.

అయితే రామయ్యకు శేఖరయ్యమీద ఒక నమ్మకం వుంది. ఆయన బాగాఆలోచించనిదే నిర్ణయానికి రాడను కున్నాడు. ఏదో కారణంచెప్పి కొలుపులకు పోకుండా వుంటాడని ఊహించాడు. కాని యిలా జరుగుతుందను కుంటే ఆనాటి సంఘటనలు మరొకవిధంగా రూపొంది వుండేవి.

రామభద్రయ్య స్వయంగావచ్చి శేఖరయ్యను కొలుపులకాహ్వానించాడు. ఇలాజరుగుతుందని శేఖరయ్య వూహించలేకపోయాడు. రామభద్రయ్య శేఖరయ్యయింటి లోనికి సరాసరివచ్చి ఒదినగారిని పలుకరించి అన్నను పిలిచాడు. ఆ పిలవడంలో వెనుకటి అన్నదమ్ముల ప్రేమ వుట్టిపడింది. అసలంతకుముందు వారిమధ్య యేమీజరగనట్లే ప్రవర్తించాడు. అదే శేఖరయ్య ఆశ్చర్యానికి కారణంఅయింది. రామభద్రయ్య అలావస్తాడనిగాని, కొలుపులవద్ద తనతో మాట్లాడతాడనిగాని ఆయన వూహించివుండలేదు. తమ్మునిలో కలిగినమార్పు ఆయనకు ఆతనితో ఆప్యాయంగా మాట్లాడటానికి దోహదం చేసినది

శేఖరయ్య రామభద్రయ్యతో కలిసి ముందుగా వెళ్ళడంచూచి అక్కడి పెద్దలు ఆయన్ను అనుసరించారు. దానితో పార్టీభేదాలు వదిలి గ్రామమంతా కొలుపులవద్ద చేరారు. వెంకటయ్య పొలంపని వుండడంవలన ఆరోజు కొలుపులకు వెళ్ళలేదు. శేఖరయ్య యింటినుండి రాగానే వెంకట్రామశాస్త్రి అన్నగారింటికివెళ్ళి జరిగినసంగతి తెలుసుకుని రామయ్యకు కబురంపాడు. అప్పటివరకు రామయ్యకు ఆనాడు రామభద్రయ్య శేఖరయ్య కలిసివెళ్ళిన విషయం తెలియదు. ఆయన యింటివద్దనే కూర్చుని దీర్ఘంగా ఆలోచనలలో నిమగ్నుడైనాడు,

జరిగినసంగతంతావిని రామయ్య మీ బ్రాహ్మణులకు వీలు, చాలు లేదయ్యా వెంకట్రామశాస్త్రి! అనిమాత్రం

అన్నాడు. ఆతర్వాత అతనేమీ మాట్లాడలేదు. అతని మనస్సుమాత్రం క్రోధంతో వున్నట్లు వెంకట్రామశాస్త్రి గమనించాడు.

"జరిగిందేదో జరిగింది. మనంకూడా వెళదాంరా"

"నేనా చచ్చినారాను. మీరు సాధించ లేకపోతే నేమవుతారనుకుంటూన్నా? బైటవాళ్ళు జనాన్ని తీసుకువచ్చి యింతకంటే బ్రహ్మాండంగా కొలుపులు చేస్తారు. చూస్తారుగా! అని అక్కడినుండి వెంకట్రామశాస్త్రి జవాబు కూడా ఆశించకుండా చరచరా నడిచివెళ్ళి పోయాడు. వెంకట్రామ శాస్త్రి ఒక్కక్షణం అలాగే స్తబ్ధుడై నిల్చుని అక్కడినుండి పొలానికి వెళ్ళాడు.

అప్పటికి నాలుగు ఘడియల ప్రొద్దెక్కినది. ఊరిపెద్ద జంతుబలితో కొలుపులు ప్రారంభమయినవి. దానికి ముందు మాలదాసు తప్పెట వీరంగం వేశాడు. అతడికి మంచి ప్రతిభవున్నది. మాలవాసు కొలుపులలో నేగాక తిరునాళ్ళలో కూడా తప్పెట వీరంగం వేసి ఆ చుట్టుప్రక్కల గ్రామాలలో తనంతవాడు లేడనిపించుకున్నాడు కొలుపులు చూడటకు వచ్చినవారిలో చాలామంది మాలదాసు వీరంగం యింతకుముందు అనేక పర్యాయాలు చూచినవారైనప్పటికీ ఎప్పటికప్పుడు అతనిలో వారికేదో నూతనత్వం కనిపిస్తూవుంటుంది. కాళ్ళకు, చేతులకు గజ్జెలు కట్టుకుని చెవిలో బంతిపూలు పెట్టుకుని వెనుక జుట్టు ఎర్ర పూలతో ముడివేసి తలపాగా చుట్టి తెల్లమల్లు అంగీ వేసుకొని తప్పెట పట్టుకుని ఎగురుతూంటే విచిత్రంగా ఉ

ప్రజలు చూచేవారు, అతవినలా చూడడం వారికి సరదా. అందుకే ఈనాడు కొలుపులముందే మాలదాసు వీరంగం వుందనగానే రామభద్రయ్యకు గిట్టనివారు కూడా అనేకమంది వీరంగం చూడటానికి వచ్చారు.

మాలదాసు రెండుఘడియలసేపు వీరంగం వేసి కొలుపుల కట్నం తీసికొని వెళ్ళిపోయాడు. ఆతరువాత మాలపల్లె పెద్దవచ్చి గ్రామపెద్ద యిచ్చిన దున్నపోతును ఒకే వేటుతో తలనరికి అమ్మవారికి నైవేద్యం పెట్టి పోయాడు. ఆతరువాత మొక్కుల కిచ్చిన గొర్రెపొట్టేలు కోడిపుంజులు వరుసగా అమ్మవారికి ఆహుతయినవి.

ప్రతిగ్రామంలోను ఎప్పుడోగాని కొలుపులు జరగవు. గ్రామంలో ఘోరమైన అంటువ్యాధులు వ్యాపించినప్పుడు అనావృష్టికి అమ్మవారికి కొలుపులు చేస్తారు. అలాముందు నిర్ణయించుకున్న ప్రకారం అన్ని రోజులు కొలుపులుచేసి అమ్మవారిని ఊరిబయటదాకా సాగనంపి తిరిగి వస్తారు.

కొలుపుల రోజులలో పగలు వేటలు వీరంగాలతో జరిగిపోతుంది. రాత్రిళ్ళు వినోదప్రదర్శనలు, కత్తి, కర్ర సాములు, గరిడీలు, బొమ్మలాటలు వేయించుతారు. వరుసప్రకారం రోజుకొక వినోదప్రదర్శనతో కొలుపుల రోజులు వెళ్ళిపోతాయి.

అగ్రహారంలో కొలుపులు చేస్తున్నారని తెలియగానే ఆచుట్టుప్రక్కల గ్రామాలనుండి స్త్రీలు, పురుషులు అనేకమంది బండ్లతో అగ్రహారం వచ్చారు. అప్పటికా ప్రాంతాలలో కొలుపులు జరగడం తక్కువ కావడం వలన

జనం ప్రక్క గ్రామాలనుండి విపరీతంగా వచ్చారు. కొం దరు తమకు తెలిసినవారియిండ్లలో దిగారు. గుడిదగ్గరే బండ్లక్రింద భోజనసదుపాయాలు చేసుకొని కాలం వెళ్ళ బుచ్చారు. మరికొందరు చెఱువుగట్టున చింత, మర్రిచెట్ల కింద బండ్లనాపుకొని ఆ నాలుగురోజులు కాలం గడిపారు.

అప్పటికా ప్రాంతంలో సినిమాలు, డాన్సులు వుండేవికావు. అసలవిఅంటే వారికి తెలిసేదేకాదు. అందుకే వారా ప్రాంతంలో యెక్కడ యేదిజరిగినా సకుటుంబంగా వెళ్ళేవారు. అవి వారికెంతో గొప్పగా వుండేవి. ఈనాటి నాగరిక ప్రజలు సినిమాలకు, డ్యాన్సులకు యెలా పరుగెత్తు తున్నారో అలాగే వారు అవంటే యిష్టపడేవారు. అందుకే కొలుపులముందురోజునుంచి అగ్రహారం యింకంతదైంది. వీధులలో, గుడివద్ద ఎక్కడచూచినా జనంతో అగ్రహారం కిటకిటలాడింది.

గాంధీగారి రెండవసారి ఆంధ్రదేశ పర్యటనలో చాలామంది కాంగ్రెసులోచేరి సభ్యత్వం తీసుకున్నారు. పట్టణంలో ప్రకాశరావుకూడా న్యాయవాద వృత్తిలో వుంటూ కాంగ్రెసులో సభ్యత్వం తీసుకున్నాడు. ఈసారి ప్రకాశరావులాంటి వారనేకమంది స్వాతంత్ర్యోద్యమంలో చేరడంవలన గాంధీగారి ఆశయం చాలావరకు ఆంధ్ర దేశంలో ఫలించినదనే చెప్పవచ్చు. ప్రకాశరావుగారు కాంగ్రేసులో చేరిన తరువాత ఆయనవద్దకు వచ్చే కేసు లలో చాలమంది భాగ్యవంతులు ఆయనవద్దకు రావడం మానుకున్నారు. అందులో ముఖ్యుడు రామలక్ష్మయ్య.

ఆయన అప్పటికే జస్టిస్ పార్టీలో చేరడంవలన తనకు వ్యతి
రేకపార్టీ వ్యక్తియైన ప్రకాశరావుకు కేసులివ్వడంమాని
మరొకవ్యక్తి కివ్వడం ప్రారంభించాడు. ఇలా అనేకమంది
చేయడంవలన ప్రకాశరావు ఆదాయం ఆ సంవత్సరం
బాగా తగ్గినది.

అంతేగాక ప్రకాశరావు రాజకీయాలలో ప్రవేశిం
చిన తరువాత వృత్తిని శ్రద్ధగా చేయలేకపోయినాడు.
ఎప్పుడూ మీటింగులు, ఉపన్యాసాలతో ఆయన సామాన్య
కేసులనుకూడా నిర్లక్ష్యం చేయుడంవలన ఆర్థికంగా ఆసంవ
త్సరం చాలా నష్టాన్ని భరించవలసి వచ్చింది అందుకు
అగ్రహారంలో ఆయనపొలం కొంత విక్రయించవలసి
వచ్చింది.

ఈవిధంగా తన పరిస్థితి మారినా ప్రకాశరావు భీతి
చెందక భారతదేశానికి స్వాతంత్ర్యం రావాలేగానీ, తన
ఆస్తిపోయిన ఫరవాలేదని సమాధానపడ్డాడు

ఈవిధంగా కొంతకాలం జరిగింది. ఇప్పుడు పట్టణ
కాంగ్రెసు ఆఫీసుకూడా అద్దెలేకుండా తనింటిలోనే పెట్టిం
చాడు. గ్రామాలనుండి వచ్చిన కాంగ్రెసువారికి భోజన
సదుపాయ కూడా తనింట్లోనే చేయించేవాడు. ఆదాయంతగ్గి
ఖర్చు అధికం కావడంవలన అనతికాలంలోనే ప్రకాశరావు
తనకున్న పొలంలో సగం విక్రయించవలసివచ్చింది.

ఆ సంవత్సరం ప్రారంభంలోనే ప్రకాశరావు తల్లి
మరణించింది ఆమె శ్రాద్ధకర్మలకు కొంతపొలం విక్రయిం
చాడు. వెనుకటిలా యింట్లో ఆచారవ్యవహారాలు సన్న

గిల్లినవి. ప్రకాశరావు భార్య మహాలక్ష్మమ్మ, భర్త ఆదేశం ప్రకారం పట్టణంలో మహిళాసంఘాన్ని స్థాపించినది. ఇంటింటికి వెళ్ళి మహిళల కర్తవ్యాన్ని బోధిస్తూ సభ్యులను చేర్చి ఆ పట్టణంలో వెయ్యమంది మహిళా సభ్యురాండ్రను మహిళాసంఘంలో చేర్చినది. ఇప్పుడు ప్రకాశరావు పట్టణ కాంగ్రెసు అధ్యక్షుడైతే మహాలక్ష్మమ్మ మహిళాసంఘానికి కార్యదర్శిని పదవి నలంకరించినది. ఈ విధంగా నూతన సభ్యులతో, మంచికార్యకర్తలతో, ఆంధ్రదేశం రాజకీయంగా ఎంతో అభివృద్ధిచెందినది. ఉద్యమంలో పట్టుదల కలిగిన సభ్యులుంటే ఆ ఉద్యమం పటిష్టంగా తయారై ఎంతో చైతన్యాన్ని కలిగిస్తుంది. ప్రకాశరావు లక్ష్మమ్మ నాయకత్వంలో వారున్న రెండు ఉద్యమాలు ఆంధ్ర దేశంలో విపరీతమైన చైతన్యాన్ని తీసుకువచ్చినవి. ఆంధ్ర ప్రజఏనాడూ వారిసేవను మరచిపోరని ఆ పట్టణ ప్రజలు భావించారు.

రెండవరోజు కొలుపులలో పోలేరమ్మకు జంతువుల బలిఅయిన తరువాత ఆకాశం మేఘావృతమైనది. మరికొన్ని క్షణాలలో వర్షంవచ్చే సూచనలు కనిపించినవి. అందు కాపల్లె ప్రజలు సంతోషానికంతులేకపోయినది. రామ భద్రయ్య గర్వంగా చూచాడు. దీనికంతటికికారణం తనేనని అక్కడచేరిన ప్రజలందరికి చెప్పాడు. కొలుపులు చేయకపోతే వర్షంపడేదేకాదని తమపార్టీవారు కొలుపులు చేయడం అమ్మవారికిష్టం కాబట్టె తమకింతవరకు విజయం కలుగుతుందని చెప్పాడు. రామభద్రయ్య మాటలు విన్న

ప్రజలు ఆజ్ఞకు బద్ధులం అన్నట్లు ఆయనవైపు చూశారు. వారిచూపులు అర్థంచేసుకున్న రామభద్రయ్య అమ్మవారికి ప్రభను కట్టాలన్నాడు. ఆ సాయంత్రానికి గ్రామ ప్రజలు ప్రభను కట్టారు. గ్రామంలోవున్న బలంగల ఎద్దులను ముప్పయి జతలు ఏరికట్టి ముందు అమ్మవారి గుడిచుట్టూ ప్రభను మూడుసార్లు ప్రదక్షిణం చేయించాడు. ఆతర్వాత అగ్రహారంలోవున్న మూడు వీధులలో తిప్పారు. ఇతర గ్రామాలనుండి వచ్చినజనం ప్రభవెంట మూడువీధులు తిరి గారు. ప్రభముందు భజనచేసుకుంటూ ఇరవైమంది యువ కులు కీర్తనలు పాడుతున్నారు. ఇంటింటిముందు ఆగుతున్న పోలేరమ్మ ప్రభను భక్తితో హారతులిస్తున్నారు స్త్రీలు, ఆవిధంగా మూడువీధులు తిరిగి బొడ్రాయిముందుకువచ్చి రెండుగడియలకాలం ఇరవైమంది యువకులు భజన చేశారు.

ఇలావుండగానే వర్షంవచ్చింది. పోలేరమ్మ మహా త్యంకన్నా రామభద్రయ్య మహాత్యమే అరోజు ప్రజలకు ఎక్కువగా కనిపించినది. రామభద్రయ్యమాట వారికి వేద వాక్కు అయినది. ఆయనపేరుతో ఏంతపనిచేయడానికైనా సిద్ధంగా ఉన్నారు ప్రజలు. లౌకికుడైన రామభద్రయ్య సమయాన్ని జారవిడుచుకోలేదు.

ఇంకా గొప్పగా కొలుపులుచేస్తే అమ్మవారికి అగ్ర హారంమీద శాశ్వతంగా కటాక్షం కలుగుతుందని జంతు వులబలిని మరొకపది ఎక్కువచేసి అవి ఎవరెవరు తెచ్చి యివ్వాలో చెప్పాడు.

వచ్చినవర్షం అగ్రహారంమీదే ఎక్కువసేపు వర్షించకపోయినా మాడిపోయే పంటపొలాలు మరికొన్ని రోజులు బ్రతకగలవనే ధీమావర్పడింది ప్రజలకు. అయితే ఆ కాస్త వర్షానికి చెరువులోనికి నీరురాలేదు. బీటలువారిన నేల సళ్ళిచ్చినది.

ఆ రాత్రికి వినోదప్రదర్శన ఏమివేయించాలని రామభద్రయ్య ఆలోచించాడు. అనుచరుల నడిగాడు. వారిచ్చిన సమాధానం తనఆలోచనకు జోడించి భారతంలో అభిమన్యుని వధను బొమ్మలాటగా వేయించాలని నిర్ణయించాడు. ఆ ప్రకారం వెట్టివాడిని పిలచి గ్రామంలో చాటింపు వేయించాడు.

రామయ్యలో యివన్నీ సంచలనం కలిగించాయి. విరోధుల విజయం అతనికి గ్రామంమీద విరక్తి కలిగించినది. ఇకముందు తాను గ్రామంలో ఎలా తలెత్తుక తిరుగుతానా అని ఆలోచించాడు. ఇక్కడ ఆస్తినంతా అమ్మి మరొక పల్లెవెళ్లి అక్కడే పొలంకొని స్థిరనివాసం వేర్పరుచుకుందామను కున్నాడు. కాని పల్లెల పరిస్థితులు అంతటా ఒకేలావుంటవని పట్టణమే వెళ్ళిపోవాలను కున్నాడు. పట్టణంలో ఒక హోటలుపెట్టి నిదానంగా వీరిమీద కచ్చ సాధిద్దామనుకున్నాడు.

రామయ్య తను చేయబోయేపని ఎవ్వరికీ చెప్పలేదు. ఆ గ్రామంలో అందరూ అతనికి శత్రువులుగానే కనిపించారు. ఒక ఉదయం ఎవ్వరికీ చెప్పకుండా పట్టణం వెళ్ళాడు. రామలక్ష్మయ్యకు తానువచ్చిన విషయం చెప్పి

ఎలాగైనా తన మార్గం సుస్థిరం చేయమని చెప్పాడు. ఈ పనులన్నీ రహస్యంగా జరపమన్నాడు. రామలక్ష్మయ్య బాల్యస్నేహాన్ని బట్టి పాటించాడు. అయితే పొలం విష యం తండ్రితో సంప్రదించకుండా కానన్నాడు. ఎలాగో పని కావాలి కాబట్టి సరేనని అంగీకారం వచ్చాడు.

అప్పటికే కోతలు అయిపోయి వారం రోజులు అయినది. పొలంమీది పంట ఎండిపోయిందని మరికవర్షం వచ్చే సూచనలేవీ లేకపోవడం వలన పంటను కోయడానికే నిశ్చయించుకున్నారు రైతులు, అందరితో బాటు రామయ్య తన పొలాన్ని కోయించి కళ్ళంలో వేయించాడు. అందరి లాగా అతనికి ఆ సంవత్సరం సగం పంటే పండింది.

రామభద్రయ్య దయవలనే యీ కాస్త పంట చేతి కందినదని పెద్దరైతులు కళ్ళంలో చెప్పుకోనడం విన్నాడు రామయ్య. ఆ మాట అతనికి గుండెల్లో బాకు లాగా గుచ్చుకొన్నది. కాని తన కోపాన్ని మనస్సులోనే దిగమింగుకున్నాడు

ఈ విధంగా మరికొన్ని రోజులు గడిచినవి రామ లక్ష్మయ్యవుంచి శెట్టికి జాబేమీ వచ్చినట్లులేదు రామయ్య ఒకటి రెండుసార్లు తానేపోయి శెట్టికి తన విషయం చెప్పా లనుకున్నాడు. కాని ముందు తొందరపడితే యింకా చుల కనైపోతానని ఆ ఆలోచనను ఉపసంహరించుకున్నాడు.

రామయ్య గ్రామంలో ఎవ్వరితో మాట్లాడుటలేదు. వెంట్రామశాస్త్రి దగ్గరకు రెండుసార్లు వెళ్ళివచ్చాడు. అయినా అతనితో వెనుకటిలా మనసిచ్చి మాట్లాడుటలేదు.

ఆ గ్రామప్రజలు రామయ్యలోవచ్చిన మార్పును గ్రహించ లేదు. అసలది వారిఊహకు మించినదైనందున ఒకరిద్దరు ఆలోచించికూడా తమ అభిప్రాయాన్ని మనస్సులోనే ఉంచుకున్నారు.

వెంకట్రామశాస్త్రి ఒకరోజు రామయ్యకు కబురంపాడు. కాని రామయ్య ఆరోజే పట్నం వెళ్ళాడని తెలుసుకుని ఆశ్చర్యపడ్డాడు. కారణంలేనిదే రామయ్య ఎక్కడికీ వెళ్ళడని శాస్త్రికి తెలుసు ఈసారి ఏదో కారణంచూచి రామభద్రయ్యపార్టీమీద కేసుపెట్టడానికి వెళ్ళాడా అనుకున్నాడు నిజంగా అలాంటిదేదైనా అయితే తనను సంప్రదించకుండా వెళ్ళడుగదా! ఇలా ఆలోచించుకుని అన్నగారింటికి వచ్చాడు,

శేఖరయ్య కివేమీ తెలియదు. అగ్రహారంలో కొలువులైనప్పటినుండి ఆయన మనస్సుకు కొంత స్థిమితంచిక్కింది. గ్రామమంతా ఒకమాటమీదికి వచ్చినట్లున్నది. అలావుండాలనే శేఖరయ్య అభిప్రాయం.

వెంకట్రామశాస్త్రి వస్తూనే 'అన్నయ్యా, రామయ్య యెక్కడకు వెళ్ళాడో నీకేమైనా తెలుసా?'' అని అడిగాడు.

"యేం గ్రామంలో లేడా?'' శేఖరయ్య ముఖం మీద ఆశ్చర్య రేఖలు పొడచూపినవి.

"లేడు. ఎక్కడికో వెళ్ళాడట!''

"ఎందుకు?''

"తెలియదు. ఇంటివద్దగూడ చెప్పివెళ్ళినట్లులేదు.''

"అతనికి అంత అవసరమైన పనులేమున్నవి ?"

శేఖరయ్య వేసిన యీ ప్రశ్నకు వెంకట్రామశాస్త్రి సమాధానంకోసం ఆలోచించాడు. ఎంత ఆలోచించినా అతనికి జవాబు రాలేదు.

అయితే రామయ్యను గురించి శేఖరయ్య ఆలోచించకుండా వుండలేదు. ఆయన వెంటనే రామయ్య ఇంటికి పాలేరును పంపి విషయాలు తెలుసుకురమ్మన్నాడు. పాలేరు నిస్సారంగా తిరిగివచ్చాడు. అన్నదమ్ములు మరొకవిధంగా ఆలోచించారు.

ఇంతవరకు సమానాంతర రేఖలుంగా కలిసివచ్చిన వారి ఆలోచనలు యిక్కడినుండి విడిపోయినవి

రామయ్యమీద శేఖరయ్యకు మిత్రవాత్సల్యంకంటె పుత్రవాత్సల్యమే ఎక్కువగావుంది. అందుకని ఆయనకు మనస్సులో యెంతో బాధగావుంది. అతనెందుకు గ్రామం వదిలి వెళ్ళాడో ఆయన కర్థంకాలేదు రామయ్య విషయం ఆయనకు ఒకతీరని సమస్య అయినది.

దేశంలో శాంతి, న్యాయం, ధర్మంలేవు. అసూయ ద్వేషం, అన్యాయం తాండవించిఉన్నాయి. తమను వదులుకుని తత్తిమ్మా ప్రపంచమంతా యిలాగే ఉన్నదనుకుంటారు ప్రతివారు. దేశమంతా పాపపంకిల మయిపోయింది.

వెంకట్రామశాస్త్రి రామయ్యను బాగా యెరిగి ఉన్నాడు. రామయ్య ఎంతపట్టుదలగల మనిషో అంత ఆవేశపరుడు. అయితే అతనెప్పుడూ అవమానాన్ని సహిం

చడు. ఆ రోజు శేఖరయ్య వెంకట్రామశాస్త్రి వనిర్ణయా
నికి రాలేకపోయినారు. ఆ మరురోజు రామయ్య రాకతో
గాని వారి మనస్సులు శాంతించలేదు.

# 24

ఆ మరురోజే కాంతమ్మ కాసులపట్టెడను తీసుకొని
వెంకట్రామశాస్త్రి యింటికి వచ్చినది. మొదట్లో శాస్త్రి
ఆమెచేయుపనిని వారించాడు. తను చేయించినదేమైనా
తిరిగి తను తీసుకోనని కాంతమ్మకు చెప్పాడు. కాని
కాంతమ్మ అందుకంగీకరించలేదు. ఈవిధంగానైనా తను
సహాయం చేయగలుగుతున్నానని బలవంతంగా శాస్త్రిని
ఒప్పించింది.

కాసులపట్టెడను తీసుకుని శాస్త్రి ఆ మరురోజు
పట్టణం వెళ్ళాడు. ఈసారి రామయ్య, శేఖరయ్య, శాస్త్రి
వెంట పట్టణంవెళ్ళలేదు. శాస్త్రి ఒంటరిగానే వెళ్ళి కోర్టు
వ్యవహారం పూర్తిచేసుకుని వచ్చాడు. కోర్టు వ్యవహారం
తీర్పుదాకావచ్చింది. ఈసారి రామభద్రయ్యకూడా పట్టణం
రాలేదు. చలమయ్య మాత్రమే వచ్చాడు.

శాస్త్రి ఒంటరిగా పట్టణంవెళ్ళి పనులు సానుకూలం
చేసుకువస్తాడని ఎవ్వరూ ఊహించలేదు. శేఖరయ్య ఆ
సాయంత్రం శాస్త్రివచ్చేదాకా భయంతోనే ఎదురు
చూచాడు. శాస్త్రివిషయం తెలుసుకొన్న శేఖరయ్య అలా
భీతి చెందడంలో ఆశ్చర్యపడవలసిన పనిలేదు శాస్త్రి స్వత

సిద్ధంగా యున్నిసంవత్సరాల ఆతనిజీవితంలో ఏ ఒక్కపని స్వయంగా చేసివుండలేదు. పట్టణం ప్లీడర్లు, కోర్టు ఆయన చూచినవేమైనా ఎందుకో శాస్త్రినిగురించి శేఖరయ్య భయ పడకుండా వుండలేకపోయాడు.

ఆ సాయంత్రం శాస్త్రి పట్టణంనుండి తిరిగిరాగానే శేఖరయ్య పట్టణంలోని విషయాలు వివరంగా తెలుసు కున్నాడు. శాస్త్రి సుఖంగా తిరిగివచ్చినందుకాయన ఎంతో సంతోషించాడు.

# 25

రామయ్య, రామలక్ష్మయ్య సానుభూతి సహా కారంతో పట్టణంలో ఒకహోటలు ప్రారంభించాడు. రామ లక్ష్మయ్య ఫ్యాక్టరీకి దగ్గరలో ఒక డాబాయింటిలో రామయ్య హోటలు. రామలక్ష్మయ్య పనివారు నూరు మంది రామయ్య హోటలును ఉపయోగించమని ఉద్యోగు లకు, పనివారికి తెలియపర్చాడు. దానితో రామయ్య హోటలు మంచిలాభాలతోనే సాగుతున్నది.

ఈ విషయం రామయ్య అగ్రహారంలో ఎవ్వరికీ చెప్పలేదు చలమయ్య కాంతమ్మ అంటే ఆతనికి సరి పడదు. వెంకయ్య ఒక్కడే తనవిషయం చెప్పగలవాడు. పెద్దవాడు. కాని అతనికి రామయ్య ఎందుకో చెప్పలేదు. కొలుపులనాటినుండి శేఖరయ్యఅంటె రామయ్యకు ద్వేషం ఎక్కువైనది. అందుకు రామయ్య వారికి తనవిషయం చెప్ప లేదు.

అయితే అగ్రహారంలో రామయ్య ఉండటంలేదని పట్టణంలో వుంటున్నాడని అందరికి తెలుసు. కాని అతన క్కడ ఏంచేస్తున్నది ఎవ్వరికీ తెలియదు. అగ్రహారంలో యిల్లు, పొలం విక్రయించి పూర్తిగా పట్టణం వెళ్ళిపోతా డని కొందరు, అలాచేయడని మరికొందరు భావించారు. కాని రామయ్య అభిప్రాయంకూడా యిందుకు భిన్నంగా లేదు. అతను తొలిసారి పట్టణం వెళ్ళి రామలక్ష్మయ్య సహాయం అర్థించినపుడు రామలక్ష్మయ్య సహకారం లభి స్తుందని రామయ్య ఆశించలేదు. అందుకు రామయ్య రామ లక్ష్మయ్య ఆనాటి ప్రవర్తనచూచి తనకు సహాయం చేయు డని అగ్రహారంలో తనఆస్థి పూర్తిగా విక్రయించి పట్టణం వ్యాపారంలో దిగాలని భావించాడు. ఆ ఉద్దేశ్యంతోనే మొదటిసారి పట్టణం వెళ్ళివచ్చినపుడు అనుకున్నాడు.

కాని రెండోసారి పట్టణం వెళ్ళినపుడు రామ లక్ష్మయ్యతో మాట్లాడటానికి రామయ్యకు బాగా అవకాశం చిక్కింది. ఆ సమయంలోనే అగ్రహారంలో నరహరిశెట్టిని రామభద్రయ్య, శేఖరయ్యపెట్టు బాధలు దొంగతనాల విషయం యింకా కొన్ని లేనిపోని మాయమాటలు చెప్పి రామభద్రయ్యను తనకనుకూలంగా మార్చుకున్నాడు. రామయ్యమాటలు రామలక్ష్మయ్యదగ్గర బాగా పని చేసినవి. అంతేకాదు, రామలక్ష్మయ్య అభిమానానికి పాత్రుడైనాడు ఫలితంగా పట్టణంలో ఎక్కువ పెట్టుబడి లేకుండానే సునాయాసంగా హోటలు ప్రారంభించాడు.

ఇంతసులభంగా తనకోర్కె నెరవేరినందుకు రామయ్య మనసులో ఎంతో సంతోషించాడు. ఈ విధంగా తన కోర్కెలన్నీ నెరవేరితే అగ్రహారంలో రామభద్రయ్య శేఖరయ్యల వినాశనం త్వరలోనే చూడగలనని మనస్సులో ఊహించాడు రామయ్య. ఇప్పటికే రామలక్ష్మయ్యను తనకనుకూలంగా మార్చుకున్నాడు. ఇంక కొద్దికాలం రామలక్ష్మయ్యతో బాగాస్నేహంచేసి, ఆయన అభీష్టంప్రకారం నడుచుకుంటూ ఆయన ప్రాపకంతో అండదండలతో అగ్రహారం చరిత్రే మార్చాలని ఉవ్విళ్ళూరాడు.

అయితే రామయ్య ఊహలు తప్పిపోలేదు. అగ్రహారం నుండి ఒంటరిగా ఒట్టిచేతులతో వచ్చిన రామయ్య మొదటి మాసంలోనే, వెయ్యిరూపాయల లాభాన్ని సునాయాసంగా సంపాదించాడు.

ఆ సంవత్సరం వర్షాలు పడక, పంటలు పోయినందున అగ్రహారంలో ప్రజలకు ఆరుమాసాల భుక్తికి సరిపడ ధాన్యమే వచ్చినది. దానితో అనేకమంది రైతులు కూరగాయలు పండించి అగ్రహారంనుండి పట్టణానికి ఎగుమతి చేసి పొలాలు అమ్మకుండా ఆ సంవత్సరం వచ్చిన నష్టాన్ని పూడ్చుకున్నారు.

రామభద్రయ్య శెట్టిదగ్గర డబ్బు తీసుకున్నప్పుడు పెట్టిన గడువు దాటిపోవడంతో శెట్టి రామభద్రయ్య పొలాన్ని సునాయాసంగా స్వాధీన పరుచుకున్నాడు సరిగ్గా అదే సమయంలో కోర్టువారితీర్పు శేఖరయ్య కనుకూలంగా

చెప్పడంతో, రామభద్రయ్యకు రెండువందలరూపాయలు జుల్మానా విధించారు కోర్టువారు. ఖర్చులు ఎవరివివారే భరించవలసినదిగా తీర్పుచెప్పారు. అందుకుగాను ఆ సంవత్సరం కౌలుపుల్లకింద తను ఖర్చుపెట్టినది, కోర్టుకు కట్టవలసింది. వాయిదాలకు ఖర్చయినది మొత్తంకింద రామభద్రయ్య నూరుయెకరాల భూమిని రామలక్ష్మయ్యకు స్వాధీనపరచి, రెండువేలరూపాయలను తీసుకున్నాడు.

రామభద్రయ్యకు ఆ సంవత్సరం ఖర్చులక్రింద పదిహేనువందల రూపాయలు అయిపోయినవి. పంటతో రామలక్ష్మయ్యకు పొలం అమ్మడంవలన, ఆ సంవత్సరము ఆయనకు మూడుమాసాలకు సరిపడపంటే వచ్చినది. దానితో ఐదువందలరూపాయలు ఆ సంవత్సరం భుక్తికిగాను ఖర్చుపెట్టవలసి వచ్చింది.

ఈ విషయాలు తెలుసుకున్న రామయ్య, ఆనందం పట్టలేకపోయాడు. తన ఆశయం సునాయాసంగా నెరవేరుతున్నందుకు యెంతో సంతోషించాడు. తమ సోదరుల పొలాలేవీ నష్టపోకుండా వున్నందు కాతను సంతోషంతో ఒకసారి అగ్రహారం చూచిరావా లనుకున్నాడు.

అనుకున్నప్రకారం ఆ మరురోజే రామయ్య అగ్రహారం వెళ్ళాడు. అయితే ఈ సారి రామయ్య అగ్రహారం మామూలుగా వెళ్ళలేదు. పట్టణం వచ్చిన కొద్దికాలంలోనే అన్నిటా మారిన రామయ్య, బండి కట్టించుకుని అగ్రహారం వెళ్ళాడు.

అగ్రహారం ప్రజలు రామయ్యనుచూచి ఆశ్చర్య పోయారు. మాసిపోయిన ముతకబట్టలు కట్టుకుంటూ అగ్ర హారంలో వ్యవసాయం చేసుకుంటున్న రామయ్య, మిల్లు బట్టలతో అగ్రహారం వెళ్ళితే యెవరైనా ఆశ్చర్య పడక తప్పదు. గ్రామంలోకూడా దిగకుండా బండి సరాసరి తనింటిముందుకు తీసుకువెళ్ళాడు రామయ్య. అగ్రహారంలో ఉన్నంతసేపు రామయ్య తన బలగాన్ని పలకరించ లేదు, యెవరైనా వచ్చి పలకరించితే ముక్తసరిగా సమాధానాన్ని చెప్పేవాడు. అంతకుమించి తనకుతానై యెవ్వరినీ పలకరించ లేదు.

అయితే మరిది పలకరించకపోయినా అతనిని భోజ నానికి పిలవక కాంతమ్మకు తప్పలేదు. రామయ్యలో వచ్చిన మార్పుకు ఆమె ఆశ్చర్యపడలేదు అతని సంపా దన విని గుండె బాదుకోననూలేదు. కాని భోజనంలో కూడా మార్పు చెందిన రామయ్య పరిస్థితిచూచి కాంతమ్మ ఆశ్చర్యపడకుండా వుండలేక పోయినది. కంచంనిండా అన్నం పెట్టకుని, కొరివికారమో, గోంగూరో వేసుకుని, ఆ తర్వాత కంచంనిండా చల్ల పోసుకుని మద్దలు చేసుకుని తినే రామయ్య, నాగరికంగా మునివేళ్ళతో తినడంతో ఆమె ఆ విడ్డూరాన్ని చూచి ఆశ్చర్యపడకుండా వుండలేక పోయింది పట్టణంలో మనుష్యులు నాజూకుగా వుంటారని ఆమెకు తెలియనిది కాదు అయితే దానికి సంస్కారం, సాంప్రదాయం వుండవని ఆమె భావన రామయ్య పూర్వీకుల కా ఆచారంలేదు. నిన్నటివరకు రామయ్య

జీవితం అందుకు భిన్నంగాలేదు. ఈ హఠాత్తు పరిణామాల కామె ఆశ్చర్యపడక ఏంచేస్తుంది.

రామయ్య తనపొలాన్ని వెంకటయ్యకు పాలికిచ్చి, వున్న ఒక ఈనమోసిన గేదెను, కాడిమెన్లను అమ్మి పట్నాం వచ్చాడు. అయితే మరదివద్ద పొలం పాలికి తీసు కోనకం కాంతమ్మ కిష్టంలేదు. అదే విషయాం మరది సమక్షంలోనే, భర్తకు చెప్పింది. కానీ వెంకటయ్య భార్య మాటను పాటించక తమ్ముని అభీష్టంప్రకారం ఆతని పొలాన్ని పాలికి తీసుకున్నాడు. శాస్త్రి, శేఖరయ్యలకు రామయ్య అగ్రహారం వచ్చివెళ్ళిన విషయం తెలిసినది. వారెంతో బాధపడ్డారు. రామయ్య వేష, భాషలలో వచ్చిన మార్పు కాంతమ్మ శాస్త్రికి చెప్పినది. ఈ కొద్ది కాలంలోనే ఆతని సంపాదన, ఆతనిలో వచ్చిన మార్పుకు ఆశ్చర్యపడ్డారు. శాస్త్రికి రామయ్య ప్రవర్తననుగురించి ఎంత ఆలోచించినా ఆతని మస్తిష్కంలోనికి సరియైన జవాబు రాలేదు. తన అనుమానం గురించి అన్ననడిగాడు.

"అన్నయ్యా రామయ్య యిక్కడకు వచ్చికూడా మనకు కనిపించకుండా వెళ్ళినాడేమిటి?"

అంతకు ముందునుండే శేఖరయ్య ఈ విషయం గురించి ఆలోచిస్తున్నాడు. ఆయనకెంత ఆలోచించినా రామయ్య అలా తమకు కనబడకుండా వెళ్ళడానికి కారణా లేమీ లేవు. అయితే ఆతని ప్రవర్తనలోవచ్చిన యీ విప రీత పరివర్తనకు కారణమేమిటి? ఆతనిని తనేమీ అన

లేదు. శాస్త్రి అసలు అనేవాడు కాదు ఆతనికి అన్యాయము తలపెట్టలేదు. కోర్టువ్యవహారం రావడానికి కారణం అతను. అయినప్పటికి ఆతనికి పొలం కొద్దేవున్నదని తామే ఖర్చులన్నీ భరించారు. అయితే రామయ్య ప్రవర్తనలో మార్పుకు కారణమేమిటి, ఆతనంతకృతఘ్నుడా. పవిత్రమైన తమస్నేహాన్ని శంకించాడా, ఈ విధంగా ఆలోచనలోవున్న శేఖరయ్యకు శాస్త్రి ప్రశ్న ఊపిరాడనీయ లేదు.

"నేను అదే ఆలోచిస్తున్నారా తమ్ముడూ" శాస్త్రి యిక మాట్లాడలేదు. అన్నదగ్గర శలవు తీసుకుని యింటికి వెళ్ళిపోయినాడు.

శేఖరయ్య అలాగే రామయ్యనుగురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు. సాయంత్రం ప్రొద్దు పశ్చిమదిశకు వాలింది. శేఖరయ్య సంధ్యావందనవేళ అయినది. అలవాటు ప్రకారం భారతి రాగి పంచపాత్ర, ఉద్ధరిణ్ణి తెచ్చి శేఖరయ్య ముందు పెట్టినది. కానీ శేఖరయ్యలో చలనం లేకపోవడం ఆమె చూచి "నాన్నా సంధ్యావందనం చేసుకుని రావూ" అని తండ్రిని కదిపింది. కూతురు కుదుపుతో శేఖరయ్య ఆలోచనలు పోయినవి. "వెళ్తానమ్మా వేళయైనదిగా" అంటూ ఆయన అంగోస్త్రం బుజాన వేసుకుని చెఱువువైపు వెళ్ళాడు.

శేఖరయ్య సంధ్యావందనం పూర్తిచేశాడు. చీకటి రావడానికి యింకా చాలా వేళవున్నది. శేఖరయ్య కట్ట మీద కూర్చున్నాడు. ఇంతలో అక్కడకు శేఖరయ్య

భార్య, కూతురుని తీసుకుని మంచిశిళ్ళకు వచ్చినది. ఈ
మధ్య కొద్దిగా వర్షాలు పడినందున ఈ సంవత్సరం, నీటి
కంత ఎద్దడి లేదు. చెఱువులో కూడా నీరు బాగానేవున్నవి.
తామరాకులు చెఱువునిండా నీరున్నవరకూ వున్నవి.
ఏనాడు తనతాత నరసింహశాస్త్రిగారు తామర మొక్కను
వేశాడో, అప్పటినుండి అగ్రహారంలో బ్రాహ్మణులకు,
విస్తరాకులు కొనకుండా కాలం గడచిపోతున్నది. వారెంతో
పుణ్యాచరితులు, అనుకున్నాడు శేఖరయ్య.

"నాన్నా మే మెళ్ళిపోతున్నాము. నీవురావూ?"
ఎనిమిదేండ్ల కూతురు, కాశీచెంబును బుజాన పెట్టుకుని
తీసుకుపోతూ అన్నది. కూతురు పిలుపుతో శేఖరయ్య
ఆలోచనలు పోయినవి.

భారతి గారాబు బిడ్డ. శేఖరయ్య ఏకైక సంతానము.
రోజూ తల్లివెంట ఆ చెంబును పట్టుకుని మంచిశిళ్ళకు
వస్తుంది. సాంప్రదాయప్రకారం ఆమె కీ సంవత్సరం
వివాహం చేయాలనుకున్నాడు శేఖరయ్య. కానీ, దేశంలో
ఉప్పెనలా శారదాచట్టము ఆ సంవత్సరమే వచ్చినది.
యుక్తవయస్సు రాని ఆడపిల్లలకు వివాహం చేయకూడ
దని, అలా వ్యతిరేకించినవారిని శ్రీకృష్ణ జన్మస్థానమునకు
పంపుతారని శేఖరయ్య పట్టణం వెళ్ళినపుడు ప్రకాశరావు
చెప్పాడు. ఈ విషయం విని శేఖరయ్య ఎంతో విచారిం
చాడు. వివాహ విషయాలు, దాంపత్యజీవనంలోకూడా
ప్రభుత్వంవారి జోక్యానికాయన తీవ్రంగా నిరసించాడు.
కానీ ఆయన ఏం చేయగలడు. హిందూ ధర్మసంఘం అన్ని

విధాలా పునాదులతో పడిపోవడానికి సిద్ధంగా వున్నది. ఆచారాలు, ధర్మాలు, మంచి, చెడూ, న్యాయం, అన్యాయం యిప్పటికే దేశంలో: నశించినవి. పెద్ద, చిన్న భేదములు పోయినవి. పవిత్రమైనభూమి అనాదినుండి మ్లేచ్ఛులతో కలుషితమైనది. ఈ విపరీతపరిణామంలో తాను ఒంటరివై సాధించేదేమిటి? సంఘజీవితం, గ్రామ పాలన, పంచాయితీలుపోయి కోర్టులు వచ్చినవి దానితో ధర్మంనశించినది. అందుకు తను చేయగలిగిందేమీ లేదు. క్షణక్షణంమారుతున్న కాలంతోబాటు తాను, తమఉద్దేశ్యా లను మార్చుకోవాలి. అనుకుని భారతి వివాహవిషయం అప్పట్లో విరమించుకున్నాడు.

## 26

1941 వ సంవత్సరం వచ్చింది. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమై అప్పటికి రెండు సంవత్సరాలైనది. జపానువారు మనదేశంమీదగూడా బాంబులు వేశారు. ఇది చాలా అపాయకరమైనదని, అన్యాయమని, గాంధి మొదలగు పెద్దలు "మా దేశం విడచిపెట్టండి" అని బ్రిటిషు వారికి హెచ్చరిక చేశారు. దీనినే 'క్విట్ ఇండియా' ఉద్యమం అంటారు, దానికి బ్రిటిషువారు నాయకులనేక మందిని జైల్లో వేశారు. స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు ఆ వుద్యమంలో చేరారు. అందుకే ఆ సంవత్సరం ఎక్కడా ఏ ఖైదు ఖాళీలేకుండా పోయింది. దానితో

తిరిగి ప్రజలు, బ్రిటిషువారిని 'మా దేశంనుండి వెళ్ళండి, లేదా చావండి' అని నిదానం లేవతీశారు. అంతేకాదు, దేశవ్యాపితంగా, సమ్మెలు చేశారు. అనేకమంది స్వాతంత్రోద్యమంలో ప్రవేశించారు.

ఆ ఉద్యమం దేశవ్యాపితంగా జరగడంతో, పల్లెల నుండి వేలాది ప్రజలు పట్టణాలువచ్చి, కాంగ్రేసులో చేరి, ఆ వుద్యమాన్ని జయప్రదం చేశారు. ఈ విషయాలన్ని ఎప్పటికప్పుడు గమనిస్తున్న శేఖరయ్యకూడా భారత స్వాతంత్ర్యంకోసం ఉద్యమంలో చేరకుండా వుండలేక పోయాడు. ఈ విషయం విన్నరోజున ప్రకాశరావుగారెంతో సంతోషించారు. శేఖరయ్యలాంటి పండితుడు, భారతీయ సాంప్రదాయాలకు, ధర్మాలకు, ప్రతిఃధి అనేక శాస్త్రిములు చదివిన, ఉన్నతుడు, ఉత్తముడు ఉద్యమంలో చేరేసరికి ప్రకాశరావుకు 'స్వాతంత్ర్యం' కనుచూపులో కనిపించినది. బ్రిటిషువారి పాలనకిక భారతావనిలో కాలదోషం పట్టిందని ఆయన వూహించాడు.

శేఖరయ్య వుద్యమంలో చేరిన మూడవరోజే బ్రిటిషువారాయనను శ్రీకృష్ణజన్మస్థానమునకు పంపారు.

ఈ విషయం తెలుసుకున్న రామభద్రయ్య చకితుడై నాడు. అన్న అలా మారుతాడని ఆయన వూహించలేకపోయాడు. అగ్రహారం ప్రజలు ఈ వార్త విన్నరోజు, విస్మయముతో నమ్మలేకపోయారు. సంధ్యావందనానికి ఆలస్యమైతే భరించలేనివాం కి. విషా

పరుడు, వుద్యమంలో చేరి జైలుకు వెళ్ళాడంటే వారు నమ్మ లేకపోయారు. రామభద్రయ్య నిజా నిజాలు, తెలుసుకోను ఆ మరుగోజే పట్టణం వచ్చాడు. శాస్త్రి, అన్న పరిస్థితి విని దుఃఖించాడు.

శేఖరయ్య విషయం, అగ్రహారంలో ఎంత ఆశ్చ ర్యాన్ని కలిగించినదో, రామయ్య, రామలక్ష్మయ్యలనుఅంత సంతోషపరచినది. అప్పటికే రామలక్ష్మయ్య జస్టిస్‌పార్టీలో ప్రముఖవ్యక్తి అయినాడు. ఆ పట్టణ జస్టిస్ పార్టీకి ఆయన నాయకత్వంగూడా వున్నది. రామయ్య రాజకీయాభి ప్రాయములో, రామలక్ష్మయ్యకు వ్యతిరేకనియే చెప్పవలసి వుంటుంది. కానీ ఆతనెన్నడూ రామలక్ష్మయ్యకు తన అభిప్రాయాన్ని తెలయపర్చలేదు. రామలక్ష్మయ్య అండ లేకపోతే పట్టణంలో తనకు నిలవనీడవుండదని రామయ్య మనస్సులో రామలక్ష్మయ్యను వ్యతిరేకించినా పైకి సమ ర్థించకుండా వుండలేదు. వ్యాపారభావా లెక్కువ గల రామలక్ష్మయ్య రామయ్యను పరీక్షించకుండానే ఆత నిని తమలో కలుపుకున్నాడు. శేఖరయ్యను జైల్లో పెట్టా తని తెలిసి, రామయ్య ఆనందంతో వుప్పొంగిపోయాడు. తన చిరకాలవాంఛలు నెరవేరుతున్నందుకాతను మన స్సులో ఎంత ఆనందించాడో చెప్పలేము.

రామయ్య స్థిరపడినతరువాత తన మామూలు పద్ధతులన్నీ మార్చుకున్నాడు. బాల్యంలో వెంకట్రామ శాస్త్రితో బాటు వీధిబడిలో చదువుకున్న చదువును నెమ

రుకు తెచ్చుకుని ఇప్పుడు దినపత్రికను తిరగేస్తున్నాడు. నానారకాల మనుషులువచ్చి హోటలులో మాట్లాడిన మాటలు శ్రద్ధగావిని అప్పుడప్పుడూ ఆతనూ రాజకీయాల గురించి, గాంధీతత్వంగురించి చర్చలు జరుపుతున్నాడు. నెలకొకసారి చేసుకునే గడ్డాన్ని రెండురోజులకే చేసుకుంటు న్నాడు. రెండురోజులకొకసారి ఇస్త్రీబట్టలు మార్చుకుంటు న్నాడు. జుట్టుమారిపోయి క్రాపింగువచ్చింది దుబ్బ మీసాలుపోయి పెంచికటింగుమీసాలు పెట్టించాడు. ఈ మధ్యనే ఒకచేతిగడియారాన్ని కొన్నాడు.

రామయ్య ఈ మధ్యనే రామారావుగా పేరు మార్చు కుని ఫ్యాక్టరీ ప్రక్క స్థలంలో కొత్తపేరుతో పునాదిరాయి వేశాడు. హోటలుకువచ్చినవారితో మంచిగామాట్లాడుతూ హోటలు దూరమనే అభిప్రాయాన్ని వారిలోనుండి తొల గించాడు. వ్యక్తులనుబట్టి మాట్లాడుతూ వ్యాపారాన్ని బాగా అభివృద్ధిలోనికి తీసుకవచ్చాడు. దొమ్మేటి బాగా నటిస్తాడో, గగ్గయ్య బాగానటిస్తాడో చెప్పడానికై పట్టణం వచ్చినప్పటినుండి వేసిన నాటకాలను వదలిపెట్టకుండా చూస్తున్నాడు. ఈవిధంగా అతను అత్యంత అభివృద్ధిలోకి వచ్చాడు.

# 27

రామభద్రయ్య పట్టణంవచ్చి అన్నవిషయం తెలుసుకుని ఆశ్చర్యపడ్డాడు. నిజంగా ఆయన స్వాతంత్ర్యోద్యమంలోనే జైలుకు వెళ్ళాడని తెలుసుకుని ప్రకాశరావు యింటికివచ్చాడు. ప్రకాశరావుగూడా జైలుకువెళ్ళడంతో ఆయన ఆ సాయంత్రమే తిరిగి అగ్రహారం వెళ్ళాడు.

రామభద్రయ్య అన్నవిషయం గురించి తెలుసుకోను పట్టణం వెళ్ళాడని విన్నప్పుడు శాస్త్రి ఎంతో ఆశ్చర్యపడ్డాడు. రామభద్రయ్యలో అంతసులభంగా పరివర్తన వస్తుందని ఆయన ఆశించలేదు. ఈవిషయంలో తమ్ముని ప్రవర్తన ఆయన శంకించకుండా వుండలేదు.

అంతవరకు శాస్త్రికి తమ్మునితో మాట్లాడాలని వుద్దేశ్యంలేదు. తమ్ముని విచిత్ర ప్రవర్తన ఆయనకాఅవకాశాన్ని పోగొట్టింది. ఆ సాయంత్రం తమ్మునిరాకకై ఎదురుచూచాడు. రామభద్రయ్య అగ్రహారంలో ముందు యింటికివెళ్ళక సరాసరి శేఖరయ్య యింటికి వెళ్ళాడు. పట్టణంలోని విషయాలు ఒదినకుచెప్పి అక్కడినుండి శాస్త్రి యింటికివచ్చాడు.

తమ్ముని రాకతో అంతవరకు తమ్ముని మీదవున్న ద్వేషము జారిపోయినది. అప్యాయంగా ఆతనిని పలుక

రించాడు రామభద్రయ్య పట్టణవిషయాలుచెప్పి అక్కడి నుండి తనింటికి వెళ్ళాడు.

ఇదంతా గమని చుతున్న కాంతమ్మకు మతిస్థిమితం తప్పినదనే చెప్పవచ్చు. ప్రపంచంలో జరుగు వింతలన్ని అగ్రహారంలోనే జరుగుచున్నవని ఆమె భావించినది. అందుకే ఆమె ఏది నిజమో, ఏది అబద్ధమో, నిర్ణయించుకో లేకపోయినది ప్రథమ దినాల్లో ఆమె కాపురానికి వచ్చిన నాటి అగ్రహారం పరిస్థితికి నేటిపరిస్థితికి పోలికలు పోల్చుకో లేకపోయినది. ఈ కొద్ది సంవత్సరాల జీవితం ఆమె కొక కలగా, కనిపించినది. రామభద్రయ్య ప్రవర్తన ఆమెకు మొదటినుండి ఆందోళనను కలిగించుతూనే వున్నది. ప్రతిఫలా పేక్షలేని శాస్త్రి, శేఖరయ్యను, కుటిలుడైన రామభద్రయ్య ద్వారా ఎప్పుడే అపకారాన్ని పొందుతాడోనని ఆమె భావించుతూవచ్చింది ఇంతవరకూ ఆమె వూహించినట్లే జరిగింది.

అయితే రామభద్రయ్య ఈ హటాత్ ప్రవర్తనలో మార్పు ఆమెకొక తీరని సమస్య అయినది. ఇందులో ఏదో మోసంవుండి వుంటుందని ఆమె భావించింది. కానీ యిక్కడే ఆమె వూహ తప్పినది. అందరూ ఆశించినదానికి వ్యతిరేకంగా ఆయనలో నిజమైన మార్పు వచ్చింది. అయితే ఆ మార్పు ఏఒక్క కారణంచేతను రాలేదు అగ్రహార పరిస్థితులే అందుకు ప్రధానకారణమైనవి.

అగ్రహారంలో రామయ్య నిష్క్రమణ తరువాత, పార్టీలు అసలు లేవనే చెప్పవచ్చు. అన్నదమ్ములు

దాయాదులైనా, వారిలో వారికి సమోధ్యాశనశించినా, వారెప్పుడూ పోట్లాటలు పెంచుకోలేదు అదే కృష్ణశాస్త్రి, కుమారులలోవున్న ప్రత్యేకత. రామభద్రయ్య కక్ష రామయ్యతోనే ప్రారంభమైనది ఆతని నిష్క్రమణతో రామభద్రయ్య ఆశయం నెరవేరింది. కోర్టులో ఓడినా, కొలుపులు స్వతంత్రించి చేసి నెగ్గించినందుకు అగ్రహారం ప్రజలు రామభద్రయ్యను అభినందించకుండా వుండలేక పోయారు. ఆతనిని అంతవరకు అనేక విషయాలలో వ్యతిరేకించువారు కొలుపుల అనంతరం మనస్ఫూర్తిగా ఆతనితో ఏకీభవించారు. దానితో అగ్రహారంలో రామభద్రయ్యకు తిరుగులేకపోయింది.

నిజానికి రామభద్రయ్యలో వచ్చిన మార్పు, కోర్టు ఖర్చుల విషయంలోనూ, అనావృష్టి విషయంలోనూ కాదు. అన్నలమీాద ఆయనకు మొదటినుండి దురభిప్రాయంలేదు. పార్టీలేర్పడి, తనకన్నిటా వ్యతిరేకుడైన రామయ్యతో కలిశాడని రామభద్రయ్య కోర్టు ఎక్కాడు. ఫలితాలు ఆశించకుండానే ఆస్తిని అమ్మి ఖర్చుపెట్టాడు. తను ఆర్థికంగా దెబ్బతినినా. శత్రువులకు, బల్లెమై మెలగాలని రామభద్రయ్య ఆలోచించి చేశాడు. అందుకే ఆతని మార్పును సన్పాదయంగా తీసుకున్నవారు లేకపోయారు. ఈ మార్పులో గూడా ఏదో కుతంత్రం వున్నదనే అంతా భావించారు.

* * * *

రామారావు హోటల్ మీాద సంపాయించిన డబ్బు పెట్టి పట్టణంలో పెద్ద భవంతిని కట్టించి ఒకనాడు అతివైభవంగా గృహప్రవేశం చేశాడు. రామలక్ష్మయ్య ఆరోజు కార్యక్రమం దగ్గరుండి స్వయంగా జరిపించాడు. రామలక్ష్మయ్య యింత అభిమానం చూపుతాడని రామారావు అనుకోలేదు. అందుకే ఆయనకోరిక ప్రకారం ఆసాయంత్రం ఆ నూతన యింటి ఆవరణలో చిన్న ఉపన్యాసాన్ని పెట్టించాడు. రామలక్ష్మయ్య జస్టిస్‌పార్టీ విధానాలను గురించి, ప్రభుత్వాన్ని సమర్థిస్తూ మాట్లాడాడు. ఆయన ఉపన్యాసం, రామారావు, యింకా అక్కడ చేరిన కొద్దిమందికి మాత్రము నచ్చలేదు. కానీ ఎవ్వరూ ఆయనను వ్యతిరేకించ లేదు. ఆవిధంగా ఆరోజు కార్యక్రమము పూర్తియైనది. రామారావు గృహప్రవేశానికి తనవారి నెవరినీ పిలవలేదు. తనవారెంతో అనాగరికంగా వుంటారని, వారివల్ల తన పరువు మర్యాదలకు లోపంవస్తుందని అతను భావించాడు.

శేఖరయ్యను బ్రిటీషువారు ఎట్టినిర్బంధం లేకుండానే వదలిపెట్టారు. శేఖరయ్యకు జైలుజీవితం కొత్తయినా, అదే ఆయనలో గొప్ప సంచలనాన్ని కలిగించినది.

మొదటిరోజుల్లో ఆయనకు, అక్కడి వాతావరణం అంతా క్రొత్తకావడంవలన, కొన్ని బాధల ననుభవించ వలసి వచ్చినది. ముఖ్యంగా ఒంటరిజీవితము అక్కడ నిర్బంధించిన తోటి కాంగ్రెసువారితో ఆయనకు పరిచయం లేకపోవడం వలన ఆయనకక్కడ కాలం గడుపుట ఒక సమస్య అయినది.

కానీ యింతలో ప్రకాశరావును శేఖరయ్య వార్డుకు బదిలీ చేసినతరువాత, శేఖరయ్య ప్రశాంతంగానే జైలు జీవితం గడిపాడు. అక్కడాయన, ప్రకాశరావు నడిగి అనేక విష యాలు తెలుసుకున్నాడు. భారత కాంగ్రేసు చరిత్ర, ఉద్యమచరిత్ర, నాయకులచరిత్ర, ఆయనబాగా తెలుసు కున్నాడు జైల్లో అంతా స్వచ్ఛందసేవకులే అయినప్పటికి, వివిధరకాల మనుష్యులున్నట్లే వివిధరకాల అభిప్రాయాలు కాంగ్రేసు ఉద్యమాన్ని గురించి వచ్చేవి. ఇందులో కొంత మంది అతివాదులు, మితవాదులు వున్నారు. తరచూ అక్కడ వాదనలు జరుగుచుండేవి. శేఖరయ్య కూడా అందులో పాల్గొనేవాడు. కొత్తలో ఆయన వాదనలో అను భవం లేనందున చాలాసార్లు ఓటమి పొందేవాడు. రాను రాను, అక్కడివారిని వాదనలో అనేకసార్లు ఓడించాడు.

శేఖరయ్యలో యింతరాజకీయ చైతన్యం కలుగు టకు ప్రధాన కారకుడు ప్రకాశరావు. ఆయన విసుగు, విరామంలేకుండా తోటిసోదరులకు, వారికి తెలియని అనేక విషయాలు చెప్పేవాడు. ఓపిక, సహనంతో ఆయన మాటాడుతీరు, శేఖరయ్యకు బాగా అలవడినది . సహ జంగా మెత్తనిమనస్సు గలవాడగుటవలన శేఖరయ్య, వాదనలో ఎవ్వరినీ తూలనాడేవాడు కాదు. అందరినీసమంగా సమభావంతో చూచేవాడు. వేళకువెళ్ళి అందరితోబాటు భోజనం చేసివచ్చేవాడు. కులవ్యవస్థను గురించి ప్రకాశరావు వెలిబుచ్చిన అభిప్రాయాలు ఆయనకు బాగా నచ్చినవి.

అందుకే అంత పండితుడుగూడా, జైలు జీవితానికి సునాయాసంగా అలవాటు పడగలిగాడు.

శేఖరయ్య విడుదలకాగానే సరాసరి అగ్రహారం వెళ్ళాడు. ఆయన జన్మించిన తర్వాత అగ్రహారాన్ని వదలి, యింతవరకూ ఎప్పుడూ యిన్నిరోజులు ఎక్కడా వుండలేదు. ఈ కొద్దికాలంలో ఆయనకు అగ్రహారం ఎంతో మార్పు చెందినట్లుగా కనిపించినది. అగ్రహారంలోని ప్రజలంతా ఒక్కొక్కరేవచ్చి శేఖరయ్యను చూచి వెళ్ళారు. శాస్త్రి, రామభద్రయ్య, ఆరోజల్లా అన్న యింట్లోనే వున్నారు అన్నలో వచ్చిన ఈ మార్పుకు వారెంతో విస్మయం చెందారు.

వెంకటయ్య తమ్ముడి ఆస్తినికూడా వ లికిచేయడం వలన ఆతని ఆదాయం బాగా పెరిగినది. అందుకు తగినట్లు ఆతనికి ఖర్చుగూడా లేదు. కాంతమ్మ కాపురానికి వచ్చి యిన్ని సంవత్సరాలైనా, ఆమెకింత వరకు సంతానం కలగ లేదు. వెంకటయ్య అప్పుడప్పుడూ యీ విషయం గురించి దిగులుపడటం కాంతమ్మ గ్రహించకపోలేదు కానీ ఆమె మాత్రం ఏంచేస్తుంది. భర్తకోరిక నెరవేరదేమోనని ఆమె మనస్సులో చింతిస్తూనే ఉన్నది.

శేఖరయ్య వచ్చాడని తెలిసి కాంతమ్మవచ్చి ఒక సారి చూచి వెళ్ళినది. శేఖరయ్యలో వచ్చిన ఈ మార్పుని ఆమె ఎంతో చకితురాలయినది. అంతా భగవంతునిలీల అకు ఆమె మనస్సులో జోహారులర్పించింది.

ఈవిధంగా నాలుగురోజులు గడిచినవి. శేఖరయ్య బొడ్రాయిదగ్గర మీటింగు ఏర్పాటుచేసి ప్రకాశరావును వుపన్యాసకుడిగా పిలిపించాడు. ఆ సభలో, ప్రకాశరావు తరువాత, శేఖరయ్య కాంగ్రేసు వుద్యమాన్ని గురించి, హరిజనులను గురించి గాంధీగారు చెప్పిన మాటలు స్వాతంత్ర్య వుద్దేశం అన్నీ వివరంగా, చెప్పారు. ఆసభకు మాలపల్లి నుండి చాలామంది హరిజనులు వచ్చారు. శేఖరయ్య వుపన్యాసం వారినెంతో ఆశ్చర్యపరచినది. ఆయనలో వచ్చిన ఈ మార్పుకువారు ఎంతో ఆనందించారు.

ప్రకాశరావు అగ్రహారం వచ్చినపుడు, శేరయ్యకు ఒక విజ్ఞప్తిచేసి వెళ్ళాడు. ఆచుట్టుప్రక్కల గ్రామాలకు అగ్రహారం కూడలిగా జేసుకుని. కాంగ్రేసు ప్రచారం చేయమని, కాంగ్రేసు ఆఫీసు అగ్రహారంలో పెట్టమని, చెప్పి వెళ్లాడు. ప్రకాశరావు అభిప్రాయం శేఖరయ్యకు బాగా నచ్చినది. అందుకు తమ్ములతోకూడా సంప్రదించకుండా, తన పొలమంతా శెట్టికమ్మి అగ్రహారంలో ఒక చిన్న యిల్లు కట్టించి అందులో కాంగ్రేసు ఆఫీసు పెటాడు. అప్పటినుండి ఆచుట్టుప్రక్కల గ్రామాలన్నీ తిరిగి కాంగ్రేసుకు ప్రచారం చేశాడు.

అయితే ఈ విషయం ప్రభుత్వం వారికి తెలియక పోలేదు. వెంటనే పోలీసులువచ్చి శేరయ్యను అరెస్టుచేసి తీసుక వెళ్ళారు. ఈసారి శేఖరయ్యకు జైలు జీవితం చాలా దుర్భరంగానే గడిచింది. ఆయనను రాజకీయ ఖైదీగా చూడక, అన్ని విషయాలలోను అనేక యిబ్బందులు

పెట్టారు. లాటీలతో కొట్టారు. వేళకుభోజనం పెట్టక ముక్కి పోయిన గోధుమలు వండిపెట్టారు. నోటికి వచ్చినట్లల్లా తిట్టేరు. శేఖరయ్య యివన్నీ భరించాడుగాని, మాలదాసు తమ్ముడు కాలిచెప్పువిడచి కొట్టినందుకాయన సహించలేక పోయాడు. అప్పటినుండి ఆయన మూడురోజులవరకు నిరాహార వ్రతం చూనాడు ఈ విషయాన్ని గురించి ఆయన పై అధికార్లకు రిపోర్టు యిచ్చినా ఫలితం కనబడలేదు. అందుకే ఆయన భోజనం మానేశాడు.

శేఖరయ్య ఏంచేసినా ఆయన మొర ఆలకించినవారు లేరు అలాగే, నాలుగు రోజులకు తోటి సోదరుల బలవంతంమీద, శేఖరయ్య భోజనంచేశాడు. ఈ విధంగా స్వచ్ఛంద సేవకులను, జైళ్ళలో ఎంతో అమానుషంగా చూచింది బ్రిటీషు ప్రభుత్వం. దినదినానికి దేశంలో ప్రజలయందు స్వాతంత్ర కాంక్ష పెరిగినందువలన వారి ఆలోచనలేవీ సాగలేదు.

ఒకనాటి సాయంకాలం వెంకటయ్య ఎడ్లను తోలుకుని యింటికివస్తూ త్రోవలో పడిపోయినాడు. తరువాత ఆత్తనిని తీసుకవచ్చి కట్టుకట్టించారు. కానీ ఫలితంకనిపించ లేదు. పడి దెబ్బతగిలిన కాలుకే పక్షవాతం వచ్చింది. వెంకటయ్య, కాలువిషయంలో ఎంతజాగ్రత్త పడుతున్నా, కాంతమ్మ ఎన్ని ఉపచారాలు చేసినా ఆకాలు బాగు పడనూలేదు- వెంకటయ్య పక్షవాతము తగ్గనూలేదు. ఈ విషయం తెలుసుకున్న రామారావు ఒకసారి అగ్రహారం

వచ్చి అన్నను చూచివెళ్ళాడు. అన్న పరిస్థితికాతనెంతో విచారించాడు. వెంకటయ్య తమ్ముని వైభవానికి, తమ్ముని లో వచ్చిన మార్పుకు ఆశ్చర్యపడ్డాడు. పట్టణంలో గృహప్రవేశం అతివైభవంగా జరిపించి తమను మాట మాత్రంకూడా పిలవలేదని అతను చింతించాడు

అయితే తన విషయంలో అన్న ఏమనుకుంటున్నదీ రామారావు గ్రహించలేకపోలేదు. కానీ అతనావిషయాన్ని గురించి ఏమాలోచించలేదు. అగ్రహారంలో అతనున్న రెండురోజులు ఆతనికి ఎక్కువ బాధ కలిగించినది, శేఖరయ్య విషయమే? తనున్నప్పుడు శత్రువుగానున్న రామభద్రయ్య అన్నతో కలిశాడు. శేఖరయ్య కాంగ్రెసు నాయకుడైనాడు. అగ్రహారంలో ఆఫీసు తెరిచి, సర్వకులాలకు ప్రాధాన్యతనిస్తున్నాడు. ఏమిటి వీరిపరిస్థితి? ఎంత సేపాలోచించినా ఆతనికి బోధపడలేదు.

ఆదిలో కులవ్యవస్థవుండాలని, సంఘజీవితంలో దాని కెక్కువ ప్రాముఖ్యతవున్నదని చెప్పినది బ్రాహ్మణులు. ఈనాడు, కులవ్యవస్థనిర్మూలనకు కారకులు వీరే! ఏమిటీ మార్పు, శేఖరయ్యలాంటి పండితుడు యిలామారాడంటే రామారావు ఆలోచించలేక పోయాడు ఆరోజు అక్కడ ఎలాగోగడిపి ఆమరునాడే పట్టణం వెళ్ళాడు

శేఖరయ్య కాంగ్రెసు నాయకుడుగా ఆ ప్రాంతంలో చలామణి అయ్యాడు. ఆయన ఉపన్యసించని గ్రామాలు ఆ చుట్టు పక్కలలేవు. అన్నిగ్రామాలలోను ఆయన వుపన్యాసాలిచ్చాడు. అనేకమంది రైతులను కాంగ్రెసు వుద్య

మంలో చేర్చాడు. అనేక గ్రామాలలో కాంగ్రెసు ఆఫీసులు, లైబ్రరీలు తెరిపించాడు. బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా అనేక ప్రదేశాలకు వెళ్ళి శాంతియుతంగా సత్యాగ్రహాలు జరిపించాడు. అనతి కాలంలోనే శేఖరయ్య కాంగ్రెసుకు మూలస్థంభంలాంటి వాడని బ్రిటిషువారు గ్రహించారు. అప్పటినుండి అగ్రనాయకులలాగే ఆయన మీద ప్రత్యేక గూఢచారులను నియమించారు.

ఇంతలో దేశవ్యాపితంగా ఎన్నికలు వచ్చినవి. ఆంధ్రదేశంలో అనేక ప్రదేశాలలో కాంగ్రెసుతో జస్టిస్ పార్టీ పోటీచేసింది. పట్టణంలోకూడా జస్టిస్ పార్టీతరపున రామలక్ష్మయ్య కాంగ్రెసుకు పోటీగా నిలుచుంటారని అంతా భావించారు.

నిజంగా అలాగే జరిగినది. పట్టణంలో కాంగ్రెసు పార్టీకి పోటీగా జస్టిస్‌పార్టీ అభ్యర్థి రామలక్ష్మయ్య పట్టణ నియోజకవర్గంలో నిలబడ్డాడు. ఎన్నికలు ప్రశాంతంగానే జరిగినవి. రామారావు బహిరంగంగానే రామలక్ష్మయ్య కనుకూలంగా ఎన్నికలలో ప్రచారం చేశాడు. కానీ ఫలితం కనబడ లేదు. ప్రకాశరావు లా చదివినవాడు. సహజంగా మంచివక్త, రాజకీయాలలో సర్వం త్యజించిన దేశభక్తుడు కావడంవలన అత్యధిక మెజారిటీతో ప్రకాశరావును విజయం వరించినది

ఈ విషయం విని శేఖరయ్య ఎంతో సంతోషించాడు. రామలక్ష్మయ్యలాంటి పెట్టుబడిదారులు కాంగ్రెసుకు వ్యతి

రేకులు, అలా ఓటమి చెందటం, ఆ సంవత్సరం యింకా యిలాంటి సంఘటలను విని ఆయనెంతో ఆనందించాడు.

అయితే ఆ మరుసటి సంవత్సరమే శాసనసభలో బ్రిటిషువారికి వ్యతిరేకంగా కాంగ్రెసు సభ్యులంతా రాజీనామా లిచ్చారు. దానితో ప్రకాశరావు సభ్యత్వానికి రాజీనామా యిచ్చాడు.

ఈవిధంగా దేశపరిస్థితులు అల్లకల్లోలంగా వున్నవి. శాసనసభ సభ్యత్వానికి రాజీనామాలిచ్చి తిరిగి సభలు, సమావేశాలు, జరిపారు. పికిటింగులు, సత్యాగహాలు చేశారు. బ్రిటిషువారు, భారతీయులకిక స్వాతంత్ర్యం యివ్వక తప్పలేదు. 1947 ఆగష్టు 15న స్వాతంత్ర్యం ఒప్పగించి వారిదేశం వెళ్ళిపోయారు. ఎర్రకోటమీద త్రివర్ణపతాకం ఎగిరింది.

అంతకు పూర్వమే స్వాతంత్రోద్యమంలో పాల్గొని, జైళ్ళకు వెళ్ళి, స్వాతంత్ర్యం కోసం పాటుపడినవారిలో కొంత మంది అతివాదులు చీలిపోయి. ప్రత్యేకపార్టీ ఏర్పాటు చేసుకున్నారు. స్వాతంత్రం వచ్చినతరువాత పదవులలో వారు స్థానాన్ని కోల్పోవలసి వచ్చింది వారు పోటీ పార్టీగా శాసనసభలో, పార్లమెంటులో నాటినుండి నేటి వరకు పరిగణింపబడుతూనే వున్నారు.

జస్టిస్‌పార్టీ ఆంధ్రదేశంలో ఆశించినంత అభివృద్ధి లోకి రాలేకపోయింది. దానితో జస్టిస్‌పార్టీ వారంతా భారతదేశానికి స్వాతంత్రం సిద్ధించిన పిదప కాంగ్రెసులో

చేలారు. రామలక్ష్మయ్య కాంగ్రెసు సభ్యత్వం తీసు కున్నాడు.

రామలక్ష్మయ్య మార్పుకు ఎవరెలావున్నా రామా రావు ఎంతో సంతోషించాడు. వచ్చేఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థి రామలక్ష్మయ్యే అవుతాడని ఆతను భావించాడు. రామలక్ష్మయ్య యందాతనికంత ఆసక్తి కేవలం ఆయన రామారావుకు సహాయం చేశాడనేకాదు. అప్పటివరకు పట్ట ణంలో కాంగ్రెసు నాయకుడు ప్రకాశరావు. శేఖరయ్య, రామ భద్రయ్యల శాఖవాడు ఎన్నికలలో ఆతను వచ్చినా, శేఖరయ్య వచ్చినా ఒకటే. అందుకు రామలక్ష్మయ్య అయితే ప్రకాశరావుకు సమంగా పోటీ వుంటాడు. పట్టణం లోని వ్యాపారస్థులు రామలక్ష్మయ్యనే అభిమానించువారు కాబట్టి ప్రకాశరావు కాంగ్రెసు అభ్యర్థిత్వాన్ని కోల్పో తాడని ఆతను భావించాడు.

* * *

కాంతమ్మ ఉపచారంవలన వెంకటయ్యకు పక్ష వాతం తగ్గినట్లే తగ్గి ఒకసారి విజృంభించి, వెంకటయ్య ప్రాణాలను తీసుకపోయింది. ఇంత హఠాత్తుగా వెంకటయ్య చనిపోతాడని అగ్రహారంలో యెవ్వరూ భావించలేదు. భర్తకు వ్యాధి తగ్గుముఖం పట్టిందని కాంతమ్మ సంతో షించినది. కానీ ఒకనాడు హఠాత్తుగా మరణించే సరికి అంతా నివ్వెరపోయారు.

వెంకటయ్యా ఆఖరు తమ్ముడు అన్నను, సమాధి చేశాడు. వెంకటయ్యా చనిపోయిన నక్షత్రం మంచిది కాదని వారుంటున్న యిల్లు పూర్తిగా మూసేశారు. రామారావు పదోనాడు వచ్చాడు. అన్న వద్ద తనకు రావసిన ధాన్యం తీసుకుని నరహరిశెట్టి కమ్మేశాడు, పొలం చలమయ్యకు ఒప్పగించి రెండో రోజునే వెళ్ళిపోయాడు

రామారావు ప్రవర్తనకు కాంతమ్మ విచారించినది. చలమయ్యా మూడు మాసాలు ఒదినను తనింట్లోనే వుండమన్నాడు. వెంకటయ్యా పొలం తనే చూస్తానని, పదిమందిలో పదోరోజు మాటిచ్చాడు. కాంతమ్మ పెద్దలు చెప్పిన ప్రకారం ఆ మూడు మాసాలు మరిది చలమయ్యా యింట్లో వుండి ఆ తర్వాత స్వంతయింట్లో వుండే ఏర్పాటు చేసుకున్నది. ఆమె తదనంతరం ఆమె పొలాన్ని ఆమె కిష్టం వచ్చినవారి కిచ్చేటట్లుగా నిర్ణయమైనది.

అయితే ఈ విషయంలో రామారావు అభిప్రాయం యిందుకు వ్యతిరేకంగా వున్నది. ఒదిన జీవితకాలం పట్టణంలో తనింట్లో వుంచి పోషిస్తానని, ఆమె తదనంతరం ఆమె ఆస్థి తనకు రావాలని, పదోరోజు పెద్దల సమక్షంలో అన్నాడు.

కానీ కాంతమ్మ అందుకంగీకరించక పోయేసరికి ఆ మరునాడే రామారావు పట్టణం వెళ్ళిపోయాడు. మరదికి కోపంవచ్చి వెళ్ళిపోయాడని కాంతమ్మ వూహించినది.

వెంకటయ్యా పక్షపాతంలో వుండగా రెండుసార్లు కలుసుకున్నాడు శాస్త్రి కాంతమ్మను. ఆతను చనిపోయిన

తరువాత శవం సమాధి చేయకముందు ఒకసారి వెళ్ళి చూచాడు. అప్పుడే ఆమెను పూర్తిగా చూడలేకపోయాడు. ఆతర్వాత మరల ఆమెను చూడలేదు శాస్త్రి. శేఖరయ్యా వెంకటయ్యా చనిపోయినప్పుడు గ్రామంలోలేడు. ఆ తర్వాత ఈ విషయం విని ఆయనేతో విచారించాడు. చలమయ్యా యింటికివెళ్లి కాంతమ్మను పలకరించివచ్చాడు. మొదటి నెలంతా కాంతమ్మకు దుఃఖంతోనే సరిపోయింది. అగ్రహారంలో ఎవరో ఒకరు రావడం కాంతమ్మను చూచిపోవడం జరిగింది. రెండో మాసంలో కాంతమ్మకికదైనందిన కార్యకలాపాలలో పాల్గొనక తప్పలేదు. చలమయ్యా, అతని భార్య పొలం పనులు చూస్తుంటే కాంతమ్మ యింటిదగ్గర వంట చేసిపెడ్తుండేది. ఈవిధగా కాంతమ్మ మూడు మాసాలు చలమయ్య యింట్లో గడిపింది.

## 29

ఇంతలో 1952 జనరలు ఎన్నికలు వచ్చినవి. పట్టణంలో కాంగ్రెలు అభ్యర్థిగా రామలక్ష్మయ్యను వుంచాలా, ప్రకాశరావును వుంచాలా అని కాంగ్రెసు సభ్యులకు సమస్య అయినది. కొంతమంది రామలక్ష్మయ్య అన్నారు. అలా అన్నవారిలో రామారావు ముఖ్యుడు. ఆతనే మరి కొందరిచేత రామలక్ష్మయ్యనే నిర్ణయించాలని తీర్మానించాడు.

కానీ కొందరు నిజాయితీ పరులు ప్రకాశరావు స్వాతంత్ర్యోద్యమంలో జైలుకు వెళ్ళి లాటీదెబ్బలు తిని,

ఆస్థిని కోల్పోయిన ప్రజాసేవకుడు కాబట్టి, ఆయననే అభ్యర్థిగా నిలబెట్టాలని ప్రతిపాదించారు. అందులో ముఖ్యుడు కామేశ్వరరావు. ఈవిధంగా అభ్యర్థి విషయంలో వాదనలు జరిగినందున పార్టీ అభ్యర్థి విషయంలో అప్పుడు ఎవ్వరూ ఒక నిర్ణయానికి రాలేకపోయారు. అందుకు వారు యీ విషయం గురించి కేంద్ర కమిటీకి తెలియపర్చారు.

ఈలోపే ప్రకాశరావును గురించి ఉద్యమంలో ఆయన చేసిన సేవ, ఆయన రాజకీయ జీవితాన్ని గురించి కామేశ్వరరావు కేంద్రకమిటీకి తెలియపర్చాడు రామారావు కూడా రామలక్ష్మయ్యను గురించి ఎన్నికలకు ఆయన అభ్యర్థిగా వుంచవలసిన అవసరం పట్టణంలో ఆయనకున్న పరపతి, బలం అన్నీ వివరంగా వ్రాశాడు. పై కమిటీవారు యిద్దరి లేఖలను పరిశీలించి కాంగ్రెసు సభ్యులకు కావలసింది పదవులు కాదు, సీట్లని, రామలక్ష్మయ్యనే అభ్యర్థిగా పెట్టమని తమ నిర్ణయాన్ని తెలియపర్చారు.

ఈవార్త పట్టణంలో ఆ చుట్టుప్రక్కల గ్రామాలలో కాస్త సంచలనం కలిగించినా, పెద్దగా కమిటీ అభిప్రాయాన్ని ఎవ్వరూ వ్యతిరేకించలేదు. దానితో రామలక్ష్మయ్యను కాంగ్రెసు అభ్యర్థిని నిర్ణయించారు.

ఈవిషయం ఎవరికెలావున్నా శేఖరయ్యకు ఎంతో బాధ కలిగించినది. ఆయన అగ్రహారం, ఆ చుట్టుప్రక్కల గ్రామాలు కలసి 'జంక్షన్' నియోజకవర్గంలో కాంగ్రెసు అభ్యర్థిగా పోటీ చేయబోతున్నాడు. ప్రకాశరావులాంటి అభ్యర్థిని కాదని రామలక్ష్మయ్యను అభ్యర్థిగా నిర్ణయించా

రని ఆయన కమిటీకి వ్రాశాడు. ఈలోపు రామలక్ష్మయ్య పట్టణాని కనుబంధంగావున్న జంక్షన్ నియోజకవర్గ అభ్యర్థి అయిన శేఖరయ్యను తొలగించి, తన కనుకూలుడు, అభిమానుడు అయిన రామారావును కాంగ్రెసు అభ్యర్థిగా నిర్ణయించి కమిటీకి వ్రాశాడు. కమిటీవారు రామలక్ష్మయ్య లేఖ ప్రకారం రామారావును ఖాయంచేస్తూ జాబు వ్రాశారు. దానితో పట్టణంలో ప్రకాశరావు, జంక్షన్‌లో శేఖరయ్య కాంగ్రెసు అభ్యర్థిత్వాన్ని కోల్పోయారు.

ఈ నిర్ణయాలు చాలా అన్యాయంగా, కుటిలంగా వున్నవని కొందరు కమిటీకి వ్రాశారు. వీరి లేఖలకు సమాధానం వచ్చేలోపునే ఎన్నికలు జరిగిపోయినవి. ఆశించినట్లుగా కాంగ్రెసు అభ్యర్థులు ఆ ఎన్నికలలో గెలవలేదు. ఆంధ్రదేశంలో అతివాద పార్టీల సభ్యులు ఆశించిన వాటికంటే ఎక్కువ సీట్లను సంపాదించారు. ప్రకాశరావు యెన్నికల తరువాత పట్టణంలో తిరిగి న్యాయవాద వృత్తిని స్వీకరించక తప్పలేదు. తాతలనాడు సంపాయించి యిచ్చిన అగ్రహారాన్ని ఆయన కాంగ్రెసుకు వ్రాసియిచ్చాడు. చాలావరకాయన సంపాదన పట్టణ కాంగ్రెసుకు ఖర్చుపెట్టాడు. ఇదంతా జరిగిన తరువాత ఆయనకు పట్టణంలో యిల్లుమాత్రమే మిగిలింది.

శేఖరయ్య పరిస్థితికూడా యిందుకు భిన్నంగాలేదు. ఆయన అగ్రహారంలో తన పొలాన్ని అమ్మి, కాంగ్రెసు ఉద్యమానికి ఖర్చుచేశాడు. ఇంగ్లీషు చదువు చదువుకున్న

వాడు కాకపోవడంవలన, అయినకిప్పుడు భుక్తికే చాలా యిబ్బందులు పడవలసి వచ్చింది.

అన్న పరిస్థితిచూచి, రామభద్రయ్య, శాస్త్రి ఎంతో విచారించారు, ఈ పరిస్థితిలో కుమార్తె వివాహం ఎలా చేస్తాడో, వారికెంత ఆలోచించినా బోధపడలేదు కుమార్తె పెండ్లివిషయంలో అన్న అభిప్రాయమేమిటో వారెంతప్రయత్నం చేసినా అన్ననుండి ఆశించిన సమాధానాన్ని పొందలేక పోయారు.

# 30

భారతి బాగా యుక్తవయస్కురాలైనది తండ్రి, తాతలపోలికలే రావడంవలన ఆమె స్త్రీయైనా బాగా పెరిగినది. శేఖరయ్యకు ఆమె వివాహవిషయం ఒక సమస్య అయినది. ఈమధ్య ఒకరిద్దరువచ్చి ఆమెనుచూచి వెళ్ళారు. వచ్చిన వారు కట్నంలేనిదే చేసుకోమని చెప్పారు. శేఖరయ్య కేంచేయడానికి తోచలేదు. ఏదైనా అమ్మి కుమార్తె వివాహం చేద్దామన్నా, అంతా యింతకుముందే పోగొట్టు కున్నాడు. నాదని చెప్పుకునే వస్తువు శేఖరయ్య కిప్పుడు అగ్రహారంలో లేదు. ఈ పరిస్థితిలో ఆయనకేం చేయడానికి తోచలేదు. ఒకనాడు తమ్ములకు, యింట్లో చెప్పకుండా పట్టణం వెళ్ళాడు.

శేఖరయ్య పట్టణం వచ్చినతరువాత ముందు ప్రకాశరావు యింటికి వచ్చాడు.

ఇక్కడ ప్రకాశరావు పరిస్థితి యింతకుముందులా లేదు. ఆయన న్యాయవాదిగా వున్నా, ఆర్జన యింతకు ముందులా లేదు. ఉన్న పొలాలనన్నిటిని ఏనాడో అమ్మి వేసినందున ఆయనకిప్పుడు జరుగుబాటుగూడా చాలా కష్టంగానే వున్నది. న్యాయంగా వృత్తిమీద సంపాయించిన డబ్బు ఆయనకిపుడుతిండికే సరిపోవడంలేదు. అతిథి అభ్యాగతులను ఆయన పూర్తిగా వదలిపెట్టాడు.

శేఖరయ్య ఆగమనం ప్రకాశరావును ఆశ్చర్య పరచినది. కుశలప్రశ్నల అనంతరం శేఖరయ్యను ప్రకాశ రావు "ఏమిటి పనిమీద వచ్చారు" అని అడిగాడు.

"పనేమీలేదు" శేఖరయ్య ముక్తసరిగా సమాధానం చెప్పాడు.

"పనేమీ లేనిదే ఎందుకు వచ్చారు" ప్రకాశరావు ఆశ్చర్యంగా అడిగాడు.

"అగ్రహారంలో ఏమీ తోచక యిలా వచ్చాను"

శేఖరయ్య సమాధానం ప్రకాశరావును సంతృప్తి పరచలేదు. ఆయన ఏదో చెప్పలేక దాస్తున్నాడని ప్రకాశ రావు వూహించాడు. గట్టిగా అడిగి శేఖరయ్యను బాధ పెట్టడం ఇష్టంలేక ప్రకాశరావు మౌనం వహించాడు.

వారిద్దరిమధ్య ఎక్కువసేపు సంభాషణలు జరగ లేదు. ప్రకాశరావువద్ద శలవు తీసుకుని శేఖరయ్య వీధి లోకి వచ్చేశాడు.

అనుకున్నాడు. ఇంట్లో ప్రస్తుత పరిస్థితి అందుకు అను కూలంగా లేదు. అందుకే శేఖరయ్య వెళ్తానని చెప్పినప్పుడు ప్రకాశరావు అభ్యంతరం చెప్పలేదు. సంస్థానంలాంటి తమయిల్లు యీనాడిస్థితికి వచ్చిందని మనస్సులో ప్రకాశ రావెంతో బాధపడ్డాడు,

శేఖరయ్య ప్రకాశరావుయింటికి వచ్చినకారణం గూడా అదే! మొదట్లో ఆ పూట అక్కడ భోజనంచేసి. తర్వాత తాను వచ్చినపని చూచుకుందామనుకున్నాడు, తీరా ప్రకాశరావు పరిస్థితి చూచి శేఖరయ్య వచ్చేశాడు. ఆ మధ్యాహ్నం శేఖరయ్య భోంచేయలేదు. జేబులో రాగిపైసా లేకుండా ఆయన పట్టణం వచ్చాడు. తిరిగా సాయంత్రమే అగ్రహారంకు వెళ్ళాడు.

ఇంతకూ ఆయన పట్టణం ఎందుకు వచ్చాడో, తిరి గెందుకు వెళ్ళాడో, ఎవ్వరికీ తెలియదు. నిజానికి ఆయనకే తెలియదు.

ఈ విధంగా మరికొంతకాలం జరిగినది. శేఖరయ్య కుమార్తె వివాహ విషయం ఆలోచించడంలేదని, గ్రామంలో నలుగురు పెద్దలు, చందా వేసుకుని భారతి వివాహం చేయాలని నిశ్చయించుకున్నారు. అనుకున్న ప్రకారం ఒకరు వరాన్వేషణచేసి ప్రక్కగ్రామంలో ఎలి మెంటరీస్కూల్లో పనిచేస్తున్న ఒకఅనాథ యువకుడిని మాట్లాడివచ్చారు. మరొకరు గ్రామంలో చందాలు పోగు చేశారు. వేరొకరు వివాహానికి ఏర్పాట్లు చేశారు. ఇలా

గ్రామపెద్దలు నలుగురుచేరి భారతి వివాహానికి ముహూర్తం పెట్టించారు.

ఇంతవరకూ, శేఖరయ్యకుగాని, ఆతని తమ్ములకు గాని, యీ విషయం తెలియదు. ముహూర్తం నిర్ణయించినతరువాత, గ్రామపెద్దలు యీ విషయాన్ని చెప్పారు. విన్నతరువాత వారిక చేయవలసినదేమీ కనిపించలేదు. మౌనం వహించి వూరుకున్నారు.

భారతి వివాహం యిలా జరుగుతున్నదని విని దుఃఖించనివారు లేరు. అందులో ముఖ్యంగా కాంతమ్మ ఆమె భారతివివాహానికి, యాభై రూపాయలిచ్చినది. అగ్రహారంలో పెద్దచందా ఆమెదే!

కానీ ఎవరుమటుకు ఏం చేయగలరు. కాల పరిస్థితి అలా వున్నది. అందుకు సంతోషించాలో, దుఃఖించాలో ఆ గ్రామప్రజలు ప్రయత్నించలేదు. అందుకే అది యీ నాటికి శేష ప్రశ్నలాగే మిగిలిపోయినది.

# 31

నరహరిశెట్టి అగ్రహారంలో. ఐదువందల ఎకరాల భూమిని సంపాదించి,హటాత్తుగా ఒకరాత్రి చనిపోయినాడు. శెట్టి చావు అగ్రహారంలో అందరినీ ఆశ్చర్యపరచినది. ఆ రోజుకూడా కొట్టులో సరుకు లమ్మినశెట్టి ఆ తెల్లవారే సరికి చనిపోయాడంటే అంతా ఎంతగానో విస్మయం

చెందారు. అప్పటికప్పుడే ఈ విషయాన్ని రామలక్ష్మయ్యకు తెలియపరిచారు. ఆరోజే రామలక్ష్మయ్య భార్యాసమేతంగా కారులోఅగ్రహారం వచ్చాడు. యథాప్రకారంగా పదిరోజు లుండి తండ్రి శ్రాద్ధకర్మ పూర్తిచేశాడు.

ఈ పదిరోజులు రామలక్ష్మయ్య అగ్రహారంలో వుండటంవలన, ఆయనకు గ్రామజీవితం ఎంతో ఆనందాన్ని కలిగించినది. సాయంత్రంపూట తమ పొలాలను చూచి రావడానికి భార్యను పంపేడు. ఈ విధంగా వారక్క డున్న పదిరోజులు ఎంతో ఆనందంగా జీవితాన్ని గడి పారు. సుందరికి గ్రామజీవితం అంతకుముందు తెలియక పోవడంవలన, ఆమె అగ్రహారం అంతా మొదటి రెండు రోజులలోనే చూచివచ్చింది. పట్టణంలో లేని ఆనందాన్ని ఆమె ఆ గ్రామజీవితంలో అనుభవించినది. ఆమె కంతకు ముందు గ్రామజీవితం యింత ఆనందాన్ని కలిగిస్తుందని వూహించలేకపోయినది. జీవితకాలం ఆ గ్రామంలో వుంటే బాగుండు ననుకున్నది.

రామలక్ష్మయ్యకూడా అగ్రహారం వచ్చినప్పటి నుండి పై అభిప్రాయంలోనే వున్నాడు, అయితే అగ్ర హారంలో యిప్పుడు ఆయనకు తెలిసినవారెవ్వరూ లేరు. పైగా అంతా సామాన్యులే, అందరూ వ్యవసాయదారులె. ఆయనకు వారితో అక్కడ వుండటం యిష్టంలేకపోయినది. అందుకే అగ్రహారాన్ని తనే కొనాలనుకున్నాడు. ఆయన కీ అభిప్రాయం కలగగనే, అడిగినంత రేటుపెట్టి ముందు, చలమయ్యపొలం కొన్నాడు. ఆ తర్వాత కాంతమ్మ

అమ్మింది. ఇలా ఒక్కొక్కరే మంచి రేటు వస్తుందని, అంతా పొలాలమ్మకని ప్రక్కగ్రామాలకు, పట్టణానికి వెళ్ళి పోయారు.

ఈ సమయం పోతే రాదని, శేఖరయ్య అగ్రహారంలో తనకున్న ఒక్కయింటిని ఐదువందలరూపాయలకు రామలక్ష్మయ్యకు విక్రయించాడు. శాస్త్రి తనకుమిగిలిన నాలుగెకరాలు, యింటిని అమ్మి కాంతమ్మతో పాటు పట్టణం వెళ్ళాడు రామభద్రయ్య యిల్లు, రెండెకరాలు విక్రయించి అన్నలననుసరించాడు. ఈ విధంగా అనుకో నట్లుగా అగ్రహారం రామలక్ష్మయ్యకు, స్వాధీనమైనది. తనకోర్కె యిన్నిరోజులకు నెరవేరినందుకు రామలక్ష్మయ్య ఎంతో సంతోషించాడు.

అయితే యింతవరకు రామలక్ష్మయ్య అగ్రహారాన్ని కొనడంతోనే సరిపోయింది. ఇంక అగ్రహారానిను ఆధునికంగా మార్చాలనుకున్నాడు. అందుకుగాను ఎడ్వర్డును పిలిపించి ఫ్యాక్టరీకి ప్లాను వేయించాడు. పూరిపాకలన్నీ పీకేయించి భవంతులు కట్టించాడు. వీధుల వెడల్పుచేంచి ఒకయాభై డాబాయిండ్లను కట్టించాడు. ఊరి మొదట్లో చెరువుప్రక్క ఖాళీస్థలంలో ఫ్యాక్టరీకి పునాదులు తీయించాడు. బాటలన్నిటిని సిమెంటుచేయించాడు. గ్రామ మధ్యలో, బాడ్మింటన్, టెన్నిస్ కోర్టులు, పార్కులు కట్టించాడు. వూరి మొదట్లో వున్న వేదపాఠశాలను ఎలిమెంటరీ స్కూలుగా మార్పించాడు. అక్కడక్కడా వీధిలో

ఎలెక్ట్రిక్ దీపాలు పెట్టించాడు. ఈ విధంగా సంవత్సర
కాలంలో అగ్రహారం స్వరూపాన్ని మార్చి ఆగ్రాపట్టణంగా
రూపొందించాడు.

రామలక్ష్మయ్య ఆగ్రాలో స్వయంగా ఫ్యాక్టరీని
దగ్గరుండి కట్టించాడు. మంచిరోజుచూచి, ఫ్యాక్టరీపని
ప్రారంభించాడు. ఆ ఫ్యాక్టరీలో పనిచేసే ఉద్యోగులు,
పనివారే యిప్పుడాగ్రాలో వుండేది. ఇంత కొద్దికాలంలోనె
అగ్రహారాన్ని ఆగ్రాగా మార్చాడు రామలక్ష్మయ్య.

అగ్రహారంనుండి వెళ్ళిన రైతులు, వారివారి వీలును
బట్టి ప్రక్కగ్రామాలలో పొలాలు కొనుక్కొని, అక్కడే
స్థిరబడిపోయారు. శాస్త్రికి నాలుగెకరాలభూమి, యిల్లు
అమ్మినందుకోగాను వచ్చిన డబ్బుపెట్టి పట్టణంలో ఒక చిన్న
యిల్లు కొనుక్కొని పౌరోహిత్యంచేయ నారంభించాడు
కాంతమ్మ వేరుగావుంటున్నా శాస్త్రి కండగానే వుంటు
న్నది. రామభద్రయ్య పట్టణంలో ఒక చిన్న యిల్లు అద్దెకు
తీసుకుని, బడిపెట్టుకుని కాలం వెళ్ళబుచ్చుకుంటున్నాడు.
శేఖరయ్యకు ఆ పట్టణంలో చేయవలసిన పనేమీ కన్పించ
లేదు. ప్రకాశరావు బలవంతంతో కట్టెలడితీలో నలభై
రూపాయలజీతానికి లెఖ్ఖలు రాస్తున్నాడు.

రామలక్ష్మయ్య అగ్రహారాన్ని నామరూపాలు
లేకుండా మార్చాడనీ విని రామారావు చూసిపోవాలని
ఒకరోజు ఆగ్రావచ్చాడు. అక్కడతనికున్న పొలము ఇల్లు
ఆదిలో రామలక్ష్మయ్యకే విక్రయించాలనుకున్నాడు. కాని

వచ్చి రామలక్ష్మయ్యను చూచినతరువాత ఆయన అందు కిష్టపడలేదు. రామలక్ష్మయ్య రామారావు కున్నయింటిని బాగుచేయించుకొని అక్కడే వుండమని చెప్పాడు అతనలా చెప్పడంలోని వుద్దేశ్యముకూడా మంచిదేనని, రామారావు భావించాడు. ఆతను ఆ గ్రామాలకు అభ్యర్థి ఎన్నికలలో గెలిచినా, ఓడినా, కాంగ్రేసు అభ్యర్థిగా చెలామణీ అవు తున్నాడు. కాబట్టి తానిక్కడ వుండుట యెంతైనా సమం జస మనుకున్నాడు.

ఆ విధంగా రామారావు అక్కడ ఒక భవంతి నిర్మించాడు. తన పొలాన్ని ప్రక్కగ్రామాల రైతులకు పాలికిచ్చాడు. రామలక్ష్మయ్య పొలంవిషయంలో, ఒక నిర్ణయానికి రాలేదు. ఎడ్వర్డు నాలుగు ట్రాక్టర్లు కొని, వేరుశనగ వేయాలని చెప్పాడు. ఆనేల ఆ పంటకు చాలా మంచిదని ఎడ్వర్డు అభిప్రాయం. కాని రామలక్ష్మయ్యకా నేలలో ఆ పంటను పండించాలని లేదు. చెఱువుచుట్టూ వున్న పొలంలో తోటలు వేసి, పొగాకు పండించాలని. ఆయన ఉద్దేశపడ్డాడు. అందుకు మొదటిసంవత్సరం ఒక నిర్ణయానికి రాలేనందున తాను ఒక నిర్ణయానికి వచ్చేవరకు ప్రక్కగ్రామాల రైతులకు ఆ పొలమంతా పాలికిచ్చాడు.

## 32

శేఖరయ్య కట్టెలడితీ ఉద్యోగంలో ఇముడలేక పోయాడు. ఆయన కా ఉద్యోగం అలవాటు లేకపోవడం వలనఅందులో అనేకయిబ్బందుల ననుభవించవలసి వచ్చినది. ముఖ్యంగా వ్యాపారంలో ఆయనకేమాత్రం అనుభవం లేదు. వచ్చినవారితో మాట్లాడటం ఆయన కలవాటు కాలేదు. దానితో అనేకకష్టాలు, నష్టాలు వచ్చినవి. అందులోవుండి ఈ బాధలు పడలేక ఆ ఉద్యోగానికి తిలో దకాలిచ్చాడు.

ఈ విషయం విని ప్రకాశరావు శేఖరయ్య తమ్ములు ఎంతో విచారించారు. శేఖరయ్య భవిష్యత్తు ఎలావుండేద వారు ఆలోచించలేకపోయారు. అన్నిటా చితికిపోయిన తమ కుటుంబాలను తలచుకుని, వారెంతో చింతించారు.

శేఖరయ్యకిపుడు పట్టణంలోవుండి చేయవలసిన పనేమీ కన్పించలేదు. భుక్తికోసం ఆయన ఏదో ఒకపని చేయాలి. కానీ ఏంచేయాలి? అందరినీ కదలించినది. ఇది సామాన్యంగా తేలేవిషయం కాదని వారూహించక పోలేదు. అన్న కుటుంబానికి వారేమీ సహాయం చేయలేని నిస్సహాయస్థితిలో వున్నారు. ఏదో విధంగా ఆయనకు జీవనభ్రుతి కలగచేయాలి. ఇదే వారి ఆలోచన. యీ విధంగా కొద్దిరోజులు కడచినవి.

అగ్రహారం, ఆగ్రాగా మారిన తరువాత అక్కడి పరిస్థితి శేఖరయ్య విన్నాడు. రామలక్ష్మయ్య కొత్త ఫ్యాక్టరీలో ఉద్యోగాలు ఖాళీలున్నవని, తెలిసింది. శేఖరయ్యకీ వార్త కొంత సంతోషాన్ని కలిగించినది. రామలక్ష్మయ్య తమకు కొత్తవాడేమీ కాదు తన తాత, రామలక్ష్మయ్య తాతకు, అగ్రహారంలో స్థానం యిచ్చాడు. వచ్చిన కొత్తలో అనేక విధాల సహాయం చేశాడు. ఈ నాడు రామలక్ష్మయ్య యిలా వుండటానికి కారకుడు తన తాత నరశింహశాస్త్రి. ఆ నాడాయన సుబ్బిశెట్టికి అగ్రహారంలో స్థానం యిచ్చివుండకపోతే యీ నాడు రామలక్ష్మయ్య, ఎక్కడుండేవాడో, ఏం చేస్తుండేవాడో కాబట్టి, తను వెళ్ళి అడిగితే తప్పక తనకు సహాయం చేస్తాడు. అని శేఖరయ్య ఒకనాటి వేకువఝామున ఆగ్రా వెళ్ళాడు.

శేఖరయ్యకు రామలక్ష్మయ్య దర్శనం అనుకున్నంత సులభంగానే దొరికింది. రామలక్ష్మయ్యకు తన పరిస్థితి అంతా చెప్పి తనకేదైనా ఫ్యాక్టరీలో అవకాశం కల్పించమని కోరాడు. శేఖరయ్య చెప్పినదంతావిని, రామలక్ష్మయ్య, ఫ్యాక్టరీలో ప్రస్తుతం ఉద్యోగాలేవీ ఖాళీలు లేవని, ఖాళీ లేర్పడిన తరువాత కబురంపుతానని చెప్పాడు.

రామలక్ష్మయ్య మాటకు శేఖరయ్య మారుమాట్లాడలేకపోయాడు. ఆయనవద్ద శలవు తీసికుని పట్టణాం ప్రయాణమైనాడు.

కాని శేఖరయ్యకు చెఱువుకట్టమీదికి వచ్చేసరికి, తను సంధ్యావందనం చేసుకున్న స్థలము, తమ పూర్వీకులు

ప్రవహించినభావి, తమ పొలాలు గుర్తుకు వచ్చినవి. ఆయన అక్కడనుండి ఒక్కడుగు ముందుకు వేయలేక పోయాడు. చింతచెట్టు నీడలో, చతికిలపడ్డాడు. నీటిమీద చల్లనిగాలి శేఖరయ్యను పులికింతలు పెట్టింది. ఆయన పట్టణం వెళ్ళిన తరువాత, యిలాంటి గాలిని ఎప్పుడూ అనుభవించి వుండ లేదు. చెట్టుమానుకు తలచేర్చి వెల్లికిలా పడుకున్నాడు.

ఆయనకు గడచిన దినాలలోని మధురస్మృతులు జ్ఞప్తికి వచ్చినవి. శ్రీ వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు తమ తాత కగ్రహారం యిచ్చినప్పటినుండి, అగ్రహారంలో జరిగిన సంఘటనలు ఒక్కొక్కటే ఆయన మస్తిష్కంలో నికి వచ్చిపోతున్నవి.

ఏమిటి తాము సాధించినది, ఎవరికోసం తామిలా సర్వవిధాలా నాశనమైనది. ఆలోచించినంత వరకు భావి జీవితం ఆయనకు నిరాశా జనకంగానే కన్పించినది. కర్మ యిలావుంటే క్షేమంచేయగలరు. ఆస్తులు, అగ్రహారాలు, పాండిత్యం, ప్రతిభా, కులం, అన్నీ పోగొట్టుకుని, అనాథుడై ఆ చెఱువుకట్టమీద పడివుండమని విధి వ్రాస్తే ఎవరు తప్పించ గలరు.

గడచిన చరిత్ర గుర్తుకు తెచ్చుకుని భవిష్యత్తు వూహించేసరికి శేఖరయ్య శరీరం భయంతో వణికింది. కండ్లు అశ్రుపూరితాలైనవి. అంతే! శేఖరయ్య యిక అక్కడ ఒక్కక్షణం వుండలేకపోయాడు. ఆ వాతావరణం ఆయననక్కడ వుండనివ్వలేదు. సూర్యుడు పశ్చిమాద్రిని